# అర్పణము

★

నా ఆప్తమిత్రులు

శ్రీయుత్, శ్రీ సుదర్శనరావులకు....

'పెట్టింది పెట్టించోట వుంచరు యీ పిల్ల మూక !' అని విసుక్కుంటూ నాకు బొట్టు పెట్టింది పెద్దక్కయ్య కమల.

ఊరేగింపుకు వెళ్ళేమందు నాముఖం ఎల్లావుందో నేను చూసుకోనేందుకు వీలు లేకుండా చేశారీ పిల్ల మూక. భలే ఊరేగింపు ! వేళకు తిండీలేదు— కారులో 'హమ్మయ్య' అంటూ కాళ్ళుజాపుకు పడుకోవాలని అనిపించింది.

పెట్రొమాక్సు లైట్ల కాంతిలో మెళ్ళో హారం ధగధగా మెరుస్తూంటే హంసలా అడుగులో అడుగు వేసుకొంటూ వచ్చిన నా తోడికోడలు చంచల 'యింకా అవలేదా !' అంటూ పరిహాసంగా నవ్వింది, నన్ను చూసి.

తను నాకు చేసిన అలంకారాన్నంతా, ఆఖరిసారిగా మెరుగులు దిద్దుతున్న పెద్దక్కయ్యతో 'యింక చాల్లెద్దూ' అని, నా తోడికోడలు పక్కనే నడుస్తూ, కొత్త శిల్కుచీర చేసే తస్ బుస్ శబ్దంతో, వీధిగుమ్మందాకా వచ్చి నిలబడి పోయాను

గుమ్మంలో పన్నీరు బుడ్డితో నిల్చున్న సుందరం బావ, "నిద్రపోయి ఆయన మీద పడేవుసుమా !' అంటూ నన్ను చూసి విరగబడినవ్వాడు. అంతమంది మగవాళ్ళలో తను నన్ను చేసిన పరిహాసానికి — తలవంచుకొని అల్లాగే నిలబడి పోయాను !

'ఇంకా అక్కడ మళ్ళీ 'హాల్టింగ్' ఎందుకు? రా! రా!' అన్న మా పెద్ద బావగారితో —

'అయ్యో అన్నగారా! ఆయన వచ్చి చెయ్యిపట్టుకొని తీసికెళ్ళద్దూ?' అని వేళాకోళంగా సమాధాన మిచ్చాడు సుందరం బావ.

'ఏం చంద్రం? ఇంకా అక్కడే నిల్చుంటావేమిటి? చెయ్యి పట్టుకు తీసుకువెళ్లు' అంది నా తోడికోడలు

ట్రోమాక్సు లైట్ల కాంతిలో, పందిట్లో ట్వీడ్ సూట్ ని నిల్చున్న 'వారు' చిరునవ్వు నవ్వుతూ, టక్ టక్ ట్ల శబ్దంతో నా పక్కనే వచ్చి నిల్చున్నప్పుడు, నా కళ్ళకు కొత్తగా వున్న ఆ ఆకారము నా మనస్సులోని అలసటనంతా అంతర్ధానంచేసి, ఓ కొత్త శక్తిని ప్రసాదించింది. పట్టులాంటి నా చేతిని, తన బలమైన చేతిలోకి తీసుకొని చిన్నగా ఆయన నొక్కినప్పుడు, నా మనస్సు 'ఝల్లు' మన్న ఆ అనుభవం 'మగవానికి మగువ అణిగేదే' అన్నట్లు తోచింది. వధూవరు లిద్దరికి కొలిచినట్లు మాత్రం స్థలాన్నుంచి మిగిలిన చోటంతా చిన్న పిల్లలు ఆక్రమించేశారు ఆ కారులో.

మీ వాయిద్యంకన్నా మా వాయిద్యమే బాగుంటుంది చూడం డన్నట్లు సన్నాయి వాయిద్య గోష్టితో పోటీ పడు తున్నట్లు బాండు వాయిద్యంవాళ్ళు బాండు వాయిస్తూ ముందడుగు వేయగా ఊరేగింపు కారు కదిలింది.

హమ్మయ్య – ఊరేగింపు ఆరంభమయింది. దీనికి ఎన్నెన్ని ఆర్భాటాలు జరిగాయి? నా వివాహ ప్రశ్నకూడా నాన్నకు పెద్దదిగా తోచలేదు. ఊరేగింపు ప్రశ్న మాత్రం మా యింట్లో వాళ్ళ నందరినీ ఒక ఊపు ఊపేసింది. నాన్న

గారికి కోపాన్ని, అమ్మకు కలవరాన్ని కలిగించిన యీ ఊరే గింపుకు ఒక ప్రత్యేకత వుంది. వివాహం నిశ్చయమైన వెంటనే 'ఊరేగింపుకు కారు మాట్లాడారా ?' అంది అమ్మ.

నాన్న విసుక్కుంటూ 'యీసారి విమల పెళ్ళికి ఊరే గింపూ లేదు ఏమీ లేదు. నాలుగు గంటలసేపు ఊళ్లో తిరిగిరావ టానికి ఎనభై రూపాయలడిగాడు ! ఆ డొక్కు కారులో ఊరేగేకన్నా ఊరుకొంటేనే మంచిది' అన్నారు.

ఈ మాటలు విని అమ్మ తన కలవాటయిన ఒక అవతారాన్ని దాల్చింది !

'ఊరేగింపు వుండాలని శాస్త్రమేమీ లేదు. దగ్గరలో యింకో కారు ఏదీ లేదుకదా అని, కొంచెంకూడా మొహ మాటం లేకుండా మాట్లాడాడు ఆ డ్రైవర్ను. 'యూస్ లెస్ ఫెలో !' అన్నారు నాన్న మళ్లీ.

అయిదువేల అయిదు వందలు వరదక్షిణగా యిచ్చి, యింకా వివాహం ఖర్చుకూడా భరించవలసినప్పుడు, అంతకు ముందే యిద్దరు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసి అత్తవారిళ్ళకు పంపించి, ఎండకు ఎండిపోయిన నారింజ తొక్కలా తయా రయిన తాలూకా గుమాస్తాకు, ఊరేగింపు కారుకోసం ఎనభై రూపాయలు ఖర్చు చేయాలంటే కోపంరాకుండా వుంటుందా ? అందుచేత దమ్మిడీలతో సహా లెఖ్ఖ వేసుకుంటూ, ఏ ఖర్చు తగ్గిస్తే అందులో ఎంత మిగులుతుందా అని లెఖ్ఖలు వేసుకోవటం ఆరంభించారు. అమ్మకు మాత్రం సాధ్య మైనంతవరకు ఏ లోపమూ లేకుండా చేయాలని ఆశ ! 'ఒక శుభకార్యం అంటూ జరిగినప్పుడు ఖర్చు తప్పుతుందా ?

దానికి ఎవరేనా యిల్లా లెక్కలు వేసుకుంటారా? మన యిబ్బంది మనకి ఎప్పుడూ వుండనేవుంది. ఊరేగింపు లేకుండా పెళ్ళేమిటి? నన్ను తీసుకొచ్చి, భగవంతుడు, ఎతి అంటే ప్రతి అనే మాతో కట్టిపడేసాడే...ఖర్మ...' అంటూ తనకు అలవాటయిన అస్త్రాన్ని ప్రయోగించి ఊరేగింపు ఏర్పాటుకు అమ్మ నాన్నని ఒప్పించింది. అది రాస్తేనే ఒక పెద్ద పురాణ మవుతుంది!

ఊరేగింపు బయలుదేరింది...రంగు రంగుల చీరలతో శోభిస్తూ, రక రకాలుగా మాట్లాడుకుంటూ, రాత్రిపూట ఊరేగింపులో పాల్గొని రమణీయంగా ముందుకుసాగే రమణులని చూసి రాలుగాయి కుఱ్ఱకారంతా చూపే తళుకులు – బెళుకులు, విసిరే-చణుకులు చూసి తీరాల్సిందే!

రాత్రిళ్ళు ఆకాశంలోని నక్షత్రాలను చూడటమంటే నాకు ఎంతో యిష్టం. నా జీవిత స్రవంతి ఒక ముఖ్య ఘట్టంలోకి వచ్చిన యీ రాత్రి అకస్మాత్తుగా, ఆకాశాన్ని చూడాలని ఆలోచనకలిగింది.ఆ ఆలోచనతోనే ఆకాశంలోని నక్షత్రాల ప్రకాశంలాగే మా జీవితాలుకూడా ప్రకాశిస్తాయనే ఒకమూర్ఖ నమ్మకకూడా నాకు తెలియకుండానే నాలో ఉద్భవించింది! ఈ ఆలోచన ఎల్లా తోచిందో ఎందుకు తోచిందో చెప్పలేను. కళ్ళెం లేకుండా పరిగెత్తే గుఱ్ఱంలా చంచలమైన మనస్సు ఒకో సమయంలో యిటువంటి ఆలోచనలను లేవదీస్తూంటుంది. ఆకాశంలోని నక్షత్రాల ప్రకాశానికి జీవిత ప్రకాశానికి ఏమిటి సంబంధం? ఏమిటీ నమ్మకం? అనే విషయం కొంచెం కూడా నాకు తోచలేదు. ఎల్లా తోస్తుంది?

వీధిగుమ్మంలో నిల్చోకూడదని, తుమ్మితే అపశకునమని మొదలైన మూఢనమ్మకాలతో నిండిన వాళ్ళమధ్య పుట్టి పెరిగిన పల్లెటూరి పిల్లనుకదా నేను! పెళ్ళికూతురు మీదే అందరి కళ్ళూ వున్నప్పుడు ఆకాశాన్ని నేను ఎల్లా చూడను?

మెడ నొప్పి పెట్టటం చేత పొద్దున్న పెళ్ళి పీటలమీద తలకొంచెం పైకెత్తాను కాబోలు. అస్తమానూ నా పక్కనే వున్న పెద్దక్కయ్య కమల, వెంటనే నాతలను కిందకు అణిచి నపుడు నా మెడనరాలు బెణకక పోవటం నా అదృష్టమే! యీ సంఘటనను చూసి 'ఫక్కున' నవ్విన నా చిన్న తోడి కోడలు సుశీల, 'అయ్యో పాపం!' అని పరితాపంగా నవ్విందో నాకు పెళ్ళికూతురులా కూర్చోటం తెలియలేదని నవ్విందో నాకు యింకా అర్థం కాలేదు.

అకస్మాత్తుగా ఏర్పడిన కుదుపువల్ల నేను 'ఆయన' మీద వాలిపోయాను. నాకు తగని సిగ్గేసింది! సర్దుకొని కూర్చున్నాను. ఇదిచూసి పరుగెత్తుకుంటూ వచ్చి—'మిస్టర్ చంద్రశేఖరం! మా విమల ఏకంత బరువుకూడా లేదు. చూశారా! కారు కుదిపినపుడు పడిపోకుండా కాస్త గట్టిగా పట్టుకోండి!'—అన్నాడు విరగబడినవ్వుతూ— ఆ కోతి— సుందరం బావ. ఆయన నవ్వుతూ నన్నుచూశారు. వంచిన తల ఎత్తకుండా నాచేతులను చూసుకొన్నాను.

ఇదంతా చూసిన మామయ్య, 'ఒరేయ్ సుందరం! ఎందుకురా అస్తమానూ వాళ్ళచుట్టూ తిరుగుతావు? వాళ్ళను కొంచెం మాట్లాడుకోనీ. నువ్వెందుకు అక్కడో

పానకంలో పుడకలా ?' అని కేక లేయటం, సుందరం బావ పారిపోవటం ఒక్కసారి జరిగాయి.

అర్థంకాని ఒక ఆవేశం నాలో దడదడ కొట్టుకొంది. అది సంతోషమో, భయమో, కోపమో నేను తెలుసుకో లేక పోయాను. 'ఆయన' నా చేతిని తన చేతిలోకి ఎల్లా తీసుకొన్నారో నాకు తెలియదు. నా చేతిని మెల్లిగా నొక్కుతూ, ఆయన 'విమలా' అని నా చెవుల్లో మాత్రమే పడేటట్లు పిలిచినపుడు, నా మనస్సు గాలికి రెప రెపలాడే గాలికి తెరలా శబ్దంచేసింది ! మా పక్కయింటి అమ్మాయి కోమల నాతో చెప్పిన మాటలన్నీ జ్ఞాపకం వచ్చాయి. కోమల నాకన్నా మూడేళ్లు పెద్దది. ఆమెకు కిందటి సంవత్స రమే వివాహం జరిగింది. తన భర్త తనని మొట్టమొదటి సారిగా ఏ విధంగా పలకరించారో తనతో ఏ విధంగా సంచ రించారో, ఉత్సాహంగానూ, సంతోషంగాను తను నాతో చెప్పినప్పుడు ఆ ఆనందాన్ని అంతగా పొంద లేక పోయాను.

కాని యిప్పుడు......! ఆయన పిల్చిన పిలుపుకు నేను ఏం సమాధానం చెప్పను ? ఏమని చెప్పను ? కోమల చెప్పి నట్లు యీ మగవాళ్ళకు అసాధారణ ధైర్యం ! నా నాలుక పెగల లేదు. చేతి రుమాలుతో ముఖం తుడుచుకొన్నాను.

'చాలా ఉక్కగా వుంది కదూ ?' అన్నారు ఆయన.

'ఊ' అన్నాను మెల్లిగా తల కదపకుండా.

'పిలిస్తే పలకవేమో అనుకున్నాను. ఇవాళ నువ్వు ఏమీ తినలేదు కదూ ? తెలివి తక్కువదానిలా యిల్లా సిగ్గు పడుచున్నావా ?' అన్నారు అధికార పూర్వకంగా.

ఈ ఒక్క రోజులోనే ఆయన నాతో ఎంత స్వతం త్రంగా మాట్లాడటం ఆరంభించారు!

విందులూ, మర్యాదలు పెళ్ళి పందిరిలో వైభవంగా జరుగుతున్నాయి. కాని పెళ్ళికూతురికి సంబంధించినంతవరకు యించుమించు ఉపోషమే! ముక్కూ, ముఖం తెలియని కొత్త ముఖాలమధ్య కూర్చోబెట్టి, ఆడాళ్ళూ మగాళ్ళూ కలసి అల్లరి చేస్తూంటే విందు చేస్తున్నారుట! విందు! నేను యివాళ విస్తరి ముట్టుకోనేలేదు. అస్తమానూ కాఫీనీళ్ళతోనే కడుపు నింపుకొన్నాను.

'లోపలికి వెళ్ళినతరువాతేనా ఏమైనా తిన్నావా లేదా?' అన్నారు మళ్ళీ.

వదిలేటట్లు లేరే...! లేదనే నిజాన్ని చెప్పకుండా ఆయన రెండవ ప్రశ్నకు కూడా 'ఊ' అన్నాను.

'చాలా సిగ్గుపడుతున్నావ్ విమలా! మా యింట్లో వాళ్ళంతా ఎంత సహజంగా మసులుతున్నారో చూశావా? అల్లాగే నువ్వూ వుండాలి. మగవాణ్ణి చూసి అదిరి బెదిరి అంగలు వేసుకుంటూ వంటింట్లోకి పారిపోయే ఆడవాళ్ళను చూస్తే నాకు కిట్టదు' అని మొట్ట మొదట్లోనే తన అభిప్రా యాన్ని చెప్పినప్పుడు నా మనస్సు అంత పొంగిపోయిం దెందుచేత?

నాన్న మొదటి రోజునే చెప్పారు. 'విమల అత్తా రింట్లో అందరూకూడా కలసిమెలసి తిరుగుతూ, చాలా చనువుగాను, చాలా సహజంగాను వున్నారు. మొన్న మధ్యాహ్నం, ఆమె అత్తగారు, తోడికోడళ్ళు, బావగార్లు

అందరూ సరికి సరిగా కూర్చొని పేకాడుకొంటున్నారు. రేపు మన విమలకూడా అల్లాగే వుంటుంది' అని నన్ను చూస్తూ నవ్వుతూ చెప్పినప్పుడు నాకు ఎంత గర్వమేసింది? పాపం మా చిన్నక్కయ్య ప్రమీలకు నామీద అసూయ కూడా కల్గివుంటుంది! అనాగరికుడైన పల్లెటూరి జీవికి కదా తన జీవితాన్ని ధారపోసింది!

ఆయన నా చేతిని కొంచెం గట్టిగా నొక్కారు. మరో సమయంలో అయితే 'అయ్యో' అని అరిచేదానిని. కాని ఆ సమయంలో ఎంత ఆనందంగా వుంది!

'విమలా! నువ్వు ఎంతబాగా పాడావు ఆనాడు? నాకు యింకా బాగా జ్ఞాపకముంది. ఆరోజు నువ్వు పాడిన ఆ పాటను నా జీవితంలో మర్చిపోలేను. పిల్లను చూడటాని కని నా జీవితంలో ఒక్కసారే వచ్చాను. నిన్నుచూసి నువ్వు నాకోసమే పుట్టావని తీర్మానించుకొన్నాను' అన్నారు ఆయన.

ఈ మాటలు నా చెవులలో పడినప్పుడు నా హృదయం ఎంత పొంగిపోయింది? నేను చాలా బాగా పాడతానని నన్ను ఎంతో మంది పొగిడారు. కాని యివాళ, ఆయన యీ మాటలన్నప్పుడు నా మనస్సు పొంగి పొరలుతుందెందుచేత?

ఆయన నన్ను చూడటానికి వచ్చినప్పుడు, నేను పాడటానికి మా పక్కింటి ఆవిడ ఏరి ఏరి యిచ్చిన, "మనసులోని మర్మము దాచనేలనో" అనే ఆ పాటను మొదట్లో పాడనని పట్టుపట్టాను. 'చెప్పినమాట వినాలని' ఆవిడతో కలసి అమ్మకూడా కేకలేయటం వల్ల పాడక తప్పిందికాదు. దానిని జ్ఞాపకముంచుకొని యిప్పుడు అడుగు

తున్నారే! ఆవులిస్తే పేగులే లెఖ్ఖపెడతారు కాబోలు! పాడమని, కల్యాణం నిశ్చయమైన దగ్గరనుంచి వేళాకోళం చేసిందది మా పక్కయింటి ఆవిడ. కావాలనే నేను ఆపాట పాడినట్లు ఆయన అనుకోవటం తెలుసుకొని అంతులేని ఆనందాన్ని పొందాను. 'నన్ను కూడా మొట్టమొదటిసారి చూడటానికి వచ్చినవారు మీరే' అని అందామనుకొన్నాను. కాని సిగ్గుతో మాట్లాడలేక పోయాను!

'ఏం చంద్రం! కాలక్షేపం చాలా బాగా జరుగుతున్నట్లుందే' అంటూ నవ్వుతూ నా పెద్ద తోడికోడలు చంచల వచ్చింది.

నేను యీ ప్రపంచంలో పడ్డాను. ఆయనకి ఎంత సాహసం!

'ఏం ప్రయోజనం లేదు వదినా! ప్రతిదానికి 'ఊ' తప్పితే యింకేమీ బయటికి రావటం లేదు. అని నావైపు చూస్తూ చిత్రంగా నవ్వారు.

నేను 'ఊ' కొట్టటం ఆయనద్వారానే ఆమె తెలుసుకొన్నందుకు నేను చాలా సిగ్గుపడ్డాను. ఆయనమీద కొద్దిగా వాలి వున్నట్లు కూర్చొన్నదానిని, సరిగా సర్దుకొని కూర్చొన్నాను.

ఆయన కొంచెం గట్టిగా 'ఈవిడ మా పెద్దవదిన తెలుసునా విమలా! అల్లాచూడు. అక్కడ శిల్కులాల్చీ మీద జరీకండువా వేసుకొని నిల్చున్నారే, ఆయనే మా పెద్దన్నయ్య. వీళ్ళిద్దరూ నాకు తల్లి తండ్రులతో సమానము' అని పరిచయం చేశారు నా పెద్ద తోడికోడలు చంచలను.

నేను కొద్దిగా తలఎత్తి, దూరంగావున్న మా బావ గారిని, పక్కనేవున్న మా తోడికోడలును ఒకసారిచూశాను. మీకు ఎవరెవరిమీద ఎటువంటి గౌరవ మర్యాదలుంటాయో అదేవిధంగా నాకూ వుంటాయి, అని నామనస్సు సంకల్పించు కొన్నట్లు చెప్పాలనుకొన్నాను. కాని ఆ పాడు సిగ్గు బయటికి వచ్చే నామాటలను లోపలకులాక్కుపోయింది. అవును!ఆయన స్వరంలో ఆయన ఆశయం ఆ విధంగా వున్నట్లు నాకు ధ్వనిం చింది. నన్నే చూస్తున్న నాతోడికోడలు చంచల 'మః ంటికివచ్చి నాలుగు రోజులుండంటే చాలు చాలన్నట్లు మాట్లాడేస్తుంది. ఏమ్మా విమలా ! మొట్టమొదట్లోనే 'కంప్లెయింటా ?' అంది నవ్వుతూ. నాకు తెలియకుండానే నా పెదిమలు ఆమెను చూసి నవ్వాయి. ఆ క్షణంలో నేను స్వర్గంలోకంలోని శృంగార వనంలో విహరిస్తున్నట్లు తోచింది. నా కన్నా భాగ్యశాలి యీ ప్రపంచంలో మరెవ్వరూ వుండరనుకొన్నాను. చిన్న వయస్సులోనే తండ్రిని పోగొట్టుకొన్న నా భర్త, తన పెద్దన్నయ్య వదినల ప్రేమాభిమానాలలో వున్నవారని, యిప్పుడుకూడా వాళ్ళతో కలిసే వున్నారని నాకు తెలుసు. అందుచేత వాళ్ళను తన తల్లిదండ్రులలా భావించటం సమంజ సమేకదా ? ఆయన మూలంగా ఆ మాటలు వచ్చినప్పుడు, నా తోడికోడలు నా కళ్ళకు ప్రేమ దైవంలా కనిపించింది. ఆ నవ్వు ముఖమూ, ఆ చిన్న కుంకుమబొట్టూ – నా మనసులో జీవాన్ని పొంది నేను ఆమెను ప్రేమతో పెనవేసుకొని జీవి [illegible] గడుపుతాననే ఆలోచనను లేవదీసి – నన్నమితానంద [illegible] చిన్నక్కయ్య ప్రమీల తన అత్తగారు, మావ

గార్ల ఎదురుగా తన భర్తతో మాట్లాడటానికి యింకా భయ పడుతోంది. పూర్తిగా ఒక్కరోజుకూడా పూర్తికా లేదు. ఇంత సహజంగా వదినగారి ఎదుట సరసమాడుతున్నారే యీయన! సందేహం లేకుండా నేను పెట్టి పుట్టిన దానినే! నా అదృష్టం కొద్దీ నాకు మంచిచోటే దొరికింది! నా జీవితం చిగిరించింది! ఇంక పువ్వులు పూస్తుంది!!!

అంతవరకు ఏకధాటిగా సినిమా పాటలు వాయించిన వాయిద్యాలు ఒక్కసారిగా ఆగిపోయాయి. కారణమేమిటా అని నేను తల కొంచెం పైకెత్తాను. ఎంత ఆశ్చర్యం...!!

వీధులన్నీ తిరిగి మా ఊరేగింపు పెళ్ళి పందిట్లోకి వచ్చేసింది!!

అప్పుడే ఊరేగింపు పూర్తయిపోయిందా? ఇంత తొందరగానా? ఇటువంటి సంతోషం మళ్ళీ వస్తుందా?

కారులో ఎక్కేటప్పుడు, ఆయనకూ నాకూ మధ్య వున్న దూరం మాయమయి, బాంధవ్య బంధము నన్ను ఆయనతో కట్టివేసినట్లు తోచింది. తెరచివున్న నా మనో ద్వారం ఆయనను లోపలకు రానిచ్చి, యింకేమీ రానివ్వకుండా మూసుకొంది. అయిదారు మాటలు మాత్రమే! అయినా, మొట్టమొదటిసారి ఆయన నోటినుంచి వచ్చిన ఆ మాటలు నన్ను ఎంత ఆకర్షించాయి!

కారు ఆగింది. చిన్న పిల్లలను వాళ్ళవాళ్ళు వచ్చి తీసుకొని వెళ్ళిన తరువాతనే మాకు దిగటానికి వీలయింది. దిగేటప్పుడు అకస్మాత్తుగా జ్ఞాపకంవచ్చినట్లు, ఆతృతగా ఆకాశాన్ని చూశాను. నా గుండె లదిరిపోయాయి! నా

కళ్లు తిరిగాయి !! ఆయన నా చేతిని గట్టిగా పట్టుకొని వుండకపోతే, కింద పడిపోయేదానినేమో!!!

ఒక్క నక్షత్రంకూడా కనిపించలేదు ! యింకొక్క రోజు గడిస్తే పౌర్ణమి. చంద్ర చ్ఛాయలే లేకుండా ఆకాశ మంతా కారుమేఘాలతో నిండిపోయింది !

ఎక్కడో ఎవరో పాట పాడుతున్నారు.

"నీ ఆశలన్నీ కలలే సుమా......"

తక్కున సుత్తితో నెత్తిమీద కొట్టినట్లనిపించింది. కళ్లు తిరుగుతున్నట్లయింది !...నా తలకూడా నాకు బరువుగానే తోచింది !...... నా మనస్సులో ఏదో గడ్డ గట్టుకు పోయింది !......అంతే !

తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు !

# 2

నాకు తెలివి వచ్చింది. కళ్ళు తెరచి చూశాను. నా తల్లోని పువ్వులన్నీ తీసేశారు. నాకు చిరాకెత్తించిన ఆ చీరకూడ విప్పి వేరొక పల్చని వాయిల్ చీర కట్టారు. నేను చాలా నీరసంగా వున్నాను. మెల్లి మెల్లిగా నాకు అన్నీ జ్ఞాపకం వచ్చాయి. పెద్దక్కయ్య కమల, అమ్మ నాపక్కనే కూర్చున్నారు. వాన వెలిసిందని తెలుసుకొన్నాను. నా మనస్సు కొంచెం శాంతించింది. 'కళ్ళు తెరచినట్లుందే' అంటూ నా చిన్నబావగారు గుణశేఖరం వచ్చారు. తను

డాక్టరని నాకు తెలుసు. అక్కయ్య, అమ్మ లేచి నిల్చున్నారు. నేను అల్లాగే ఆయన ఎదురుగా పడుకొని వుండటం నాకు తగని సిగ్గేసింది. కొత్తముఖాన్ని చూసి చాటుచేసికొనే చిన్న పిల్లలా, నేను బోర్లగిలా తిరిగి నాముఖాన్ని తలగడలో అణిచేశాను.

'అసలే చాలా బలహీనంగా వుంది. దానికి తోడు యివాళ భోజనం సరిగా కుదరలేదు. ఎండ, గాళ్ళు, సందడి— కొంచెం శోషవచ్చింది. అంతకంటే యింకేమీ లేదు.' అని తన డాక్టరేట్ అభిప్రాయం వెలిబుచ్చారు నాచిన్న బావగారు డాక్టర్ గుణశేఖరం.

'అవును నేను అప్పుడే చెప్పాను. ఇవాళ అసలు అది ఏమి తిననే లేదు. లోపలికి వచ్చింతరువాత నేనా ఏదైనా తినిపించి వుండాల్సింది మీరు' అన్న 'ఆయన' గొంతుక కూడా వినిపించింది. ఆయన గుమ్మంలోనే వున్నారు కాబోలు! ఆహా! నా భర్తకు నామీద ఎంతప్రేమ! అక్కయ్యలు, అమ్మ, అత్తయ్య అని యింతమంది వున్నారే—అందరూ నన్ను అలంకరించటంలో శ్రద్ధచూపించారే కాని నేను ఏమైనా తిన్నానా లేదా అనేసంగతి వాళ్లకి కొంచెం కూడా తోచలేదు! పెళ్ళికి వచ్చినవాళ్ళని గౌరవించారు. వాళ్ళని వాళ్ళు చూసుకొన్నారు. నాసంగతి పూర్తిగా మర్చిపోయారు! కాని, ఆయన, యివాళ పొద్దున్నే నాచేయి పట్టుకొని తనదాన్నిగా చేసుకొన్న ఆయన, నేను ఏమీ తినలేదనే దాన్నిగురించి ఎంత బాధపడుతున్నారు! నామీద నాకే అంతబాధ కలగలేదే!

'ఇంతమంది వున్నారుకదా ఎవళ్లో ఒకళ్లు దానిసంగతి చూస్తారనుకొన్నాను. నాకు చేతినిండా పనేనాయెను' అని అమ్మ గొణిగింది. అల్లుడి ఎదురుగా అమ్మ మాట్లాడదు.

'పనిమందిలోను పందిట్లో కూర్చోబెట్టి అల్లా అందరూ కలసి అల్లరి చేస్తే ఏమవుతుంది మరి ? అక్కడికీ నేను హెచ్చరించాను. కాని ఎవరేనా వింటేగా ?' అని అమ్మకు సూటిగా సమాధాన మిచ్చారు 'ఆయన'. ఈ అల్లుడి దగ్గర అమ్మ తన అలవాటును మార్చుకోవలసిందే !

ఏమయినప్పటికి ఆయన అల్లా మాట్లాడటం నాకు కొంచెం కష్టంగానే తోచింది. ఇంకా ఇరవైనాలుగు గంటలు కాలేదు నన్ను తన చేతిలోపెట్టి, అప్పుడే నన్ను సరిగా చూడ లేదంటూ అభియోగం చాటుతున్నారే ! కని, పెంచి, పెద్ద దానిని చేసి, పదహారు సంవత్సరాలు పాటు పడ్డారే ? ఈ చిన్న విషయానికి మనం యిల్లా మాట్లాడ వచ్చా అనే సంగతి ఆయనకి ఎందుకు తోచటంలేదు ? పోనీ, 'పెళ్ళంటే మరేమిటనుకొన్నావ్ ? ఇల్లాగే వుంటుంది' అని మా బావ గారేనా చెప్పారా ? ఆయనకూడా 'ఆయన'తో కలసి, 'అవు నండి, చంద్రం చెప్పింది నిజమే. మీరు దానితిండి విషయంలో చాలా అశ్రద్ధ చేశారు' అని తాళంవేసి పదం పాడారు !

అమ్మకు చంప ఛెళ్ళు మన్నట్లయింది ! అక్కయ్య నిశ్చేష్టురాలయిపోయింది!

'సరిసరి. అయిందేదో అయింది. అయిదుగంట లయింది యిప్పుడు. ఎనిమిది తర్వాత అప్పగింతలు పెట్టుకోవచ్చు.

కొంచెం పళ్ళరసం ఏదైనా యిచ్చి కొంచెంసేపు కన్ను ముయ్యనివ్వండి' అన్నారు మా పెద్ద బావగారు జ్ఞాన శేఖరం.

ఆయనకూడా గుమ్మంలోనే వున్నారు కాబోలు! 'అవును కొంచెం అలసటైనా తగ్గుతుంది' అన్నారు నా భర్త.

వాళ్ళు అల్లా అన్నారో లేదో, 'అమ్మయ్యో! యింతోటి దానికి ఎంత గంతు లేశారే బాబు! అశ్రద్ధ చేశామనేశారే ఏకంగా' అంటూ ఆశ్చర్యపడింది పెద్దక్కయ్య కమల.

బత్తాయి రసం తీస్తున్న అమ్మ 'అవును మరి యింత వాళ్ళ సాత్త్వికదా!' అంది.

'ఇంక కొంచెంసేపట్లో తెల్లవారబోతోంది. ఇప్పు డెందుకమ్మా ఆ పళ్ళరసం' అన్నాను. అంతమంది జాలీ నాకు తెలియకుండానే నన్ను పసిపిల్లను చేసింది.

'ఆయన చెప్పి వెళ్ళారు. నువ్వు వద్దంటూ సణుగు. ఇంకొంచెంసేపయ్యాక 'యిచ్చారా' అంటూ ఆయనగా రొస్తారు. చివరకి మాటపడేదాన్ని నేను. పదహారేళ్ళమ్మాయి పసిపిల్లలా మాట్లాడటం ఏం బాగా లేదు. అట్టే వాగక తాగు' అని అమ్మ కోప్పడింది. నేను మళ్లీ మాట్లాడకుండా బుట్టలో పాములా గడగడ తాగేశాను ఆ పళ్ళ రసాన్ని.

'ఇంక కొంచెంసేపు నిద్రపో' అని లోపలికి వెళ్ళింది అమ్మ. 'అవునమ్మా విమలా! నిద్రపో! లేకపోతే మళ్లీ ఆయనగారు వచ్చి మమ్మల్ని ఏదైనా అనేస్తారు!' అంది కేళాకోళంగా నవ్వుతూ పెద్దక్కయ్య కమల.

నాకు కోపం వచ్చింది!

నా మనస్సంతా నిండిపోయిన ఆయనగురించి తప్పుగా మాట్లాడితే నాకు పౌరుషం రాదామరి? వాళ్ళ యింట్లో యిల్లా లేదే అని యీ అక్కయ్యకు కొంచెం యీర్ష్యే! లేకపోతే ఆయన అంత జాలి చూపించినందుకు సంతోషించాలికదా!

'ఏదో ఒకమాట అన్నారని నోటికి వచ్చినట్లల్లా మాట్లాడేస్తున్నావే! ఆయన అన్నదికూడా నిజమేగా? నా తిండి సంగతి మీరెవరేనా చూశారా?' అంటూ నవ్వుతూనే అటించాను.

'అయ్యబాబోయ్! యింకా ఒక్కరోజుకూడా పూర్తికాలేదు. ఆ యింటినీళ్ళు యింకా ఒక గుక్కెడుకూడా నోట్లో పడలేదు. అప్పుడే దీనికి ఎంత పౌరుషం వస్తోంది? చాలా అసాధ్యురాలవే విమలా నువ్వు! ఊఁ...భార్యా భర్తలంటే యిల్లాకదా వుండాలి?' అని ఓ దీర్ఘ శ్వాసాన్ని విడిచిన అక్కయ్య 'మేమూ వున్నాం ఏంలాభం?' అన్నట్లు కనిపించింది.

దీపంతగ్గించి జంబుఖానా ఒకటి పరుచుకొని పడుకొంది అక్కయ్య. వెంటనే దానికి నిద్ర పట్టేసింది. పాపం అలసట కదా!

నాకు నిద్రపడుతుందా? బయట అరుగులమీదవున్న పెట్రొమాక్సులైట్ల హోరు, నిద్రపోతూన్న పెద్దమనుష్యులు పెట్టే గుఱకలు నిశ్శబ్దాన్ని చీల్చేస్తున్నాయి. తాను సృష్టించిన దానిని మళ్ళీ మళ్ళీ తల్చుకొని ఆనందాన్ని అనుభవించే

కళాకారునిలా, ఆనాటి సంఘటనలను మళ్ళీ మళ్ళీ తలుచుకొని నాలో నేను పొంగిపోయాను !

జీవితంలో ఒకరోజు — నిశ్చయాలు జరిగినప్పుడు కూడా వాటినిగురించి నేను ఏమీ ఆలోచించలేదు. కాని యిప్పుడు అవి అన్నీ నన్ను ఆయనతో కట్టివేసే పుణ్యకార్యాలలా తోస్తున్నాయి. అప్పుడు లేనిది యిప్పుడు నాకు ఏదైనా జ్ఞానోదయ మయిందా ?

కాదామరి ! ఆయన ప్రేమపలుకులు నిద్రపోయిన నామనస్సును మంత్రదండంలా తట్టి లేపివేశాయే ! ప్రేమ యొక్క ప్రకాశాన్ని సరిగా అర్థం చేసుకోగలిగే శక్తి ఇప్పుడు నామనస్సు పొందింది. పెద్దలు విధించిన పుణ్యకార్యాలవల్ల ఏర్పడే బంధంలో, పరస్పర పవిత్రప్రేమకు స్థానం వున్నట్లయితే, పాలు, తేనె కలిసినట్లుగా ఎంత ఆనందం కలుగుతుంది! ఈ కొత్త అనుభవంలో నా శరీరం అలిసినట్లుగా నాకు తోచలేదు. ఏదో అర్థంకాని కొత్తశక్తి నాలో ప్రవేశించినట్లుగా తోచింది. నిద్రపో బుద్ధి వేయలేదు. లేచి కూర్చొన్నాను.

మొట్టమొదటగా నాకళ్ళకు ఎదురుగా గోడకు తగిలించిన రోజాపువ్వుల మాలలోని చమ్కీ 'మెరుపులా' కనిపించింది. అలమారు అద్దాలలోనుంచి వడ్డాణము, తదితర నగలూ కనిపించాయి. ఆ పక్కనే బల్లమీద నిన్నటి అలంకార చిహ్నమైన ఆ చీర—

నిన్నటిమాదిరిగానే ఆ చీరకట్టుకొని, ఆ నగలన్నీ పెట్టుకొని ఆయన ప్రక్కన కూర్చోవాలి ! ఈ ఆలోచన నాకు ఎంత ఆనందంగా వుంది !

కిటికీ దగ్గరకువచ్చి పొలాలవైపు చూశాను. వెన్నెల కాంతిలో మిలమిల మెరుస్తూ వంకరటింకరగా ముందుకు సాగిపోయే నాగసర్పంలా, తెల్లవారకట్ల మసక చీకట్లో తెల్ల తెల్లగా ప్రకాశించింది యింటి వెనుకవైపునుంచి సాగిపోయే ఆకాలిబాట. పొలాలమీదనుంచి వచ్చే పైరుగాలి చల్లగా హాయిగా వుంది. రాత్రి కురిసిన వానవల్ల కొంచెం మట్టి వాసనకూడా వేసింది. సూర్యభానుని అరుణకిరణాలు యింకా బయటికి రాలేదు. కాని చీకటికూడా అంతరించింది. ప్రాతఃకాలపు ప్రశాంతతను గురించి చాలా చదివాను. కాని ఇంత ఆహ్లాదకరంగా వుంటుందని యీనాడే అనుభవ పూర్వకంగా అర్థం చేసుకోగలిగాను. ఎంతసేపు అల్లా నిల్చున్నానో!

'ఏమే విమలా నువ్వు అసలు నిద్రేపోలేదా? ఏమిటీ చూస్తున్నావు?' అంటూ నా భుజంమీద చెయ్యి వేసింది పెద్దక్కయ్య.

'ఏంలేదు అక్కా రాత్రి బాగా వాన కురిసిందా?'

'హాసి పిరికిపిందా! ఇంకా వానకురుస్తోందనుకొంటు న్నావా? వేసంకాలం వాన, ఏదో నాలుగు చినుకులు పడ్డాయి. అప్పుడే వెలిసిపోయింది. అంతమాత్రానికే భయ పడి అమ్మాయిగారు మూర్ఛపోయారు కాబోలు!' అంది పరిహాసంగా.

'లేదక్కా! భయపడలేదు. రాత్రి ఎవరో పాట పాడారే ఎవరక్కయ్యా?'

'అవునవును. కొంతమందికి ఏ సమయంలో ఏ పాట పాడాలో కూడా తెలియదు. నాకు చాలా కోపంవచ్చింది.

మీా పెద్దతోడికోడలే ఆ పాట పాడింది. నలుగురూ సంతోషంగా వున్నప్పుడు, అటువంటి పాటలు పాడకూడదనే యింగితజ్ఞానమేనా లేదు' అని యీా పల్లెటూరి అక్కయ్య ఆ పట్టణం పిల్లకు 'సర్టిఫికేట్' యిచ్చింది !

ఈమె యిల్లా మాట్లాడుతున్నప్పుడు, బి. యే. ప్యాసయిన మా పెద్దతోడికోడలుకు ఆ పాట పాడకూడదని ఎందుకు తెలియలేదు ? పాడాలనే పాడిందా ? నాగరికం యిటువంటివాటి కన్నింటికి ప్రయోజనం లేదా ? సంతోషంలో వున్నవాళ్లని ఏడిపించటానికే ఆ పాట వచ్చిందా ?' ఇప్పటి నా సంతోషం శాశ్వతం కాదా ?

గానుగచుట్టూ తిరిగే ఎద్దులా నా మనస్సులో తిరుగుతున్న ఆలోచనకే మళ్లీ వచ్చాను. చిన్నక్కయ్య ప్రమీాల, అమ్మ గదిలోకి వచ్చారు.

'ఏదో కళ్లు తెరకుండా పడివుందన్నావ్ ! ఇద్దరూ కబుర్లు చెప్పుకొంటున్నారే !' అంది చిన్నక్కయ్య.

'విన్నావా పెద్దమ్మాయ్. వాళ్ళకూడానే పిల్లను తీసుకువెళ్లాలనే అభిప్రాయ మున్నట్టుందని తెలుస్తోంది అంటున్నారు మీా నాన్నగారు' అంది అమ్మ.

'నిజంగానేనా ? ఒకవేళ అటువంటి అభిప్రాయమున్నట్లయితే రాత్రి చెప్పివుండేవారే !' అని అనబోయి అనలేక పోయాను.

'నేను అప్పుడే అనుకొన్నాను. ఇంత బాధపడేవాళ్ళు దీన్ని యిక్కడ వదిలి ఎల్లావుంటారా అని' అంది పెద్దక్కయ్య నన్నుచూసి నవ్వుతూ.

'ముందుగా తెలిస్తేకదా ఏదైనా ఏర్పాటు చేయటానికి వీలౌతుంది? చటుక్కున మా కూడానే తీసుకెళ్తాం అంటే ఎల్లా?' అంది అమ్మ.

మా బామ్మ అంటూవుంటుంది. 'ఈ ఆడపిల్లలే యింత. కని, పెంచి, పెద్దదానినిచేసి, తీరా పెళ్లంటూ అయ్యే సరికి, ఎప్పుడు యిక్కణ్ణుంచి వెళ్ళిపోదామా అన్నట్లుంటారు. తినటానికి తిండి లేకపోయినాసరే ఆ యిల్లే వాళ్లకి స్వర్గం—కృతఘ్నులు!'

ఎంత అనుభవ పూర్వకమైన మాట!

ఇన్నాళ్ళు పెరిగి పెద్దదాని నయిన పుట్టిల్లు వదలి వెళ్ళిపోతున్నామనే విచారంగాని, బాధగాని నాకు కలగలేదు 'ఆయన కూడా. వెళ్లబోతున్నాం. ప్రేమ ప్రవాహంలో ప్రియమైన తనవాళ్ళందరితోను ఆనందంగా వుండబోతున్నాం'. అని నామనస్సు పొంగిపోయింది!

రాత్రి చెప్పకపోతే మాత్రం? నా వాళ్ళందరిని వదలి వెంటనే రావటానికి బాధపడతానేమోనని చెప్పివుండక పోవచ్చు. నన్ను చూస్తే అల్లా అనిపించిందేమో ఆయనకి. చదువుకొన్నప్పటికి, పట్టణవాసం అంటే ఏమిటో తెలియని నాలో పల్లెటూరిఛ్ఛాయలు కనిపించకుండా వుంటాయా? ఇకనుంచి, తనవాళ్లందరి లాగునే నేనుకూడా సంచరించాలి. అల్లా అయితేనే ఆ యింట్లో నాకు గౌరవంగా వుంటుంది' అనే ఆలోచనా సాగరంలో యీదులాడాను.

వారు ఎందుచేతనో అభిప్రాయం మార్చుకొన్నారు. నన్ను యిప్పుడు తీసుకు వెళ్లరుట!

అప్పగింతలన్నీ సవ్యంగా పూర్తయాయి. 'వివాహం బాగా జరిపించారు. మాకు సంతోషం' అంది నా తోడికోడలు చంచల అమ్మతో, సాంప్రదాయంగా.

మా అత్తగారు మొదటినుంచీకూడా చాలా ముభావంగానే వున్నారు. ఆమెలో ఏదో అసంతృప్తి వుందనేది నాకు లీలగా తోచింది. ఏమీ కలగచేసుకోలేదు. ఏమీ మాట్లాడలేదు. స్వభావమే అంతేనేమో? మా తోడికోడలు చంచలదే సర్వాధికారమూను. రేపు అక్కడికి వెళ్ళాక నేనూ అల్లాగే వుండాలి!

నా దగ్గరకువచ్చి 'వెళ్ళొస్తాం విమలా! చాలా బలహీనంగా వున్నావ్! ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. ఉత్తరాలు రాస్తూవుండు. అక్కడికిమాత్రం యిల్లా వచ్చావంటే రానివ్వను' అంది నవ్వుతూ నా తోడికోడలు చంచల.

టక్ టక్ మనే బూట్ల శబ్దంతో, అంతమంది ఆడవాళ్ళలో, నన్ను చూసి చిరునవ్వు నవ్వుతూ ఆయన నాదగ్గరకు వచ్చినపుడు, నా తల నాకు తెలియకుండానే కిందకు వంగిపోయింది! చిన్న పేకెట్‌ను నా చేతిలో పెడుతూ, 'వెళ్ళిరానా విమలా' అంటూ తన చూపుడు వేలితో నా తలను పైకెత్తి నా కళ్ళలోకి సూటిగా చూసిన ఆ చూపు ఎంత మధురానందాన్ని కలగచేసింది!

ఆయన అల్లా వెళ్ళారో లేదో, 'ఏమిటది విమలా! అంత ఆప్యాయంగా నీచేతికే యిచ్చారు?' అంటూ యీ ఆడవాళ్ళంతా నన్ను చుట్టు ముట్టారు. పెద్దక్కయ్య నా చేతిలోని ఆ పేకెట్‌ను లాక్కుని విప్పి చూసింది.

చక్కటి ఫౌన్‌టెన్‌పెన్ !

'దానిని వాళ్ళన్నయ్య తనకిచ్చారు. తను తన అర్ధాంగికి యిచ్చాడు' అని వ్యాఖ్యానించింది నా తోడికోడలు చంచల. 'అవునవును – ఉత్తరాలు రాయటానికి' అని వాఖ్యానాన్ని పూర్తిచేసింది చిన్నక్కయ్య ప్రమీల.

పెళ్లివారంతా వెళ్ళిపోయారు. వాళ్ల ఊరెళ్లి వీళ్ళందరూ పల్లెటూరి గబ్బిలాయిలనుకొంటూ నవ్వుకొంటారేమోకూడా అనిపించింది నాకు.

నా జీవితంలో యీ ఒక్కరోజు ఎంత మహత్తరమైన మార్పు తీసుకొచ్చింది? పదహారు సంవత్సరాలు 'పెరిగి పెద్దదాననయిన పుట్టిల్లునుంచీ, నా తల్లి తండ్రులు, బంధువుల నుంచీ వేరుపడిన నేను, ఉదయకాంతి అరుణకిరణాలతో శోభాయమానంగా ప్రకాశించే సరస్సులో విచ్చిన సరికొత్త పువ్వులా ఒయ్యారంగానూ, గర్వంగానూ తలఎత్తి నిల్చోటం ఆశ్చర్యాల్లో కల్లా ఆశ్చర్యం కాదా !

'విమల పెళ్ళయిందంటే నానెత్తిమీదనుంచి కొండంత బరువు తగ్గినట్టవుతుంది' అని అమ్మ అప్పుడప్పుడు అంటూ వుండేది. కాని యిప్పుడు తీరా పెళ్ళియాక, అమ్మా నాన్నలకు సంబంధించినంతవరకు, ఆ నెత్తిమీద బరువు యింకా ఎక్కువైనట్లేవుంది కాని తగ్గినట్లు ఏమీ లేదు. అమ్మగొంతుక బొంగురుపోయింది. నాన్న యింకో పదేళ్లు పెద్దవారయినట్టు జాలిగానూ, భీతిగాను కనిపించారు. సినిమా పూర్తయాక తిరిగి వెళ్ళిపోయే ప్రేక్షకులలా, పెళ్లికి వచ్చిన బంధువులంతా

ఒక్కొక్కరే వెళ్లిపోయారు. చివరకు మిగిలినవాళ్లు అత్తయ్య బామ్మలు

అత్తయ్య నాన్నకు ఏకైకసోదరి. అత్తయ్య భర్త ఆగ్రాలో ఒక పెద్ద ఇంజనీరు. ఆశకు ఒక అమ్మాయి శ్యామల, ఆనందానికి ఒక అబ్బాయి సుందరం అత్తయ్యకు పిల్లలు. వజ్ర వైడూర్య మాణిక్యాలతో పొదిగిన నగలలో అత్తయ్య నడుస్తూంటే ఆ నడకలో అహంభావమూ గర్వమూ కనిపిస్తూనే వుంటాయి. అల్లుడు రెండుచేతులా సంపాదిస్తున్నాడని కూతురుమీద ప్రత్యేక అభిమానం బామ్మకి. తను కూతురు దగ్గరే వుండటానికి కారణం కూడా అదే. నాన్న తనకి ఏకైక పుత్రుడు. ఆయన ప్రియసంతతే మేము. మామీద పాశమో ఏమో "ఏరా నారాయణా! ఆడపిల్లగా పుట్టినదానిని నెల నెలా పదీ పదిహేను ఖర్చుపెట్టి చదివిస్తున్నావే. ఏదో కొంచం పాడుతోంది అది చాలదా? పదిరూపాయలిచ్చి సంగీతం మేష్టరుకూడా ఎందుకు? యీ డబ్బంతా యిల్లా తగలేసేకన్నా ఏదైనా ఓగొలుసు చేయించి పడేస్తే లక్షణంగావుంటుంది. ఎద్దులా ఎదిగిపోయింది. యింకా దాని మెళ్లోకి ఏమీ చేయించలేక పోయావు" అని ఒక సందర్భంలో బామ్మ నాగురించి అన్నప్పుడు ఆమెకు మామీద వున్న ద్వేషం ధ్వనించకుండా వుండదు. బామ్మ మాటలువింటే అమ్మకు రోషమొస్తుంది. కాని ఏం చేస్తుంది? పళ్లుబిగించి, నోరు మూసుకూర్చొంటుంది! ఎప్పుడైనా యిల్లా కల్యాణం, కార్తీకం అంటూ ఏదైనా జరిగితేనే వాళ్ళు మాయింటికి

వస్తారు. ఒకసారి బామ్మ మాయింటికి వచ్చినపుడు జరిగిన సంఘటన ఒకటి నాకు బాగా జ్ఞాపకం వుంది.

'కాఫీ దగ్గరనుంచి తాంబూలమిచ్చి పిలవాలి మీ బామ్మని. వెళ్లి పిల్చుకురావే విమలా' అంది అమ్మ కోపంగా. నేను వెళ్ళేటప్పటికి బామ్మ, మా పక్క యింటి కోమల తల్లితో 'ఒళ్లూపై తెలియకుండా ఎల్లా ఖర్చు చేస్తోందో చూడండి. మొన్న మట్టుకు మొన్న కమల పురిటికి వచ్చి వెళ్లిందా – పిల్లలందరి చేతుల్లోను పదేసి రూపాయల నోట్లు పెట్టింది. యిల్లా ఖర్చుచేస్తే రేపు విమల పెళ్లి ఎల్లా చేస్తుంది? చివరకి నా కూతురే ఏదైనా సహాయం చెయ్యాలి. లేకపోతే ఏమయిపోతారు వీళ్ళు? ఊఁ...ఎన్ని చేసినా, ఏంచేసినా ఏం లాభం? కొంచెమేనా విశ్వాసమనేది వుంటేగా? అది అసలు వీళ్లింటికి రానేరాదు. ఎప్పుడైనా వచ్చిందంటే, దానికి తగిన చీరేనా పెట్టాలని తోచదు. పాపం నారాయణ! ఉత్తి అమాయకుడు. వాడి నెత్తికి యీ ఛండ శాసనురాలిని కట్టి పడేసాడు భగవంతుడు' అని ఏమేమో అంటూ కూతురు గొప్పతనాన్ని, కోడలు చిన్నతనాన్ని ప్రలాపించేస్తోంది.

ఆడుతూ పాడుతూ తిరిగే నేను, మా కుటుంబవ్యవహారాలు ఎప్పుడూ ఆలోచించలేదు. అమ్మనుగురించి బామ్మ మాట్లాడిన ఎత్తిపొడుపు మాటలు నాకు చాలా బాధ కలిగించాయి. 'అత్తయ్య సహాయమే లేకపోతే మేము బ్రతకలేమా?' అమ్మకి యిదంతా ఎందుకు తోచలేదు? బామ్మ అన్నదంతా అమ్మతో చెప్పెయ్యాలనుకొన్నాను.

ఉన్నట్టుండి ఆ మర్నాడే 'నన్ను యివాళ బండెక్కించేయరా నారాయణా' అంది బామ్మ. 'యింకో పదిరోజుల పాటువుండి వెళ్లమ్మా, యిప్పుడేం తొందర ?' అన్నారు నాన్న. 'ఏమో నాయనా ! నువ్వొ యిక్కడ కష్టపడుతున్నావ్. అక్కడ అటువంటిది ఏమీ లేదు. శుభ్రంగా పాడీ పంట అన్నీ వున్నాయి' అంది బామ్మ. ఆరోజే బామ్మ వెళ్లిపోయింది.

బామ్మ వెళ్ళగానే అమ్మ తన కోపాన్నంతా వెళ్ళగక్కింది. 'విన్నారా మీ అమ్మగారి మాటలు. అవును మరి–నేను పేదరాలినే. నాకు పాడీ, పంట ఎక్కణ్ణుంచి వస్తాయి ? కరువో, కాటకమో నీ గుమ్మంతొక్కదు లేదు, అని ఏమేమో అంటూ వెళ్లింది మీ అమ్మగారు' అంది అమ్మ.

పాపం నాన్న ఏం చేస్తారు ? 'దైవమా' అనుకొంటూ తన చేతులను నెత్తి కాన్చుకొని దిగులుతో కూర్చుండిపోయారు. ఆ సమయంలో అమ్మ మాదిరిగానే నాకూ రోషమొచ్చింది. "తన సొంత సంతానాన్నే గొప్ప బీద అంటూ తల్లి వ్యత్యాసం చూపిస్తుందా ? వాళ్లు గొప్ప వాళ్లనే గర్వం వాళ్ళకే వుండనీయండి. రేపు నా పెళ్ళికి వాళ్ల నేమి అడక్కూడదు" అని చటుక్కున అనేసాను ముందూ వెనకా ఆలోచించకుండా. అమ్మా నాన్నా ఒక్కక్షణం నిశ్చేష్టులై పోయారు !

నా మనస్సులో మాత్రం ఆ మాటలు చాలా సమంజసంగా కనిపించాయి. కాని బయటికి, కుటుంబ వ్యవహారాలంటే ఏమిటో తెలియకుండా, ఆడుతూ పాడుతూ తిరిగే నేను

అకస్మాత్తుగా అన్న ఆ మాటలు అర్థంలేని అధిక ప్రసంగంలా కనిపించాయి. వెంటనే అమ్మ నా నెత్తిమీద గట్టిగా మొట్టింది.

'చిన్న పిల్లలా వుండకుండా పెద్దవాళ్ళ మాట్లాడుకొనేదంతా వింటూ కూర్చున్నావా నువ్వు? ఇల్లా అయితే రేపు కాపరానికి వెళ్ళి ఏం వెలగబెడతావు!' అని అమ్మ కేకలేసింది బొప్పికట్టిన తలని తడువుకొంటూ నేను ఆవతలకి వచ్చేశాను.

'వాళ్ళు గొప్పవాళ్ళు. మేము బీదవాళ్ళం. శ్యామల, సుందరం బావలు నాతో సమమయినవాళ్ళు కారు' అని ధృఢపరచుకొన్నాను.

అప్పట్లో అమ్మ వైరాగ్యంగా మాట్లాడి నప్పటికి, ఆత్తయ్య నా పెళ్ళికి ఏదో, అప్పుగా యిచ్చిందనే సంగతి. ఎవరూ చెప్పనక్కర్లేకుండానే నాకు తెలిసింది. నాకు నచ్చలేదు. కాని పెద్దవాళ్ళు ఆలోచించకుండానా చేస్తున్నారు? వాళ్ళకు లేని గొప్ప బీదరికాలు నాకు మాత్రం ఎందుకు? కుటుంబం అంటే యిల్లాగే అనేక చిక్కులు వుంటూవుంటాయి.' ఇటువంటివన్నీ చూసీ చూడనట్లు పోనటమే మంచిది' అని అనుకొని యిదివరకు విషయాలన్నీ మర్చిపోయి, నవ్వుతూనే వాళ్ళందరిని ఆహ్వానించాను.

శ్యామల నాతో చనువుగానే వుండేది. 'అత్తయ్యా! విమలని మాతోపాటు పంపరాదూ? ఎల్లాగా యింక కాపరానికి వెళ్ళిపోతుంది. పదిరోజులపాటు వుండి వస్తుంది' అని అమ్మను అడిగింది శ్యామల.

'అవునమ్మా, నేను వాళ్ళవూరు ఎప్పుడూ వెళ్ళలేదు కూడా' అన్నాను చిన్నపిల్లలా ముందూ వెనకా ఆలోచించకుండా.

మాట్లాడకుండా మౌనందాల్చిన అమ్మతో, "అవును వదినా, ఏదో పిల్లలు సరదాపడుతున్నారు. పదిరోజులపాటు వుండివస్తుంది. అంటూ మా పక్షమే మాట్లాడింది అత్తయ్య.

# 3

నేను వచ్చిన ఆ రోజే శ్యామల తలనొప్పి అంటూ పడుకొంది. నేనూ తనూ కలసి ఉల్లాసంగా ఊరంతా తిరిగి సంతోషించలేదు. ఆడుతూ పాడుతూ కథలు చెప్పుకుంటూ కాలక్షేపం చెయ్యలేదు. ఇంటి ఎదురుగావున్న పువ్వుల మొక్కలు, దూరంగా కనిపించే చెట్లూ చూసి చూసి విసుగెత్తింది. ఎందుకు వచ్చానురా బాబూ అని అనిపించేటట్లు, శ్యామల తలనొప్పి టైఫాయిడ్ జ్వరంగా మారి యింట్లో వాళ్ళందరినీ హడలెత్తించింది. నాతో మాట్లాడేవాళ్ళెవరూ లేరు. నన్ను కవ్వించి నవ్వించేవాళ్ళూ లేరు.

శ్యామల మూసినకన్ను తెరవకుండా పడివుంది. గంట గంటకి డాక్టరు వచ్చి చూసి వెడుతున్నారు. పరిచర్య చేయటానికి ప్రత్యేకంగా ఒక నర్సుని నియమించారు. అత్తయ్యకు మతిలో మతి లేదు. తల్చుకొన్న దైవానికల్లా ముడుపుకట్టి మొక్కింది బామ్మ.

నేను వచ్చి పదిహేనురోజులు దాటింది. నాకు యిక్కడ వుండటంకూడా విసిగెత్తిపోయింది. అర్థాంగీకారంగా తలూపిన అమ్మ మనస్సు అర్థంచేసుకోకుండా వచ్చినందుకు నాకు యీ శాస్తి కావాల్సిందే! ఇప్పుడు నేను మా ఊళ్లో వున్నట్లయితే? ఆయన నాకు పెన్ను ప్రెజంటుగా యిచ్చిన సంగతి తెలుసుకొని కనిపించినచోటల్లా నన్ను పరిహాసం చేస్తారు. ఊళ్లోవాళ్ళంతా మా యిద్దరి గురించే యింకో నెలదాకా నేనా చెప్పుకొని చెప్పుకొని నవ్వుకుంటారు. నేను వచ్చి యిన్నాళ్ళయిందే - నాకు ఏదైనా ఉత్తరం వచ్చిందేమో! తల్చుకోవటానికే నాకు సిగ్గుగా వుంది... నేనే ఉత్తరం... చంచల ఉత్తరం రాయమని చెప్పింది. ఇప్పుడు రాస్తే? కాని నాకు ఎడ్రసుకూడా సరిగా తెలియదు! తెలిస్తే మాత్రం? ఇక్కడ బామ్మ అత్తయ్యలకు తెలియకుండా ఉత్తరం వ్రాయటం ఎల్లా సాధ్యమవుతుంది? ఒకవేళ వీలయితే -! అది మంచిపనేనా?

బయలుదేరేముందు, సహజధోరణిలో, నాకూ శ్యామలకూ వుండే అభిమానాన్నిబట్టి అల్లా మాట్లాడారని నేను అర్థంచేసుకొనేటట్లుగా వారు నన్నొక పరాయిమనిషిగా చూస్తూ, బామ్మ అత్తయ్యలు నాతో మాట్లాడనే లేదు! అకస్మాత్తుగా శ్యామలకు జ్వరం రావటంవల్ల యిల్లావున్నారా, లేక నేను యిక్కడికి రావటం వీళ్ళకి యిష్టంలేదా అన్న సంగతి నాకు అర్థంకాలేదు. మా ఊళ్లో వున్నప్పుడు పాటలు మర్చిపోకుండా వుండేందుకు నేను రోజూ పాడేదానిని. వీళ్లు చూడకుండా వున్నప్పుడు నా అంతట నేనే పాడనా? ఇంట్లో

రేడియో, అనేక పుస్తకాలు, కేరమ్సుబోర్డు లాంటివి ఎన్నో కాలక్షేపానికి వున్నాయి. శ్యామల లేకుండా స్వతంత్రంగా వాటిని వుపయోగించే ధైర్యం నాకు కలగలేదు.

ఆ రోజు మామూలుగానే సుందరం బావ వార్తలు వింటూ రేడియో దగ్గర కూర్చున్నాడు. నేను కొంచెం దూరంలో ఆ గదిలోనే వున్నాను. వార్తలు అయిపోయిం తర్వాత, 'యింకా వుంచనా విమలా! కాసేపు కూర్చుని విను, ఇప్పుడు ఏదో సంగీతం అనుకొంటాను. అయిపోయాక యీ స్విచ్ తిప్పి ఆపుచేసేయ్' అని ఎక్కడికో వెళ్లిపోయాడు. రేడియోలో వచ్చిన ఆ పాట నాకుకూడా వచ్చును. ఆ గొంతు కతో నా గొంతుకకూడా కలిపి, సన్నగా పాడుకొంటున్నాను నాలో నేను. బామ్మ అక్కడికి రావటం నేను చూడనేలేదు.

'ఏయ్ విమలా! పైన శ్యామల ఒళ్లెరక్కుండా పడుంది. నీకు యిప్పుడు సంగీతం ఒకటి తక్కువయిందేమిటి? సుందరం ఎక్కడ? వాణ్ణి ఆ రేడియో ఆపుచేయమను.' బామ్మ గొంతుక విని అదిరిపడ్డాను.

'బావ బయటికి వెళ్లాడు బామ్మా. నేనే ఆపేస్తాను' అంటూ రేడియో దగ్గరగా వెళ్లాను.

'నేనే ఆపేస్తాను అంటూ అదీ యిదీ తిప్పి పాడు చేయకమ్మా తల్లీ. వెయ్యి రూపాయలు పోసి కొన్న సొమ్ము అది.'

బామ్మ మాటలు నా చెంపలమీద ఛెళ్లుమన్నాయి.

అదీ యిదీ తిప్పి పాడుచేసే పసిపిల్లనా నేను? చదువు లేని మూర్ఖురాలినా నేను? తన సంతానంలోనుంచి వచ్చిన

దానినే అనే సంగతి మర్చిపోయి ఎంత హీనంగా మాట్లాడు తోంది ! శ్యామలతో నేనుకూడా సమానమే అని అనుకో వటం ఎంత అవివేకం ?

ఆ క్షణమే రెక్కలు కట్టుకొని మా వూళ్లో వాలి పోవాలని పించింది. పాలు, పళ్లూ, పలహారాలు, లేక పోయినా, తరవాణీ అన్నం తిన్నా, మా యిల్లు, ఆ స్వాతంత్రంలో ఎంత ఆనందం వుంది ? రేడియో, పుస్త కాలు మొదలైనవి లేకపోతేమాత్రం ? కమలక్కయ్యకూడా వుంది- తమాషాగా కబుర్లు చెప్పుకొంటూ, పెరట్లోనుంచి పొలాలకేసి చూస్తూ కూర్చుంటే ఎంత హాయిగా వుంటుంది! పాపం ! కమలక్కయ్య అక్కడవున్న నాలుగురోజులూ తనతోకూడా వుండకుండా, ఇక్కడేదో స్వర్గలోకం వుందని భ్రమించి పరుగెత్తుకు వచ్చానే ! నాకు కావలసిందే యీ శిక్ష !

శ్యామలకి కొంచెం జ్వరం తగ్గింది. ఇంక నేను బయ ల్దేరాల్సిందే. అత్తయ్యతో మెల్లిగా చెప్దామని వచ్చాను. బామ్మ, అత్తయ్యలు భోంచేస్తున్నారు కాబోలు. వాళ్ల మాటలు వినిపించటంతో ఓ గోడ పక్కనే ఆగిపోయాను.

'అదా ! అయ్యబాబోయ్ ! మాటలు మాత్రం తియ్యగా వుంటాయి. నానా పాట్లు పెట్టి దీనిగడ్డి దీనికి పెడు తుంది. అతన్నిచూస్తే యించు మించు ముప్ఫయిఏళ్లు వుంటా యనిపిస్తోంది. దీనికేమో పదహారేళ్ళు. రెండవ పెళ్లాంలా పడ్డానుగేళ్లా తేడా ? మహా తెలివైన దానిలా మాట్లాడు

తుందే వదిన - యీ సంబంధం మరి ఎందుకు చేసిందో' అంది అత్తయ్య.

'ఇందుకే అయిదువేల అయిదువందలు యిచ్చు కొన్నారు కాబోలు. నెలకి డబ్భై రూపాయలు తెచ్చే ముష్టి గుమాస్తా వుద్యోగానికి' అంది బామ్మ.

'ఆ...ఆవుద్యోగంకూడా ఖాయంకాదు ! సేల్సటాక్సు డిపార్టుమెంటులో టెంపరరీయేనట!' అంది అత్తయ్య.

నన్ను గురించే యీ మాటలు అని తెలుసుకోలేని తెలివితక్కువదానినా నేను ?

'విమల అదృష్టవంతురాలు. చాలా మంచి సంబంధమే దొరికింది. వాళ్లంతా దీనిని పువ్వుల్లో పెట్టినట్లు చూసుకొం టారు' అని ఆనాడు అమ్మతో అన్న అదే. అత్తయ్యేనా యిప్పుడు యిల్లా మాట్లాడుతోంది ? మనసులో ఒకటి బయ టికి మరొకటి ఎందుకు మాట్లాడుతోంది ?

నిజంగా నా తోడికోడలు అంత చెడ్డదా ? ఆయనకు నేను రెండవభార్యలా వున్నానా ? అల్లాగయితే...ఆయన... ఛీ! ఏమిటీ ఆలోచన ! ఎల్లావుంటే ఏం? ఆయనకు నామీద అపార ప్రేమ వుంది. అది నాకు చాలదా ?

సందర్భం సరిగా లేదని వచ్చిన దారి తెలియకుండా వెనక్కుతిరిగాను. నామనస్సులో ఒకతుపాను చెలరేగింది...

తప్పులనేవి మనకు తెలియకుండానే మనలో ప్రవే శించినపుడు, వాటిని మనం తెలుసుకోలేక పోవటానికి కారణం, వాటిని అణగతొక్కే సంతోషం కలగటమే. నా అత్తవారింట్లోని ఆ అనర్థాలు నిజమైనవేనా ? ఏదో ఆ వేశంలో

కట్టుబడి పోయిన కొత్త వ్యామోహంలో నేను వాటిని ఘనా
స్తులుగా తలచవచ్చు. కాని, రోజువారీ వాడకం వల్ల మెరుగు
అరిగిపోయిన కళాయిపూసిన గిన్నెలా నా కొత్త వ్యామోహం
లోని మెరుగుకూడా అరిగిపోయినట్లయితే, యీ అనర్థం
పెద్దమడుగులా సాక్షాత్కరిస్తుందా నాకు ?

ఆనాటివాన, ఉరుములు, పిడుగులు, ఆపాట అన్నీ
ఒక దాని వెనకాల ఒకటి గొలుసులా నాకు జ్ఞాపకం
వచ్చాయి. తల్చుకోవటానికే భయాన్ని కలిగించే యీ
ఆవేదన, నన్ను కట్టిపడేసినట్లు, ఆ పరిస్థితిలో నా చుట్టూ
తెగ తిరిగాయి.

రాత్రి నిద్రపట్టక, అటూ యిటూ దొర్లుతున్న నన్ను
బామ్మ పిల్చింది. 'ఏంబామ్మా' అంటూ వెళ్లాను. 'మీనాన్న
ఉత్తరం రాశాడుట' అంది మెల్లిగా ఏదో ఆలోచిస్తూ.

దీన్ని చెప్పటానికా యింత ఆలోచన ? ఏం ? వచ్చిన
వెంటనే చెప్పకూడదా ?

'ఏం రాశారు బామ్మా ?' అన్నాను.

'నిన్ను తీసుకొచ్చి దిగబెట్టమని రాశాడు.'

'ఏమని.'

'అవునమ్మా అవును. అయిదువందలకి అస్త్రం వేశాడు
మీనాన్న' అంది బామ్మ వేపకాయ తిని ఉమ్మివేసేటట్లు.

నాన్న డబ్బు కావాలని రాశారా ? నాకు ఏమీ
అర్థంకా లేదు.

'అయిదు వందలు కావాలిట ! అయిదు వందలు !
పెళ్ళికి కావలసినంత యిచ్చిందికదా ? మళ్ళీ యిప్పుడా ?

చెప్పుకోవటానికి నాకే సిగ్గేస్తోంది. మీ అమ్మో రాయమంటే మాత్రం మీ నాన్నకి ఎల్లా రాయాలని తోస్తోంది? ఇంత కట్నంయిచ్చి బి. య్యే. ప్యాసయిన అల్లుడికోసం ఎందుకు ఏడవాలి? తన తాహతుకు తగిన సంబంధం చూసుకోకూడదూ? పిల్ల ఒళ్లెరక్కుండా పడివుందని దాని కసలు మతేలేదు. ఇప్పుడే కుదిరిందీ యీాయనగారికి డబ్బు కోసం రాయటానికి. ఛి...ఛీ!' అని అమ్మ నాన్నల్ని నా ఎదురుగుండా చీదరించుకొంది బామ్మ.

ఇంతకుముందే అత్తయ్య అంతస్థు, అహంభావాలతో, వార్ధక్యంలోని శరీరంలా నలిగిపోయిన నా మనస్సు, యిప్పుడు నాన్న తెచ్చిపెట్టిన యీ అవమానంతో పెట్లిపోయింది.

వీళ్ళు యిటువంటివాళ్ళని తెలియదా? ఎందుకు యిక్కడికి డబ్బుకోసం రాశారు? ఏదో పెళ్ళిసమయంలో నలుగురిమధ్యా సాంప్రదాయానుసారంగా తిరిగినంతమాత్రం చేత అదంతా నిజమని నమ్మారా యీ అమాయక ఫునాన్న? అమ్మ రాయమని చెబుతుందా? సమయం వచ్చినప్పుడల్లా వీళ్ళని ఎత్తిపొడుస్తుందే! ఈ అయిదువందల రూపాయలు యింకెక్కడా దొరకవా? ఇక్కడ వీళ్ళదగ్గర ఎందుకు అవ మానపడాలి?

అవును...పాపం! నాన్న ఏంచేస్తారు? ఆయన తప్పే ముంది? అయిదువందలు వీళ్ళకి ఒక లెఖ్ఖా? ఈ శ్యామలకి పరిచర్య చేయటానికి పెట్టిన నర్సుకి రోజుకి పాతిక రూపా యలు చొప్పున మాట్లాడారే! యింకా డాక్టరుఫీజు, మందులూ అంటూ ఎన్ని ఖర్చులో! వేలు వేలుగా ఖర్చు

చేస్తున్నారు. మావయ్యకు నెలకు నాలుగువేలదాకా వస్తుం దనుకొంటున్నారే! నాన్నకి అయిదువందలు యివ్వటానికి లెఖ్ఖా? జమా? బావమరదేకదా? ఒకవేళ ఏదైనా దుబారా ఖర్చుకోసమా అడుగుతున్నారు? నాకోసం యీ స్వల్ప ద్రవ్యాన్ని ఇవ్వటానికి వీళ్ళకి ప్రమాదంకాదే! ఎల్లా గయినా యింటికి వెళ్ళిపోయి వీళ్ళ సంగతంతా నాన్న అమ్మ లతో చెప్పివేయాలని తహతహలాడింది నా మనస్సు.

ఏమయినప్పటికీ, బామ్మ యిదంతా నాతోనా మాట్లాడుతుంది? పెద్దవాళ్ళ సాధక బాధకాలు అనేకం వుంటాయి. ఈ నిష్ఠూరాలని అమ్మస్థానంలో నన్ను నిలబెట్టి మాట్లాడటం మర్యాదేనా? 'అయ్యోపాపం! చిన్న జీతం; ఇంతకుముందే యిద్దరు పిల్లలకు పెళ్ళిళ్ళుచేసి చితికిపోయాడు. వాడికి ఎల్లాగయినా సహాయం చెయ్యాలి' అనే దయాదాక్షి ణ్యాలు తన సొంతకొడుకుమీద యీ బామ్మకి ఎందుకు కలగటంలేదు? ఆడపిల్లమీద తల్లికి అపార ప్రేమ వుంటుం దని నాకు తెలుసు. అందులో అత్తయ్య సామాన్యమైనది కాదే! పక్షపాతమనేది అందుచేతనే హాస్తిమశకాంతరం రూపొందింది కాబోలు!

ఈ మనఃక్లేశాలలో మునిగిపోయిన నేను, నన్ను నా అత్తవారింట్లో దిగబెట్టబోతున్నారనే సంగతిగురించి ఆలో చించనే లేకపోయాను. అయిదువందల రూపాయల ప్రశ్న, రాత్రి అంతా నాకు నిద్రపట్టకుండా, నా కళ్ళముందు ఒక భయంకర పర్వతంలా ప్రతిబింబించింది!

భగవంతుడు ఎందుకు యీ కఠినబుద్ధితో, గొప్ప వాళ్ళు, పేదవాళ్ళు అంటూ మానవులను సృష్టిస్తున్నాడో, అనాదికాలంనుంచి పరిశోధించి మానవులు అర్థంచేసుకోలేని వ్యూహంలో తలదూర్చి వెక్కి వెక్కి ఏడ్చాను.

రాత్రి అంతా నిద్రపట్టకపోవటంవల్లనో ఏమో, తెల్ల వారగానే నా తలంతా భారంగా తోచింది. మనస్సులో మసిలిపోయే ఆ వేదనయొక్క ప్రతిబింబంలా నా ఒళ్ళంతా చెమట పట్టేసింది. చాలాసేపు అల్లాగే పడుకొనే వుండి పోయాను లేవలేక.

'ఏయ్ విమలా! నీకు యింకా తెల్లవారలేదా? కాపరానికి వెళ్ళబోయేపిల్ల తెల్లారి ఎనిమిదింటిదాకానా నిద్ర పోతూవుంటుంది?' అని కేకలేస్తూ వచ్చింది భామ్మ.

తన మాటలతో నా కళ్లు అశ్రుపూరితాలయాయి. మా యింట్లో అమ్మ నన్ను ఎంత కోప్పడినా నాకు బాధగా వుండదు. అలవాటులేని యింట్లో, అభిమానం చూపేవాళ్లు ఎవళ్ళూ లేనిసమయంలో, బోనులో చిక్కుకుపోయినట్లు చిక్కుకుపోయానే అని నాలో నేను కృంగిపోయాను.

'ఏంలేదు బామ్మా. తలంతా భారంగా తలనొప్పిగా వుంది. ఒళ్లంతా నొప్పిగావుంది. అందుకనే లేవలేక పోయాను' అని మెల్లిగా లేచాను, బయటికివచ్చే కన్నీళ్లను బలవంతంగా ఆపుచేసుకొంటూ.

'అదేదో చెప్పివడిస్తేకదా నాకు తెలుస్తుంది? సర్లే! లే! ఈపూట స్నానంచెయ్యకు. మిరియాల కషాయం ఇస్తాను తాగు- తగ్గిపోతుంది' అంటూ బామ్మ వెళ్లింది.

యింట్లో నీ జీవితంలో మళ్ళీ కాలు పెట్టవద్దు అని 'ఆర్డరు' వేసినా వేస్తారు !

సిగ్గు, కలవరము నన్ను ఆవరించగా, బామ్మ యిచ్చిన మిరియాల కషాయం తాగేసి, మధ్యహాలులోకి వచ్చేసరికి అక్కడ అత్తయ్య నాకు తెలియని ఒక యువకునితో మాట్లాడుతోంది. 'నేనుకూడా రావాలనే అనుకొంటు న్నాను. కాని ఏదో ఒక పనితోనే సరిపోతోంది...ఊ... అయితే చెల్లెలిని తీసుకురావటానికి నువ్వే వెళ్తావన్నమాట. మీ నాన్నగారికి ఎల్లా వుంది యిప్పుడు ? అమ్మకి సాధారణ జ్వరమేనా ?' అంది అత్తయ్య. 'అనే డాక్టరు అంటున్నారు. నాన్నగారికి కొత్త ఏముంది ? అంతా యిదివరకు పరిస్తితే. మా పిన్నికూతురికి దగ్గు, జ్వరం, మా పిన్నికి ఆ[illegible] లోపలికి బామ్మకి గుండె దడ, [illegible] ఏం చెప్ప[illegible]ను సైకిలుఎక్కి ఆస్పత్రి అయిపోయింది. నేను డాక్టరు[illegible]స్తూ వుండిపోయాను ! కాదు. ఈ డాక్టరు బిల్లులేనా మిగిలేవి. ధైర్యం నాకు లేదు. కూడా వస్తుంది. అసలే దాని ఆరోగ్యం ఏ[illegible] లేదుట. దానికి తోడు గర్భిణి. ఏం చెప్పమ[illegible] శ్యామలకు బాధ' అంటూ నవ్వుతూనే చెప్తూండగా, అతని [illegible] నామీద పడ్డాయి.

'ఈ అమ్మాయి ఎవరు అత్తయ్యా !' అని నేను అక్క ణ్ణుంచి వెళ్లినతరువాత అడగకుండా నా ఎదురుగుండానే నా గురించి అడిగేశాడు ! 'ఇదే విమల. మొన్న పెళ్ళయింది దీనికే' అంది అత్తయ్య. 'ఓహో ! పెళ్ళికూతురన్నమాట. చూస్తే శ్యామలకన్నా చిన్నదానిలా వుంది. అప్పుడే పెళ్ళి

యుందా ? ఆయన ఏం చేస్తున్నారు ?' అని అతను అన్నప్పుడు నాకు చాలా సిగ్గు వేసింది.

ఎంత సాహసం అతనికి ? నా ఎదురుగా నా గురించి ఒక యువకుడు మాట్లాడటం యిదే మొదటిసారి !

'చిన్నదేమిటి ? శ్యామల కొంచెం పొడుగ్గా వుంది, కాని దానికన్నా యిదే పెద్దది. ఆతను కలకత్తాలో ఏదో అఫీసులో పనిచేస్తున్నాడు' అంది అత్తయ్య.

'ఊహూ...మీతో కూడా వచ్చింది కాబోలు... పాపం...శ్యామల మంచమెక్కింది, తనకి యిక్కడ ఎల్లా పొద్దుపోతోంది ? తాజ్‌మహల్ చూసిందా ? ఊరంతా తిరిగి
నా ?' అంటూ వదలకుండా నాగురించే గుచ్చి గుచ్చి
'యిప్పుడు ప్రశ్నలు, అత్తనెవరో తెలుసుకోవాలనే
మెల్లిగా.
దాయి నాకు.

'ఏం ?
ఏముంది ? క్కడికి వచ్చి నెలరోజులు దాటిపోయినప్పటికీ
అని విసుక్కు నా సంగతి ఆలోచించకపోయినా, అప్పుడే
న అతను ఒక్క క్షణంలోనే 'తనకి యిక్కడ
పొద్దుపోతోంది ?' అని నా మనస్సును అర్థం చేసి
న్నట్లు సరిగ్గా అడిగేశాడే ! ఇక్కడ ఎవరికి కూడా తోచని ప్రశ్న తోచిన యితను ఎవరయి వుంటాడు ? అని నేను ఆశ్చర్యపోయాను.

'అది వచ్చిన సమయమే బాగుండలేదు. వచ్చిన రోజే శ్యామల మంచమెక్కింది. ఇంకా ఎక్కడికీ వెళ్ళలేదు. చెల్లాయిని తీసుకురావటానికి నువ్వు రేపే బయలుదేరతా

వనుకొంటాను' అని చమత్కారంగా సంభాషణ మార్చి వేసింది అత్తయ్య.

'అవును రేపే వెళ్దామనుకొంటున్నాను. నాకు కాలేజీ తెరచే రోజులు కూడా దగ్గరకు వచ్చాయి. సుందరం వచ్చాక చెప్పు. నేను వెళ్ళేముందు మళ్ళీ కనిపిస్తాను. వస్తాను' అంటూ బయల్దేరాడు అతను.

'ఏం ? భోంచేసి వెళ్ళకూడదూ ?' అంది అత్తయ్య. 'యిప్పుడు లాభంలేదు. నాకు చాలా పనుంది. పైగా యింత తొందరగా తినే అలవాటులేదని తెలుసుగా. వస్తానత్తయ్యా!' అంటూ, గుమ్మంపక్కగానే నిల్చుచున్న నన్నుకూడా ఒక సారి చూసాడు. 'వెళ్ళొస్తా నన్నట్లు'. అత్తయ్య లోపలికి వెళ్ళిపోయింది. నేను అక్కడే నిలబడి అతను సైకిలుఎక్కి వెళ్తూండటం కనిపించినంతవరకూ చూస్తూ వుండిపోయాను !

అతను ఎవరని అత్తయ్యను అడిగే ధైర్యం నాకులేదు. 'అత్తయ్యా' అంటూ మాట్లాడాడే.

మెల్లి మెల్లిగా నాకు జ్ఞాపకం వచ్చింది. శ్యామలకు మేనత్తకొడుకు యితనే అయివుండాలి ! కలకత్తాలో కాలేజి ప్రిన్సిపాల్‌గా వున్నాయన యితని తండ్రేకాబోలు.

'చిన్నపిల్లలావుందే ! అప్పుడే పెళ్ళయిందా ?' అన్న అతని ప్రశ్న తల్చుకొంటే నాకు నవ్వొస్తోంది. చూడటానికి నేను అల్లాగే వున్నానా ?

ఆ హాలులో గోడకు తగిలించివున్న నిలువుటద్దంలో నారూపం కనిపించింది. అతను చెప్పినది నిజమేనా అని

ఆలోచించేటట్లో ఏమిటో నా ప్రతిబింబాన్నే చూస్తూ నిలబడి పోయాను.

నిజానికి నేను అప్పటికి పూర్ణజవ్వనినే. నాకు నేనే గర్వపడటంలేదు. కథలలో కనిపించే కథానాయకిలా, చమరీ వాలములవంటి శిరోజములు, బంగారువర్ణ దేహచ్ఛాయ, పద్మాలవంటి పెద్దకళ్లూ, పరిపూర్ణ యౌవ్వనంతో తొణికిస లాడే నా అవయవాలు, అన్నీ బాగా కనిపించాయి. నిలువు టద్దంలో ప్రతిబింబించే నా రూపాన్ని చూస్తూ నిలబడిన నేను, నా మనోఫలకంలో ప్రతిబింబించే నా భర్త దగ్గరకు ఎల్లా వెళ్లానో!

మొట్టమొదటగా ఆయన నన్ను చూడటానికి వచ్చి నపుడు నేను చూసిన ఆ రూపానికి, తరువాత పెళ్లిలో కాశీ యాత్రకు వెళ్ళేటప్పుడు చూసిన రూపానికి ఎంతో వ్యత్యాసం వున్నట్లు తోచింది. నిజం చెప్పాలంటే ఆ రెండు రూపాలు కూడా నా మనస్సులో అంతగా నిలబడలేదు. కాని ఊరేగిం పులో నేను చూసిన ఆ మోహనరూపాన్ని చెరగని చిత్రంగా చిత్రించుకొంది నా మనస్సు! ఆయన తొడుక్కున్న ట్వీడ్ సూట్‌తో నాకన్నా పొడుగ్గా వున్నారు. ఫాలభాగాన్ని కొద్దిగా కప్పుతూ మధ్యపాపిడితో వెనక్కు దువ్విన వంకీ వంకీల ఆ గిరజాల క్రాఫ్! వెడల్పయిన కనుబొమ్మల కింద చిన్ని సొట్టలు కనిపించకుండా చక్రాల్లాంటి ఆ కళ్ళు! కొలిచి నట్లు కనిపించే ఆ ముక్కు! ఆణిముత్యాలలా తెల్ల తెల్లగా ప్రకాశించే ఆ పలువరుస! చిరునవ్వు చిలుకుతూ చెదిరే ఆ అధరం! ప్రకాశవంతమైన ఆ కోలముఖం! బలమైన కండలు

తేరిన ఆ పచ్చని శరీరం ? —వీటన్నింటిని నా మనస్సు ఒక్కొక్కటిగా పరిశోధించింది. ఎల్లా చూసినా ఆయన నాకు తగినవారు కారని అనటానికి వీల్లేదు ! నలుగురూ నాలుగు రకాలుగానే మాట్లాడుతారు. ఎవరు ఏం చెప్తేమాత్రం ఏం? నేను ఆయనకు నచ్చాను ! నాకు . . . ? నాకు మాత్రం ? ఇప్పుడు మేము యిద్దరం మా జీవితాంతాలవరకు విడిపోవటానికి వీల్లేకుండా వివాహబంధంలో, మంగళసూత్రమనే బంధంతో బంధింపబడి పోయాము. ఇకమీాదట ఆ మాదిరిగా అనుకోవటం తప్ప. తల్చుకోవటం పాపం కూడా ! ఇల్లా ఆలోచిస్తూ ఎంతసేపు కూర్చుండి పోయానో !

ఏ రోజూ లేనివిధంగా నన్ను ప్రియంగా పిలుస్తూ నా దగ్గరికి వచ్చింది అత్తయ్య. 'మీా ఊరెళ్లిపోతా నన్నావుట కదూ. బామ్మ అంటోందే' అంది.

'అవునత్తయ్యా ! నేను వచ్చి కూడా నెల దాటి పోయింది' అన్నాను నేను.

స్వరాన్నిబట్టి నన్ను యింటికి పంపించటానికి ఆమె సుముఖంగానే వుందని తోచింది. అందుకు నేను చాలా సంతోషించాను.

'అవుననుకో. కాని యిప్పుడు నిన్ను ఎవరు తీసి కెళ్తారా అని ఆలోచిస్తున్నాను. మీా బామ్మని యిప్పుడు పంపించటానికి కుదరదు. సుందరం రేపు ఏదో 'ఎక్స్కర్షన్'కి వెళ్తున్నాడు. . . రేపు రాధాకృష్ణ తనచెల్లెలిని తీసుకురావటానికి అటువైపు వెళ్తున్నాడు. నిన్ను కూడా తీసుకువెళ్ళమంటే సరిపోతుంది. చాలా మంచివాడు అతను. నువ్వూ రేపు

యిక్కడ బయలుదేరుతున్నావని అన్నయ్యకు యివాళే వుత్తరం వ్రాస్తే స్టేషనుకు వచ్చి నిన్ను యింటికి తీసికెళ్తాడు. ప్రస్తుత పరిస్థితినిబట్టి యీ ఏర్పాటే మంచిదనుకొంటాను' అంది అత్తయ్య.

రెక్కలు కట్టుకొని మా వూళ్లో వాలిపోవాలని తహ తహలాడే నేను యీ అవకాశాన్ని జారవిడుస్తానా? పైగా 'నిన్ను దిగబెట్టటానికి ఎవరూ లేరే' అంటోంది. ఈ సందర్భం కాస్తా దాటిపోతే మళ్ళీ ఎప్పుడో? అంతవరకు జైలులో ఖైదీలా యిక్కడ ఎల్లా వుండను?

'అల్లాగయితే నేను రేపే వెళ్ళిపోతాను అత్తయ్యా. ఇవాళే నాన్నగారికి ఉత్తరం రాస్తే ఎల్లుండి పొద్దున్నే చేరు తుంది. ఆయన స్టేషనుకు వస్తారు' అన్నాను గబగబా సంతోషంతో.

'అయితే రాధాకృష్ణతో చెప్పాలి. సరే...బజారు కెళ్ళి నీ కేదైనా...'అని ఏదో అనబోతూ వెళ్ళింది అత్తయ్య.

'నాకేమీ అక్కర్లేదు' అని అనేశాను వెంటనే గట్టిగా తనవాక్యం పూర్తిగాకుండా.

అత్తయ్య వెళ్ళిన కొంచెం సేపట్లో సుందరం బావ నవ్వుతూ వచ్చాడు.

'రేపు వెళ్ళిపోతున్నావుటకదూ విమలా? అప్పుడే ఏంఅంతతొందర? ఓహో ... 'ఆయన' జ్ఞాపకం వచ్చారు కాబోలు...' అన్నాడు నవ్వుతూ పరిహాసంగా.

పెద్దవాళ్ళకిమల్లే, కపటం, కల్మషం పిల్లకి యింకా అంటలేదు. అందుచేతనే నాతో యిల్లా చనువుగా వుంటు

న్నారు. కాని, నేను మళ్లీసారి వచ్చినపుడు వీళ్లు పెద్దవాళ్లవు తారు. అపుడు అంతస్థుకి పట్టుబడే, గర్వము వీళ్లలో ప్రవేశిస్తుందేమో ?

తెలివితక్కువదానిలా ఆలోచిస్తున్నావే ? ఒక గిన్నె లోని అన్నానికి ఒక్క మెతుకేకదా పదును చూడాలి ? ఒక సారివచ్చి ఎపుడువెళ్లిపోతానా అని తపించిపోయే నేను, యీ యింటికి మళ్లీ రావడం కూడానా ? చాలు చాలు యీ బంధుత్వం ! నేను రేపు వెళ్లిపోవల్సిందే !

'రాధాకృష్ణ'

'ఓహో ! అతని పేరు రాధాకృష్ణ కాబోలు. ముక్కూ ముఖం తెలియని అతనితోనా రేపు నా ప్రయాణం ? ఎంత ఆశ్చర్యం ? దారిలో ఏ యే ధర్మసంకటాలను ఎదుర్కోవలసి వస్తుందోకదా ?"

అర్థంకాని అయోమయం ఒకపక్క, అనుభవంలేని ఆందోళన యింకొకపక్క, మా యింటికి వెళ్ళిపోతున్నామనే అంతులేని ఆనందం మరొకపక్క నన్నావరించగా, యువకు డైన యీ పరపురుషుడితో రేపటి నా ఒంటరి ప్రయాణం తలంపుకు, నడిసముద్రంలో తుఫాను కెరటాలకు అదిరే తెప్ప తెరలా నా మనస్సు ధడ్ ధడ్ మంటూ అదరగా, ఏంచెయ్యాలో తోచక శూన్యాకాశంలోకి చూస్తూ కూర్చుండి పోయాను. . .

# 4

బామ్మ వెనకాల వస్తూండగా అత్తయ్య గబగబా మేడమీదకు వచ్చింది. 'రాధాకృష్ణతో నిన్ననే చెప్పాను. బజారుకు వెళ్లి నీకు రెండు చీరలు కొనుక్కొచ్చాను. ఇవి చూడు' అంది ఒగుర్చుకొంటూ, ఆయాసపడుతూ, కారులో వెళ్లి వచ్చిన అత్తయ్య.

'ఎందుకే అమ్మాయ్ యిప్పుడు ఆ చీరలూ గీరలూను? అర్జంటుగా బయలుదేరి వచ్చేసిందంటే నిన్ను ఎవరేమన బోతారు? నువ్వు యిల్లా చేస్తూనేవుంటే నీకు అక్కడనుంచి ఒక్క కానీ ఎత్తుకూడా వచ్చేదేమీ లేదు' అని కూతురు సొత్తంతా తరిగిపోతున్నట్లు చీదరించుకొంది బామ్మ.

నాకు ధర్మసంకటంగా వుంది. అత్తయ్య యింట్లో నా జీవితం నన్ను పరిశోధించే ఘట్టానికి వచ్చినట్లు తోచింది.

'నువ్వుండమ్మా! నా కదంతా తెలుసు. పెళ్ళయిం తర్వాత మొట్ట మొదటిసారిగా వచ్చింది. ఉత్తచేతులతో పంపిస్తే, రేపు ఆ ఊళ్లో వాళ్ళంతా నన్నేమంటారు? చీరా, రవికేనా పెట్టకుండా పంపిింది మేనత్త అని దెప్పిపొడవరూ? ఈ రంగులు రెండూ చాలా బాగున్నాయి కదూ విమలా?' అంటూ నా అభిప్రాయాన్ని అడిగింది అత్తయ్య.

'ఊళ్లో వాళ్ళకేం? నోటి కొచ్చినట్టు మాట్లాడతారు' అని విసుక్కొంది బామ్మ.

ఈ చీరలని తీసుకొందామా, వద్దా అని నాలో ఏదో అర్థం కానిదేదో పెద్ద పోట్లాట ప్రారంభమయింది. ఇది అత్తయ్య అభిమానానికి అనుగుణ్యంగా, ఆదర్శంగా మన

స్ఫూర్తిగా తన మేనకోడలికి యిచ్చే కానుక మాత్రంకాదు. తను శ్రీమంతురాలిననే భావాన్ని చాటుకోవటం కోసం, తన అహంభావ చిహ్నంగా, మా హీనపరిస్థితిని ఎత్తిపొడుపు మాటలతో చూపిస్తూ, ఊళ్ళో వాళ్ళకి భయపడుతున్నట్లు నటిస్తూ, వీటిని యిస్తోంది. నా మనస్సుకు యిష్టంలేని యీ కానుకను నేను ఎల్లా తీసుకోను ? ఎంత లేనివాళ్ళయినప్పటికీ మానాభిమానములున్నవాళ్ళు, తమ మర్యాదకు భంగం వచ్చేటట్లు, తమని అవమానపరిచే వస్తువులకోసం కొంచెం కూడా యిష్టపడరు. కేవలం యీ నూలు చీరలు చాలా సాధారణమైనవి, మహా వుంటే రెండూకలపి పాతికరూపాయ లుంటాయేమో !

నేను యిల్లా ఆలోచిస్తూంటే అత్తయ్య ఆ చీరలను తెగ వర్ణించేస్తోంది.

'చాలా నైస్ చీరలు. సిల్కులా నిగ నిగ మెరిసి పోతున్నాయి. రోజూ తడిపి ఆరవేసుకోనేందుకుకూడా బాగా పనికి వస్తాయి. ఈ రంగులు ఈ రకం చీరలు రెండే వున్నాయి. ఆ షాపులో నాకోసమే అన్నట్టు యిచ్చాడు ఆ షావుకారు. ఇప్పుడే ఒక చీర కట్టుకో అంది అత్తయ్య.

ఏం సమాధానం చెప్పాలో నాకు తోచలేదు. 'నాకు అక్కర్లేదు' అని మొహంమీదే చెప్పేయనా ? లేక మాట్లాడ కుండా ఆ చీరలను పుచ్చుకొని కట్టుకోనా ? నా మనస్సు దేనికీ ఒప్పుకోలేదు.

'ఏడిశినట్టేవుంది నీ తెలివి ! మంగళవారంపూట కొత్త చీర కట్టుకోవటమేమిటె ?' అంది బామ్మ.

హామ్మయ్య! బ్రతికించింది! ఆ చీరలను తీసుకొని పెట్లో పడేశాను. ఏదో - తీసుకొన్నప్పటికీ మనస్ఫూర్తిగా మాత్రం నేను వాటిని తీసుకోలేదు. పట్టణం మధ్యలో దారి తెలియక నిలబడిపోయిన పల్లెటూరి గబ్బిలాయిలా యీ చీరలను ఏంచెయ్యాలో తెలియక ఆలోచిస్తూ వుండిపోయాను. ఇంతలోనే అతను వచ్చేశాడు...

అప్పుడే బండికి టైం అయిందా ?' అంటూ తన చేతి రిస్టువాచీ చూసుకొన్న అత్తయ్య 'ఓ...సరి...బయల్దేరమ్మా విమలా జాగ్రత్తగా వెళ్ళిరా శుభం' అంది. బామ్మ మాట్లాడ లేదు !

ఆగ్రా విశాల వీధులకు చల్లదనాన్ని, మనస్సుకు ఆనందాన్ని యిచ్చేట్టట్లు కనిపించిన నీడ నిచ్చే ఆ చెట్లు, ఆ ఊరికే ఒక గంభీరాన్ని కలుగజేసే ఆ మేడలూ, మిద్దెలూ అన్నీ ఒక్కొక్కటిగా నా కళ్ళముందునుంచి వెళ్ళిపోతున్నాయి. 'జీవితంలో ఒక్కొక్క భాగంకూడా యీ విధంగానే గడుస్తూ వుంటుంది' అని అనుకొంటూ దీర్ఘమైన నిట్టూర్పు విడిచిన నేను, లోపలికి చూశాను.

అంతవరకూ నేను కన్నెత్తి చూడని రెండవ తరగతి పరుపులు నా మనస్సులో అధికంగా సిగ్గు పుట్టించాయి. ఇంత వరకు నా జీవితంలో యీ విధంగా ఒంటరిగా - కాదు - పర పురుషుడితో ఎప్పుడూ ప్రయాణం చెయ్యలేదనే సంగతి నన్ను యింకా సిగ్గుపడేటట్లు చేసింది ! అంత డబ్బున్న అత్తయ్య కూడా, నేను తనకూడా రావటంవల్లనో, లేక మామయ్య, బావలు ముందుగానే వెళ్ళిపోవటంవల్లనో వచ్చేటప్పుడు

మూడవ తరగతిలోనే ప్రయాణం చేసింది! అనుభవంలేని నా పరిస్థితి అతనికి తెలియకూడదని అలక్ష్యంగానే వున్నట్లు భావించేందుకు ప్రయత్నించాను. సాధారణంగా వున్నప్పుడు అందంగా కనిపించేవాళ్లు ఫొటో తీయించుకొనేటప్పుడు 'సహజంగా...నవ్వుతూ...' అనే మాటలు వినబడేసరికి కొందరి ముఖాలు ఏడురోజులనుంచీ ఏడుస్తున్నట్లు కనిపించటంలేదా? నేనుకూడా ఏమీ ఆలోచించకుండా మామూలుగానే కూర్చుని వున్నట్లయితే అతని దృష్టి పడేదేకాదు. ఇప్పుడు నా ఆలోచన సరిగా లేదని నా ముఖమే చెప్పేసింది అతనికి!

'ఏం? అదో మాదిరిగా వున్నావు? స్థలం సౌకర్యంగా లేదా? అవును...అక్కడ కూర్చుని అల్లా కిటికీలో నుంచి చూస్తూంటే బొగ్గునుసివచ్చి కళ్ళల్లో పడుతుంది! ఇల్లా వచ్చి కూర్చో' అని తన ఎదురు సీటులో మూలగా కూర్చొన్న నాకు తన పక్కనే స్థలం చూపించాడు రాధాకృష్ణ!

ఆ పెట్టెలో నేను ఒక్కదాన్నే ఆడదాన్ని! ఇంకో ఇద్దరు వృద్ధులు కూడా వున్నారు. ఒకరు ఏదో పుస్తకంలో మునిగిపోగా మరొకరు దినపత్రికలో లీనమయారు.

'ఫర్వాలేదు. ఇక్కడే సౌకర్యంగా వుంది' అని అతి శ్రమపడి సమాధానమిచ్చి నేను మళ్ళీ కిటికీలో నుంచి బయటికి చూస్తూ కూర్చొన్నాను.

'కళ్ళల్లో బొగ్గునుసి పడుతుంది. ఇల్లా వచ్చి కూర్చో! చెప్పిన మాట విను' అని అతను అతి సహజంగా అనటం నన్ను యింకా సంకోచపరచింది.

అంతకుముందే అవమానంతో కృంగిపోయానని అత్తయ్యకు ఎందుకు తోచలేదు? ఐశ్వర్యగర్వం, అహంభావ పటాటోపం వేరూనిపోయినవారికి ఎదటి మనస్సును హీనంచేసి మాట్లాడటం తప్పని తెలియనే తెలియదు కాబోలు! అత్తయ్యట! అత్తయ్య! ప్రాణంపోయే సమయంలోనైనా సరే, వీళ్ళగుమ్మం తొక్కకూడదు యింక!

'ఎన్ని చెప్పినా అక్కడే కూర్చున్నావుకదూ?' అని అతను అడిగేటట్లు, ఆ వెధవయింజనుపొగ, నా ముఖాన్నంతా కమ్మేసి, కళ్లల్లో బొగ్గునుసిని వెదజల్లింది! ఓడిపోయానని ఒప్పుకొన్నట్లు తలవంచుకొని కళ్లునలుపుకొన్నాను. కళ్ళు తెరచి చూడటానికి వీల్లేకుండా కళ్ళుమండటం ఆరంభించాయి. ఇందాక తను చూపించిన స్థానంలో పోయి కూర్చుని జార్లబడ్డాను!

నన్నే చూస్తున్నతను, 'నీళ్ళతో కొంచెం కళ్ళు కడుక్కో. బాధ తగ్గుతుంది సుమారుగా' అంటూ మర చెంబులో నీళ్లు గ్లాసులోపోసి యిచ్చాడు. ఆ నీళ్ళతో నా కళ్లు కడుక్కొని కూర్చున్నాను.

ఇతను చూపించే యీ అనుతాపం, అందరితోనూ సహజంగా సంచరించే స్వభావగుణమూ లేక కావాలనే యిల్లా సంచరిస్తున్నాడా అనేది నాకు అర్థంకాలేదు మా ఊరు చేరటానికి యింకా ఎంతసేపు పడుతుందో? మధ్యలో కాఫీ, భోజనం అంటూ వేరే వున్నాయే? శుద్ధ తెలివితక్కువ దాసలా, ఆలోచించకుండా యిల్లా చిక్కుకు పోయానే? అని నాలో నేను ఎంతో విచారించాను. అతను నాతో మాట్లాడ

కుండా వుండాలని నేను కోరుకోగా, నన్ను ప్రశ్నలతోనే ముంచెత్తేటట్టున్నాడు !

'మీ నాన్నగారికి నువ్వు ఒక్కత్తివేనా ?' అన్నాడు ముందుగా.

'నాకు యింకా యిద్దరు అక్కయ్య లున్నారు' అంటూ మెల్లిగా గొణిగాను తలవంచుకొనే.

'ఏదో ఒంటరిగా వెళ్ళేకన్నా, కాలక్షేపానికి తమాషాగా కబుర్లు చెబుతావని నిన్ను తీసుకు వెళ్తానన్నానుగాని, నువ్వేమో మూగదానికన్నా అన్యాయమై పోయావు. ఈ యిరవయ్యో శతాబ్దంలో నీలాంటి పల్లెటూరి గబ్బిలాయిని ఎక్కడా చూడలేదు నేను. 'స్కూల్ ఫైనల్'లో రాష్ట్రంలోనే ఫస్టుమార్కు తెచ్చుకొన్న విమలను మామయ్య కాలేజీలో చేర్పించటంలేదు' అనేది శ్యామల. 'కాని నిన్ను చూస్తే చదువుకొన్న దానివిలా కన్పించటం లేదే !' అంటూ నన్నుచూసి మందహాసం చేశాడు.

'పల్లెటూరి గబ్బిలాయి !' —— ఆయన కూడా యిటువంటి వాళ్లను చూస్తే తనకి కిట్టదన్నారే ! ఆ సమయంలో, అందరితోను చనువుగాను, సహజంగాను సంచరించాలని సంకల్పించుకొన్నానే గాని, తెలివితక్కువదానిని, సమయం సందర్భం వచ్చినప్పుడు సంకోచపడిపోతున్నానే ! ఆయనలాగే సంస్కారం కలవాడులాగే కనబడుతున్నాడు ! ఇతని నోటి నుంచి 'పల్లెటూరి గబ్బిలాయి' అనే పట్టపు పేరు వినేటట్లు పిరికిదానిలా ప్రవర్తించానే ! నా అర్థంలేని పిరికితనాన్ని తోసివేసి, తనకి జవాబివ్వటానికి నేను నిశ్చయించుకొన్నే

టప్పటికి అతను ఏమడిగాడో నేను మర్చేపోయాను! కాని నేను ఆ ప్రశ్నకోసం ఆలోచించనవసరం లేకుండాఅతను యింకో ప్రశ్న అడిగాడు.

'కలకత్తాలో మీా వాళ్ళు ఎక్కడున్నారు!'

నేను బదులుచెప్పాలని నిశ్చయించుకొన్నానే గాని, అతను అడిగిన ప్రశ్నకు జవాబు నాకే తెలియదు! కలకత్తా నేను ఎప్పుడూ వెళ్ళలేదు. ఎడ్రసు కూడా నాకు సరిగా తెలియదు. కాని దొరకకుండా——

'నేను యింకా అటునైపు వెళ్ళలేదు. విజయలక్ష్మి మర్కెంటైల్స్' అని వుందిటకదూ? ఆ కంపెనీ యజమాని 'ఆయన' అన్నగారే' అన్నాను.

'ఏమిటి? విజయలక్ష్మి మర్కెంటైల్స్ అనా అంటున్నావు! అయితే జ్ఞానశేఖరం తమ్ముడా?' అన్నాడు చటుక్కున.

'మీాకు తెలుసునే' అన్నట్లు ఆశ్చర్యంగా అతనిని చూశాను.

'అంతగా పరిచయం లేదు. జ్ఞానశేఖరం మరదలు నాకు బాగా తెలుసు. మా కాలేజీలో జరిగే సమావేశాల్లో పాల్గొనేందుకు, అప్పుడప్పుడు వాళ్ళ కాలేజీ నుంచి వస్తూ వుంటుంది. ఆ సందర్భంలో నాకు కొంచెం పరిచయం వుంది. ఓసారి 'జ్ఞానశేఖరం తమ్ముడు' అంటూ 'మీా వారిని' పరిచయం చేసినట్టు నాకు జ్ఞాపకం కూడా' అని ఏదో ఆలోచనలో పడ్డాడు.

'ఇంకా ఎంతో దూరం వెళ్ళాలే ! ఎల్లా వెళ్తామో ?' అనే భయం నాలో రేగింది. ఆ భయంతో యితనితో ఎందుకు బయల్దేరానా అనిపించింది. ముందూవెనుకా పరిచయంలేని యువకుడు అతడు. అతనితో ప్రయాణం చెయ్యటమా ? నా బుద్ధి ఎందుకు యిల్లా తెలివితక్కువగా ప్రవర్తించింది ? 'నువ్వు దిగబెట్టు బావమ్మా' అని పట్టుపట్టి వుండకూడదా ? ఇతనితో కూడా వచ్చిన యీ సందర్భం యీ ఒక్క సంకటం మాత్రమే తెచ్చిపెట్టింది ? అత్తయ్య మా హీనపరిస్థితిని ఎత్తిచూపించేటట్లు మాట్లాడేసిందే ! 'టికెట్ కొనద్దా రాధాకృష్ణా' అంటూ తన పర్సు తెరచేలోపుగా తన చేతిలోవున్న రెండు టిక్కట్లూ చూపేడు. 'ఆమెకు కూడా కలిపే కొన్నాను' అన్న యితని మాటలు విని అత్తయ్య ముఖం ఒక్కసారిగా వాడిపోయింది !

'దానికి కూడా కలిపా సెకండ్ క్లాస్ కొన్నావ్ ? దాన్ని తీసుకువెళ్ళమంటే కూడానేవుండాలని అర్థమా ? ఆడాళ్ళ పెట్లోనో, పక్క పెట్లోనో ఎక్కించి మధ్య మధ్య చూసిపోతూంటే చాలదా ? అనవసరంగా రైల్వేవాళ్ళ చేతిలో పోస్తే ఏం ప్రయోజనం ? ఆ డబ్బు పెడితే దానికి ఇంకో రెండు చీరలు వస్తాయి' అని తేలిపోయిందే అత్తయ్య.

'ఇంతోటిదానికి పెద్ద పోయిందేముంది ? పైగా యీసారి నాన్నగారే నన్ను సెకెండ్ క్లాసులో వెళ్ళి రమ్మన్నారు. ఆయనే అల్లా చెప్పినపుడు నే నెందుకు కాదనాలి ?' అంటూ నవ్వాడు.

అంతకుముందే అవమానంతో కృంగిపోయానని అత్తయ్యకు ఎందుకు తోచలేదు ? ఐశ్వర్యగర్వం, అహంభావ పటాటోపం వేరూనిపోయినవారికి ఎదటి మనస్సును హీనంచేసి మాట్లాడటం తప్పని తెలియనే తెలియదు కాబోలు ! అత్తయ్యట ! అత్తయ్య ! ప్రాణంపోయే సమయంలోనైనా సరే, వీళ్ళగుమ్మం తొక్కకూడదు యింక !

'ఎన్ని చెప్పినా అక్కడే కూర్చున్నావుకదూ ?' అని అతను అడిగేటట్లు, ఆ వెధవయింజనుపొగ, నా ముఖాన్నంతా కమ్మేసి, కళ్లల్లో బొగ్గునుసిని వెదజల్లింది ! ఓడిపోయానని ఒప్పుకొన్నట్లు తలవంచుకొని కళ్లునలుపుకొన్నాను. కళ్ళు తెరచి చూడటానికి వీల్లేకుండా కళ్ళుమండటం ఆరంభించాయి. ఇందాక తను చూపించిన స్థానంలో పోయి కూర్చుని జార్ల బడ్డాను !

నన్నే చూస్తున్న తను, 'నీళ్ళతో కొంచెం కళ్ళు కడుక్కో. బాధ తగ్గుతుంది సుమారుగా' అంటూ మర చెంబులో నీళ్లు గ్లాసులోపోసి యిచ్చాడు. ఆ నీళ్ళతో నా కళ్లు కడుక్కొని కూర్చున్నాను.

ఇతను చూపించే యీ అనుతాపం, అందరితోనూ సహజంగా సంచరించే స్వభావగుణమూ లేక కావాలనే యిల్లా సంచరిస్తున్నాడా అనేది నాకు అర్థంకాలేదు మాఊరు చేర టానికి యింకా ఎంతసేపు పడుతుందో ? మధ్యలో కాఫీ, భోజనం అంటూ వేరే వున్నాయే ? శుద్ధ తెలివితక్కువ దాసిలా, ఆలోచించకుండా యిల్లా చిక్కుకు పోయానే ? అని నాలో నేను ఎంతో విచారించాను. అతను నాతో మాట్లాడ

కుండా వుండాలని నేను కోరుకోగా, నన్ను ప్రశ్నలతోనే ముంచెత్తేట్టున్నాడు !

'మీ నాన్నగారికి నువ్వు ఒక్కర్తివేనా ?' అన్నాడు ముందుగా.

'నాకు యింకా యిద్దరు అక్కయ్య లున్నారు' అంటూ మెల్లిగా గొణిగాను తలవంచుకొనే.

'ఏదో ఒంటరిగా వెళ్ళేకన్నా, కాలక్షేపానికి తమాషాగా కబుర్లు చెబుతావని నిన్ను తీసుకు వెళ్దామన్నానుగాని, నువ్వేమో మూగదానికన్నా అన్యాయమై పోయావు. ఈ యిరవయ్యో శతాబ్దంలో నీలాంటి పల్లెటూరి గబ్బిలాయిని ఎక్కడా చూడలేదు నేను. 'స్కూల్ ఫైనల్'లో రాష్ట్రంలోనే ఫస్టుమార్కు తెచ్చుకొన్న విమలను మామయ్య కాలేజీలో చేర్పించటంలేదు' అనేది శ్యామల. 'కాని నిన్ను చూస్తే చదువుకొన్న దానివిలా కన్పించటం లేదే !' అంటూ నన్ను చూసి మందహాసం చేశాడు.

'పల్లెటూరి గబ్బిలాయి !' —— ఆయన కూడా యిటువంటి వాళ్ళను చూస్తే తనకి కిట్టదన్నారే ! ఆ సమయంలో, అందరితోను చనువుగాను, సహజంగాను సంచరించాలని సంకల్పించుకొన్నానే గాని, తెలివితక్కువదానిని, సమయం సందర్భం వచ్చినప్పుడు సంకోచపడిపోతున్నానే ! ఆయనలాగే సంస్కారం కలవాడులాగే కనబడుతున్నాడు ! ఇతని నోటి నుంచి 'పల్లెటూరి గబ్బిలాయి' అనే పట్టపు పేరు వినేటట్లు పిరికిదానిలా ప్రవర్తించానే ! నా అర్థంలేని పిరికితనాన్ని తోసివేసి, తనకి జవాబివ్వటానికి నేను నిశ్చయించుకొనే

టప్పటికి అతను ఏమడిగాడో నేను మర్చిపోయాను! కాని నేను ఆ ప్రశ్నకోసం ఆలోచించనవసరం లేకుండాఅతను యింకో ప్రశ్న అడిగాడు.

'కలకత్తాలో మీ వాళ్ళు ఎక్కడున్నారు!'

నేను బదులుచెప్పాలని నిశ్చయించుకొన్నానే గాని, అతను అడిగిన ప్రశ్నకు జవాబు నాకే తెలియదు! కలకత్తా నేను ఎప్పుడూ వెళ్ళలేదు. ఎడ్రసు కూడా నాకు సరిగా తెలియదు. కాని దొరకకుండా——

'నేను యింకా అటువైపు వెళ్ళలేదు. విజయలక్ష్మి మర్కెంటైల్స్' అని వుందిటకదూ? ఆ కంపెనీ యజమాని 'ఆయన' అన్నగారే' అన్నాను.

'ఏమిటి? విజయలక్ష్మి మర్కెంటైల్స్ అనా అంటున్నావు! అయితే జ్ఞానశేఖరం తమ్ముడా?' అన్నాడు చటుక్కున.

'మీకు తెలుసునే' అన్నట్లు ఆశ్చర్యంగా అతనిని చూశాను.

'అంతగా పరిచయం లేదు. జ్ఞానశేఖరం మరదలు నాకు బాగా తెలుసు. మా కాలేజీలో జరిగే సమావేశాల్లో పాల్గొనేందుకు, అప్పుడప్పుడు వాళ్ల కాలేజీ నుంచి వస్తూ వుంటుంది. ఆ సందర్భంలో నాకు కొంచెం పరిచయం వుంది. ఓసారి 'జ్ఞానశేఖరం తమ్ముడు' అంటూ 'మీ వారిని' పరిచయం చేసినట్టు నాకు జ్ఞాపకం కూడా' అని ఏదో ఆలోచనలో పడ్డాడు.

మా పెద్ద తోడికోడలు చంచల చెల్లెలు ఒకత్తి వాళ్ళతోనే వుంటోందని, కాలేజీలో చదువుతోందని నాన్న చెప్పినది జ్ఞాపకం వచ్చింది. ఆమే అయివుంటుంది.

తన ఆలోచన ఫలించునట్లు నవ్వుతూ, 'ఊఁ...జ్ఞాపకం వచ్చింది. మీ ఆయన పేరు చంద్రశేఖరంకదూ? ఏం చేస్తున్నారు యిప్పుడు ?' అన్నాడు.

ఇంతవరకు నేను తోసి వేసిన ఆ పాడు సంకోచం మళ్లీ నన్నావరించింది. కాలికి అంటుకొన్న బురదను విదిలించినట్లు, నానాఅవస్థా పడి దానిని తోసివేశాను. కాని 'ఆయన' గురించి ఎవరూ మాట్లాడినాకూడా, నా మనస్సులో పొంగి పొరలే ఆహ్లాదం, నా సరళమైన స్వభావంలో సిగ్గు దొంతరులను లేవదీస్తూన్నప్పుడు, వికటంగా నవ్వుతూ, విమర్శనగా చూస్తూ, నాతో అధిక పరిచయం లేని పరపురుషుడైన ఒక యువకుడు ఆయన సంగతి అడిగితే నేనేం చెయ్యను? అందులోనూ పరాయి మగవాళ్ళతో చనువుగా ప్రవర్తించే అలవాటు నాకు పూర్తిగా కొత్తగా వున్నప్పుడు? అడిగిందే కాకుండా నవ్వుతూ నన్నే చూస్తున్నాడు!

పట్టుగుడ్డతో మూయబడినట్లు మనస్సు మిల మిల మెరవగా, చివరికి ఎల్లాగో ఒకవిధంగా ఆయన ఎక్కడ పని చేస్తున్నారో చెప్పాను!

'అరె...బాప్ రే! దీనికోసం ఎంత ఆలోచన ?' అంటూ కలకలా నవ్వాడు అతను.

ఈ కొత్త అనుభవం ఒకవిధంగా బాగానే వుందనిపించింది. ఇంకొక విధంగా భయంగానూ తోచింది.

రాధాకృష్ణ తండ్రి నాగపూర్‌లో ఎవరినో కలుసుకో మని అతనికి పని చెప్పారు. మా రైలు సాయంత్రం అయిదు గంటలకు నాగపూరు చేరింది. రైలు చాలా లేటు అవటం వల్లనూ, మళ్ళీ ఎక్స్‌ప్రెస్‌కు ఎక్కువ టైము లేకపోవటం వల్లనూ నన్ను వెయిటింగ్ రూమ్‌లోనే కూర్చోబెట్టాడు రాధాకృష్ణ. అతను ఒక్కడే ఊళ్ళోకి వెళ్ళి తన పని పూర్తి చేసుకొని తిరిగి వచ్చాడు. ఎక్స్‌ప్రెస్ కూడా ఆవాళ లేట్ గానే రాత్రి పదిగంటలకు నాగపూర్ వచ్చింది.

తలవని తలంపుగా నా సందేహాలను రాధాకృష్ణకి చెప్పేటట్లు అతని మనస్సు నాకు బాగా అర్థమయేటట్లు మేము నాగపూర్‌లో ఎక్స్‌ప్రెస్ ఎక్కినపుడు ఒక సంఘటన జరిగింది.

మేము ఆ పెట్టెలోకి వచ్చేసరికి అంతకుముందే ఒక యువకుడు ఒక యువతి అందులో కూర్చున్నారు. ఆమె మహారాష్ట్రీ స్త్రీ అని, కట్టూ బొట్టుని బట్టి తెలుసుకొన్నాను. శోకంతో నిండిన ఆమె ముఖంలో చదువో, నాగరీకమో కొంచెంకూడా లేనిదానిలా, చాలా అమాయకురాలిగా కనిపించింది. అతను నాగరీకంగా బట్టలు కట్టుకుని మంచి దారుఢ్యం కలిగినవాడిలా వున్నాడు. నేనూ, రాధాకృష్ణ 'అవును, కాదు...ఊఁ...ఊఁ' అని మాట్లాడుకొన్నట్లుకూడా వాళ్ళు మాట్లాడుకోలేదు. బహుశా వేరు వేరు మనుష్యులు కాబోలు అనుకొన్నాను.

'నువ్వు యిక్కడేపడుకో' నేను 'అప్పర్ బెర్త్' మీద పడుకొంటాను. తర్వాత ఎవళ్లైనా వచ్చారంటే నీకు పడు

కోనేందుకు చోటు దొరకదు' అంటూ రాధాకృష్ణ పైబెర్తు మీాదకు వెళ్ళి పడుకొన్నాడు.

నాకు నిద్రపోబుద్ధి వేయ లేదు. నిద్రకూడా రాలేదు. నేను అల్లాగే కళ్లు తెరచుకొని కూర్చోటానికి ఇంకో కారణం కూడా వుంది. వాళ్లిద్దరూ మాట్లాడుకోకుండా కూర్చోటమే అందుకు కారణం.

నాకేదో సందేహం కలిగింది. ఆ స్త్రీని చూసి 'ఎక్కడికి వెళ్తున్నా'వని అడిగాను. సమాధానంగా, ఏడ్చి ఏడ్చి బొంగురుపోయిన గొంతుకతో మరాటీలో ఏదో చెప్పింది. ఏం చెప్పిందో నా కర్థం కాలేదు. 'ఒంటరిగావా వెళ్తున్నావు?' అని అర్థం లేకుండా మళ్ళీ అడిగాను. అందుకూ ఏదో చెప్పింది. అతన్ని చూస్తే తెలుగువాడిలాగనే వున్నాడు. కాని మా మాటలువింటూ కూర్చొన్న అతను ఎందుచేతనో నోరు తెరవలేదు.

ఎంత కళ్ళు తెరుచుకొని కూర్చున్నప్పటికి, అర్థరాత్రి సమయంలో నాకు తెలియకుండానే నాకళ్లు మూసుకొన్నాయి. 'కడడ్ కడ్, కడడ్ కడ్, కడ్' మని పరుగెత్తే రైలుచక్రాల శబ్దం కొంతసేపటివరకు నా చెవుల్లో వినిపించింది. ఆ తర్వాత అదీ వినిపించలేదు. ఎంతసేపు నిద్రపోయానో తెలియదు. గట్టిగా ఏడుస్తూ గోలచేసే మాటలు విని అదిరిపడి లేచాను. ఆ స్త్రీ మరాటీలో ఏమిటేమిటో చెప్తోంది. నిద్రనుంచి లేచి కళ్ళు నలుపుకొంటూ, రాధాకృష్ణ ఆమె చెప్పేదంతా వింటున్నాడు నాకు అంతా విచిత్రంగాను, ఆశ్చర్యంగాను వుంది. సందేహంతో 'ఏమిటది' అన్నాను రాధాకృష్ణతో.

'బండిలో ఎక్కినవెంటనే చెప్పకూడదూ? అయోగ్యుడు...' అని ఆమె చెప్పినదంతా విన్న రాధాకృష్ణ తనంతట తనే అన్నాడు. తర్వాత అతను నాతో యిల్లా అన్నాడు...

'ఆ స్త్రీ రాయటం చదవటం చేతకాని పల్లెటూరి పడుచు. సొంతవూరు వార్ధా. ఆమెభర్తకు అమరావతికి పక్క ఊళ్లో పట్టుచీరలు నేసే కొన్ని మగ్గాలు సొంతంగా వున్నాయిట. సుమారు నాలుగునెలల కిందట, ఆమె పుట్టింటికి ప్రసవానికి వచ్చిందిట. పిల్ల పుట్టి పోయిందట. అకస్మాత్తుగా, నిన్న ఆమె భర్త ఒక కారు 'యాక్సిడెంటు'లో మరణించినట్టు, వెంటనే రావలసిందిగా టెలిగ్రాం వచ్చిందిట. ఆ సమయంలో ఆమె తండ్రి టైఫాయిడ్ జ్వరంతో ఆస్పత్రిలో వున్నారుట. ఆమె ఏంచేస్తుంది? ఏల్లాగో నానా అవస్థలుపడి వచ్చి పక్కవూళ్లో రైలు ఎక్కింది, పొరపాటున అమరావతి వెళ్ళే రైలు ఎక్కటానికి బదులు నాగపూరు వెళ్లే రైలు యెక్కింది! ఇల్లుదాటి బయటి ప్రపంచాన్ని చూడని పల్లెపడుచు కదా తను? దానికి తోడు మనః క్షోభ ఒకటి. ఇక్కడికి వచ్చి యీ పెద్ద స్టేషన్ చూసేటప్పటికి దిగ్భ్రాంతి చెందింది. దిక్కూదివాణం తెలియక అవస్తపడుతున్న సమయంలోనే ఆ దౌర్భాగ్యుడు దాపరించాడు! పాపం! వాణ్ణినమ్మి తన కష్టాన్ని చెప్పుకొని సరైన రైలు ఎక్కించమని కోరింది. రాత్రి సమయం. ఆమె మెళ్లోని నగలు, పడుచుతనం — అన్నీ వాడికి దుర్బుద్ధి కలగచేశాయి. దిక్కులేని ఆమె దీన పరిస్థితి, ఆమె అమాయకత్వం, అన్నీ

కలసిరాగా, తానుకూడా అమరావతి వెళ్తున్నానని చెప్పి, ఆమె కష్టానికి పరితాపపడిన వాడిలా నటిస్తూ, ఆమెను ఓదార్చి అమరావతి వెళ్ళే రైలు ఎక్కించటానికి బదులుగా యీ ఎక్స్‌ప్రెస్‌లోకి తీసుకొచ్చి ఎక్కించాడు. కొంచెం దూరం వచ్చింతరువాత ఆమెకు ఎందుకో సందేహం కలిగిందిట ఈ రైలు అమరావతి ఎప్పుడు వెళ్తుందని నిన్నడిగిందట ! నువ్వు నిద్రపోనటంవల్ల, వాడినే తన సందేహాన్ని అడిగిందట. వాడు చెప్పిన జవాబుకి ఆమె తృప్తిపడలేదు. వాడు ఏమనుకొన్నాడో ఏమో, యింతకుముందు ఆమె 'లెట్రిన్'లోకి వెళ్ళినప్పుడు, బండి సరిగ్గా అదే సమయంలో పక్క స్టేషన్‌లో ఆగటంతోటే, వాడు ఆమె పెట్టెతోసహా పలాయనం చిత్తగించాడు. ఆమె బయటకి వచ్చేటప్పటికి వాడు లేడు. ఖంగారుతో అటూ యిటూ చూచి, తన పెట్టెకూడా లేదని తెలుసుకొనేసరికి బండి కదిలిపోయింది. తర్వాత కేకలు వేస్తూ నన్ను లేపింది,'

మళ్ళీ స్టేషన్‌లో బండి ఆగటంతోటే, రాధాకృష్ణ ఆమెతోకూడ దిగి, ఆమెను పోలీసులకు అప్పగించి వచ్చాడు.

"ధైర్యము, ప్రపంచానుభవములేని స్త్రీలు, దిక్కు తెలియని దారిలో చిక్కుకుపోతే, దొంగలూ, దుర్మార్గులూ కాచుకొని వున్నారే ! భాష తెలియలేదు ! — పోయి పోయి ఒక దుర్మార్గుడి చేతికా తను చిక్కాలి ? తనకి కలిగిన కష్టాలను విన్నంతమాత్రంచేత ఎవరికైనా మనస్సు కరిగి పోతుందే !. ఆమెను మోసం చెయ్యటానికి వాడికి దుర్బుద్ధి ఎలా పుట్టిందో కదా ? కంటికి కనిపించిన వాళ్ళందరిని నమ్మకూడదు అనేది కూడా నిజమే" అన్నాను నేను రాధాకృష్ణతో.

సిగ్గుపడకుండా, యింతసేపు సహజధోరణిలో అతనితో నేను మాట్లాడటం యిదే మొదటిసారి.

'వాడు పోనేపోయాడు. ఇంకెక్కడ దొరుకుతాడు? ఆ పెట్లో యించుమించు రెండువందల దాకా వున్నాయట, పాపం! మూడవ తరగతిలో అయితే, జనం చాలామంది వుంటారని, ఎవరైనా ఈమె సంగతి అడగవచ్చునని, ముందాలోచనతోనే ఎవ్వరూ లేని ఈ పెట్టెలోకి తీసుకొచ్చి ఎక్కించాడు ... దొంగరాస్కెల్ ... ! తనకి అనుమానం తోచిన వెంటనే నన్ను ఎందుకు లేపలేదో? ఒకవేళ నేను కూడా వాడిలాంటి వాడినే అని అనుకొందేమో' అంటూ నవ్వాడు రాధాకృష్ణ.

ఏమి అర్థం అయిందో, ఏమి అర్థం కాలేదో, అతను చెప్పేది ఏమిటో కూడా నా బుర్రకు ఎక్కలేదు. ఇంకో ఆలోచన నాలో చెలరేగింది!

ఇప్పుడు మేము యిద్దరం మాత్రమే ఆ పెట్టెలో వున్నాం! నేను కూడా యించుమించు ఆ పరిస్థితిలోనే వున్నాను! అనుభవం లేని దానిని. పరిచయం లేని ప్రదేశంలో ప్రయాణం చేస్తున్నాను. రాధాకృష్ణ నాకు బాగా తెలియదు. ఇతను వాడిమాదిరిగా నన్ను మోసం ఏమీ చెయ్యలేదు. కాని...కాని...తల్చుకొనేందుకే నాకు భయం వేస్తోంది! అతనా యువకుడు! నేనా వయస్సులో వున్న పడుచును! రాత్రి సమయం! ఇదో నాపక్కనే కూర్చొన్నాడు! మెల్లిగా ఆ చేతులు నామీద వేస్తూ నన్ను...! నేను ఏంచెయ్యను?

అగ్నిగుండ మొకదాన్ని నా అంతట నేనే వెతుక్కొన్నా ననిపించింది! ఈ పరిస్థితి నుంచి తప్పించుకోవటం ఎల్లాగా అనే ఆలోచనలో మునిగిపోయాను. 'నన్ను వేరే ఆడవాళ్ళ పెట్లో ఎక్కించ'మని అకస్మాత్తుగా యిప్పుడు అన్నట్లయితే అతను ఏమనుకొంటాడు?

ఏ మనుకొంటే ఏం? నిజంగా దుర్బుద్ధి వున్నవాడయితే 'ఏం? ఎందుకు?' అంటూ ఆక్షేపిస్తాడు.' లేకపోతే......: లేకపోతే మాత్రం ఏం చేస్తాడు?

ఛీ! తెలివితక్కువతనం! అల్లా అడకూడదు! నిజానికి నేను భయపడుతున్నట్లు బయటికి కనిపించటమే ప్రమాదము. ఒకవేళ అతను ఏమైనా పిచ్చి పిచ్చి వేషాలు వేసాడంటే "అలారం గొలుసు" వుండనేవుంది— అని నాలో నేను ధైర్యం చెప్పుకొన్నాను.

'ఏమిటి విమలా! ఆ అమ్మాయి గురించేనా యింత ఆలోచన?' అని విరగబడి నవ్వాడు రాధాకృష్ణ,

నేను మాట్లాడేలోపుగా అతనే మాట్లాడాడు—

'విమలా! ఇటువంటి నీచులు కొంతమంది వుండబట్టే, పురుషవర్గాన్నే అందరూ అనుమానించే పరిస్థితి ఏర్పడుతోంది. వాడి ఆ వేషం, మోసం చేసేవాడిలావుందా? అసలు మనహిందూసాంప్రదాయంలో ముందుకువచ్చే స్త్రీలే తక్కువ. అందులోను, మగవాళ్ళు వాళ్ళని తమ సోదరీలలా మర్యాదగా చూడకుండా వాళ్ళతో చాలా హీనంగానూ, నీచంగానూ ప్రవర్తించటంచేత, వాళ్లకి స్వతసిద్ధంగావుండే ధైర్యంకూడా సడలిపోతోంది. నేను ఎన్నోసార్లు, ఎన్నో

చోట్ల, ఎన్నో సందర్భాల్లో చూశాను. బస్సుల్లోనో, బజారు లోన్లో, శుభ్రమైన బట్టలుకట్టుకొని, కంటికి కొంచెం అందంగా ఏ అమ్మాయైనా కనిపించి తేచాలు. వాళ్ళకి కళ్లూ, కాళ్లూ తెలియవు. స్త్రీలు ముందుకు రావాలి, ముందుకురావాలి అంటూ సభలలో ఉపన్యాసాలుదంచే పెద్దమనుష్యులుకూడా, అంతవరకూచూడని అతిశయం ఏదో కనిపించినట్లు, అదో మాదిరిగా చూస్తారు. ఇంత నాగరీకంవచ్చినా యీ యిరవయ్యోశతాబ్దంలోకూడా, ఎదురుగావెళ్ళే ఆడదానిని వెనక నుంచివచ్చి, చూసీ చూడనట్లు ఢీకొని "అయామ్ వెరీసారీ" అంటూ పళ్ళికిలించేవాళ్ళని నేను చాలామందిని చూశాను. నిజానికి స్త్రీలు ముందుకురావాలంటే, వారి వివేక విజ్ఞానాలను ఉపయోగించుకోవాలంటే, వాళ్ళని వాళ్ళే సరిదిద్దుకోవాలి. స్త్రీలవిషయంలో దుర్బుద్ధి, మర్యాదతక్కువగా నడవటం, వదిలివేయాలి. పరాయిస్త్రీల నందరిని తమ తల్లులలాగ, అక్కచెల్లెళ్ళలాగ చూడగలిగే స్వభావాన్ని నేర్చుకోవాలి. అప్పుడే నిజంగా స్త్రీలు సంతోషంగా ముందుకు రాగలుగుతారు, అని ఒక ఉపన్యాసాన్నే యిచ్చాడు ఆవేశంతో రాధాకృష్ణ.

అర్థంలేని అమానుషాలను లేవదీసిన నా మనస్సులోని అనుమానపుతెర "క్రీచ్" మంటూ చిరిగిపోయింది! అరెరె... మనుష్యుల మనస్సులు ఎంతవిచిత్రమైనవి? మాటలలోను, చేష్టలలోను సహజత్వాన్ని చూపించిన అతనిని, కొన్ని క్షణాలలోనే ఏమేమో అనుమానించేశానే! అత్తయ్య నాకు సెకండుక్లాసు ప్రయాణం తగనిదన్నప్పటికి, అతను లెక్క

చెయ్యక పోవటానికి కారణం మరొకరూపంలో అర్థంచేసు
కొన్నానే! వాడు ఆ దురదృష్టవంతురాలిని ఏకారణంతో
యీబండిలో ఎక్కించాడో, అదేమాదిరిగా యితనుకూడా
అనుకొన్నాడేమో అనికదా నా మనస్సు నిర్ణయంచేసింది?
అందులోనూ ఆ కారణం తనంతట తానుగా తెలుసుకొని
నాతో చెప్పినపుడు, నా అనుమానం బలపడి భయపడి
పోయానే?

కాని అదే సమయంలో అతను నేను నా మనస్సులో
అనుకొన్నట్లుగా తలచనే లేదని, నిష్కళంకంగా నడవని పురుష
వర్గాన్ని గురించి ఆలోచిస్తూ వుండిపోయాడని యిప్పుడుకదా
తెలుస్తోంది! ఇద్దరి మనస్సులకి ఎంత వ్యత్యాసం! అను
భవంలేని నా ఆలోచన ఎక్కడ? అన్నింటిని దూర దృష్టితో
చూడగలిగే అతని నిర్మల మనస్తత్వం ఎక్కడ!

నాలో నేను కృంగిపోయిన నాకు అతని ముఖంలోకి
చూసి మాట్లాడటానికే అవమానంగా తోచింది. ఎల్లాగో
సమాధానపడి 'అవును మీరు చెప్పిందే ముమ్మాటికి నిజం'
అని ఆమోదించాను.

నా మనస్సు ఎల్లా పరిగెత్తిందో నేను తెలుసుకోలేక
పోయాను. నాభర్త పల్లెపడుచుయొక్క అర్థంలేని సంకోచాలు,
అదిరిబెదిరి పారిపోయే ఆడవాళ్లని చూసి సహించరు. ఇటు
వంటి మనస్తత్వాన్నే కలిగివుంటారేమో అని ఆలోచనలో
పడ్డాను.

ఈ సమయంలో నేను యీ విధంగా రాధాకృష్ణతో ఒంటరిగా ప్రయాణం చేస్తున్నాను; యీ విషయాలు మాట్లాడు కొన్నాం అని ఆయనకు తెలిస్తే గర్వపడతారా ?

మర్నాడు పొద్దున్న మా రైలు కొవ్వూరు వచ్చే టప్పటికి నాన్నగాని, తమ్ముడుగాని, నన్ను యింటికి తీసుకు వెళ్లటానికి రాలేదు ! ఎవరూ స్టేషన్‌లో కనిపించక పోవటంతో నేను కొంచెం తెల్లబోయి చూచాను. ఉత్తరం అందలేదేమో అనే ఆలోచన కలగలేదు. 'నాన్న ఆరోగ్యం బాగుండలేదేమో ఒకవేళ. అల్లా అయితే రామంయేనా వచ్చేవాడే! వాడుకూడా కన్పించటం లేదే !' అంటూ గుమ్మంలో నిల్చుని ప్లాటుఫారం అంతా ఒక్కసారి కలయ చూశాను బిక్క మొహంతో.

'సరిగా చూడు విమలా ! భయపడకు. ఎవరూ రానట్లయితే నేనుకూడా దిగి, తర్వాత బండిలో వెళ్తాను' అన్నాడు రాధాకృష్ణ.

తన కెందుకు అనవసరంగా శ్రమ, ఊరు దాకా ఎల్లాగా రానే వచ్చాను. నాకు తెలియని ఊరేమీ కాదుకదా అనుకొని —

'అక్కర్లేదు లెండి. ఓ బండి చేయించుకొని నేనే వెళ్లిపోతాను' అన్నాను.

'అయితే నేను మీ ఊరుకు రావద్దంటున్నావన్న మాట' అన్నాడు పరిహాసంగా నవ్వుతూ.

నేను తనకి అనవసరంగా శ్రమ యివ్వకూడదని అల్లా అన్నందుకు అతను వ్యత్యాసంగా తీసుకోవటం నా కదోలా అనిపించింది.

'అటువంటి అభిప్రాయం నాకేమీ లేదు. మా ఊరుకే కాకుండా మీరు మా యింటికికూడా విజయం చెయ్యటం నాకు చాలా సంతోషం' అని జవాబుగా నేనూ నవ్వాను.

గబగబా యిద్దరం కలసి సామానులు దింపాము. స్టేషన్ ఆవరణలో నాలుగైదు గుఱ్ఱపుబళ్లు వుంటాయి.

'ఉండండి వస్తాను' అంటూ బయటికి వెళ్లబోతూన్న నన్ను చూసి, స్టేషన్ మాస్టరు మందహాసం చేశారు.

'ఏమమ్మా! విమలా! ఎవరూ రాలేదా? మొట్టమొదటి సారిగా అల్లుడూ, కూతురూ కలసి వస్తూంటే యిల్లా అలక్ష్యంగా స్టేషన్‌కి ఎవళ్లూ రాకుండానా వుంటారు!' స్టేషన్ మాస్టర్ అన్నారు.

# 5

'ఆయన మావారు కాదు' అని అనేయాలనుకొన్నాను. కాని, 'లేకపోతే మరెవరు' అంటారు. అనుమానంతో చూస్తారు. 'ఇటువంటి అనవసర ప్రసంగాలకి అవకాశంయివ్వకుండా, మాట్లాడకుండా వూరుకోవటమే మంచిది' అని అనుకొని మౌనంగా ముందుకు వెళ్లి, ఓ బంశీవాడిని పిల్చుకొచ్చాను. వాడికి సామానులు చూపించి, నేనూ రాధాకృష్ణా కలిసి స్టేషను గేటు దాటాము. మేము రెండడుగులు ముందుకు వెళ్ళటం చూసిన స్టేషన్ మాస్టర్, బుకింగ్ క్లార్కు మోహన సుందరంతో, "నారాయణగారి అల్లుడు పెళ్ళిలో కొంచెం చామనచాయగా వున్నాడుకదూ? ఇప్పుడు చూస్తే పచ్చగా

వున్నాడే! ఏమోయ్ మోహన్! నా కళ్ళేమైనా భ్రమి స్తున్నాయా లేక పెళ్ళయాక ఈ అల్లుడుగారు రంగే మారి పోయాడా?' అని తన హాస్యానికి తనే గట్టిగా నవ్వటం, నాకు మాత్రమే కాకుండా, రాధాకృష్ణ చెవుల్లో కూడా పడింది! 'ఫక్కు'మని రాధాకృష్ణ కూడా నవ్వేశాడు. నాకో, సిగ్గు, కోపం, అవమానం - అన్నీ ఒక్కసారిగా పొంగి పోయాయి. 'మీ ఊళ్ళోవాళ్లు భలేగా వున్నారే!' అని నన్ను అడుగుతున్నట్లుంది అతని నవ్వు. ఏదో పెద్ద తప్పు చేసిన దానిలా నేను మౌనంగా తల వంచుకొని, గబగబా వెళ్ళి బండి ఎక్కి కూర్చున్నాను.

'గలగల' మనే బండి మువ్వలు అగ్రహారం వీధిలో వినిపించితే చాలు. ఎవరింటికి వస్తోంది ఈ బరిడి, అని ఆశ్చర్యంగా తెలుసుకొనే అగ్రహారం మహాజనులందరూ, గుమ్మాల్లో ఏదో రథోత్సవం చూడబోతున్నట్లు వచ్చి నిల్చుని. బండి వారి కళ్ళముందునుంచి వెళ్ళగానే, చుట్టు పక్కల అమ్మలక్కలంతా చేరి ఎవరు, ఎవరికోసం, ఎవరింటికి ఎందుకు వచ్చారనే అంశంమీద చర్చలు సాగించి మరీ లోపలికి వెళ్తారనే సంగతి జ్ఞాపకం వచ్చి, నేను యింకా భయపడిపోయాను.

అగ్రహారం వీధిలోకి బండి రావటంతోనే, 'ఇంతమంది మనల్ని ఎదురు చూస్తూంటారని నేను అనుకోనేలేదు విమలా! రోడ్డు రెండు పక్కలనుంచి మనకి అమోఘమైన స్వాగతం యిస్తున్నారు!' అంటూ నవ్వుతూ నన్ను చూశాడు రాధా కృష్ణ. నేనే వెనకాల కూర్చుని వున్నట్లుంటే, బండిలోనుంచే

వాళ్ళంతా అడిగే కుశల ప్రశ్నలకు సమాధానాలు కూడా చెప్పవలసివచ్చివుండేది. దానికన్నా యిది కాస్త ఫరవా లేదనిపించింది.

మా గుమ్మంలో బండి ఆగింది. అవాళ నాన్నగారి ఆఫీసుకు ఏదో శలవు కాబోలు. అరుగుమీద పాతకుర్చీ వేసుకు కూర్చుని, రామానికి ఏవో లెఖ్ఖలు చెబుతున్నారు. నేను బండినుంచి దిగటంతోనే ఆశ్చర్యంగా లేచారు. తర్వాత అమ్మా, అక్కయ్యా అంతా బండి శబ్దం విని బయటకు వచ్చారు. మా పక్కయింటి కోమల అత్తవారింటినుంచి వచ్చినట్టుంది. గుమ్మంలో నిల్చుని నన్నుచూసి నవ్వుతూ కుశలం విచారించింది. ఆమె పెదిమలమీద కనిపించిన ఆ పరిహాసపునవ్వూ, ఆశ్చర్యంగా చూసిన ఆ కళ్లూ, నేను 'ఆయన'తోకూడా వచ్చాను అని ఆమె అనుకొన్నట్లు నాకు తోచింది!

'వస్తున్నామని ఉత్తరం రాయలేదా? అకస్మాత్తుగా బయలు దేరారా?' అన్నారు నాన్న.

అమ్మ, అక్కయ్య 'ఇతనెవరు?' అని అడిగారు. లోప లికి పదండి చెబుతాను అనేటట్లు వాళ్ళకేసి చూసి, నేను గబగబా లోపలికి వచ్చేశాను. రాధాకృష్ణ నాన్నతోపాటు అరుగుమీదే కూర్చుని ఏదోమాటలలో లీనమయాడు.

'శ్యామలకి మేనత్తకొడుకు యితను. రాజమండ్రిలో వున్న తన చెల్లెల్ని ప్రసవానికి తీసుకురాబోతున్నట్లు తెలిసింది. ఇప్పుడు నన్ను అక్కడినుంచి తీసుకువచ్చేవాళ్లు ఎవరూ లేకపోవటంవల్ల, యితను యీదారినే రావటంచేత,

యితనికూడా నన్ను పంపింది అత్తయ్య. ఉత్తరం రాశ్తామని చెప్పిందే అత్తయ్య! నాన్న స్టేషన్‌కు వస్తారనుకొన్నాను. ఆయన స్టేషన్‌లో కనిపించకపోయేసరికి, ఆయన ఒంట్లో ఏమైనా సుస్తీచేసిందేమోనని నేను ఎంత భయపడిపోయానో తెలుసునా?' అని గబగబా మాట్లాడేశాను.

'ఏం? ఆ సుందరం ఏమయ్యాడు? లేకపోతే మీ బావ్మ్కేంరోగం వచ్చింది? ఇల్లా ముక్కూముఖం తెలియని మనుష్యులకూడా పంపుతుందా? సిగ్గుచేటు!' అని విసుక్కొన్న అమ్మ మాటలు నన్ను చాలా గాయపరిచాయి.

'ఇతను చాలా మంచివాడమ్మా! ఇతనికన్నా మంచి తోడు దొరకనేదొరకదు? చాలా చనువుగాను, సహజంగాను సంచరించే మంచిస్వభావం కలవాడు!' అని కొంచెం నసుగుతూ, నసుగుతూ నేను చెప్పినమాటలువిని అమ్మ, అక్కయ్య నిశ్చేష్టులైపోయారు!

అమ్మ చీదరించుకొంటూ 'చాలుచాలు, సిగ్గులేకుండా యింకా మాట్లాడుతున్నావు? మీ అత్తయ్య ఏంచేసినా మెచ్చుకోవటానికి నీకేనచ్చుతుంది. ఏదో మాటలో మాట మీాద సరేలంటే పరిగెత్తుకొని వెళ్లావు. ఈ సంగతి రేపు నలుగురికీ తెలిస్తే ఏమంటారు నన్ను?' అని అత్తయ్యమీాద తనకున్న కోపాన్నంతా వెళ్లగక్కటమేకాకుండా, రాధాకృష్ణనుకూడా హీనంచేయటం నాకు నచ్చలేదు.

'నేనేమీా మెచ్చుకోవటంలేదు. మీాకు యిష్టంలేకుండా నేను వెళ్లటం తప్పు తప్పు అని కావాలంటే వెయ్యిసార్లు లెంపలేసుకొంటాను. అత్తయ్యట! అత్తయ్య! కాని

యుతనితో నన్ను పంపటం తప్పనిమాత్రం అనుకోకండి! ఇతడు చాలా మంచివాడు' అన్నాను కోపంగా నేను. రాధా కృష్ణ నిష్కల్మషమైన మనస్సుని యింకెల్లా చెప్పాలో, అంత కన్నా అప్పుడు నాకు తెలియలేదు.

నాన్నతో భోజనానికి కూర్చున్న రాధాకృష్ణ – 'మీా అమ్మాయి ఏం చెప్పిందో తెలుసా? 'మీాకు యింటికి రానద్దు. నేనే బండికట్టించుకొని వెళ్ళిపోతాను' అంది. నేను అల్లాగే వెళ్ళిపోతే చాలా బాగుంటుందని అనుకొనే ఆవిధంగా మాట్లాడిందని తరువాత తెలుసుకొన్నాను. ఎందుకంటే, నేను నేనని తెలిసినట్లయితే, యీా ఊళ్ళో వాళ్ళు నా కాళ్ళూ చేతులూ విరగ్గొట్టి పంపిస్తారేమో కూడాను!' అంటూ హాస్యధోరణిలో విరగబడి నవ్వాడు. నాన్న వెంటనే అర్థంచేసుకోలేక 'ఏమం టున్నారు?' న్నారు.

రాధాకృష్ణ నన్ను చూసి నవ్వాడు.

'అవును నాన్నా! రైలు దిగిన లగాయతు, స్టేషన్ మాస్టర్ దగ్గరనుంచి, బండివాడు పోలయ్యదాకా, అల్లుడూ కూతురూ వస్తూంటే ఎవరూ స్టేషన్‌కి రాకుండా వుండిపోతారా అని అడిగితె ఎల్లా వుంటుంది మరి? ఈ ఊళ్ళో వాళ్ళకి కొంచెం కూడా మంచీ చెడ్డా తెలియదు!' అన్నాను నేను.

కల్మషం, కపటం తెలియని అమాయకపు నాన్నకి యిదొక పెద్ద హాస్యంగా తోచింది. 'అల్లాగా అన్నారు!' అంటూ ఆయనకూడా నవ్వాను.

నన్ను లోపలికి పిలిచిన పెద్దక్కయ్య కమల – 'ఇల్లా పరాయి మగాడితో నేను విరగబడి నవ్వుతూ మాట్లాడినా' లేదు ఒంటరిగా ప్రయాణంచేసినా నన్ను మళ్లీ గుమ్మం తొక్క నివ్వరు తెలుసునా ? ఎంత నాగరీకం, నాగరీకం అన్నప్పటికి హద్దనేది ఒకటి వుండాలి. సిగ్గూ ఎగ్గూ లేకుండా పరాయి మగాడితో బయల్దేరి వచ్చావు ! ఊళ్ళోవాళ్లు అడిగారంటే తప్పేముంది ? ఈ మధ్యనే పెళ్లయింది – అల్లుడూ, కూతురూ వస్తున్నారనే అనుకొంటారు' అంటూ విరుచుకు పడింది.

పల్లెటూరివాళ్లతో తప్ప చదువుకొన్న నలుగురితో కలసి మెలసి తిరగనిదే కదా తను ! పల్లెటూరినే అంటి పెట్టుకొని జీవితాన్ని గడుపుతున్న బావగారి మనస్సు తనకు సరిపోయింది. మరి నేను అటువంటిదానినా ?

ఆరేళ్ళ అమ్మాయి. పదేళ్ల అబ్బాయి కలసి, 'అమ్మా—నాన్న'ల ఆట ఆడుకొనే టప్పుడు, తాము పిల్లల మనే సంగతి పూర్తిగా మర్చిపోతారు. నాన్న అమ్మని 'ఆఫీసుకు టయిమయింది' అంటూ తొందర చేసేటట్లు, అబ్బాయి, అమ్మాయిని కసురుతాడు. అమ్మ నిజంగా నాన్నని కోపగించు కొనేటట్లు కనిపించేలా అమ్మగా నటించే అమ్మాయి కోప గించుకొంటుంది. పెద్దవాళ్ళు అవబోయేవాళ్ల ఆశ, వాళ్లకి పిల్లలమనే ధ్యానమే వుండదు.

నేను, ఆ పిల్లల స్థితిలోనే జీవితంలో యింకా మొదటి అడుగుకూడా పెట్టనిదానిలా వున్నాను. అమ్మ, అక్కయ్య— వీళ్ళందరికన్నా ఎక్కువగా అనుభవాన్ని పొందిన మనస్సును, నాగరీక సౌలభ్యాన్నీ అందుకొన్నా ననుకొన్నాను — అని

గర్వపడ్డానంటే అతిశయోక్తికాదు! అందులోనూ రాధా కృష్ణతో ఒకరోజు పరిచయం తర్వాత, నా విజ్ఞానం యింకా ఎక్కువయినట్లుగానూ, పదిమందిలో కొత్తవాళ్ళతో సంచరించగలిగే కొత్త మెరుగును పొందినట్లుగానూ పరవశం చెందాను కనుక, కమలక్కయ్య అభిప్రాయం తప్పని, స్త్రీలు ముందుకు రావాలనే ఆశతో తన మనస్సు వికసించాలని తనకు తోచేటట్లుగా, తన అభిప్రాయాన్ని తోసివేసి ప్రసంగించాను.

'నీకుమల్లే యిల్లాగ మన వివేకాన్ని, విజ్ఞానాన్ని దాచుకోని, మనంతట మనమే భయపడి పారిపోయినట్లయితే ఆడవాళ్ళు ముందు కెలా వస్తారే? నలుగురితోనూ కలసిమెలసి తిరిగి నాలుగు విషయాలూ తెలుసుకోవటంలో తప్పేముంది? పరాయి మగవాడితో మాట్లాడమే తప్పని చెడు అర్థంతో ఎందుకనుకోవాలి? మీకందరికి యీ కుత్సితబుద్ధే ముందుకు వస్తుందికాబోలు! మా యింట్లో యిల్లా లేదమ్మా! అందరితోనూ కలసిమెలసి తిరుగుతూ సహజంగాను, చనువుగాను సంచరించటం వ్యత్యాసంగా తీసుకోరు. అందులోను ఆయన మరీను ...! అదిరి బెదిరి వంటింట్లోకి పారిపోయే ఆడవాళ్ళను చూస్తే ఆయన కసలు కిట్టనే కిట్టదు' అంటూ ఆవేశంగా మాట్లాడేశాను.

దానికి కోపమే వచ్చిందో, ఆశ్చర్యమే కలిగిందో నాకు అర్థంకా లేదు.

'అమ్మయ్యో! ... భలే ... భలే ... ఇప్పుడే ఏమి టేమిటో మాట్లాడేస్తోందే యిది! ఆయనకి యిల్లావుంటే

కిట్టదు, అల్లావుంటే కిట్టదు అంటూ మహా తెలిసినదానిలా మాట్లాడుతోందే!' అంటూ బుగ్గమీద చెయ్యి వేసుకొంది కమలక్కయ్య.

అంతటితో వదిలానా నేను? అత్తయ్య ఎత్తిపొడుపు మాటలు, బామ్మ చీదరింపులు అన్నీ ఒక్క అక్షరంకూడా పొల్లుపోకుండా అమ్మతో చెప్పేసి — 'ఏం అమ్మా! పోయి పోయి యిటువంటి అత్తయ్యను డబ్బెందు కడిగారు? మా వాళ్లు నాకు నగలూ గిగలూ ఏమీ అక్కర్లేదని చెప్పారుగా? మీరు అత్తయ్య దగ్గర్నుంచి డబ్బు తెచ్చి నాకు ఏమీ చేయించనక్కర్లేదు. అంతకన్నా నేను ఏమీ లేకుండా నే వెళ్ళి పోతాను. వాళ్లు ఏమీ అనుకోరు' అని ఏదో మహా అనుభవ శాలిలా, అత్తయ్యమీద నాకున్న కోపాన్నంతా వెళ్ల గక్కాను.

దీనికంతటికీ ఫలితం నాకు కాచుకొనే వుంటుందని నేను అనుకోలేకపోయానే!

'వాళ్ళని ఊరికే అడిగామా ఏమిటి? రేపు మీ నాన్న గారు రిటైరు అయాక ప్రావిడెంటుఫండు వస్తుంది. వడ్డీతో సహా వాళ్ల మొహాన్ని పారేస్తాం. సాటివాళ్లు తగిన స్థితిపరులైనప్పుడు, సమయానికి సహాయం కోరటం ప్రపంచంలో లేని విడ్డూరమా? నేను ఖరీదైన చీర పెడితే, పొడుగూ లేదు, వెడల్పూ లేదు, దాసీదాని కిచ్చాను, పాకీదాని కిచ్చాను అంటూ నా మొహాన్నే కొట్టినట్లు విసుక్కొంటుందే మీ అత్తయ్య. ప్రమీల పెళ్లిలో పదిమందిలోనూ నానామాటలు అనేసిందే ఆ చీరగురించి. జరిగిందేదో జరిగింది – నిన్ను పెళ్ళికూతురు

చేసేనాటికన్నా రావలసిందని, బతిమాలుతూ అరడజను వుత్తరాలు రాశానే! వచ్చిందా మీ అత్తయ్య? మీ బామ్మ సంగతి చెప్పనే అక్కర్లేదు. ఆవిడకి, రోజు కొక్క సారేనా నన్ను తిట్టుకోంటేగాని తిండి సహించదు. ఎంతసేపూ నన్ను ఏడిపించటం ఎల్లాగా అనేధ్యాస తప్పితే మరేంవుండదు, మీ బామ్మకి' అని చీదరించుకొని లోపలికి వెళ్లిపోయింది అమ్మ.

ఇక్కడ వీళ్ళేమో మీ అత్తయ్య, మీ బామ్మ అంటూ దెప్పుతున్నారు. అక్కడ వాళ్ళేమో, మీ అమ్మ, మీ నాన్న అంటూ దెప్పిపొడిచారు. వీళ్ళకి మధ్య నేనా యిల్లా నలిగిపోవాలి!

అనాదికాలంనుంచీ వచ్చే ఈ విరోధ మనస్తత్వం కారణం లేకుండానే అభివృద్ధిచెందే శక్తి కలిగివుంది. ఈ చిక్కులను విడదీయగా విడదీయగా, యింకో ప్రక్కనుంచి తామమాయగా మనకు తెలియకుండానే, చిక్కుపడిపోయే శక్తికూడా కలిగే వుంటుందనే సంగతి తెలుసుకోగలిగే అను భవం నాకు, అప్పుడు యింకా రాలేదే!

"అత్తయ్య దగ్గరనుంచి యిన్ని నిష్ఠూరాలని మోసు కొచ్చావన్నమాట" అంటూ వెళ్ళింది కమలక్కయ్య.

నాకు ఆ చీరలు జ్ఞాపకం వచ్చాయి. వాటిని తీసు కొందామా వద్దా అనే నా సందేహం. అత్తయ్య సెకండ్ క్లాస్ టికెట్టుకు చూపించిన పిసినిగొట్టుతనాన్ని చూసి, తీసుకోకూడదనే నిర్ణయానికి వచ్చాను. తను అహంకారంతో అమ్మ యిచ్చిన ఖరీదైన చీరను అలక్ష్యంచేసినప్పుడు నేను

ఏటిని నిరాకరించకూడదా? 'ఇక్కడి మాటలన్నీ యింట్లో చెప్పేసింది- కొండపల్లి లక్క బొమ్మలాంటిదేం కాదు' అని తను అనుకొంటేమాత్రం నాకు పోయేదేముంది! వాటిని యిప్పుడు రాధాకృష్ణ చేతికి యిచ్చి పంపించేస్తే? ఏదో తంత్రాన్ని కల్పించి వాటిని పంపించి వేయాలి! కాని ఈ లోపుగా ఈ సంగతి వీళ్ళతో చెప్పకూడదు! అంతా అయి పోయాక తర్వాత చెప్పచ్చు' అని నిర్ణయించుకొని, రాధాకృష్ణ ఒంటరిగా వున్నాడా, నాన్నతో మాట్లాడుతున్నాడా అని చూడటానికి సావిట్లోకి వచ్చాను.

నవ్వుతూ నాకోసం లోపలికి వస్తున్న రాధాకృష్ణ, 'శ్రీమతి విమలా చంద్రశేఖరం' గారికి ఒక ఉత్తరం'అన్నాడు నన్ను చూసి.

అతని చేతిలోనుంచి, అచ్చులా రాయబడిన ఎడ్రసుతో వున్న ఆ కవరు తీసుకొన్నప్పుడు, ఆనందపరవశంతో నాలోని ప్రతీ అణువు పులకరించింది. వణికే చేతులతోను, జ్వలించే కళ్ళతోను, ఆ కవరును తీసికొన్నప్పుడు దానితోపాటు యింకో కార్డుకూడా వచ్చిందనే సంగతి చూడనే లేదు! తనే, 'ఇది నువ్వు వస్తున్నట్లు మీ మావయ్య వ్రాసినకార్డు' అంటూ యిచ్చాడు. అతనితో చెప్పాలనుకొన్న విషయం మర్చిపోయాను!

ఇంగ్లీషులో టైపు చేసిన వుత్తరం ఆయన దగ్గరనుంచి వస్తుందని నేను ఎప్పుడూ అనుకోనేలేదు. ఒకొక్క పంక్తిలోను, ఆయన ప్రేమప్రవాహంలో మునిగిపోతూన్న నేను, కమలక్కయ్య వచ్చి తొంగిచూసి, 'ఏదో ఆఫీస్ ఉత్తరంలా

వుందే! ఎక్కణ్ణుంచి వచ్చిందే ?' ,అన్నమాటలూ, మద్యాహ్నం బండిలో వెళ్దామనుకొంటున్నాను'అని గుమ్మంలో నుల్చుని రాధాకృష్ణ అన్నమాటలూ ఎక్కడో కలలో వున్నట్లు విన్నానంటే ఆశ్చర్యంకాదేమో! అది చెప్పొచ్చానే? గర్వం నెత్తికెక్కి 'ఓసి తెలివితక్కువదానా! టైప్ చేసి వస్తే అది ఆఫీస్ ఉత్తర మవుతుందా ?' అని కొప్పొచ్చాడు ఎలిమెంటరీ పాఠశాలలోని మూడవ తరగతి దాటని తనకు, అన్ని పాఠాలని ఇంగ్లీషులోనే చదివి స్కూల్ ఫైనల్ పరీక్షలో రాష్ట్రానికే మొట్టమొదటి దానిగా ప్యాసయిన నేను, పట్టంకట్టాను!

పెట్టె తెరచి, వెలకట్టలేని పొక్కమైన ఆ ఉత్తరాన్ని జాగ్రత్త చేస్తున్నప్పుడు ఆ చీరలు కనిపించాయి. ఆ చీరలను తీసుకొని బయటకు వచ్చాను. నాన్న ఎక్కడికో వెళ్ళారు కాబోలు అక్కడ లేరు. అక్కయ్య ముఖం ట్లేంచుకొంటూ లోపలికి వెళ్ళిపోయింది.

'అత్తయ్య నాకు రెండు చీరలూ, శ్యామలకు రెండు చీరలూ కొంది. మాటల ధోరణిలో పొరపాటున నాలుగు చీరలూ నా పెట్లోనే పెట్టేశాను. ఇప్పుడే చూశాను. మీరు ఎల్లాగా అక్కడికి వెళ్తారుగా. దయచేసి యీచీరలు అత్తయ్యకు యిచ్చేస్తారా?' అని ఆచీరల పొట్లాన్ని రాధాకృష్ణ చేతిలో పెట్టేశాను. అతను ఆ చీరల పొట్లాన్ని విప్పి చూశాడు.

'నాలుగూ నీకోసమే కొందేమో?' అన్నాడు.

'లేదు లేదు. శ్యామలకని చెప్పిందే?' అన్నాను నేను మెల్లిగా.

'శ్యామల యిటువంటి చీరలుకూడా కడుతోందా? శిల్కూ, జార్జెట్ తప్ప నూలుచీరలు కట్టటం నేను ఎప్పుడూ చూడలేదే!' అంటూ అనుమానంగా నవ్వాడు రాధాకృష్ణ.

నేను లోపలికి వెళ్ళిపోబోయాను. ఇంతలోకే, ఎక్కడికో వెళ్ళిన నాన్న అప్పుడే వచ్చారు. అతని చేతిలోని చీరలు చూసి—'చీరలా' అంటూ అవి తన చేతిలోకి తీసుకొన్నారు. నా గుండె ధడధడ కొట్టుకొంది. గుచ్చి గుచ్చి ఆయన ఏదైనా అడిగితే, రాధాకృష్ణ సమాధానమిచ్చేశాడంటే, తీగ కదిపితే డొంకంతా కదిలిందన్నట్లు, గుట్టంతా బయట పడిపోతుందేమోననే భయంతోనే నే కలగచేసుకొన్నాను.

'అవును నాన్నా! వాళ్ళ చెల్లెలు సరోజకోసం కొన్నారుట' అంటూ తెగించి ఓ అబద్ధాన్ని ఎల్లా చెప్పానో నాకే తెలియదు. చెప్పేశాను!

ఎంతో చనువు, సొంతము, స్వతంత్రము అయిన నాన్నకు భయపడి, ఒక్కరోజు పరిచయం కలిగిన రాధాకృష్ణతో ఎక్కువ చనువు వున్నట్లు, ఒక అబద్ధాన్ని కప్పటానికి యింకో అబద్ధాన్ని చెప్పటం—తర్వాత ఆలోచిస్తే నాకే ఆశ్చర్యం కలిగింది. నాన్న చీరలను అటూ యిటూ తిప్పి చూస్తుంటే, అతని కళ్ళు నన్ను తమాషాగా చూశాయి. నేను ఏకారణంచేత అల్లా అబద్ధం చెప్పానో అతను ఎల్లా ఊహించగలడు? ఎల్లాగో బాధ్యతను అతని నెత్తిమీద తోసేసి, నేను ఏమీ ఎరుగనట్లు లోపలికి వచ్చేశాను!

అతనుకూడా గుట్టు బయటపెట్టలేదు. తర్వాత కొంత సేపటికి అతను వెళ్ళిపోయాడు. మొండి ధైర్యంతో ఆ పని చేసేశానేకాని, ఆక్షణంనుంచి నా మనస్సు పరిపరివిధాల బాధపడింది.

పెద్దవాళ్ళదగ్గర యీసంగతి దాచిపెట్టి, తొందరపడి పిచ్చిపనిచేశానే! నేను చెప్పినట్లు యితను వాటిని అత్తయ్యకు యిచ్చినపుడు, చెయ్యాలనే నే నీపని చేశానని తెలుసుకొని తను యింకా ఏం చెప్పిపోడుస్తుందో? ఇతనికికూడా యీ సంగతి అంతా అర్థమయిపోతుందే?

ఛ...ఛ...ఎటువంటి పిచ్చిపని చేశాను? నేను చేసిన ఈ పనివల్ల ఏం జరుగుతుందో ఆలోచించకుండా. ఏమీ తెలియని అతన్నికూడా యిందులో యిరికించివేశానే? నేను చెప్పిన అబద్ధానికి అతను ఏమనుకొన్నాడో? చూడబోతే చిన్నవిషయం!

ఏం? ఎందుకు యివ్వకూడదు? తను ఎత్తిపొడిచినట్లు, మా పేద పరిస్థితిని అవమానం చేసేటట్లు యిచ్చిన ఆ కానుకను నేను నిరాకరించటం మంచిపనే అని వాదించింది నా మనస్సు ఒకపక్క.

తర్వాత మా వాళ్ళతో చెప్దామనుకొన్నానేగాని చివరికి ఎవరికీ చెప్పలేదు!

# 6

నా చదువు పూర్తయిందగ్గరనుంచి అమ్మ గుణం రాక్షసగుణంగా మారిపోయిందనుకోవటానికి నాకు చాలా సందర్భాలు వచ్చాయి. ఇంతకాలంతర్వాత నామీద తన పగ తీర్చుకొనేటట్లు, పొద్దున్నే లేచి స్నానంచేసి, యింటిపని అంతా నేనే చెయ్యాలని నిర్బంధించేది. సరిగా చెయ్యకపోతే కోప్పడేది. నేను ఏదైనా నోరువిప్పి మాట్లాడితే కొట్టేసేది కూడా. నా అజ్ఞానాన్ని అర్థంచేసుకోలేని నేను, అమ్మకి నామీద ప్రేమఅనేదే లేదని, యీ యింట్లోనుంచి పారిపోయి, ఎంత బ్రతిమాలినాసరే యింక రాకూడదని నిర్ణయించుకొన్నాను. ప్రతిదానికి ఎదిరించి మాట్లాడేదానిని. కాని అమ్మ మనస్సు పుండుపడి బాధపడుతుందని తెలుసుకోలేకపోయాను.

ఆ రోజు వచ్చేసింది నాకు. ఇంక ఒక కొత్త యింటికి కొత్తమనుష్యులతో కలసి, కొత్త జీవితాన్ని గడిపేందుకు నేను కాపరానికి వెళ్ళిపోతున్నాను!

నా మనస్సే అనుభవంలేనిది. నా అభిప్రాయమో భ్రమలో ఏర్పడినది. నేను కాపరానికి వెళ్ళేరోజు దగ్గరకు రాగారాగా నా మనస్సులోవున్న అజ్ఞానం అస్తమించటం ఆరంభమయింది.

తల్లి యొక్క పవిత్రప్రేమ భగవంతుని సాన్నిధ్యంలో కలిగే ఆనందానికి సమంగా వుంటుందని వివేకవంతులకే అర్థమవుతుంది. తల్లియొక్క ప్రేమలోను, కరుణలోను

చందనపు సువాసన, చల్లగాలి ప్రసరిస్తాయి. ప్రకాశంతోను వికాసంతోను, లోతుగాను, సుడిగుండాలుగాను చేసుకొంటూ పోతుంది. మంచుకొండలా తెల్ల తెల్లగా ప్రకాశించే జల పాతం పొంగులోనుంచి వచ్చే ఆవిరికూడా తల్లి ప్రేమలో పెనవేసుకుపోతుంది. ఏమీ తెలియని అజ్ఞానానికి, నీటి ప్రవాహం గంభీరంగా వుండటానికి, లోతులు, సుడిగుండాలు అవసరమని, చందనపువాసన లేకుండా చల్లగాలిలోని సుఖాన్ని అనుభవించలేమని తెలియదు. పటికిబెల్లాన్ని స్వారస్యంగా చప్పరించి, ఉప్పుని 'థూ' అని ఉమ్మివేసే గుణం కలిగిన పసిబిడ్డ వల్ల, అంతులేని సామరస్యంలేని ఉత్తమమైన తల్లి ప్రేమను నిజంగా అర్థంచేసుకోలేదు. నా మంచికోసం, నా బాగుకోసం, అమ్మ కొప్పడుతోందని, కొడుతోందని, ఆడుతూ, పాడుతూ పసిపిల్లగా తిరిగే నేను తెలుసుకోలేక పోయాను.

తను యింక నన్ను ఎందుకేనా కోపగించినట్లయితే, తన మనస్సు వుండుపడేటట్లు మాట్లాడకూడదని, ఎదురు సమాధానం చెప్పకూడదని నిర్ణయించుకొన్నాను. కాని, అమ్మ నన్ను కొప్పడేందుకు సందర్భమే రాలేదు! నన్ను యింటిపని చెయ్యొద్దనేది. 'నువ్వు వంటింట్లోకే రావద్దు, ఇంక కొద్దిరోజులే కదమ్మా విమలా. ఆ పాటపాడు వింటాను, యీ పాట పాడు వింటాను' అంటూ అమ్మ నన్ను సిగ్గు పడేటట్లు చేసేది.

అంతకుముందే నా సంతోషం కోసం తలకు మించిన ఖర్చు చేసి పెళ్ళిచేసిన నాన్నను చూస్తే నాకు అపరిమిత

మైన జాలివేసింది. అమ్మ నగలు అన్నీ అమ్మివేసి, పసుపు తాడుతో కట్టుకొన్న మంగళసూత్రంతోను, గాజు గాజుల తోను నిలబడిన అమ్మను చూసి 'అమ్మా' అంటూ వెక్కి-వెక్కి ఏడ్చాను. ఇవన్నీ ఏం సాంప్రదాయాలు ? తల్లీ, తండ్రీ నానాఅవస్థపడి పెళ్ళి చేసిందే కాకుండా, నగలుకూడా పెట్టి పంపాలనే ఒక నిర్బంధంకూడా ఒక సాంప్రదాయమేనా? కూతురు మెడనిండా నగలు పెట్టుకొని వెళ్తూంటే, నవ మాసాలు మోసి, కని, పెంచి, పెద్దదానిని చేసిన తల్లి మెళ్లో పసుపుతాడు, చేతులకి గాజుపూసలూ వున్నా మాకేం సంబంధం లేదనటం కూడా ఒక సాంప్రదాయమేనా ?

'ఆయనతో యీ మూర్ఖ సాంప్రదాయాల గురించి నాన్న పరిస్థితిగురించి చెప్పెయ్యాలి ! ఇంతవరకూ ఎవరూ చూడని మాదిరిగా, కొత్తగా, నా సుఖంకోసం ఖర్చుపెట్టి అప్పులు తీర్చే దారి తెలియక బాధపడుతున్న నాన్నకు, కనీసం వరకట్నం డబ్బైనా తిరిగి యిచ్చివేయవలసిందిగా ఆయన్ని కోరుకొంటాను ! విమలా చంద్రశేఖరం అంటేనే అమ్మ, నాన్న, — ఏం ? ఊళ్లోవాళ్ళు కూడా గొప్పగా చెప్పుకొనేటట్లు నేను చెయ్యగలను !' అని ఏమేమో ఆలో చించుకొన్నాను.

వీధి గుమ్మంలో బండి వచ్చి ఆగింది.

'నన్ను దిగబెట్టి వచ్చింతరువాత నాన్న ఒక్కరోజు కూడా నిశ్చింతగా వుండలేరు. "ఆడపిల్లలకోసం అలసి సొలసి పోయిన ఆయనకి ఏం ఫలితం వుంది ? ఆయన పడిన కష్టానికి ప్రతిఫలంగా ఏం చెయ్యగలం ? ఒక్కరోజు పిలిచి తృప్తిగా

భోజనం పెడదామంటే యింకొకరి ముఖం చూడాల్సివస్తోంది"
అని అక్కయ్య అంటూవుంటుంది. నేను అల్లావుండేను.
నా వాళ్ళందరూ నాగరీకులు. నాకు ఆయింట్లో సర్వస్వాతం
త్రాలు వుంటాయి! ఏం? నాన్న రిటైరుఅయిపోయాక
నాకూడానే వుంచుకొంటాను!' అనుకొన్నాను బయల్దేరే
ముందు.

అక్కయ్యకి, అమ్మకి నమస్కరించాను.

'వెళ్ళిరామ్మా విమలా! పుట్టినింటికి మెట్టినింటికి
మంచి పేరు తెచ్చుకోవాలి! అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూ
వుండు' అంటూ ఆశీర్వదించిన అమ్మ కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి.
అక్కయ్యకూడా యించుమించు అదేస్థితిలోవుంది. నేను
తనని ఎన్నిసార్లు ఎగతాళి చేసినా నేను వెళ్ళిపోతున్నానంటే
తనకి ఎంత దుఃఖం కలుగుతోంది! ఇంతకాలంనుంచి లేని
బాధ అకస్మాత్తుగా నన్నావరించింది. 'అక్కా' అంటూ
తనమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చాను.

నాన్న వీధిలోనుంచి కేకవేశారు. ఇంక అమ్మ
అక్కయ్యలను చూడలేక, వీధిలోకి వెళ్ళి గబుక్కున బండి
ఎక్కుతూంటే, నా కొత్త చీరకొంగు బండిమేకుకు తగిలి
పర్రుమని చిరిగింది!

'కొంచెం మెల్లిగా ఎక్కకూడదమ్మా' అన్నారు
నాన్న.

'బయల్దేరే సమయంలో చీర చిరిగిందా? ఉత్తిఖంగారు
పిల్ల. లోపలికి రా. కాళ్ళు కడుక్కొని వెళ్లు' అంది అమ్మ
గుమ్మంలో నిల్చొని.

'ఇంక యిప్పుడేం లాభంలేదు, టైంలేదు. బండిని పోనీవోయ్' అంటూ బండి ఎక్కారు నాన్న.

'వెళ్లొస్తానమ్మా !' అన్నాను బండిలోనుంచే అక్కయ్య అమ్మ, పక్కింటి కోమల, అంతా నన్నే చూస్తూ నిలబడి పోయారు.

బయల్దేరే సమయంలో కొత్త చీర చిరిగిందేమిటి ?

నా మనసు చాలా బాధపడింది. ఊరేగింపురోజునాటి వాన, ఉరుములు, మెరుపులు, పిడుగులు ఆ పాట ! అవన్నీ గుర్తువచ్చాయి ?

బండి చక్రాల వేగానికి పల్లంలో ఏర్పడిన కుదుపువల్ల నా చేతిలోవున్న మరచెంబు జారి నీళ్లు ఒలికిపోయాయి !

'కొంచెం మెల్లిగా తోలవోయ్' అన్నారు నాన్న బండివానితో. పూర్తిగా ఆలోచించటానికి వీల్లేకుండా యింజను పొగలా నా మనస్సంతా క్షోభించిపోయింది.

ఆ రోజున తను ఆ పాట ఎందుకు పాడింది? అంత కన్నా యింక పాటలే లేవా? ఇప్పుడు నేను కట్టుకొన్న చీర, మేకుకు తగిలినంతమాత్రాన చిరిగిపోవాలా? పోనీ పాత చీరేమో అనుకొంటే అదీ కాదే! కొత్తచీర కదా!

పురాణాల్లోని కథల్లో వచ్చేటట్లు — భర్తను రణ భూమికి పంపటానికి ముందు, అతనికి మంగళహారతి యివ్వ టానికి తెచ్చిన పళ్లెం చెయ్యిజారి కిందపడిందని భార్య బెదిరి పోతుంది, అపశకున మనుకొంటూ. "శకునమూ లేదు, శాపమూ లేదు. నేను యుద్ధ భూమికి వెళ్తున్నాననే భయంతో కింద పడేసుంటావు" అని ఆమెను సమాధానపరచి రణ

రంగానికి వెళ్ళిపోతాడు అతను. చివరకు శకునమే ఫలిస్తుంది. రణరంగంలో విజయాన్ని సాధించాలని వెళ్లినవాడు వీరస్వర్గ మలంకరిస్తాడు — ఎల్లాగయినా యిదంతా మూఢనమ్మకమని రుజువయేటట్లు మంచి జరుగుతుందా? లేదు — జరగదు.

అల్లాగయితే నాకు కన్పించిన యీ శకునాలన్నీ ఏమిటి?

'అది దీన్ని నానాపాట్లు పెట్టి దీని గడ్డి దీనికెడుతుంది' అన్న అత్తయ్యమాటలు జ్ఞాపకం వచ్చాయి. నన్ను నానా పాట్లు పెట్టటానికి నేను ఏంచేశాను? పూర్వకాలం వాళ్ళయితే - కొత్తకోడలు ఎక్కువగా మాట్లాడకూడదు. వీధి గుమ్మంలో నిల్చోకూడదు. ఇంట్లో పనంతా తనే చేసుకోవాలి—అంటారు. ఇక్కడ అటువంటి పరిస్థితికి స్థానం లేదే! ఆరోజు కొన్ని క్షణాలు సొమ్మసిల్లి పోయిన నన్నుచూసి. అమ్మ, అక్కయ్యలమీద అభియోగం చాటిన 'ఆయన', నా తోడికోడలు నన్ను నానాపాట్లూ పెడితే రాతి బొమ్మలా చూస్తూ ఊరుకొంటారా?

'ఇదంతా ఉత్తి భ్రాంతి! కొమ్మమీద కోయిల కూర్చొన్నంత మాత్రంచేత పనసనండు రాలిపోతుందనుకొన్నట్లు, కోతిబుద్ధి కలిగిన మనస్సుకి, కొన్ని కొన్ని సమయాలలో కొన్ని కొన్ని విషయాలు సరిగ్గా అతుక్కుపోతున్నాయి. ఇటువంటివన్నీ ఆలోచిస్తూ మనస్సుని పాడు చేసుకొని సంతోషాన్ని చంపుకోవటమే అవుతుంది. నేను యిల్లా తెలివి తక్కువగా ఆలోచించినట్లు ఆయనకు తెలిస్తే నవ్వుతారు కూడా!

వాన కురుస్తున్నప్పుడు ఒకోసారి ఎండకూడా వస్తుంది. ఏ విషయాన్నీ కూడా దూరదృష్టితో ఆలోచించి అర్థం చేసుకోగలిగే శక్తిలేని నా మనస్సు పరిపరి విధాల ఆలోచిం చింది.

మేము స్టేషన్‌కు వచ్చింతరువాత బండి రెండుగంటలు 'లేట'ని తెలిసింది. ప్లాట్‌ఫారంమీద కూర్చొన్న జనంలో మేముకూడా ఒకచోటపోయి కూర్చున్నాం. అప్పుడు రాధా కృష్ణతో సుఖంగా సెకండ్‌క్లాస్ ప్రయాణం చెయ్యటం, నాగ్‌పూర్‌లో సకలసౌకర్యాలుకలిగిన 'వెయిటింగ్ రూమ్'లో విశ్రాంతి తీసుకోవటం నాకు జ్ఞాపకం వచ్చింది. ఒకవేళ, నేను మళ్ళీసారి 'ఆయన'తో కలకత్తానుంచి వచ్చేటప్పుడు అల్లా వస్తానేమో!

నాన్న 'విమలా' అన్నారు. ఇంటిదగ్గర బయల్దేరినప్పటి నుంచి, ఏమీ మాట్లాడకుండా వచ్చిన ఆయన, చటుక్కున నన్ను పిలిచేసరికి ఆశ్చర్యంగా 'ఏం నాన్నా?' అన్నాను.

'నిన్ను దిగబెట్టిన వెంటనే నేను బయలుదేరాలి. అక్కడ మాట్లాడటానికి వీలౌతుందో లేదో? నువ్వు కొన్ని సమయాల్లో చాలా దుడుకుతనంగా సంచరిస్తున్నావ్! ఆరోజు రాధాకృష్ణ చేతికి చీరలు యిచ్చేసి నాతోటి అబద్ధమేకదూ చెప్పావు?' అని ఆగారు.

వెళ్ళకూడదనుకొన్న విందుకి బొట్టూ, కాటుకా పెట్టి పిలిచినట్లు, ఆయన నాతో ఆ చీరలసంగతి, అవాల్టితో నే పూరయిపోయిందని పూర్తిగా మరిచిపోయిన ఆ పాతసంగతి ప్రస్తావిస్తారని నే ననుకోలేదు! నేను ఏమని జవాబు చెప్పను?

'నువ్వు ఆ విధంగా మర్యాదతక్కువగా నడుచుకోన్నందుకు చాలా విచారిస్తున్నానంటూ బావగారు ఉత్తరం రాశారు. వాళ్ళు ఐశ్వర్యవంతులమ్మా. మనమూ బీదవాళ్లం. ఎప్పుడు సుడిగుండంలాంటి చక్రంలో చిక్కుకు పోయామో కష్టమో, నష్టమో దాని దారిలోనే వెళ్ళాలమ్మా! నువ్వు యింకా చిన్నపిల్లవు. వాళ్ళు ఏదైనా అని నీమనస్సు బాధ పెట్టి వుండవచ్చు. అయినప్పటికీ నువ్వు చేసినదిమాత్రం చాలాతప్పుపని. ఇప్పుడు యింత పౌరుషంగా వున్ననువ్వు నీ భవిష్యత్తులో కష్టపడతావేమో ననేదే నా బాధ. ఇప్పుడు నువ్వు ఒక పెద్ద కుటుంబంలో కాలు పెట్టబోతున్నావు. నీ తోడికోడలు, ఆమె తల్లి, ఆమె చెల్లెలు, నీ అత్తగారు అంటూ మూడు కుటుంబాలు కలిసివున్న కుటుంబం అది. ఒక్కొక్కరిగుణం ఒకోవిధంగా వుంటుంది. వాళ్ళ స్వభావాలకి తగినట్లు, అంతా మనమంచికే అన్నట్లు నడుచుకోవాలి. వాళ్లు ఇప్పుడు ఎల్లాసర్దుకు పోతున్నారో అల్లాగే నువ్వూ వుండాలి. వెయ్యిమంది వున్నప్పటికి మగవాళ్లు కలసి మెలసి వుండగలరు. కాని ఆడవాళ్లు అల్లా వుండలేరు. అత్యంత ప్రాణ స్నేహితులలావున్నాకూడా సహజంగా వుండరు. తప్పులు వెతికి పట్టుకొనే శక్తి వాళ్ళకి అపారంగా వుంటుంది. అందుచేతనే అభిప్రాయ భేదాలు, మనఃక్షోభలూ ఏర్పడటం స్త్రీల విషయంలో చాలా సులభమవుతోంది. ఈ మార్గంలోనే విజ్ఞానాన్ని ఎప్పుడూ వెళ్ళనివ్వకూడదు. అంతాకూడా మన మంచికే అన్నట్లు చూసుకో. ఇంటి పనిచేయటం హీనమనుకొనే బద్ధకశాలి కాకూడదు నువ్వు విమలా! చందనపు కర్ర

కూడా అరగగా, అరగగానే సువాసన వస్తుంది. అల్లా
నీ సౌకర్యాలన్నింటిని ఎంతెంతగా తగ్గించుకో గల్గుతావో నీ
అంతంత మంచిది. 'నాకు అది లేకపోతే వీల్లేదు. ఇది లేకపో
నే నుండలేను' అంటూ నువ్వు ఎప్పుడూకూడా మాట్లా
కూడదు. త్యాగబుద్ధి అనేదే లేకపోతే నిజమైన గొప్పతన
లేదు —— సుఖమూ లేదు. కుటుంబానికి స్త్రీలు దివ్యజ్యోతు
లాంటివాళ్ళు. కుటుంబంయొక్క మంచి చెడ్డలన్నింటికి వాళ్
కారకులు. నీ భర్త అన్నగారిమీాదా, వదినగారిమీాదా నువ్వు
అపార ప్రేమా, గౌరవ మర్యాదలు చూపించాలి. ఇకనుం
ఎప్పుడైనాసరే ఆ అన్నదమ్ములు విడిపోయి వేరింటికాపరాల
పెట్టుకొన్నారంటే, అందుకు నువ్వు కారకురాలివి కా
పోయినా ప్రపంచం నిన్నే నిందిస్తుంది! అటువంటి పరిస్థి
రాకుండా నువ్వు సంచరించాలి. చెప్పుడు మాటలు నమ్మకు
నాగరీకాన్ని చూసి మోసపోకమ్మా. శీలపావనతనేదే గౌర
మయిన యింటికి పునాది. పెత్తనంకోసం ఎప్పుడూకూడా ఆ
పడకమ్మా. ఏ పరిస్థితులలోనైనాసరే నీ ధైర్యాన్ని వదిలి
పెట్టకు. పెద్దవాళ్ళని ఎప్పుడూ అలక్ష్యంచేయకు. ఎంతో
శ్రమపడి నీకు యిటువంటి సంబంధం చేయటంకూడా నాక
పెద్ద కష్టంగా తోచలేదు. రేపు నీవల్ల ఒక్క తప్పుకూడ
జరక్కూడదు. కన్న తల్లీ, తండ్రీ పేరు నిల్పి, పుట్టింటికి మెట్ట
నింటికికూడా మంచిపేరు తేవాలి విమలా! తెలుస్తోందా
తల్లీ!' అని పూర్తి చేశారు నాన్న.

నాకు చాలా ఆశ్చర్యంవేసింది. చూడటానికి అమాయ
కంగా కనిపించే నాన్నకు ఎన్ని విషయాలు తెలుసును?

'మీరు యిప్పుడు చెప్పిన విషయాలన్నీ తప్పకుండా జ్ఞాపకం వుంచుకొంటాను. అల్లాగే నడచుకొని అందరిచేతా మంచిదాన్ననిపించుకొంటాను నాన్నా' అని నిశ్చయతాభి ప్రాయంతో చెప్పినప్పుడు ఎందుకనో నా గొంతుక బొంగురు పోయింది.

'కమల అత్తారింటికి వెళ్ళింది. ప్రమీలకూడా అత్తారింటికి వెళ్ళింది. అప్పట్లో నేను వాళ్ళ గురించి ఏమీ బాధ పడలేదు. విచారపడలేదుకూడా. కాని నీ విషయం నాకు అంత తేలికగా తోచటంలేదు. ఎన్నోకష్టాలుపడి, ఎంతో శ్రమకి ఓర్చి నీకు చదువు చెప్పించాను. సంగీతం చెప్పించాను. "విమల మొగపిల్లాడిగా పుట్టాల్సింది. తనకి యిప్పట్లో పెళ్ళి చేయకండి. కాలేజీలో చేర్పించండి. బాగా చదువుకొని పెద్ద ఉద్యోగంచేసి ముందుకు రానివ్వండి" అని అనేకసార్లు, నువ్వు చదువులో చూపించే శ్రద్ధ చూసి మీ హెడ్‌మాష్టరు నాతో చెప్పేవారు. కాని, జీవనాధారంకోసమూ, వివాహ ఖర్చు తప్పించుకోవటంకోసమూనా నిన్ను నేను చదివించాను? సంసారనౌక అనేది సుడిగుండాల్లో పడిపోకుండా వెళ్ళాలంటే కొంతవరకేనా చదువనేది వుండాలనే నిన్ను చదివించాను! కాని చదువువల్ల తమకు కలిగే విజ్ఞానాన్ని స్త్రీలు, మంచి పద్ధతిలోనూ, నీతిదాయకమైన పద్ధతిలోనూ ఉపయోగించు కోవాలి. 'నన్ను కాపాడుకోవటం నాకు తెలుసు. నేను నీకు బానిసగా వుండను' అంటూ భర్తతో. దెబ్బలాడే పద్ధతిలో ఆ విజ్ఞానాన్ని ఎప్పుడూ ఉపయోగించకూడదు. ఒకరికొకరు బలవంతంగా అధికారానికి లోబడిన బానిస జీవితాన్ని నేను

ఆదరించను. కాని ప్రేమయొక్క పాశానికి లోబడి, ఒకరినొకరు అర్థంచేసుకొని, అన్యోన్యంగా మసులుతూ తమ జీవితపు భవిష్యత్తు తామే నిర్ణయించుకోగలిగే సతీ పతులే, నిజమైన దాంపత్య సౌఖ్యాన్ని అనుభవించగలుగుతారనేది నా అభిమతం. భార్యాభర్తలు, వికసించిన వివేకాన్నీ, నిర్మలమైన మనస్సుని కలిగి వున్నట్లయితే, జీవిత సాగరంలో ఏర్పడే సుడి గుండాల్లాంటి కష్టాలు, కలతలు లేకుండా, సంతోషంగా, సుఖంగా జీవితాలను గడపగలుగుతారు. ఇంత మంచి దంపతులుగా మీరిద్దరూ జీవించాలనేదే నాకు మిగిలిన కోరిక విమలా' అన్న నాన్న నా కళ్ళలోకి చూశారు. ఆయన చెప్తున్నదంతా వింటున్న నేను, ఆయన కళ్ళనుంచి కారే కన్నీటి ప్రవాహాన్ని నేను చూడనేలేదు !

మా ఊళ్ళో ఒక చెఱువుంది. దాని వెనుకపక్క ఒక బోదికూడా వుంది. బాగా వానకురిసి చెఱువు నిండిపోయి నట్లయితే బోది తెరుస్తారు. నేను స్కూలుకు వెళ్ళే రోజులలో చెఱువులో నీరు 'హోరు మనే శబ్దంతో బోదెలో ఆవేశంతో పరిగెత్తే నీటిప్రవాహాన్ని అతిశయంగా చూస్తూనిలబడేదానిని. చెఱువులో శబ్దం లేకుండానూ, చలనం లేకుండానూ వున్న నీరు కొంచెం సందు దొరికేసరికి ఎంత ఆవేశంగా పరిగెడుతోంది ? ఒక్కసారిగా గట్టంతా పడగొట్టేస్తే నీరు ఎల్లా పరిగెడుతుంది ? అని ఆలోచించేదానిని. నాకు అది జ్ఞాపకంవచ్చింది. నాన్న మనోసాగరంలోని ప్రేమకి అనుభవానికి కొంచెం దారి దొరికినట్లుంది ! కమలక్కయ్యమీద, ప్రమీలక్కయ్యమీద లేని ప్రేమ తనకి నామీద వుందని ఆయన నోటినుంచే

వచ్చిందే! చెలువులోని నీరుమాదిరిగా ఆయన మనస్సులో పొంగి పొరలిపోయిన ప్రేమ ప్రవాహం నన్ను తల్లడిల్ల చేసింది. నెరసిన ఆయన తల, ముడతలుపడి వాడిపోయిన ఆ ముఖం, ఎప్పుడో కుట్టించుకొని చీకిపోయిన ఆ పాత కోటు, నాకు ఆయన చేసిన త్యాగానికి నిదర్శనాలుగా కనిపించాయి. తన ప్రాణంలోని అణువులనుండి బయటకు వచ్చిన నాకు ఆయన తన సొంత సౌకర్యాలను కొంచెంగానా త్యాగం చేశారు? దీని కంతటికి నేను ప్రత్యుపకారం చేయగల కాలం వస్తుందా?

రైలుబండి వచ్చే చప్పుడు వినిపించింది. 'బండి వస్తున్నట్టుందమ్మా' అంటూ లేచారు నాన్న.

నా జీవితంలోని దూరప్రయాణంలో నన్ను ఒక ఘట్టం నుంచి మరొక ముఖ్య ఘట్టానికి తీసుకొని వెళ్ళే ఆ ధూమ శకటం, ప్రళయకాలంలోని కారు మేఘభూతంలా రోదన చేసుకుంటూ వచ్చింది.

# 7

మసకచీకటిని ఛేదించుకొంటూ సూర్యభానుని ఉదయ కాంతి అరుణకిరణాలు నాకు స్వాగతం యివ్వగా, నేను నా నూతన జీవితంలోని ఉదయకాంతిలో ప్రవేశించాను. బండిలోనుంచి నా కళ్ళకు మొట్టమొదటగా నా బావగారు కనిపించారు. ఆయన వెనకాల నాలుగైదు సంవత్సరాల ఆడపిల్ల చేయి పట్టుకొని, తెల్ల లాల్చీ, తెల్ల పైజామాతోను 'వారు' నన్ను చూసి చిరునవ్వుతో నాకు స్వాగతం

యిచ్చారు. దూరమయిన పావురం ఎగిరి ఎగిరి నా ముందు వాలింది! సామానులు దింపుతున్న నాన్నను చూసి 'పోర్టర్, పోర్టర్' అంటూ కూలివాళ్ళను కేకవేశారు నా బావగారు.

'బాగా రష్‌గా వున్నట్టుంది. కూర్చోటానికేనా చోటు దొరికిందా?' అంటూ 'ఆయన' నన్ను చూసి నవ్వారు. బండిలో నిద్రేపో లేదని, కూర్చునేందుకే యిబ్బంది పడ్డామనే విషయాన్ని రుజువుచేసేటట్లు నా ఆకారమే చెబుతోంది! సిగ్గుతో తలవంచుకొన్నాను. వాళ్ళతోపాటు స్టేషన్ ఆవరణ దాటి బయటకు వచ్చాను. వాళ్లు చూపించిన ఆకుపచ్చ కొత్త కారులో కూలీలు సామానులు పెట్టారు. డ్రైవరు స్థానంలో 'ఆయన' కూర్చోగా 'సొంతకారులాగుందే' అను కొన్నాను. ఆయన పక్కనే, ఒళ్లో పిల్లను కూర్చోపెట్టుకొని నా బావగారు, వెనకాల సీట్లో నేనూ, నాన్న కూర్చోగా, కలకత్తా పట్టణం కాంక్రీటురోడ్లమీద కారు వెళ్తూంటే నాకు ఆకాశంలో ఏదో పుష్పవిమానంమీద వెళ్తున్నట్టుగా తోచింది! కళ్ళు మూసుకొని కళ్ళు తెరచేలోపుగానే యిల్లు చేరినట్లనిపించింది నాకు. వరండాలో ఓ పేముకుర్చీలో కూర్చున్న నా తోడికోడలు చంచల, అతి శ్రమపడుతూ లేచి నిల్చుంది. 'రా విమలా!' అంటూ నన్ను నవ్వుతూ ఆహ్వానించింది. అప్పటి తన స్వరూపాన్నిబట్టి తను పూర్ణ గర్భిణి అని తెలుసుకొన్నాను.

ఇంతలోకే గబగబా వస్తూన్న మా అత్తగారు, 'ఏం చంచలా! హారతి యివ్వద్దూ! అప్పుడే లోపలికి వచ్చేసిందే' అంది.

'హారతి యివ్వాలా ? ఇదంతా నా కెక్కడ జ్ఞాపకం
అంటూ నన్ను చూసి నవ్వింది నా తోడికోడలు చంచల.

మళ్ళీ బయటకు వెళ్ళాలికాబోలు అనుకొని వెన
కడుగు వేయబోతూన్న నన్ను చూసి 'ఫర్వాలేదు - లోపలికి
వెళ్లచ్చు' అన్నారు 'ఆయన.' వంటిట్లోకి వచ్చేటప్పటికి
అక్కడ ఒకావిడ కూరలు తరుగుతోంది.

'ఈవిడ చంచల తల్లి. నమస్కారం చెయ్యి' అంది
నా అత్తగారు.

వంగి నమస్కారంచేసిన నన్ను చూసి, పర్వతం
లాగునవున్న ఆవిడ 'ప్రయాణం చాలా బడలిక చేసినట్లుంది
కళ్ళన్నీ కందిపోయాయి' అంటూ నవ్వింది. ఆమె చెవుల్లో
మెరిసే వజ్రాలద్దుద్దులు, చేతికున్న ఉంగరాలు, ధగధగ మెరిసే
మాణిక్య వడ్డాణం, అన్నీ ఆమెకు గతి లేక కూతురుతో
వుండటం లేదని చాటుతున్నాయి. పొయ్యి ఎగదోస్తున్న మా
అత్తగారితో 'ముందు కాస్త కాఫీ యివ్వండి' అం దావిడ.
'నే నింకా ముఖమే కడగ లేదు' అని చెప్పిన నేను వంటింట్లో
అటూ యిటూ దిక్కులు చూస్తున్నాను. ఈ కొత్త యింట్లో,
కొత్త మనుష్యులతో ఎల్లా మాట్లాడాలో, ఎల్లా సంచరిం
చాలో అర్థంకావటం లేదు.

'ఇ దెవరో తెలుసునా?' అంటూ ఒక చేత్తో యిందాక
స్టేషన్ కువచ్చిన అమ్మాయినీ, యింకో చేత్తో యింకో అబ్బా
యినీ లాక్కొస్తూ 'ఆయన' వంటింట్లోకే వచ్చేశారు.

'ఇది పిన్ని. నాకు తెలుసుగా' అంటూ నవ్వింది
ఆ అమ్మాయి.

'ఒరేయ్ రవీ! ఈ పిన్నికి లెక్కలు బాగావచ్చు నట. ఆ పిన్ని మాదిరిగా గట్టిగా అరుస్తూ, అసలు కొట్టనే కొట్ట దుట' అంటూ ఆ ఎనిమిదేళ్ళ పిల్లాడికి నన్ను పరిచయం చేశారు ఆయన.

'ఇక్కడ పిల్లలున్నారు. ప్రేమతో సంచరించాలి' అనుకొన్న నేను వాళ్ళని చూస్తూ నవ్వుతూ నిల్చున్నాను.

'ఓహో! మనిషి కనిపించటం లేదేమిటా అని చూస్తు న్నాను. అప్పుడే ఇక్కడ 'మిసెస్'తో మాట్లాడటానికి వచ్చేసి నట్టున్నారు!' అంటూ ఓ మధురమైన గొంతుక వినిపించే సరికి నేను తల ఎత్తి చూశాను. ఒక స్త్రీ, సౌందర్య దేవతలా ఉదయకాంతిలోని మనోహరంలో ములిగివచ్చినట్లు, అంద మంతా తన సొంతమేమోనని అనిపించేటట్లు వచ్చి నిల్చుంది.

'వీళ్ళందరిని 'ఇంట్రడ్యూస్' చేస్తున్నాను రా! నీకుకూడా చెబుతాను. ఇది...నా'మిసెస్' విమల...ఎల్లా వుంది?' అంటూ ఆరంభంలోనే ఒక్కసారిగా ఆమెను అభి ప్రాయం అడిగేశారు ఆయన. ఆమె ఫక్కున నవ్వుతూ, కళ్ళు పెద్దవిచేసుకొని నన్ను చూసింది.

'ఎల్లావుందో చెప్పాలా? ఇదిగో చెబుతున్నాను విను: కారు మేఘాలలా చమరీవాలములవంటి కురులు, తుమ్మెద రెక్కల్లాంటి కంటిపాపలు...' అని ఆమె వర్ణిస్తోంటే...

'ఆ!... ఆ!... పెద్ద నవలా రచయితలా కోసేస్తు న్నావే!' అంటూ నవ్వారు ఆయన.

మగవాళ్ళు, ఆడవాళ్ళు సహజంగా మాట్లాడటం, వ్యత్యాసం లేకుండా సంచరించటం అనేది నేను విన్నప్పటికీ యిల్లా మాట్లాడుకోవటం నే నెక్కడా చూడ లేదు.

'నిజం చెబుతే నేను కోసేస్తున్నానుట! కానాలంటే నువ్వే చూడు. కారు మేఘాన్ని, తుమ్మెదని చూసేటప్పుడు విమల జుట్టు యింకా నల్లగానూ, ఆమె కళ్ల అందం తుమ్మెదకు కూడా వుండదని తెలియటంలేదా?'

'ఇంతంతానా నిన్ను అడిగాను?' అందంగురించి అడిగాను' అన్నారు ఆయన నవ్వుతూ.

'ఓహో! ఏమిటా అనుకొన్నాను. అప్పుడే మైకం తలకెక్కి పోయిందని ఒప్పుకొంటున్నావా? ఎల్లా వుందో చెప్పనా?' అంటూ నా చుట్టూ ఒకసారి తిరిగి, సన్ను పైనుంచి కిందదాకా ఒకసారి చూసి, నవ్వింది.

'ఆమె అభిప్రాయం ఏమయివుంటుందో, భలే తమాషా చేస్తోందే' అని వాలో నాకే నవ్వొచ్చింది.

'ఆసంగతి తర్వాత చూద్దాం. నే నెవరో తనకి చెప్పావా?' అంది.

'నేను చెప్పాలి కూడానా? నీ గొంతుక స్వరంలో నుంచే నువ్వు నిర్మలవని తెలుసుకొని వుంటుందే! అప్పుడే యీ రవి, పిన్ని గట్టిగా అరుస్తూ కేకలేస్తూ లెఖ్ఖలు చెప్పటం నాకు నచ్చనేలేదు అంటూ తన కొత్త పిన్నితో 'కంప్లెయింట్' చేసేశాడు' అన్నారు ఆయన.

'సరిసరి. అంతదూరం వచ్చారా మీ రప్పుడే. ఉండండి మీపని చెప్తాను' అంది పిల్లలను చూస్తూ, బెదిరిస్తున్నట్లు.

ఆమె ఒక్కొక్క మాట, నవ్వుతూ మాట్లాడే ఆ సహజ గుణం ఆ రోజంతా అల్లాగే గడుస్తే బాగుండు ననిపించింది.

'తను వచ్చి యింకా కాఫీకూడా తాగలేదు. అప్పుడే వచ్చి మీరంతా గందరగోళం చేసేస్తున్నారు' అంది ఆమె తల్లి.

'నువ్వు మహా చెడ్డవాడివి చంద్రం! పాపం రైల్లో నానా అవస్థాపడి వచ్చిందే, ఓ కప్పు కాఫీ యిచ్చి మర్యాద చేద్దామనే బుద్ధి లేదు నీకు! కూర్చోమని కూడా చెప్ప కుండా అల్లాగే నిలబెట్టి తమాషా చూస్తున్నావు యిందాకటి నుంచి! కొత్తపెళ్లాం వచ్చిందంటే, ఏ నిముషంలో కోపగించు కొంటుందో అనే భయం వుండద్దూ?' అని అంటూంటే, నా తోడికోడలు, ఆమె అక్కగారే, 'ఏమే నిర్మలా! ఆయనకి కాఫీ తెమ్మని నిన్నిక్కడికి పంపానా? లేక కబుర్లు చెప్ప టానికి పంపానా? ఏమే మాలతీ! రాత్రి అంతా ఒకటే జ్వరం! ఇంకా నువ్వు యిక్కడే వున్నావా! పద డాక్ట రింటికి' అంటూ గర్జిస్తూనే వచ్చింది.

చనువుతో పినతండ్రి కాళ్ళను పెనవేసుకొన్న మాలతి 'ఉహూ! నేను రాను' అంటూ ఏడుపు మొదలెట్టింది.

బలవంతంగా పిల్లను బరబరా లాక్కుపోతూ, రవికి, వనజకికూడా నాలుగు తగిలించింది, నా తోడికోడలు చంచల.

'ఏరా వెధవా! చదువక్కర్లేదా నీకు? బడికి టైం అవటంలా? ఏమే యింకా నీళ్ళు పోసుకోలా? జడేసుకో నక్కర్లేదా?' అంటూ కేక లేస్తూ వెళ్ళింది.

నిర్మల, నాన్నకి కాఫీ తీసుకువెళ్తోందని తెలుసుకొన్న నేను 'ఆయన కాఫీ తాగరు. పొద్దున్నప్పుడు ఏమీ తినరు. అందులోను స్నానం చెయ్యకుండా...' అన్నాను.

'ఏమిటది ! ఏమీ తాగరా ?' అని ఆశ్చర్యపడిన ఆమె 'మరి యిప్పుడు యీ కాఫీ ఎవరికి కావాలి ?' అంటూ చేతిలోవున్న కాఫీ కప్పును వేలంవేస్తున్నట్లు మాట్లాడింది.

'ఇల్లా యియ్యి' అంటూ ఆ కాఫీ కప్పు తీసుకొన్న నా భర్త, నన్నుచూస్తూ తాగటం మొదలెట్టారు.

'అయ్యో రామా ! తీసుకొని తనకికదా యిస్తాడను కొన్నాను. గడగడా తాగేస్తున్నాడే !' అంటూ పరిహాసంగా మాట్లాడిన నిర్మలను చూసి నవ్వుతూ ఆయన వెళ్ళిపోయారు.

వాళ్ళ మాటల్లోను, నడతలోను కొత్తదనాన్ని చూసిన నేను ఆనందంతో పొంగిపోయాను. అందరితోపాటు భోజ నానికి కూర్చున్న నా బావగారు — 'మొట్ట మొదటిసారిగా నీళ్ళగది శుభ్రంగావుండటం నేను యివాళే చూశాను. నీళ్ళ పొయ్యిలోనుంచి పొగకూడా బయటికి రాలేదు. వేన్నీళ్లు సరిగ్గా కాగాయి. అంతా, కొత్త కోడలు వచ్చినట్లు నిదర్శ నంగా కనిపించింది' అని ఆయన అన్నప్పుడు నేను ఎంతో సంతోషించాను. 'ఇంత చిన్న విషయానికే యింత తృప్తి పడుతున్నారే, తొందరలోనే వీళ్ల మనస్సులు తేలిగ్గా చూరగొనచ్చు !' అనుకొన్నాను. వడ్డించటానికి వచ్చిన నన్ను నాన్న గర్వంగా చూశారు. నా తోడికోడలు ఛంచల, డాక్టరు దగ్గరకు వెళ్ళి అప్పుడే వచ్చింది.

కంచంలోనే చెయ్యి కడుక్కొంటున్న నా బావగారు 'పిల్లకి ఏం ఫర్వాలేదన్నారుకదా డాక్టరు ? సాధారణ జ్వర మేనా ?' అంటూ వేళాకోళంగా నవ్వాను భార్యను చూసి.

'అవును. మీకు వేళాకోళంగానే వుంటుంది. దీని వళ్ళు మంచిదికాదని నేను అప్పుడే చెప్పలేదా? దానికి తోడు పొద్దున్నే చంద్రం దానికి అరిశలుకూడా పెట్టాడు. ఇప్పుడు జ్వరం నూటనాలుగు డిగ్రీలుంది. న్యూమోనియా ఏమో అని అనుమానించి అక్కడే నర్సింగ్ హోమ్‌లో వుంచేయమన్నారు డాక్టరు. అది ఒక పేగోల. స్నానంచేసి, భోంచేసి వెళ్దామని వచ్చాను...అయినా మా యింట్లో నా మాటంటే ఎవళ్ళకీ లక్ష్యంలేకుండా వుంది. చంద్రం దానికి యిచ్చే చనువు రానురాను నెత్తి కెక్కుతోంది' అంటూ నా భర్తమీద అభియోగం చాటింది.

'బాగుంది! చాలా అందంగా వుంది! నేనా అరిశలు పెట్టాను? అంతా మీ ప్రియచెల్లెలు చేసినపని! కారువచ్చి ఆగిందో లేదో వచ్చిన మనుష్యులనుకూడా చూడకుండా తింటానికి ఏమున్నాయా అంటూ చూసింది. ఇంకా నయం! అంతా తినేసేలోపుగా నేను చూడనేనా చూశాను. పిల్ల లందరికి తనే పంచిపెట్టింది!' అని ఆయన ఆ అభియోగాన్ని నిర్మలమీదకు తోసేసారు.

'అందుకని యిప్పుడు నూటనాలుగు డిగ్రీల జ్వరం వచ్చింది కాబోలు! దానికి జ్వరంగా వుందన్న సంగతి నాకేం తెలుసు! తెల్లారకట్టే పట్టుసరికిణీ అదీ కట్టుకొని, మంచులో హడావుడిగా స్టేషన్‌కు వేరే వెళ్ళివచ్చింది. నాకేం తెలుసు? పిల్లలంతా తింటూంటే అదీ అడిగింది; పెట్టాను. ఒంట్లో బాగాలేదని తెలిసినపుడు బయటికి ఎందుకు పంపించాలి! నీ కసలు పిల్లలను పెంచటం తెలిస్తేకదూ?' అంటూ

కోపంగా ఆ అభియోగాన్ని తన అక్కగారిమీదకే తిప్పేసి, ఆమె లేచి వెళ్ళిపోయింది!

'ఏం? చంద్రానికి తెలియదా దానికి జ్వరమని? బాబయ్య దగ్గరికి పోతాను; బాబయ్య దగ్గరకి పోతాను అంటూ రాత్రి నా ప్రాణం తీసి, తన దగ్గరకి వెళ్ళి పడు కొంది. స్టేషన్‌కు తీసికెళ్ళద్దని చెబితే నా మాట ఎవరేనా విన్నారా? మీ రంతా తలోక విధంగా దాన్ని నెత్తి కెక్కించుకోండి – తర్వాత నాకు పిల్లల్ని పెంచటంకూడా చేతకాదని చెప్పిపొడవండి' అంది కోపంగా చంచల.

ఇటువంటి చిన్న చిన్న విషయాలకి వీళ్ళంతా ఒకళ్ళ మీద ఒకళ్ళు చిన్నపిల్లల్లా నేరం చాటుకోవటం నాకు చాలా ఆశ్చర్యమేసింది. ఏదో–చిన్నపిల్ల. కొంచెం జ్వరం వచ్చింది. దానికి యింత గందరగోళం చేస్తున్నారే! మా యింట్లో ఎవరికేనా జ్వరంవస్తే సాధారణంగా ఆ సంగతి నాన్నకు కూడా తెలియదు. రెండుపూట్లా రెండు మిరియాలమాత్రలు వేస్తుంది అమ్మ. అప్పటికీ తగ్గకపోతే లోకల్ ఫండ్ ఆస్పత్రిలో యిచ్చే రంగునీళ్ళు తెప్పించి యిస్తుంది. దాంతో జ్వరం, గిరం ఎగిరిపోతాయి. చూసేవాళ్ళు, చేసేవాళ్ళువుంటే యిల్లాగే వుంటుంది కాబోలు! అత్తయ్య యింట్లో శ్యామలకు వచ్చినదానికంటే, జరిగిన దానికంటే యిదేమీ పెద్దదికాదు కదా!

పదకొండు గంటలయేసరికి యిల్లంతా నిశ్శబ్దమయి పోయింది. పిల్లలు బడికి వెళ్ళిపోయారు. నిర్మల కాలేజీకి వెళ్ళిపోయింది. నా బావగారు, ఆయన్న, ఆఫీసులకి వెళ్ళి

పోయారు. నా తోడికోడలు నర్సింగ్ హోమ్‌కి వెళ్ళింది. ముసలమ్మ లిద్దరూ ఓ మూల కొంగు పరుచుకొని కన్ను మూశారు.

నేను మెల్లిగా వంటిల్లంతా సర్ది, తడితలను ఆరబోసు కొంటూ మేడమీదకు వచ్చాను. హాలులో ఒక బెంచిమీద నాన్న నిద్రపోతున్నారు. పైన ఎలక్ట్రిక్ పంకా తిరుగు తోంది. ఎంత అలసటగావున్నారో ఆయన పాపం!

రేడియో, అద్దాలు, పటాలు, బీరువాలు, సోఫాలు అన్నీ ఆ గదిని అందంగా అలంకరించి వున్నాయి. ఒకపక్క నుంచి యింటి వెనకాలనైపుకు దారివుంది. ఇంకో పక్క నుంచి యింకోగదిలోకి దారివుంది. దాన్ని అంటిపెట్టుకొని మూడుగదులున్నాయి. మొదటిగది తలుపుతీసేవుంది. ఎదు రుగా నిలువుటద్దం అమర్చిన బీర్వా, పుస్తకాల అల్మైరా, స్టాండుమీదవున్న చీరలు, అన్నీ ఆ గది నిర్మలదని తెలియ పర్చాయి. పక్కగది తాళంవేసివుంది. ఆ తర్వాతగదితలుపు తీసేవుంది. ఒక టేబుల్, మూడు కుర్చీలు, ఒక మంచం, ఒక కోట్‌స్టాండు, ఒక పెద్దబీర్వా, చిన్నపుస్తకాల అల్మైరా, అన్నీ అందులో వున్నాయి. కోట్ స్టాండుమీద వేలాడు తున్న పైజమా, లాల్చీ చూసి యిది 'ఆయన'గది కాబోలు అనుకొన్నాను. నా పెట్టెకూడా యిక్కడకు తెచ్చుకోవా లనుకొన్న నేను, కిటికీలోనుంచి పక్కయింటిని చూశాను. పక్కయింటికి చాలా దగ్గరలోనే ఆ కిటికీవుంది. ఆ మేడ పిట్టగోడమీద పువ్వుల మొక్కల కుండీలు అలంకారంగా అందంగా వున్నాయి. కాని జనసంచారమే లేనట్లు నిశ్శబ్దంగా

వుంది. ఏమయినప్పటికి పట్టణవాసమే బలే తమాషా అయినది. కొవ్వూరే అయినట్లయితే కొత్తకోడలు వచ్చిన రోజున ఎంతమంది వస్తారు? వెళ్తారు? అంటిపెట్టుకొన్నట్లు యిళ్ళు వున్నప్పటికీ యిక్కడ ఒకళ్ళజోలి మరొకళ్ళకు అక్కర్లేదు కాబోలు!

నేను యిల్లా అనుకొంటూ వుండగానే ఆ యింటి మేడమీదకు ఒక స్త్రీ వచ్చింది. ఆ యింటికి ఆమెయే యజమానురాలిలావుంది. నేను ఆమెను చూసినపుడు ఆమె కూడా నన్ను చూసింది. కాని మాట్లాడలేదు. అలక్ష్యంగా లోపలికి తిరిగి వెళ్ళిపోయింది. లోపల రేడియో తిప్పినట్లుంది హాయిగా పాట వినిపించింది.

'ఇక్కడకూడా రేడియోవుందే! అత్తయ్య యింట్లోలా సిగ్గుపడకుండా నేనుకూడా పెట్టచ్చునే! ఇది నాకు సర్వ స్వతంత్రాలు వున్న యిల్లుకదా?' అని అనుకొని రేడియో వున్న హాలులోకి వచ్చాను.

కిందనుంచి 'విమలా! విమలా!' అంటూ కేకవేసే నా అత్తగారి గొంతుక వినిపించింది. 'వస్తున్నానత్తయ్యా' అంటూ వెనకవైపునుంచి కిందకు దిగి వెళ్లాను.

'కొంచెం కుంపటి అంటించు నిర్మల వచ్చే వేళయింది. టైం ఒంటిగంట అవుతోంది' అంది నా అత్తగారు.

ఇప్పుడు మధ్యాహ్నం టిఫెన్‌కి వస్తుంది కాబోలు. ఆయన కూడా వస్తారేమో అని నాలో నేను అనుకొంటూ కుంపటి అంటించాను.

'చిన్న ఫిల్టర్‌లో కాఫీ వెయ్యి చాలు. వాళ్ళందరికి కాఫీ మళ్ళీ సాయంత్రం వెయ్యొచ్చు' అంది నా అత్తగారు.

'వారు సాయంకాలమే వస్తారా?' అన్నాను నేను మెల్లిగా.

'అవును. ఇంచుమించు ఆరయిపోతుంది వాళ్ళు వచ్చే టప్పటికి. ఈ యస్లప్లనేడ్ ఆఫీసులో వున్నంతకాలం, నిర్మలతో పాటు చంద్రంకూడా వచ్చేవాడు. అక్కడ మానేశాక యిప్పుడు రావటంలేదు' అంది.

'మానేసింతర్వాతనా? అంటే యిదివరకుచోట ఆయన పనిచేయటం లేదా? నాన్నకూడా యీ సంగతి నాతో చెప్ప లేదే?' అని ఆలోచనలోపడ్డాను. కాని అడగటానికి ధైర్యం రాలేదు. దానంతట అదే తెలుస్తుంది అనుకొన్నాను.

ఆ తర్వాత నాకు యింటి పనితోనే సరిపోయింది. లోపలవున్న నన్నుచూసి 'వెళ్ళొస్తానమ్మా విమలా!' అన్న నాన్న గొంతుక విని అదిరిపడ్డాను. 'వెళ్తున్నారా నాన్నా' అంటూ బయటకు వచ్చాను. అప్పుడే అక్కడికి వచ్చిన నా అత్తగారితో, 'పిల్లను మీచేతికి అప్పగించానమ్మా. ఇంతవరకు అది ఎవరింటికి వెళ్ళి వుండలేదుకూడా. ఏదైనా పొరపాటు చేసినా దయచేసి మనస్సులో పెట్టుకోకండి. అనుభవంలేని చిన్నపిల్ల. ఇకనుంచీ అది మీ అమ్మాయే అనుకోండి' అని నాన్న అన్నప్పుడు ఆయన గొంతుక కొంచెం బొంగురు పోయింది.

'బెంగ పెట్టుకోకండి. నేను చూసుకొంటాను' అని సాంప్రదాయంగా సమాధానమిచ్చి వీడ్కోలు యిచ్చింది నా అత్తగారు.

కూడానే బయట గుమ్మందాకా వచ్చిన నేను, 'ఆయన స్టేషన్‌కు వస్తున్నారా నాన్నా!' అని మెల్లిగా అడిగాను నాన్నని. ఎవళ్లూకూడా చూడటం లేదనిపించింది నాకు!

'అతనే కదమ్మా కారు డ్రైవ్ చేసుకొస్తున్నాడు' అన్నారు నాన్న. కారు తలుపు తీసుకొని లోపల కూర్చున్న నాన్నని చూస్తూ అల్లాగే నిలబడిపోయాను. మేడమెట్లు గబగబా దిగుతూ వచ్చిన నా భర్త గుమ్మంలో నిల్చున్న నన్ను చూశారు. విశాలమైన వరాండాలో ప్రకాశించే మెర్క్యురీట్యూబ్ నీలకాంతిలో, నాకు తెలియకుండానే నా కళ్ళనుంచి కారిన కన్నీటిబొట్లు ఆయనకి కనిపించాయి. నా ముఖాన్ని మెల్లిగా పైకెత్తి నా కళ్ళలోకే చూస్తూ 'నాన్నగారు వెళ్ళిపోతున్నారని ఏడుస్తున్నావా విమలా! సిగ్గు సిగ్గు!' అంటూ పరిహాసంగా నవ్వుతూ, కారులో వెళ్ళి కూర్చున్నారు. ఎవరో నన్ను ఎక్కడికో అలలమీద తీసుకెడుతున్నట్లు తోచింది. నా కళ్ళముందు నుంచి ఆ కారు వెళ్ళిపోయింది.

ఇంటి పనంతా పూర్తయింది. స్టేషన్‌కి వెళ్లిన ఆయన యింకా రాలేదు.

మా గదిలో కిటికీలోనుంచి ఆకాశంలోని ఆ చంద్రుణ్ణి చూస్తూంటే నాకు నిర్మల జ్ఞాపకం వచ్చింది. ఇంతకు కొంచెం

ముందు, చమత్కారంగాను, పరిహాసంగాను మాట్లాడుతూ మల్లెపువ్వులతో నా తలని అలంకరించి వెళ్లింది. ఎంత ప్రేమ, అభిమానమూ వున్న నిర్మలమైన మనస్సు కలిగివుంది ఈ నిర్మల! 'నిర్మల' అనే పేరు ఆమెకు ఎంత చక్కగా సరిపోయింది! చదువుకొంటోంది—అందంగా వుంది. ఐశ్వర్యముంది. కొంచెం కూడా గర్వం లేదే!

ఆమె యింట్లో వుందంటేనే నాకు ఏదో చెప్పలేని సంతోషంగా వుంది. ఒక్కరోజులోనే వశీకరమైన ఆమె ముఖమూ, కల్మషం, కపటం లేని హృదయంలోనుంచి వచ్చే ఆమె మాటలూ నన్ను సూదంటురాయిలా ఆకర్షించివేశాయి! ఆమె సాంగత్యభాగ్యం నాకు దొరికినందుకు నేను ఎంతో సంతోషించాను.

కిటికీలోనుంచి వెన్నెల నామీద పడుతోంది. ఆ ఆనందాన్ని అనుభవించటానికి లేచి లైటు ఆర్పేశాను. పక్కయింట్లో— మధ్యాహ్నం నేను చూసిన ఆ అమ్మాయి చేతిలో ఓ గ్లాసుతో ఆ గదిలో అడుగుపెట్టింది. గదిలో అటూ ఇటూ చూసింది. ఆమె వెనకాలే ఒకతను, శబ్దం చెయ్యకుండా అడుగులో అడుగు వేసుకొంటూ, వెనకనించి వచ్చి ఆమె కళ్ళు మూశాడు!

అంతే! నన్ను ముట్టుకొన్న చేతులు నా దృష్టిని మరల్చాయి! నామనసు "ఝల్లు" మంది!

'రేపు యీ కిటికీకి ఒక తెర వేసెయ్యాలి'అని నవ్వుతూ నన్ను చూశారు నా భర్త.

మూగదానిలా ఆ సమయంలో సంకోచపడ్డాను. మనస్సులో పొంగి పొరలిపోయిన ఆనందం నా గొంతుక పట్టేసింది !

'నోరు విప్పి మాట్లాడనంటున్నావే విమలా! ఈ వెన్నెలకాంతి నీమీద పడుతూంటే నువ్వెంత అందంగా వున్నావో తెలుసునా !' అని నా భుజంమీద చెయ్యివేశారు ఆయన.

ఆకాశంలోని మేఘాలకి చల్లగాలి తగిలి వాన కురుస్తుందే అల్లాగే, నా మనస్సులో పొంగిపోయే ఆవేశాలన్నింటికి ఆయన స్పర్శ తగలగానే నా కళ్లనుండి కన్నీరుగా పొరలిపోయింది !

'ఏడుస్తున్నావా ? ఏం విమలా !' అని అంతలోకే ఆయన బెదరిపోయారు.

'లేదు... ఏడవటం... లేదు' అని ఎల్లాగో మెల్లిగా అన్నాను.

'నేను ఎంత భయపడిపోయానో తెలుసునా ? ఇంకా మీ నాన్నగారు వెళ్ళిపోయారనే బెంగతోనే ఏడుస్తున్నావేమోనని బెదిరిపోయాను. విమలా ! నీ కళ్ళనుంచి కారే కన్నీటిని చూస్తే నా మనస్సు ఎవరో పిండివేస్తున్నట్లుంటుంది. పొద్దున్న నిర్మల చెప్పినట్లు, నీ విశాల నేత్రాలని తెరచి నవ్వుతూ చూస్తున్నప్పుడు నా మనస్సు స్వాధీనంలో వుండటం లేదు విమలా ! ఇవాళ ఆఫీసులో నేను ఏదైనా పనిచేస్తేనా ? అస్తమానూ అపరరతీదేవిలా నువ్వే నా కళ్ళముందు సాక్షాత్కరించావు !' అంటూ ఆయన, తన చేతులతో

నన్ను తనలోకి తీసుకోగా ఆయన ముఖం నాకు అతిదగ్గరగా వచ్చింది.

ఆ సమయంలో......!

అకస్మాత్తుగా గది బయటనుంచి 'చంద్రం, చంద్రం' అంటూ నా బావగారు కేక వేశారు. ఈ ప్రపంచాన్నే మరచి వున్న ఆయన అదిరిపోయి వెనక అడుగు వేశారు ! నేను బెదిరి పోయి తెల్లబోయాను ! నా మనస్సు చెదిరిపోయింది !

తలుపు తీసుకొని బయటకు వెళ్ళిన ఆయన 'ఏం అన్నయ్యా ?' అన్నమాటలు నేను ఎక్కడో నూతిలోనుంచి విన్నట్లు వినిపించాయి.

'అమ్మాయి పరిస్థితి ఏమి బాగుండలేదు చంద్రం. బాబయ్యకావాలి, బాబయ్యకావాలి అంటూ సాయంత్రం నుంచి ఒక్కటేగోల' ఇప్పుడుకూడా అదే స్మరణ. డాక్టరు కూడా యిప్పుడు నువ్వు రాకపోతే చాలా ప్రమాదమే వచ్చేటట్టుందని అంటున్నారు. కాని... యీ సంగతి చెప్పి నిన్ను...' అని ఆగిపోయాడు.

'అదేమిటన్నయ్యా అల్లా మాట్లాడుతున్నావ్ ! ఇంతోటిదానికోసం యింత బాధపడుతున్నావా ? ఇదిగో, నీకూడానే వస్తున్నాను పద !' అని ఆయన అన్నమాటలు కూడా ఎక్కడో కలలో విన్నట్లు వినిపించాయి.

వెంటనే మేడ మెట్లమీద చెక్ చెక్ మనే చెప్పుల శబ్దం కూడా వినిపించింది.

ఆకాశంలోనుంచి పెద్దరాతిబండను తీసుకొని ఎవరో నాపైపు వస్తున్నట్లు భ్రమఏర్పడింది. దాని మధ్య పాతసంగ

తులు, ఊరేగింపునాటి సంఘటనలు, బయల్దేరేముందు కొత్తచీర చిరిగిపోవటం — అన్నీ, టంగ్ టంగ్ మంటూ యినుపగుళ్ళలా నా మనస్సును గుద్దుకొన్నాయి !

కిటికీలోనుంచి వచ్చే ఆ వెన్నెల, నా తలలో అలంక రించబడిన ఆ మల్లెల సువాసన, చలనం లేకుండా మంచం మీాద వాలిపోయిన నన్ను చూసి గేలిచేశాయి !

# 8

ఒంటరిగా రాత్రి ఎంతసేపు కళ్లు తెరచుకొని వున్నానో! నిద్రాదేవికి నామీాద ఎప్పుడూ అపారమైన కరుణవుంది, ఆమె, నాకు తెలియకుండానే, నన్ను తన వశపర్చుకొంది.

'ఆయన ఎప్పుడు వస్తారో' అనే ఆలోచనతోనే స్తంభించిపోయిన నేను 'విమలా! విమలా!' అని మెల్లిగా పిలిచే పిలుపూ, నన్ను తట్టుతూ లేపిన స్పర్శా నా నిద్రను కలచివేశాయి. 'ఆయన వచ్చారు' అనే ఆనందంతో నేను కళ్ళు తెరచి చూశాను. ఎటువంటి ఆశాభంగం నాకోసం కాచుకొని వుంది! మల్లుపంచె తనూ తెల్లవారకట్ల తెల్ల చీకట్లో నా అత్తగారు నా కళ్ళముందు నిలబడింది!

'కొంచెం లేచివచ్చి నీళ్ళపొయ్యి అంటించు విమలా! అల్లాగే కాఫీ కుంపటికూడా అంటించు. పాలవాడు కూడా వచ్చేశాడు. నేను దగ్గరుండి పాలు పితికించాలి' అనే ఉదయ గీతం పాడి నన్ను లేపి నా అత్తగారు గబగబా వెళ్లిపోయింది.

ఒక లక్ష్యంతో ముందుకు సాగే మనస్సుకి, మధ్యలో వచ్చే సంకటాలు ఒకదాన్ని మించి ఒకటి బ్రహ్మాండంగా కనిపించి నప్పటికి, దానికన్నా యిది చిన్నది, దీనికన్నా అది చిన్నది అనే ధైర్యాన్ని పొందినట్లయితే ముందుకు సాగి పోవటం చాలా సులభమవుతుంది. నా జీవితంలో ఒక లక్ష్య మనేది చెప్పుకోవటానికి వున్నట్లు నాకు అంతవరకూ తోచనే లేదు. అటువంటి లక్ష్యాన్ని సృష్టించుకొని, అది సాధించు కొనేందుకు, ఆ వేళ పరిస్థితులలోకి నా మనస్సు ఎప్పుడూ వెళ్ళలేదు. 'ఆడపిల్లలు పెళ్ళయింతర్వాత అత్తవారింటికి బంధంలో అక్కడ సుఖంగాను, సంతోషంగాను, ప్రేమ బంధంలో పెనవేసుకుపోయి జీవితాన్ని గడుపుతారు. అల్లా లేనివాళ్ళు దురదృష్టవంతులు' అనే ఊహాలతోనే నేనుండే దానిని. కాని, రాత్రి ఆశాభంగం, తెల్లవారకల్లే అత్తగారు తెచ్చిన యింకో క్రొత్త ఆశాభంగం నాకు నా జీవితంలో అర్థంకాని లక్ష్యం ఏదో వుందని, దాన్ని సాధించటానికి, ఇది చిన్నది–దీనికన్నా రాబోయేది పెద్దది అని నాకు తగిలే ఎదురు దెబ్బల నుంచి ధైర్యంగా ముందుకు సాగాలని అనుకొనేటట్లు చేశాయి.

ఆయన స్పర్శ తగలని ఆ పక్క–పరుపుని చుట్టివేసి, వాడి కుమిలిపోయే మనస్సుతో బయటకు వచ్చాను. పక్క గదిలో నా బావగారు నిశ్చింతగా నిద్రపోతున్నారని తెలియ పర్చేటట్లు ఆయన గుఱక శబ్దం వినిపించింది. నిర్మల గదితలుపు తెరిచేవుంది. లోపల లైటు వెలుగుతూనే వుంది. ఆమె ఏదో పుస్తకంలో లీనమయింది. మధ్యహాలులో పిల్లలు నిద్రపోతు

న్నారు. గడియారంలో చూస్తే టైం అయిదు గంటలయింది. 'అప్పుడే కాఫీయా?' అనుకొంటూనే, కిందకువచ్చి, ముఖం కడుక్కొని, నీళ్ళపొయ్యి అంటించాను. కాఫీ నీళ్ళు కుంపటిమీద పడేశాను.

మొట్టమొదటి రోజు రైల్లో నిద్రపోలేదు. కాని కొత్త సంతోషాన్ని పొందబోయే ఆనందంలో కొంచెంకూడా అలసట తోచలేదు. శరీరంలోని అవయవాలన్నీ పనిచేయటానికి మిలమిలలాడే కొత్తశక్తిని పొందివున్నాయి - ఇవాళే వికసించటానికి ఆతృతగా సూర్యోదయాన్ని ఎదురుచూసే, వికసించబోయే మొగ్గమీద అకస్మాత్తుగా కారుమేఘాలన్నీ వర్షించినట్లయితే, తలవంచుకొని వంగిపోయి ముడిగిపోయినట్లు, నా హృదయంలోని తామరమొగ్గ వాడిపోయి వంగిపోయింది! శరీరంలోని చురుకుదనపు అణువులన్నీ నా నుంచి వేరుపడి నన్ను ఒంటరిగా వదలివేశాయి. చేస్తేపని నాకు ఉత్సాహాన్ని యివ్వటానికిబదులు నాకు భారంగా తోచింది. నా జీవితమంతా యిల్లా భారంగానే వుంటుందా?

ఛ! ఏమిటీ తెలివి తక్కువ ఆలోచన? కుటుంబం అంటే అందులో విధి, కర్తవ్యం, ప్రేమ, అభిమానం అన్నీ కలసివుంటాయి. ఒక అవసరంవచ్చినపుడు యింకొక అవసరాన్ని వదులుకొని వెళ్ళవలసివస్తుంది. ఇవన్నీ ఆలోచించి ధైర్యాన్ని వదలి తనని తానే పిరికిదానిగా చేసుకోవచ్చునా? కుములిపోవలసిన పరిస్థితికి యిప్పుడు ఏం జరిగింది? నిన్నటి పరిస్థితినుంచి నేను ఏ విధంగా కిందకు దిగిపోయాను?

కోపం వచ్చినప్పుడు ఒకటి, రెండు, మూడు...అంటూ పదంకెలు లెక్కపెడితే కోపంపోతుందంటారు. కొన్ని కొన్ని సమయాల్లో మనస్సుకు ఏర్పడే సంకటాలుకూడా అటువంటివే. ఆలోచించిచూస్తే పెద్ద ప్రమాదం ఏమీ జరగలేదనే తోస్తుంది.

నాలో నేనే సమాధానపడి, పాలగిన్నెను కుంపటి మీద పెడుతూంటే నిర్మలవచ్చింది. 'ఇదేమిటి అత్తయ్యా! అప్పుడే కొత్తకోడలికి వంటింటి పొయ్యి అప్పచెప్పేశారన్న మాట' అని మా అత్తగారిని అడుగుతూనే నా దగ్గరకువచ్చి కూచుంది.

'రాత్రి ఏమిటో మాలతికి బాగా జర్వంగా వుందని, బాబయ్యకోసం కలవరిస్తోందని, బావ చంద్రాన్ని పిలిచారే? ఇప్పుడు ఎల్లావుంది?' అని అడిగింది నిర్మల.

నాకు ఏమీ తెలియని కారణంగా నేను మౌనంగా తలవంచుకు కూర్చున్నాను.

'ఇంకా ఏమీ తెలియలేదే! చంచలా రాలేదు — వాడూ రాలేదు' అని నా అత్తగారు కలవరంగా జవాబిచ్చింది.

'అయితే రాత్రంతా చంద్రం అక్కడే వున్నాడా?' అని నా తల ఎత్తి నన్ను చూస్తూ అడిగింది నిర్మల.

మనస్సులోవుండే బాధ దానంతట అదే అణిగిపోతుంది. కాని, ఎవరేనా అనుతాపంగా మాట్లాడితే గుప్పుమని పొంగి పొరలిపోతుంది. నిర్మల అడిగిన ఆ అనుతాప ప్రశ్న నా మనస్సులో నుసిపడ్డ అగ్నికణాన్ని ఊదివేసింది! 'పాపం!' అంటూ నాకు మాత్రమే వినిపించేటట్లు ఆమె అన్న ఆ పరి

తాప మాట విని నాకు నిజంగానే ఏడుపు వచ్చేస్తోందనిపించింది. నేను ఒకపని పూర్తిచేసేలోగా నాజూగ్గా నాకు యింకో పని పురమాయించటంలో నాఅత్తగారు ఆమెకు ఆమే సాటి! ఒక్కరోజు అనుభవంలోనే నేను యీ విషయాన్ని అర్థం చేసుకోగల్గాను. నిర్మల చూస్తుందేమోనన్న సిగ్గుతో కుంపట్లో నుసి కళ్ళల్లో పడ్డట్లు భావనచేస్తూ కళ్ళుతుడుచుకొన్నాను. తర్వాత, నీళ్ళు కాగాయేమోనని చూడటానికి నీళ్ళగది వైపు వెళ్లాను. అక్కడ, పండుంపుల్లతో ముఖం కడుక్కుంటూన్న 'ఆయన' కనిపించారు! అప్పుడే వచ్చారు కాబోలు.

ఇంతకుముందేకదా ఏమేమో అనుకొని సమాధానపడ్డాను? ఆయన్ని చూడ్డంతో ఓ అదంతా ఏమైపోయిందో తెలియదు. 'వెళ్ళినవాళ్లు ఓ గంటో రెండు గంటలో వుండి రాకూడదా? పిల్లను కన్నతండ్రి యిక్కడ సుఖంగా నిద్రపోతున్నారు?' అని నాలో దాగివున్న కోపమంతా ఒక్కసారిగా పొంగిపోయింది. ఆయన్ను అసలు నేను చూడనట్లుగానే నేను నీళ్ళ గదిలోకి వెళ్లి పొయ్యి ఎగదోశాను. ఆయన నన్నే చూస్తున్నారని తెలుసుకొన్నాను. నా భుజాలమీద చేతులు వేసి, లేవదీసిన ఆయన్ని నేను అప్పుడుకూడా తల ఎత్తి చూడలేదు.

'కోపమా విమలా!' అంటూ నా తల ఎత్తి నా కళ్ళలోకి చూశారు. ఆ చూపులోను, ఆ మాటలలోను కనిపించిన అనురాగానికి నేను వశమైపోయాను! ఎవరేనా చూస్తారేమో

అనే సిగ్గుతోను భయంతోను 'లేదు' అన్నట్లు తలూపి ఆయన చేతుల పట్టునుంచి తప్పించుకొన్నాను.

సబ్బుపెట్టి, తువ్వాలుతో అప్పుడే అక్కడికి వచ్చిన నిర్మల, 'ఇదుగో చంద్రం వచ్చేశాడే! ఇప్పుడు మాలతికి ఎల్లావుంది?' అంది ఆయన్ని చూసి.

'న్యుమోనియా జ్వరమే. అంత తొందరగా తగ్గిపోతుందా? ఇప్పుడుకూడా నన్ను వదలలేదు. రాత్రంతా నేను ఎక్కడ వెళ్ళిపోతానో అని నా చెయ్యిపట్టుకొని వదలనే లేదు. నేను కొంచెం కదిలితే చాలు. ఏడుపు మొదలెట్టేది. ఏం చెయ్యను? కాఫీ తాగి పరిగెత్తుకు వస్తానని నచ్చచెప్పి యిప్పుడే వచ్చాను. నువ్వా వచ్చావు' అన్నారు ఆయన.

'ఇంకా నయం. దత్తుకూతురు చెప్పిందని అక్కడే వుండిపోయావు కాదు. నిన్ననే విమల యిక్కడికి వచ్చింది— నువ్వెళ్ళి నర్సింగ్ హోమ్‌లో పడుకొన్నావు! రాత్రిగుండె నీది చంద్రం!' అని ఎవరికీ భయపడనట్లు ఆయన్ని దెప్పిపొడిచింది నిర్మల.

మనస్సులో తోచిన దానిని, ఏమాత్రమూ అనుమానించకుండా, భయపడకుండా, నదురూ బెదురూ లేకుండా, బయటికి చెప్పగలిగే ఆమె స్వభావాన్ని నాలో ఎంతో మెచ్చుకొన్నాను.

ఆయన అందుకు సమాధానంగా నన్నుచూసి నవ్వారు.

అంతటితో ఆ సంభాషణ పూర్తయింది. నిన్నటి మాదిరిగానే, నా బావగారు, ఆయన, అంతా వెళ్లిపోయారు.

ఆయన ఎక్కడ పనిచేస్తున్నారు? ఎంత జీతం? ఇల్లు, కారు, వుందే? ఇదంతా మా బావగారిదా లేక యీాయనదా? అనే కుటుంబసంగతులు తెలుసుకోవాలనిపించింది. కాని ఎవరిని అడగను?

అత్తగారు ఏదో ఒకపని పురమాయిస్తూనే వుంది. చేస్తున్నానేగాని, చనువుగా యిటువంటివన్నీ అడగ గలిగే ధైర్యం నాకు రాలేదు. చంచల ఏదో ముభావంగా నాలు గైదు మాటలు తప్పితే, సహజంగా మాట్లాడటం లేదు. నర్సింగ్ హోమ్‌కి యింటికి తిరగటంతోనే సరిపోతోంది ఆమెకు. పైగా ఆమె నవ్వుముఖంతో నాకు కనిపించినా, మనసు విప్పి మాట్లాడటం కుదరదనే అర్థం లేని అనుమానం నాలో ఉద్భ వించింది. పోనీ నిర్మలనే అడిగి తెలుసుకొందామంటే ఎందుకో నాకు సిగ్గేసింది.

నేను ఆయన్ను పెళ్లిచేసుకొన్న భార్యను. ఆ యింటిలో కాలుపెట్టిన కోడలిని. నా భర్త ఏం ఉద్యోగం చేస్తున్నారు? కుటుంబం ఎల్లా జరుగుతోంది అనే విషయాలు నాకు తెలి యటం లేదనే నా తెలివితక్కువతనాన్ని నిర్మలకు తెలియ నివ్వవచ్చునా? ఆకాశంలో ఎగిరే ఉల్లాస పావురంలా స్వేచ్ఛగా తిరిగే ఆ నాగరీకరమణితో యిటువంటి సంగతులు తెలియపర్చినట్లయితే, నామీాదే కాకుండా, ఈ సంగతులు కూడా చెప్పకుండా వున్న నా భర్తమీాద కూడా ఆమెకున్న గౌరవ మర్యాదలు తగ్గినా తగ్గిపోవచ్చు. అందుచేత ఆ అభిప్రా యాన్ని వదిలిపెట్టేశాను.

ఆ రోజు మధ్యాహ్నం కాలేజీనుంచి రావటంతోనే 'నువ్వు యింతకు ముందు యీ ఊరు రాలేదుకదూ విమలా?' అని అడిగింది నిర్మల.

లేదని పెదిమి విరిచాను.

నా చెవులకు దగ్గరగావచ్చి 'మంచి సినిమా ఒకటి వుంది, పోదామా? నాకు మధ్యాహ్నం కాలేజి లేదు' అంది నిర్మల.

నాకు ఓ విధంగా సంతోషంగాను, ఓ విధంగా కష్టంగాను తోచింది. నేను అత్తవారింటికి వచ్చి యింకా రెండు రోజులుకూడా పూర్తికాలేదు. అప్పుడే నేనూ, నిర్మలా కలసి సినిమాకి వెళ్తున్నాం అంటే బాగుంటుందా? టిఫెన్ తయారు చెయ్యాలి, బియ్యం నానబోసివున్నాయి, పనిమనిషి వస్తుంది, గదులన్నీ తుడిపించాలి, ఇంతలోకే వాళ్లంతా వస్తారు. వాళ్ళ కాఫీ ఫలహారాలు చూడాలి. తర్వాత మళ్ళ వంటపని – యీ పనులన్నీ వదిలిపెట్టి నే నెల్లా అడగను? కాని, నిర్మల, యీ రెండురోజుల్లోనే నా మనస్సును సరిగా అర్థంచేసుకొని ప్రేమతో పిలుస్తున్నప్పుడు నేను రానని ఎల్లా చెప్పను?

నేను మౌనంగా వుండటం చూచి – 'ఏమిటి విమలా అంత దీర్ఘాలోచన? వెళ్తే ఆయనతోటి వెళ్లాలిగాని దీనితోటి వెళ్లటమా అని ఆలోచిస్తున్నావా దొంగా?' అంటూ నా బుగ్గమీద చిటిక వేసింది నిర్మల.

'లేదు లేదు. అత్తగారితో మీరు చెప్తారా! ఇంట్లో పని చాలావుంది, మరి!' అంటూ సణిగాను.

'నాన్‌సెన్స్ ! యింతేనా ? యింతోటిదానికి యింత ఆలోచనా ? నువ్వు తలదువ్వుకొని డ్రస్ చేసుకొని రెడీగా వుండు. మిగతా సంగతంతా నేను చూస్తాలే !' అంటూ నా భుజంతట్టి నన్ను ఉత్సాహపరిచింది నిర్మల.

ఇంట్లో అణిగివుండవలసిన కోడలు అనే సంగతి మర్చిపోయి, సంతోషంతో గబగబా మేడమీదకు వచ్చేశాను. కొన్ని క్షణాల్లోనే ఆమె కూడా మేడమీదకు వచ్చింది, అలంకరించుకోవటానికి.

ఇద్దరం తమాషాగా కబుర్లు చెప్పుకుంటూ, మేడదిగి గుమ్మంలోకి వచ్చేసరికి అక్కడ నా అత్తగారు ఏవో కూరలు కొంటోంది. మమ్మల్ని తేరిపారచూసిన ఆవిడతో 'అత్తయ్యా! నేను కోలాఘాట్‌లోని మా స్నేహితురాలింటి కెళ్తున్నాను. నాకు తోడుగా వుంటుందని విమలనుకూడా తీసికెళ్తున్నాను' అని చెప్పేసి, జవాబు ఆమెకు అనవసరమన్నట్లు, నాచేయి పట్టుకొని బరబరా లాక్కుపోయింది నిర్మల !

'మీరు యిప్పుడే చెప్తున్నారా ? ఏమైనా అనుకొంటారేమో ?' అన్నాను నేను కొంచెం జంకుతూ.

'అనుకొనే దేమిటి ? వాళ్ళంతట వాళ్ళే పంపాలని నువ్వు భయపడితే, భయపడుతూ కూర్చోవలసిందే! నిన్నంటే నిన్ననే వచ్చావు — అప్పుడే వంటింట్లోకి దూర్చేశారే ! ఇన్నాళ్ళనుంచి ఎల్లా వున్నారేమిటి ?' అంది కోపంగా నిర్మల.

'అందులో తప్పేముంది ? ఏమీ పనిచెయ్యకపోతే నాకుమాత్రం పొద్దెలాపోతుంది ? అరిగిన చందనపు కర్రే సువాసన యిస్తుందని మా నాన్నగారనేవారు. బద్ధకంగా

జీవితాన్ని గడిపితే అందులో సుఖమేముంది ?' అన్నాను నేను జవాబుగా.

'అదంతా సరేలే ! కొత్త కోడలు, కొత్త యిల్లు, కొత్తగా కాపరానికి వచ్చింది. నాలుగు రోజులపాటు అభిమానంగా చూసుకోవాలని యిక్కడ ఎవళ్ళకయినా తడుతోందా ? అమ్మ, అత్తయ్య వంటింటి పనిచేయటానికి ఓ మనిషి వచ్చిందని అనుకోవటం అల్లా వుండనీ ! అక్కయ్య ఏదో ఆడుతూ పాడుతూ తిరిగే పిల్లకి జ్వరం వచ్చిందనుకోకుండా, కొంప మునిగిపోయినట్లు పెద్ద ప్రమాదంగా భావించుకొంటూ, అక్కర్లేని చుట్టాలెవరో యింటికొచ్చినట్లు, యింటికీ, నర్సింగ్ హోమ్‌కీ యిదే సమయమనుకొని పరిగెత్తటం నాకు నచ్చలేదు. ఏదో జ్వరంవచ్చింది. నాల్గైదురోజులలో అదే తగ్గిపోతుంది. దానికి యింత ఆర్భాటమా ? నిన్న రాత్రి ఫోంచేస్తూ 'కోడలివంటేకదూ' అని బావ అన్నప్పుడు నాకు ఒళ్ళు మండిపోయింది. రాత్రి మాలతి కొంచెం నిద్ర పోగానే 'నువ్వెళ్ళు చంద్రం, నేను చూసుకొంటానులే' అని చంద్రాన్ని యింటికి పంపెయ్యాలని అక్కయ్యకు ఎందుకు తోచలేదు ? తనుకూడా ఒక ఆడదే అనే సంగతి మర్చిపోయినట్టుంది. మర్యాద యిచ్చికదా మర్యాద పుచ్చుకోవాలి ! ఇదంతా చూస్తూంటే, నేను సహించలేకపోతున్నాను. చూస్తాను ! చూస్తాను ! ఎప్పుడో నేనే నాలుగూ ఝాడించేస్తాను' అని చెప్పుకొనేపోతోంది నిర్మల.

నేను భ్రమించిపోయాను ! నేనుకూడా యింత లోతుగా ఆలోచించలేదే ! సొంతమయిన నాకే యిల్లాగ

తప్పులుగా కనిపించనప్పుడు, చదువులోను, కాలేజీలోను కాలం గడిపే కాలేజి విద్యార్థిని అయిన ఆమె, యింట్లోను, కుటుంబంలోను యింకా సంబంధం పెట్టుకోని ఆమె ఎంత సూక్ష్మంగా గ్రహించింది! దాంపత్య జీవితంలో యింకా అడుగుపెట్టని ఆమె కొత్త భార్య యొక్క ఆవేదన ఎల్లా అర్థం చేసుకోగలిగింది? జీవితానికి తగిన వయస్సు వచ్చేటప్పటికి దానంతట అదే తెలుస్తుంది కాబోలు! నిర్మల వయస్సులో నాకన్నా పెద్దదికదా? 'ఒక్కొక్కరి గుణం ఒకోవిధంగా వుంటుంది. దేనినికూడా తీవ్రంగా ఆలోచించకుండా అంతా మన మంచికే అనుకోవాలి' అన్న నాన్న ఉపదేశం జ్ఞాపకం వచ్చింది. ఇల్లా జరుగుతుందని ముందే తెలుసుకొని చెప్పినట్లు కదా జరుగుతోంది!

నిర్మల అభిప్రాయాన్ని మాటకట్టేసి నేను జవాబిచ్చాను. 'ఇటువంటి విషయాలన్నీ చూసీ చూడనట్లు వదిలి వేయాలి. అనవసరంగా ఆలోచించి ఆలోచించి మనస్సు పాడుచేసుకోంటే ప్రయోజన మేముంది?'

ఆశ్చర్యంతో భ్రమించినట్లు ఒకసారి నాకళ్ళలోకి సూటిగా చూసి 'చంద్రం చాలా అదృష్టవంతుడు!' అంది నిర్మల.

బజారు రోడ్డుమీదకు వచ్చాం. 'ఇక్కడే నిల్చుందాం. బస్సు యిక్కడకే వస్తుంది' అంది నిర్మల. మధ్యాహ్నసమయం అవటంవల్ల బట్టల కొట్లలోకి, సామాన్ల కొట్లలోకి వచ్చే వాళ్ళు వెళ్ళేవాళ్ళు ఆడవాళ్లే ఎక్కువగా కనిపించారు. నేను ఆ కొట్లనే ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిన సమయంలో అవతలనైపు బస్సువచ్చి ఆగింది. దిగేవాళ్లంతా దిగుతున్నారు.

'హల్లో !' అంటూ కేకవేసిన ఒక పరిచయమైన గొంతుక వినిపించింది. ఎదురెండ అవటంవల్ల చెయ్యి అడ్డం పెట్టుకొని. ఆ బస్సునుంచి దిగినవాళ్ళలో ఒకడైన రాధా కృష్ణ మా వైపు వస్తున్నాడు. రోడ్డుకి అడ్డంగా నడుస్తూ మా దగ్గరగా వచ్చిన రాధాకృష్ణ 'నేను చూసేది నిజమేనా ? నా కళ్లు భ్రమించటం లేదుకదా ?' అంటూ నవ్వాడు.

'కళ్ళు తుడుచుకొని బాగా చూడండి. అసలు యీ ప్రపంచంలోనే వున్నామా అనే సందేహంకూడా వచ్చినట్లయితే గిల్లుకొని మరీ చూడండి' అంటూ గేలిచేస్తూ నవ్వుతూ జవాబిచ్చింది నిర్మల.

'మిసెస్ చంద్రశేఖరానికి పక్కనే మిస్టర్ చంద్ర శేఖరంకదా వుండాలనే ఆశ్చర్యం ఒక పక్కకలగగా, నా కళ్ళకే కనిపించకుండా, ఎక్కడో ఓ మూలం యీ మహా పట్టణంలో దాక్కున్న నిర్మలాదేవిగారు, యివాళ, వెతక బోయిన తీగ కాలికే చుట్టుకొన్నదన్నట్లు నా కళ్ళపడేటప్పటికి యింకో విధంగా నాకళ్ళమీద నాకే అవనమ్మకం ఏర్పడింది' అన్నాడు రాధాకృష్ణ పరిహాసంగా.

'ఎక్కడిదాకా...యీ ప్రయాణం...?' అంది నిర్మల.

'బిసెంట్ రోడ్డులో ఓ స్నేహితుడింటికి వెళ్ళాను. ఇంతదూరం ఎల్లాగా వచ్చాంకదా అని, మిసెస్ చంద్రశేఖ రాన్ని ఓసారి చూసిపోదామని వస్తున్నాను. తను నాకు యింతకు ముందే తెలుసు !'

'అరె ! అదా సంగతి ! నువ్వు నాతో చెప్పనేలేదే విమలా ? నీకు బంధువా ?' అని నిర్మల నన్ను చూసి నవ్వుతూ నా భుజంమీద చెయ్యివేస్తూ అడిగింది.

అతన్ని చూసిన వెంటనే ఆ చీరలు అత్తయ్యకు యిచ్చాడా ! అత్తయ్య ఏమందో ? అతనేమనుకొన్నాడో ? అనే ఆలోచనలతో సతమతమయిపోయాను. ఇప్పుడా సంగతులన్నీ నిర్మలముందు మాట్లాడేస్తాడేమో అనే భయం కూడా నాలో కలిగింది.

మా పరిచయాన్ని గురించి అతను చెప్పినది విన్న నిర్మల 'అయితే విమలను చూడటంకోసమే మా యింటికి వస్తున్నారన్నమాట' అంది భారంగా.

'అవును ఆమెతో ఒక విషయం మాట్లాడాలి' అని రాధాకృష్ణ నన్ను చూశాడు.

నా గుండె ధక్ ధక్ మని కొట్టుకొంది. 'ఆ' విషయం సమయం సందర్భం చూడకుండా అడిగేసేటట్టున్నాడే ? అతని చేతికిచ్చి ఆ చీరలు పంపటం ఎంత తెలివితక్కువపని ?

'మేము సినిమా చూడటానికి వెళ్తున్నాం. అభ్యంతరం లేకపోతే మాతోటిరావచ్చు. ఒక విషయం కాదు. వందవిషయాలు మాట్లాడటానికి అవకాశముంటుంది' అని నిర్మల అతనిని కూడా ఆహ్వానించింది. అతను తప్పించుకు వెళ్ళిపోతే బాగుండు ననిపించింది. కాని —

'ఓ ! దానికేం ? మీకు అభ్యంతరం లేనప్పుడు నాకెందుకుంటుంది ? కాని ఆ విషయాన్ని యిప్పుడు అడగదల్చుకోలేదు. ఆమెతో ఒంటరిగానే మాట్లాడాలి' అని అతను నన్ను చూసి నవ్వినపుడు నిర్మల ముఖంలో 'క్వొశ్చెన్ మార్క్' కనిపించింది.

'అల్లా అయితే నాకు తెలియకుండా ఆమెతో

మాట్లాడాలనుకోనటం నావల్ల చెడిపోయిందను కొంటాను' అన్న నిర్మల గొంతుకలోనుంచి వచ్చిన వేదన నా ఉత్సాహాన్ని మింగివేసింది.

నాకు ధర్మ సంకటంగాను, కష్టంగాను తోచింది అతని ధోరణి.

'అల్లా పూర్తిగా అనటానికీ వీల్లేదు. నిర్మలాదేవిగారు కనిపించినట్లయితే వారితో కూడా ఒక విషయం మాట్లాడాలనే ఆశ కూడా వుంది' అన్న అతని మాటలు విని 'బ్రతికించాడు' అనుకొన్నాను. ఉత్సాహంగా 'ఓహో!' అన్నాను నేను నిర్మలను చూసి.

'కాని అదికూడా సొంత విషయం. ఇప్పుడు మాట్లాడ టానికి కుదరదు' అన్నాడు రాధాకృష్ణ.

నిర్మల ముఖం ఎర్రబడింది! రాధాకృష్ణతో నిర్మల మాట్లాడిన దానిని బట్టి, నాకు తెలియనిది ఏదో ఆమె మనస్సులో వుందని తోచింది. ఆరంభంనుంచి ఆమెను పరిశీలనగా చూస్తున్న నేను, నా భర్తతో ముందూ వెనుకా చూడకుండా వేళాకోళంచేసే స్వభావపద్ధతిలో యిప్పుడు యితనితో మాట్లాడటం లేదనుకొన్నాను. ఇంతలోకే మేము వెళ్ళవలసిన బస్సు వచ్చేసింది.

ముగ్గురం బస్సులో కూర్చొన్నాక 'మీరు అనుకొన్నది సరికాదు. మా యింట్లో మా యిద్దరిని ఒంటరొంటరిగా పలక రించటమనేది సాధ్యంకాదు. అదల్లా వుండనీయండి పోనీ, మీరు ఒంటరొంటరిగా మాట్లాడిన విషయాలు, మీరు అల్లా వెళ్ళగానే మేము ఒకళ్ళతో ఒకళ్లం చెప్పుకొంటాం! అప్పుడు?' అంది నిర్మల.

'అది మీ సొంత విషయం. దానికి నేను చెప్పేదే ముంది ? తమకు సాధ్యం కాదంటున్నానుకదూ ? నేను చెప్పి నట్లుగా మీ యింట్లోనే మిమ్మల్నిద్దరిని విడివిడిగా కలుసు కొని అడగదల్చుకొన్నవి అడుగుతానో లేదో చూస్తూండండి. తినబోతూ రుచి అడగటం ఎందుకు ?' అంటూ ఛాలెంజి చేస్తూన్నట్లు మాట్లాడాడు రాధాకృష్ణ.

నాకు తెలియకుండా అతనికి నిర్మలతో 'సొంతవిషయం' ఏమయి వుంటుందో నేను ఊహించేందుకు చాలా కారణాలు కన్పించాయి. ఆమెతో మాట్లాడుతూంటే అతని గొంతుకలో అంత సంతోషం తాండవమాడుతుందెందుచేత ? నాతో 'ఒంటరిగా ఒక విషయం మాట్లాడాలి' అని అత నన్నప్పుడు, నిర్మల మనస్సు వాడిపోయినట్లు ఆమె ముఖంలో ప్రతిఫలించిం దెందుచేత ? నేను నవ్వినపుడు 'అదికూడా సొంత విష యమే' అని అత నన్నప్పుడు, ఆమె ముఖం కుంకంలా కందిం దెందుచేత ? నేను అనుకొన్నట్లు, నిర్మల మనస్సులో బరువైన దేదో వుందనుకొనేందుకు నాకు చాలా సందర్భాలు కనిపిం చాయి. రెండూ రెండూ కలిపితే నాలుగవుతుందనే దానికి లెఖ్ఖకూడా వెయ్యాలా ?

మేము సినిమా చూసి బయటకు వచ్చేటప్పటికి ఇంకా చాలా పొద్దుంది. రాధాకృష్ణకి 'విడిపోతున్నామే' అని అనిపిం చింది కాబోలు.

'ఇంకా చాలా పొద్దుంది. అల్లా బొటానికల్ గార్డెన్సు వైపు వెళ్ళి కొంచెంసేపు కూర్చుంటే కాలక్షేపణ జరుగు తుందేమో !' అన్నాడు అర్థోక్తిగా.

నాకు లోపల చాలా సిగ్గుగావుంది. నిర్మల ఎక్కడ సరేననంటుందోనని, నేను 'యివాళ కాదు' అన్నాను.

'ఈవిడగారుండే, ముందు నేను పిల్చినప్పుడే ఆయన లేకుండా రావటమా అన్నట్లు చూసింది. ఈపాటికి ఆయన గారు యింటికి వచ్చేసుంటారు. ఖంగా రెక్కలైపోతోంది' అని నా చెయ్యిపట్టుకొని నిల్చున్న నిర్మల, నా చెయ్యి గట్టిగా నొక్కింది.

'ఓ! ఐ యామ్ వెరీ సారీ! నేను మర్చిపోయాను. నిజంకూడా అంతే. చెప్పటానికి వీల్లేకుండా ముందడుగు వెయ్యటానికి వీల్లేకుండా బాధపడుతూవుంటుంది. సరే, ఐతే నేను రేపు మీ యింటికి వస్తాను. శలవు' అని రాధాకృష్ణ వెళ్ళిపోయాడు వేరొకదిశగా.

మేము యింటికి తిరిగివచ్చేటప్పుడు నిర్మల నాతో ఏమీ మాట్లాడలేదు. లోతు తెలియనిదానికోసం, ఏదో చాలా తీవ్రంగా ఆలోచిస్తోందని, ఆమె మనస్సు గాలిలో ఎగిరే గాలిపటంలా ఆకాశంలో సంచరిస్తోందని, ఆమె మౌనమూ, నే నడిగిన ప్రశ్నలకు అర్థంలేని ఆమె సమాధానాలూ, నాకు తెలియజేశాయి.

ఇంట్లో మేము అడుగుపెట్టేసరికి పూర్ణ చంద్రుణ్ణి మింగివేయటానికి వచ్చే రాహువులా, నా తోడికోడలు చంచల నిర్మలను చూసి 'ఏమే నిర్మలా! దాన్నికూడా తీసుకుపోయి ఊరంతా తిరిగిరావటానికి నీకు యిదేనా సమయం? నేనూ యింట్లో లేను. అత్తయ్య ఒక్కత్తీ ఇంట్లో పనంతా చేసుకోలేక శ్రమపడుతోంది! పిల్లా పెద్దా అంతా

ఖాళీకి వచ్చేవేళ. సుశీల వేరే, దాన్ని చూసిపోదామని వచ్చింది. ఇల్లంతా ఒకటే గందరగోళం! ఇంకో నాలుగు రోజులు పోయాక వెళ్ళకూడదూ? ఇంట్లో స మ య ం సందర్భం చూడఖ్ఖర్లా?' అంటూ గర్జించింది.

ఈ ఎదురుదెబ్బ నిర్మలకి మాత్రమేకాదు. 'మూడు వంతుల ముప్పాతిక మూడు వీసాలు నాకు' అని అనిపించింది. తల వంచుకొని నిలబడిపోయాను.

'సమయం ఏమిటి? సందర్భం ఏమిటి? ఈ యిల్లు గందరగోళం లేనిదెప్పుడు? అత్తయ్య ఒక్కత్తీ శ్రమపడటం, యివాళ తోడికోడలు వచ్చాకే నీ కళ్ళకి కనిపించింది కాబోలు! అయ్యో పాపం!' అంటూ హేళన, గేలిచేస్తూ [illegible]కెవ్వరూ లెక్కలేదన్నట్లు, నిర్లక్ష్యంగా మేడ మెట్లెక్కింది నిర్మల.

నేను యింటికి వచ్చేసరికి వంటింట్లో పనులన్నీ, సులభంగా నన్ను తమ వశం చేసుకొన్నాయి.

పూర్ణగర్భిణిగావున్న నా తోడికోడలు చంచలని డాక్టరు, రాత్రిళ్లు నిద్రమేల్కోకూడదని చెప్పటంవల్ల బాధ్యత అంతా 'ఆయన' నెత్తిమీద పెట్టేసి ఆమె యింట్లోనే వుండి పోయింది. 'అసలే నువ్వు బలహీనంగా వున్నావు. రాత్రి, పగలు అనుకోకుండా నువ్విల్లా పరిగెడితే నీ వంటికి మంచిది కాదు. పిల్లకి జ్వరం తగ్గేదాకా చంద్రం చూసుకొంటాడులే! నువ్వు దిగులు పడకు' అని మా అత్తగారు కోడలికి ఉపదేశం కూడా చేసింది.

పిల్ల దగ్గర వుండటానికి తల్లికి బదులు యీ యింట్లో ఆడవాళ్ళంతా అస్తమించిపోయారా? ఆయన నర్సుపని చెయ్యాలా? ఇంట్లో అభిమానంకొద్దీ అంటిపెట్టుకొనివుండే పిల్లయితే అయివుండవచ్చును. అందుకని ఆయనే తొట్లో పెట్టి లాలిపాట పాడుతూ ఐక్యమయిపోవాలా? నిన్న నాలో అణిగి పోయిన క్రోధ ఆవేశం బయటకు తొంగి చూసింది.

పూర్తిగా రెండురోజులు కాకముందే, పాముకి విషం వుండకుండా వుండదన్నట్లు, తన గుణాన్ని చూపిస్తూ, 'దాన్ని కూడా తీసికెళ్ళటానికి నీకేనా సమయం?' అంటూ నిర్మలనే కేకలేస్తూన్నట్లు నన్ను ఏమీ అననట్లు, తేలుకుట్టినట్లు గంతులేసిందే? కుట్టింది ఆమెనే అయినప్పటికి బాధ నాకే ఎక్కింది! ఎందుకే దాన్ని తీసికెళ్ళావంటే దానికూడా నువ్వెందు కెళ్ళావే అనే కదా అర్థం?

నన్ను చూడటానికి రాబర్ట్సన్ పేటలో వేరే కాపురముంటున్న మా చిన్న తోడికోడలు సుశీల, ఆమె భర్తా వచ్చారుట. నాకోసం చూసి చూసి యింకోరోజు వస్తామని వెళ్ళిపోయారట. ఎత్తిపొడిచి చూపించేటట్లు, చంచల, నేను వింటూండగా యీ సంగతి నా భర్తతో మూడుసార్లు చెప్పింది. నేను నిర్మలతో వెళ్ళినసంగతి ఆయన యింటికి వచ్చిన వెంటనే చెప్పకుండావుంటుందా?

రాత్రి వంటిల్లు కడుగుతుండగా నర్సింగ్ హోమ్‌కి వెళ్తూ ఫ్లాస్కు కడగటంకోసం నీళ్ళగదివైపు వచ్చారాయన.

'నిర్మలతో ఎక్కడెక్కడికి వెళ్ళావు?' అన్నారు.

'ఒక సినిమాకి వెళ్ళాం. అంతే' అన్నాను నేను మెల్లిగా.

'ఫర్వాలేదే! ఏ సినిమాకి వెళ్ళారు? రెండురోజుల్లోనే మువ్వా, నిర్మలా యింతగా అంటుకుపోయారే!' అంటూ మనస్సులో ఏమీ కోపం లేనట్టుగా, మా స్నేహాన్ని ఉత్సాహపరుస్తున్నట్లుగా మాట్లాడారు.

ఆయన లేకుండా, ఆయనకు తెలియకుండా, నేను బయటకు వెళ్ళినందుకు నన్ను కోప్పడాలని చంచల ఉద్దేశ్యం కాబోలు! కోపచ్ఛాయలే కనిపించ లేదు, ఆయనలో! వదినగారిమీద ఆయన అపార అభిమానం చూపిస్తే చూపించనచ్చు. కాని నిర్మల చెప్పినట్లు, మర్యాద యిచ్చికదా మర్యాద పుచ్చుకోవాలని ఆమెకు ఎందుకు తెలియదు? ఆయన అభిమానాన్నంతా తోసివేసి, ఆయనకు కోపంవచ్చేటట్లు సంచరించి, చివరికి నన్నే తప్పుపట్టుకోటం చేసారేమో? ఊరేగింపునాడు ఆమెను ఎంత గొప్పగా ఆలోచించి గర్వపడ్డాను! ఆ నాటి నా తెలివి తక్కువతనాన్ని తల్చుకొంటే నాకు నవ్వొస్తోంది. మనస్సులో ఏది మంచిదని తోస్తుందో, దానికి తగినట్లు పరిస్థితులు కూడా కలిసినట్లయితే దానికి గొప్పతనం వస్తుంది. తియ్యని పిండివంటకు ఏలం వేసేటట్లుంటుంది. అప్పటి ఆమె చిన్న కుంకుమ బొట్టూ, విశాల నేత్రాలు చిరునవ్వు చిందే పెదిమలు, గంభీరమైన ముఖభావమూ, వీటన్నింటిని చూసి ఆమెను ప్రేమదైవంగా భావించటం యింకా నాకు జ్ఞాపకమేవుంది!

ఒకసారి చిన్నప్పుడు నాకు మలేరియాజ్వరం వచ్చింది. అప్పుడు నాన్న, డాక్టరు దగ్గరనుంచి రెండు మాత్రలు తెచ్చియిచ్చారు. తెల్లగా గుండ్రంగా చూట్టానికి పిప్పరమెంట్లలా [illegible] ఆ మాత్రల్ని గారాబం ఏమీ చెయ్యకుండా గబుక్కున

నోట్లో వేసుకొన్నాను. నాలికకు తగలటంతోనే అసలు పిప్పర మెంట్లలాగనే తియ్యగా వున్నాయి. ఆ ఉత్సాహంతో చప్ప రిస్తూ, కటిక్కున కొరికాను. అంతే! నోరంతా చేదు విష మయం! గొంతుకంతా ఎక్కిపోయింది. భరించ లేకపోయాను.

చంచల నన్ను చూసి నవ్వేనవ్వు యిటువంటిదే కాబోలు! నిజమైన ప్రేమ. అభిమానం చేష్టలలో కదా కని పించాలి? మనస్సులో చేదునుంచుకొని, బయటకు చూపించే తియ్యదనం నిజమైంది కాదని తెలుసుకొనేందుకు ఎంతసేపు పడుతుంది?

ఒకే కొమ్మకు కాసిన నిర్మలకు, చంచలకు ఎంత వ్యత్యాసం! ఒక రాత్రి రెండురోజుల్లోనే నాకు తన మీద ద్వేషం కలిగేటట్లు నడచుకోటం దెందుచేత? మరొకరాత్రి అదే రెండు రోజుల్లోనే నామనస్సునంతా అయస్కాంతంలా ఆకర్షించి వేసిం దెందుచేత? వజ్రమూ, బొగ్గూ ఒకే మూలస్థానం నుంచి వస్తున్నాయి; బురదలోనుంచి పద్మమూ వస్తోంది, పాకుడూ వస్తోంది. ఇది ఒక సృష్టిరహస్యం కాబోలు!

రాధాకృష్ణ కూడా వస్తానన్నాడు. అతను వచ్చి ఇంకేం భూకంపం లేవగొట్టాడో? ఒక్క విషయం, ఒక్క విషయం అంటూ ఆ చీకలసంగతి అల్లా మాట్లాడాడే? ఇంక, యిక్కడ ఒంటరిగా కలుసుకొని ఏం మాట్లాడతాడో? వీళ్ళెవరేనా చూస్తే ఏం జరుగుతుందో? అనే కలవరంకూడా నా మన స్సులో రేగింది.

నర్సింగ్ హోమ్, మాలతి— ఆయన్ని పట్టుకొని అంటుకు పోయాయి! ఆయన రాత్రి మళ్లీ యింటికి రాలేదు!

# 9

మధ్యాహ్నం టిఫెన్‌కోసం గోధుమరవ్వ బాగుచేస్తూ కూర్చున్న నా దగ్గరకు వచ్చి 'రాధాకృష్ణ వచ్చారు' అనే వార్త తెచ్చి నా చెవుల్లో పడేసింది నిర్మల. ఆ మాట విని నిద్రనుంచి ఉలిక్కిపడ్డట్టు చూశాను నిర్మలను. 'ఎక్కడ? కిందే వున్నారా? మేడమీదా?' అన్నాను.

'కిందే వున్నారు. ఆయన రావటం చూసి నీతో చెప్పాను. నువ్వెళ్లు. నే నీపని చూస్తాలే' అంటూ కూర్చుంది నిర్మల.

అతని చేతులో ఆ పొట్లాన్ని చూసేటప్పటికి నాగుండె ఆగిపోయినంత పనయింది. అత్తయ్య మళ్ళీ ఆ చీరలు యితనితో పంపించేసింది కాబోలు! బాగానేవుంది—ఇతనితో ఆ చీరలు వెళ్ళటం, రావటం!

'ఈ చీరలు నీకోసమే కొందిట మీఅత్తయ్య. నన్నే తీసికెళ్ళి యిచ్చేయమని చెప్పింది' అన్నాడు రాధాకృష్ణ.

నా తెలివితక్కువతనాన్ని, అత్తయ్య అవమర్యాదని, అతను తెలుసుకొని వుంటాడా? లేక అత్తయ్య విషయాన్ని అర్థంచేసుకొని నాజూగ్గా తిప్పి పంపించేసిందా? అనే సందేహంతో, వణికే చేతులతో ఆ చీరల పొట్లాన్ని తీసుకొన్నాను.

వెనకాలే వచ్చి నిల్చున్న నా అత్తగారు 'ఏమిటా పొట్లం? ఎవరీ అబ్బాయి?' అంది. ఆమె గొంతుకలో కర్ర లోని పెళుసు, ఇనుములోని కఠినము ధ్వనించాయి.

'అత్తయ్య నాకు రెండు చీరలు పంపించింది. మావయ్యకు చెల్లెలుకొడుకు యితను' అన్నాను క్లుప్తంగా.

వెంటనే ఆవిడముఖం పద్మంలా వికసించింది. అతనిని

గోత్రందగ్గరనుంచి గోచారందాకా విచారించేసింది! అతనిని గురించి నా అత్తగారు అడిగే ప్రశ్నలకు ఒకపక్క సమాధానం చెబుతూ, మరోపక్క అతని కళ్ళు, చుట్టూ చూస్తూ ఎవరికోసమో వెతకటం నేను గమనించాను. అతనిని అల్లాగే నిల్చోబెట్టి మాట్లాడటం నాకు అదోమాదిరిగా తోచింది. కాని పెద్దది నా అత్తగారు పక్కనే వుండగా కూర్చోమని నేను చెప్పచ్చునా? ఒక కప్పు కాఫీ యివ్వొచ్చునా?

సంకోచంతో ఏమీ తోచక అల్లాగే నిలబడిపోయాను. ఆ యింట్లో కాలుపెట్టబోయేముందు, యిక్కడ నాకు ఎన్నో స్వాతంత్ర్యాలు వుంటాయని అనుకొన్నాను. ఇప్పుడు నా స్వాతంత్ర్యాన్ని పరిశోధించే ఘట్టం వచ్చిందనిపించింది. నిజంగా నాకు అంత చనువున్నట్లు నే ననుకొన్న పరిస్థితులు లేవు! అయినప్పటికి మొండి ధైర్యంతో లోపలికి వచ్చి, అతనికి కాఫీకలిపాను. నేను అప్పచెప్పిన పని పూర్తిచేసి. చేతులు కడుక్కొంటోంది నిర్మల. 'ఆయన కళ్ళు మిమ్మల్ని వెతుకుతున్నాయి' అని ఆమె చెవుల్లో చెప్పి నేను వచ్చే లోపుగా 'నేను వెళ్లొస్తానువిమలా?' అన్న రాధాకృష్ణ మాటలు వినిపించాయి.

'ఇదో కాఫీ తాగి వెళ్ళచ్చును' అంటూ కాఫీకప్పుతో వచ్చాను. అతని దృష్టి అంతా నా అత్తగారి చేతులమీద వుంది. నేను అక్కడే పడేసివెళ్ళిన చీరల పొట్లం నా అత్తగారి చేతిలో వుంది. మేము చూస్తూండగానే ఆవిడ ఆ పొట్లం విప్పింది. అందులోనుంచి ఒక కవరు కిందపడింది!

'ఉత్తరం కూడా ఏదో రాసినట్టుందే! దాన్ని తియ్యి విమలా!' అంది నా అత్తగారు. వంగి దానిని తీశాను.

ముత్యాల్లాగా, అందంగా 'నిర్మలా' అని రాసివుంది ఆ కవరుమీద! అర్థప్రష్టితో నవ్వుతూ దానిని వెనక్కు తిప్పి రాధాకృష్ణను చూశాను.

ఒక్క క్షణంలో ఎంత చెమటపోసింది అతనికి! నీళ్లలో మునిగిపోయి తేలినవాడిలా ఒక దీర్ఘశ్వాసాన్ని విడుస్తూ, చేతిరుమాలుతో ముఖం తుడుచుకొంటూ, 'గండం తప్పింది భగవాన్!' అనుకొన్నట్లు నన్ను చూశాడు!

నా అత్తగారు కవరుమీద ఆ పేరు చూసి వున్నప్పటికీ యింగ్లీషు ఆమెకు అర్థంకాదు. అయినప్పటికీ అపాయం అపాయమే కదా?

'నే వెళ్ళొస్తానండి' అంటూ బయలుదేరిన అతని వెనకాలే గుమ్మందాకా వచ్చాను. నర్సింగ్ హోమ్ నుంచి అప్పుడే వచ్చిన చంచల 'ఎవరితను' అన్నట్లు చూసింది. నేను అతను ఫలానా అని చెప్పి, అతను వచ్చిన పనికూడా చెప్పాను. ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

గుమ్మం మెట్లు దిగుతూ, ఒకసారి అటూ యిటూ చూసి, ఎవ్వరూ లేరని తెలుసుకొని 'అది నిర్మలకి యిచ్చేస్తావు కదూ?' అన్నాడు మెల్లిగా బ్రతిమాలుతున్నట్లు చూస్తూ.

పరిహాసంగా నవ్వుతూ 'ఊహూ! యివ్వదల్చుకోలేదు! పెళ్ళికాని పిల్లతో యివేం పనులు? యిందుకే నుసుకొంటూ కాలేజీ చదువులు!' అన్నాను.

'సరే! నీ యిష్టం. ఏం చేస్తాం మరి? నీ చేతిలో పడ్డాక!' అన్నాడు రాధాకృష్ణ నీట ముంచినా పాలముంచినా నీదే భారం అన్నట్లు చూస్తూ వెళ్ళిపోయాడు.

ఉత్సాహంతోను, కుతూహలంతోను రెండేసి మెట్లు ఒకొక్కసారిగా దాటుతూ మేడ మీదకు వెళ్ళాను. ఒంటరొంటరిగా వున్న రెండు హృదయాల తహ తహ నాకు అంతే ఆనందాన్ని యిచ్చింది!

నిర్మల ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చుంది. ఉత్తరాన్ని వెనక్కి దాచి— 'ఆయన కళ్ళు మీ కోసం ఎంత సేపు వెతికాయో తెలుసునా? మీరు కోపంగా యిక్కడికి వచ్చేసి కూర్చున్నారు! ఆయన్ని రమ్మనమని చెప్పి ఒక్క మాటకూడా మాట్లాడకుండా యిల్లా గంభీరంగా తమరు యిక్కడ కూర్చోటం నాకేం నచ్చ లేదు. స్నేహితులంటే యిల్లాగే వుంటారు కాబోలు! అందులో సాధారణ స్నేహితులు కూడా కాదు...!' అంటూ పరిహాసం చేశాను.

'ఏయ్! విమలా! ఏమిటి వాగుతున్నావ్? సాధారణ స్నేహితులు కాక మరేమిటి? కాలేజీ సమావేశాల్లో కలుసుకోవటమే కాని, యిద్దరం విడిగా కలసి మాట్లాడుకోవటం నిన్ననే మొదటిసారి' అని నిర్మల కొంచెం కోపాన్ని ప్రదర్శించింది.

'ఓహో! నోటిమాటలకన్నా కళ్ళు చూసే చూపులకి బంధుత్వశక్తి ఎక్కువని నాకు తెలియదా? 'సొంత విషయం' అని కదా అన్నారు. ఇక్కడికి రమ్మని చెప్పకూడదూ?

ఆయన ఆశాభంగాన్ని చూసి నేను సహించలేకపోయాను' అంటూ తన కోపాన్ని కొంచెం రెచ్చగొట్టాను.

'నువ్వు చాలా అధిక ప్రసంగం చేస్తున్నావు విమలా! కళ్ళు మాట్లాడుకోవటం చెవులు కొరుక్కోవటం అంతా నీకే తెలుసు! సొంత విషయం అంటూ ఏమీ వుండదు. ఆయన వాళ్ళ కాలేజి యూనియన్‌కి ప్రెసిడెంట్ వచ్చే సమావేశంలో ఎవరు దేనిని గురించి తలనొప్పి వచ్చేటట్లు వాదించబోతున్నారనే విషయాన్ని గురించి మాట్లాడాలనే అల్లా అని వుంటారు. కప్పి కప్పి దాచి దాచి మాట్లాడటమే ఆయన స్వభావం! మీ అత్తయ్య పంపించిన చీరలని, అక్కడ అందరూ కులాసాగానే వున్నారనే వడ్లగింజలోని బియ్యపు గింజ సంగతి గురించి అంత అద్భుతంగా నటించారే! ఆయ నెప్పుడూ అంతే!' అనేసి ఆమె ముఖాన్ని నేను చూడ్డానికి వీల్లేకుండా తిప్పేసుకొంది నిర్మల.

'అటువంటి సంగతులకోసం ఉత్తరాలుకూడా రాస్తారు కాబోలు!'

జ్వరశరీరానికి థర్మామీటరు తగలగానే పాదరసం గబగబా పైకి పరిగెడుతుందికదా! నా ప్రశ్న ఆమె అణిచి వేసిన ఆవేశాన్ని, తహతహను ఒక్కసారిగా లేవదీసేసింది. 'ఏదైనా ఉత్తరం యిచ్చారా విమలా? అని ఖంగారుగా అన్న నిర్మల, నేను చేతులు వెనక్కిపెట్టి దాచిన ఉత్తరాన్ని చూసేసింది!

'అల్లా దానికి రండి!' అని నవ్విన నేను — 'లేచినవేళ మంచిది. అత్తయ్య పంపిన చీరల పొట్లంలో పెట్టారన్న

సంగతి నాకేం తెలుసు ? అలక్ష్యంగా ఆ పొట్లాన్ని అక్కడే పడేసి నేను లోపలికి వెళ్ళిపోయాను. అత్తగారు చూశారు. ఇంకానయం – ఎడ్రసు అర్థంకాలేదు ! మా అత్తయ్యే నాకేదో వుత్తరం రాసిందనుకొంది ఆవిడ ! అప్పుడు రాధాకృష్ణ ముఖం చూడాల్సింది మీరు !' అని నవ్వుతూ ఉత్తరాన్ని యిచ్చాను.

'విమలా !' అంటూ అత్తగారు కేకవేయటం విని గబగబా కిందకు పరిగెత్తుకువచ్చాను. 'ఇంకా చిన్నపిల్లలా గంతులేస్తూ ఎక్కడివక్కడే మర్చిపోతున్నావే ! ఇంద – యీ చీరలు పెట్లోపడేసి, తొందరగా టిఫెన్ పూర్తిచెయ్యి' అని కేకలేసింది నా అత్తగారు.

మళ్ళీ మేడమీదకు వెళ్ళటానికి బద్ధకంవేసింది. వంటింట్లోనే ఓ పెట్టెమీద పడేశాను ఆ పొట్లాన్ని.

రాత్రి భోజనాలయాక వంటిల్లు సర్దుతూండగా, నర్సింగ్ హోమ్‌కి వెళ్ళబోతూన్న నా భర్త వచ్చారు. సాయంత్రం ఆఫీసునుంచి వచ్చాక, ఆయన నాతో మాట్లాడటానికి సందర్భమే కలసిరాలేదు.

' మీ అత్తయ్య నీకు చీరలు పంపించిందిట కదూ ? నాకు చూపించనేలేదేం !' అన్నారు.

నేను వంచిన తల ఎత్తకుండా 'అవును' అన్నాను శృతిచెదిరిపోయిన వీణలా. ఆయనకి గనుక శక్తి వున్నటయితే ఆ నా ఒక్కమాటలోనే నా ఆవేదన అంతా అర్థంచేసుకోవచ్చును.

'రాధాకృష్ణ నీకు బంధువుట కదూ? ఇంతవరకూ నువ్వు చెప్పనేలేదేం? అతను యివాళ వచ్చాడని వదిన అంది' అన్నారు.

వదినే అంతా చెబుతోందిగా? నేను వేరే చెప్పాలా? మాట్లాడకుండా, అక్కడే పెట్టెమీదవున్న చీరలను తీసి చూపించాను. అటూ యిటూ తిప్పి చూసి—'బాగున్నాయి! శ్రీమంతురాలైన మీ అత్తయ్యకు నీ మీద చాలా చాలా ప్రేమనుకొంటాను! రేపు ఆదివారమే కదా? రాధాకృష్ణను రమ్మని చెప్పకపోయావా? వదిన 'ఎవరో' అంది. తర్వాత నిర్మల చెప్పింది, సంగతి' అని నన్ను మైమరపించే ఒక మాయ నవ్వు నవ్వారు.

'అతను-మీకు తెలుసునా!' అన్నాను నేను.

'ఒకసారి నిర్మలే వాళ్ల కాలేజి ఎగ్జిబిషన్‌లో పరిచయం చేసింది. అప్పటినుంచి ఎక్కడేనా కనిపిస్తే 'విష్' చేస్తాడు. నేనూ ఏదో సందర్భానుసారంగా నాలుగు మాటలు మాట్లాడి వెళ్ళిపోతూంటాను. ఇకనుంచి, సన్నిహితసాంగత్యం సమకూర్చుకుంటే సరిపోతుంది' అన్నారు ఆయన తమాషాగా చూస్తూ.

నేను జవాబు చెప్పలేదు. ఈ మగవాళ్ళు ఆడవాళ్ళ అబలత్వంలోని మనోబలహీనత బాగా తెలుసుకొనేవున్నారు. బతిమాలటంలోను, పొగడ్తలోను, ముఖస్తుతిలోను ఆడవాళ్లు తేలిగ్గా లొంగిపోతారనేది తెలుసుకొనివుండబట్టే, సమయానికి వాళ్ళని ఆడించివేసే ఆయుధాల్లా వాటిని ఉపయోగించుకోవటంలో సామర్థ్యాన్ని చూపిస్తున్నారు!

గోడకానుకొని నిలబడిన నా భుజంమీద చెయ్యి వేస్తూ, నా చెవిదగ్గరగా వచ్చి 'మాలతికి యింక మూడు నాలుగు రోజుల్లో జ్వరం తగ్గిపోతుంది. వదిన ఆరోగ్యంకూడా బాగా లేదు చూడు. ఇటువంటి సమయంలో మనం దొరికి పోవచ్చా! నా మీద కోపమా విమలా? నాకు ఎంత బాధగావుందో తెలుసునా? రేపు ఆదివారం – నీతో కూడా అల్లా ఎక్కడికేనా బొటానికల్ గార్డెన్సు వైపు కాసేపు తిరిగి వద్దామని వుంది. కాని, వీలౌతుందో లేదో?' అన్నారు.

ఏడ్చేపిల్లకి మిఠాయి పెట్టేటట్లు, యిదేమిటి, నా కళ్లు తుడవటమా? మాట్లాడకుండా ఆయన వెళ్ళిపోతేనే చాలా బాగుండిపోయేది. ఈ బతిమాలటం, పొగడటం నన్ను యింకా వేదనకు గురిచేస్తున్నాయే? నేను జవాబివ్వటానికి ఏముంది?

'నామీద కోపమేలా వుంది.?'

'కోపమూ లేదు, కుంగటము లేదు, కోప్పడటం ఎందుకు?' అంటూ గొణిగాను.

'ఆ మాటల్లోనే కోపం కనిపిస్తోందే! నిజంగా నీకు కోపమే లేకపోతే నన్ను తల్లకిందులు చేసే నీ చిరునవ్వు ఏమైపోయింది విమలా!'

ఈ స్టేజీనాటకం మాటలు వినేటప్పటికి నాకు 'ఫక్కు'న నవ్వొచ్చింది.

'కొద్దిరోజులు నా చిరునవ్వుతో మీ మనస్సును బాధ పెట్టకుండా వుండాలనే యిల్లా వున్నాను' అన్నాను.

'చాలా అసాధ్యురాలివి, విమలా నువ్వు!' అని నా చెంపమీద తన చూపుడు వేలితో 'చిటుక్కు'మనిపించి వెళ్ళి

పోయాను. ఆయన వెళ్లినవైపే వెర్రిదానిలా చూస్తూ నిలబడి పోయాను !

ఇక్కడకు వచ్చిన మూడురోజుల్లో నే—అల్లా వుంటుంది యిల్లా వుంటుంది అనే ఆనందసాగరంలో కోటలు కట్టిన నేను కలలు చెదిరిపోయి నిజాలను నిదర్శనాలుగా చూశాను ! అభిమానం లేని అత్తగారు ! అధికారం చలాయించే తోడి కోడలు ! బాధ్యతలో యీదులాడే భర్త ! వీళ్ళ మధ్య నేను ప్రవాహంలో కొట్టుకుపోయే కుండలా, కొట్టుకొని కొట్టుకొని గిలగిలా గింజుకుపోవాలి !

మేడమీదకు వచ్చాను. ఆశాభంగంతోను, వెగటుతోను కిటికీలోనుంచి చూశాను.

ఆ యింట్లో ప్రేమనాటకం జరుగుతోంది. ఆవేళ నేను చూడాలనుకొన్నది యివాళ నేను చూడకూడనిదిగా తోచింది. దీపం ఆర్పివేసి మంచంమీద కూర్చున్నాను. పిల్లలంతా పడుకోవటంవల్ల అల్లరి వినిపించటంలేదు కాని, బావగారు, తోడికోడలు మధ్యహాలులోనే వున్నారు. నాకు అర్థం కాని భాషలో రేడియో ఏదో పలుకుతోంది.

సంగీతం, సినిమా, నాట్యం, విహారాలు అన్నీ వాళ్లకే. నేను వాటిని అనుభవించటానికి నాకు ఏ అధికారమూ లేదు ! అత్తయ్య యింట్లో నా ఎదురుగుండానే, కన్నీళ్ళు కార్చేటట్లు నన్ను దెప్పి పొడిచింది బామ్మ. అదికూడా ఒకవిధంగా ఫర్వా లేదనిపిస్తోంది. కాని యిక్కడ ఎవళ్ళూ చెప్పకుండానే 'నువ్వు దేనికీ కూడా పనికిరానిదానివి' అని ఎల్లాగో తెలుసు కొనేటట్లు చేశారు...ఇదే యింట్లో...ఇదే పరిస్థితులలో...

ఇల్లాగే...నా జీవితమంతా...అయ్యయ్యో! తల్చుకొంటేనే తల పగిలిపోయేటట్లుందే!

చీకట్లో ఏదో రూపం నా వైపు వస్తున్నట్లు కనిపించింది. వెంటనే సన్నగా గాజుల చప్పుడుకూడా వినిపించటంతో ఆ వచ్చేది నిర్మల కాబోలనుకొన్నాను.

'చీకట్లో లైటార్పేసి కూర్చున్నావేమిటి? ఈపాటికి నిద్రపోయావేమో అనుకొన్నాను' అంటూ లైటు వేసింది నిర్మల.

'అవును ఇల్లా కూర్చుండగానే నిద్రవస్తుంది. అప్పుడు లేచి లైటార్పాలంటే బద్ధకంగావుంటుంది కదా!' అని ఎల్లాగో శ్రమపడి నవ్వాను.

ఆ సమయంలో ఆమె నా గదికి రావటం, వాతపడి కందిపోయిన చర్మం మంటమీద కొబ్బరినూనె రాసినట్లుగా తోచింది నాకు. మంచం పక్కనే కుర్చీలో కూర్చున్న నిర్మలను, రాధాకృష్ణ ఉత్తరం నేను ఆమెకు యిచ్చాక అప్పుడే కలుసుకొన్నాను. మనస్సులో పొంగిపొరలే ఆనందం ఆమె ముఖసౌందర్యాన్ని మరింతగా ప్రతిఫలింపచేస్తోంది. నిదానం లేకుండా గెంతుతూ తిరిగే ఆమె నదురూ బెదురూ లేని స్వభావం అణిగిపోయి నిండుకుండ నిశ్చలస్థితిని జ్ఞాపకం తెచ్చింది. నేను ఆమెగురించి ఆలోచిస్తూంటే, ఆమె నా గురించి ఆలోచించింది!

'చంద్రం యింత మూర్ఖుడిలా ప్రవర్తిస్తాడని నేను ఎప్పుడూ అనుకోలేదు విమలా!' అంది మెల్లిగా.

నేను విషయం మార్చి 'రాధాకృష్ణ మీా సంఘ సమావేశాలను గురించే రాశారనుకొంటాను' అన్నాను.

నేను అడిగినదానికి జవాబివ్వకుండా—'నువ్వు చాలా బాగా పాడతావుట కదూ విమలా! చంద్రం అంటున్నాడు. ఒక పాట పాడు' అంది.

'అల్లా అని గొప్పగా చెప్పకొన్నారు కాబోలు. అది అల్లా వుండనీయండి. నేను అడిగినది చెప్పనేలేదే? రాధాకృష్ణ యింత సామర్థ్యశాలని నేను కల్లోకూడా అనుకోలేదు. ఉల్లాసపావురంలా ఎగురుతూ తిరుగుతోందని నేను అనుకొన్న నిర్మలాదేవిగారిని తంత్రంగా తన మనో పంజరంలో దాచివేసుకొన్నారే!'

దొంగకోపం వచ్చిన దానిలా వెంటనే ఆమె నా చెయ్యి గట్టిగా నొక్కినపుడు, రమణీయంగా కందిపోయిన ఆమె ముఖం వింతవింతరంగు లీనుతూ చూడ్డానికి యింకా అందంగా వుంది!

'లేదు లేదు పొరపాటు – నేను తప్పు చెప్పాను. కోప్పడకండి. ఆయన తంత్రం ఏమీా చెయ్యలేదు! తమంతట తామే ఆ పంజరంలో......' అని పూర్తిచేసేలోపుగా—

'విమలా! నువ్విల్లా మాట్లాడకూడదు. చనువు దోషంలో తర్వాత నీమట్టుకు నువ్వు అమ్మ, అక్కయ్య, అత్తయ్య ఎవరేనా వున్నప్పుడు నోరుజారి అనేయగలవు!' అని హెచ్చరించింది నిర్మల.

'తెలిస్తే ఏం? తప్పేముంది? ఎల్లాగా తెలియవలసిందేగా? దేవిగారి మనోభిప్రాయాన్ని సూచనగా పెద్దవాళ్ళకి తెలియచేయటం, చెలి చెయ్యవలసిన పనేగా?'

'చాలా బాగుంది నీ వ్యవహారం! పూర్వకాలం వాళ్లలా వెంటనే పిలిపించి వివాహం చేసేస్తారనుకొంటున్నావ్! నా కోసమే కాచుకొనివున్న మోహనరావు ఏమౌతారు? రెండు సంవత్సరాలనుంచి నాకోసం సిమ్లాలో తను కట్టించే బంగళా ఏమౌతుంది? ఈ సంగతి వాళ్లకి తెలిసినంతంటే రాధాకృష్ణని యింక యీ గుమ్మం తొక్కనివ్వరు!' అన్న ఆమె మాటల స్వరంలో జీవం లేదు! చిరునవ్వు చిందవలసిన స్థానంలో శోకరేఖలున్నాయి! మనస్సుకు హాయినిచ్చే శృతి అపశృతిగా మారిపోయింది!

'ఎవరా మోహనరావు? ఆయన పేరు, ఆయన కట్టించే బంగళాపేరు చెప్పి ఒక్కసారే నోరు మూయించేస్తున్నారే?'

'నువ్వు యింకా చిన్నపిల్లలా మాట్లాడుతున్నావు విమలా! చంద్రంతో కూడా నోరుజారి ఎప్పుడూ చెప్పకు. ఎందుచేతంటే తను ఊరుకొనే మనిషి కాడు. సంగతి సందర్భాలు ఆలోచించకుండా అమ్మతోను, బావతోను చెప్పేస్తాడు. పైగా, ఆయనంతట ఆయనే ముందుకు రావాలిగాని, ఊరికి ముందే మనం అందరికీ తెలియజేయటం చాలా ప్రమాదమవుతుంది. ముందు అక్కయ్య నా చదువు కట్టిపెట్టించేస్తుంది. నాకు అదే భయంగా వుంది.

మోహనరావు అమ్మకి పింతండ్రి కొడుకు. వంశపారంపర్యంగా కాలుమీద కాలు వేసుకొని కూర్చుని తినగలిగేటంత ఆస్తివుంది. చిన్నవయస్సులోనే ఒక దూరబంధుత్వం అమ్మాయిని యిచ్చి పెళ్ళిచేశారు. ఆ అమ్మా

యికి పన్నెండేళ్ళు వయస్సు వచ్చేటప్పటికి, అకస్మాత్తుగా కలరావ్యాధి తగిలి పోయింది. లెఖ్ఖలేనంత ఐశ్వర్యంతో ఆయనగారు యిప్పుడు తులతూగుతున్నాడు. మోహనరావు తండ్రి ఒకానొక సమయంలో మా నాన్నగారికి ఆర్థికంగా చాలాసహాయం చేశారుట. అప్పటికే, తను చేసిన బాల్యవివాహానికి మనోవ్యాధికి గురియైన ఆయన, పోయేముందు నన్ను తన కొడుక్కి యిచ్చి చేసుకొనేటట్లు వాగ్దానం పుచ్చుకొన్నారు. ఇప్పుడు ఆయన లేకపోయినప్పటికి, నేను మోహనరావుకే అనే అభిప్రాయంతో వున్నారు వీళ్లంతా. చదువుకోవాలని ఆశపడుతోంది కదా అని వివాహాన్ని 'పోస్ట్‌పోన్' చేశారు. ఇదీ కథ. బావ మొట్టమొదటగా వ్యాపారం మొదలుపెట్టినప్పుడు కూడా డబ్బు అక్కణ్ణుంచే వచ్చింది. అందుచేత వీళ్ళందరికి అతన్ని మీద అభిమానం ఎక్కువ. ఇదంతా తెలుసున్న నేను, రాధాకృష్ణ సంగతి బయటపెడితే ఎటువంటి భూకంపం లేస్తుందో నువ్వే ఆలోచించుకో' అంది నిర్మల.

'మరి, యిదంతా రాధాకృష్ణకు తెలుసునా ?'

'తెలియదు. నువ్వు అనుకొంటున్నట్టు యింతవరకు మేము ఎప్పుడూ కలుసుకొని మాట్లాడుకోలేదు, నిన్న నువ్వు యిచ్చిన ఉత్తరం తన మనస్సు తెలియజేసే మొట్టమొదటి ఉత్తరం విమలా !'

నేను ఏం మాట్లాడాలో నాకు తెలియలేదు. నిశ్చలంగా ఆమెనే చూస్తూ వుండిపోయాను.

'ఈ పరిస్థితుల్లో ఏంచెయ్యాలో కూడా నాకు అర్థం కావటంలేదు. నీఅభిప్రాయం ఏమిటి?' అంటూ నాభుజంమీద చెయ్యివేసింది నిర్మల.

నాకన్నా వయస్సులోను, చదువులోను, ప్రపంచ అనుభవంలోను పెద్దదైన ఆమె, నా కళ్ళకు నేను సరిసమంగా చూట్టానికి వీల్లేనట్లు మర్యాదగా వుంటున్నంతమాత్రంచేత, ప్రేమబంధం ఒక్కదానివల్లే ఆమెతో 'యింటిమేట్'గా వుండ టానికి వీలౌతోందని, నాకన్నా ఆమె రెండాకులు ఎక్కువని నేను అనుకొన్న ఆమె, పల్లెటూరి పామరులతో మూర్ఖ అభిప్రాయాలమధ్య పుట్టిపెరిగిన నన్ను, ఆమె నా అభిప్రాయం అడగటం నన్ను నేనే నమ్మలేకపోయాను.

అతిసులభంగా "అందువల్ల బాధేముంది? మోహన రావును నేను పెళ్ళిచేసుకోలేనని భయపడకుండా చెప్పే సేయండి. నన్ను పిరికిదాన్నంటూ మీరే పిరికిదానిలా కని పిస్తున్నారే!' అన్నాను నేను.

'ఛీ! విమలా! నీకంతా వేళాకోళంగా వుంది. నాగరీకం నాగరీకం అనేదంతా కట్టూ బొట్టూలోనే వుంటోంది. మనస్సులలోకి యింకా రాలేదు. చంద్రంతో వ్యత్యాసం లేకుండా నేను పరిహాసంగా మాట్లాడటం అక్కయ్య నిము షానికి నూరుసార్లు దెప్పిపొడుస్తుంది. మోహనరావుని నేను నిరాకరించినట్లయితే నిశ్చయంగా వీళ్ళందరితోను విరోధాన్ని తెచ్చిపెట్టుకొన్నదాని నవుతాను. లేకపోతే వాళ్లు చూపించిన దారిలోనే జీవితమంతా శోకసాగరంలో కొట్టుకుపోతూ వుండాల్సివస్తుంది' అని ఆమె మనస్సును విప్పి చెప్పింది నిర్మల.

నేను ఏమీ మాట్లాడలేకపోయాను. నన్ను ఆలోచించ మన్నట్లుగా చూసి నిర్మల వెళ్లిపోయింది.

కథలలో మాత్రమే అంతవరకూ ప్రేమగురించి చదివిన నాకు, నా కళ్లముందు అందులో చిక్కుకుపోయి వాడి పోతూన్న నిర్మలను చూడటానికి నాకు చాలా ఆనందంగా వుంది.

ప్రేమ, ప్రేమ అంటూ కథారచయితలు, కావ్య కర్తలు పొగిడే ఆ అనుభవం నాకు దొరకలేదే అని తోచిందో లేదో – నా మనస్సులోనుంచి ఎవరో – 'ఏం ? ఎందుకు దొరకలేదు ? ఆయన ఆ మాటలు, ఆ చూపులు ఎందుకు ఆలోచించి, ఆలోచించి, ఆలోచించేటట్లు చేసి ఆనందాన్ని యిస్తున్నాయి మరి ? ప్రేమ అనేది దేవలోకంలో నుంచి వేరే వచ్చి ఊడిపడుతుందా ? పెద్దవాళ్లు చూపించిన దారిలో, జీవితం మిట్టపల్లాలలో పడకుండా ప్రయాణం చెయ్యటానికి ఆయన ప్రేమను నీకు లభింపచేశారు. కాని ఆమె అల్లాకాదు. ఆమె మనస్సు పడ్డచోట ప్రేమ కను క్కొంది. ఇంతే కదా వ్యత్యాసం ?' అన్నారు – ఈ ఆలోచన రావటంతోనే నా మనస్సులో ఏదో జ్యోతి వెలిగినట్లుగా ప్రకాశంతో నిండిపోయింది. నిర్మలను మర్చిపోయి, నా జీవిత విమర్శనంలోకి – ఆలోచనా గుఱ్ఱం వేరే దిశకు తిరిగిపోయింది.

మా యింట్లో కమలక్కయ్య, ప్రమీలక్కయ్య కూడా కాపరానికి వెళ్లారు. ప్రమీల గురించి నాకు అంతగా తెలియదు. కాని కమలమాత్రం నామాదిరిగా లేదనేది నిజం. 'ఏం చెప్పినా ఎన్ని చెప్పినా వాళ్లమ్మదగ్గర జేరవేసి, ఊఁ... ఊఁ...అనే యీ అల్లుడికోసం ఉత్తరాలు రాసి, టెలిగ్రాము

లిచ్చి నానాపాట్లూ పడ్డారే!' అని అమ్మదగ్గర అనేకసార్లు 'కంప్లెయింట్' చేసేది!

నేను అల్లా చెప్పనే లేను! ఆయన వెయ్యి తప్పులు చేసినాకూడా - ఆయనను నేను పెళ్లిచేసుకోవటం మహత్తర మైన నా భాగ్యం అనికదా సంతోషిస్తున్నాను? నా నోటి తోనే ఆయన్ని హీనంచేస్తానా? ఇటువంటి నిశ్చల అభి ప్రాయం యీ కొద్దిరోజుల్లోనే కలగటానికి కారణం ఏమిటి?

నిర్మల ఆ మెగదిలోకి వెళ్ళిపోయినతర్వాత నామన స్సులో ప్రకాశించిన ప్రకాశంలో నన్ను నేను మైమరచి మగతనైపోయాను! ఆ కొత్తలోకంలో ఊహావిమానంలో సంచరించే నన్ను, నిద్రాదేవి ఆ మెవడిలోకి ఎల్లా తీసుకొందో నాకు తెలియదు!

# 10

మానవజీవితాన్ని రసింపజేసే అతిముఖ్య వ్యాజనా లయిన నమ్మకం, ఆశాభంగం, చీరనేతలో పెనవేసుకు పోయిన నూలూ, జరీలా జీవితంలో పెనవేసుకుపోతున్నాయి. జరీయొక్క ప్రకాశానికి నూలు ఆధారం. నూలుయొక్క నాణ్యాన్ని చూపించేందుకు జరీ ఆధారం. ఒకవస్తువునో లేక భవిష్యత్తునో తహతహలాడే ఆవేశంతో పొంగే ఆనందంలో నమ్మటం ఎంతసంతోషాన్ని కలగచేస్తుంది! తర్వాత వచ్చే ఆశాభంగం జీవితంలోని మిట్టపల్లాలలో లేకుండా వున్నట్ల యితే తహతహ ఎక్కడుంటుంది? ఆ వేశం ఎక్కడవుంటుంది?

కనుకనే ఆశాభంగాన్ని పునాదిగా నిర్మించుకొనే ఆనందం బయటికి వస్తోంది. ఆరోజు నాకు ఏర్పడిన ఆ ఆశాభంగం యివాళ నాకు ఎంత ఆనందాన్ని యిస్తోంది !

'పిల్లకి జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. ఇవాళ యింటికి తీసికెళ్ళచ్చు అన్నారు డాక్టరు' అని నా తోడికోడలుతో నా బావగారు చెబుతున్న మాటలు, నా చెవుల్లో సప్తస్వర సంగీత వీణానాదాల్లా వినిపించాయి. 'సంకటమైన ముఖం తోను, బ్రతిమాలే కళ్ళతోను నన్ను చూస్తూ ఆయన యివాళ వెళ్ళరు ! భయపడుతూ, భయపడుతూ నాలుగైదు మాటల తోనే కాకుండా, మనసు విప్పి, నేను తెలుసుకోవా లనుకొన్న వన్నీ అడిగి తెలుసుకోవచ్చును !' అనే సంతోషంలో మునిగి పోయాను.

గబగబా యింటిపనులు చేసుకొంటున్న నాదగ్గరకి రవి వచ్చి—

'పిన్నీ ! యీ లెఖ్ఖ చెప్పవూ ?' అంటూ వంటింట్లోకే పుస్తకం, పెన్సలుతో వచ్చి కూర్చున్నాడు.

'నాకు తెల్లపరికిణి, గౌను కావాలి పిన్నీ. ఇవాళ మా టీచరు తెల్లబట్టలు తొడుక్కు రావాలంది' అంటూ బుంగమూతి పెట్టుకుంటూ వచ్చి నిల్చొంది వనజ.

'అమ్మాయ్ విమలా ! కొంచెం మిరియాల కషాయం కాచియ్యమ్మా ! పొద్దుణ్ణుంచి ఒళ్ళంతా అదోమాదిరిగా వుంది' అంది నిర్మల తల్లి.

"నీళ్ళపొయ్యి మండటంలేదు. కొంచెం విసురు విమలా?' అంటూ వంటింటి గుమ్మందగ్గరకే వచ్చి నిల్చున్నారు నా బావగారు.

'చంద్రం స్నానంచేసి తడిపిన పంచిని ఆ బాల్చీ లోనే పడేశాడు. వనజ పరికిణీ రంగంతా ఆ పంచిని పట్టే సింది. ఇదంతా చూసుకోంటూ వుండద్దూ? నేను వేరే చెప్పాలా విమలా?' అంటూ కేకలేస్తూ వచ్చింది నా అత్తగారు.

విమలని పిలవటానికి యింకా ఎవరు బాకీవున్నారని నేను అనుకోనేలోపుగా, వెనకవైపునుంచి మేడ దిగి వచ్చిన నా భర్త 'వదిన ఓ గ్లాసు హార్లిక్స్ తెమ్మంటోంది విమలా!' అనే సమాచారాన్ని నాకు అందజేశారు.

ఇంక నిర్మల ఒక్కర్తే మిగిలిందనుకొన్నందుకు ఆమె కూడా వదలకుండా వచ్చింది. 'విమలా! సుశీల అక్కయ్య వచ్చింది. నిన్ను చూసిపోదామని వచ్చిందిట. ఒకసారి రమ్మనమని చెప్పి యిప్పుడే మేడమీదకు వెళ్తోంది' అనే టెలిగ్రాం ఒకటి తెచ్చింది.

ఇంతమంది ఒక్కసారిగా పిల్చేసరికి మతిభ్రమించిన దానిలా నిల్చున్న నన్ను చూసిన నా భర్త 'భలేగా వుందే! ఈ కొద్దిరోజుల్లోనే యీ యింట్లో విమలాదేవికి యింత గిరాకీ తగిలిందేమిటి?' అన్నారు నవ్వుతూ.

నిర్మల చెప్పినదానికే ముందు జవాబు అనుకొని, మేడమీదకు వెళ్లాను. తడిపుల్లల పొగ నా కళ్లని అసలు తామర పద్మములలా చేసింది. మాసి మసిబారి నలిగిన చీర అసహ్యంగా వుంది. తల దువ్వుకోకపోవటంవల్ల నా చేతుల తోనే జుట్టుని ఒత్తుకొంటున్నాను–యిల్లా కనిపించింది నా అవతారం హాలులో ఎదురుగా వున్న నిలువుటద్దంలో.

ఒక సోఫాలో చంచల జార్లబడి కూర్చుంది. పసుపు పచ్చ బెనారస్ సిల్కుచీర, మెళ్లో వజ్రాల నక్షత్రమాల, చెవులకి కుండనాలలా వైడూర్య దుద్దులు, నడుమును ఆనుకున్న మాణిక్య వడ్డాణం ధగధగ మెరుపూ, తల్లో అలంకరించుకొన్న మల్లెలమాల, ఆమె ఏదో ఒక విందుకు బయల్దేరినట్లు కనిపించగా, చిరునవ్వుతో నన్ను ఆహ్వానించింది డాక్టరు భార్యా. డబుల్ గ్రాడ్యుయేట్ అయిన నా చిన్న తోడికోడలు సుశీల.

'నిన్ను చూసిపోదామని అవాళకూడా వచ్చాను. నువ్వు యింట్లోలేవు. ఊఁ...వంటిల్లు నువ్వే సొంతం చేసేసుకొన్నట్లున్నావు !' అంది సుశీల నవ్వుతూ.

నేను మాట్లాడకుండా చిన్ననవ్వు నవ్వాను. కాని లోపలమాత్రం 'వాళ్ళిద్దరూ సరిసమమయిన వాళ్ళు. నేనో? నా మెళ్ళో వజ్రాలు ధగాధగా మెరవటంలేదు. మిలమిలా మెరిసే మాణిక్యవడ్డాణం నాకు లేదు. నాభర్త కారులోనే ఆఫీసుకి వెళ్ళివస్తున్నప్పటికి వాళ్ళదృష్టిలో ఆయన ఒకకారు డ్రైవరు' అనే నిజం నాలో కలిగింది.

'సుశీల వచ్చిందని తెలిసేకదా వచ్చావు? కొంచెం కాఫీ తెద్దామనే ఆలోచన కలగలేదా నీకు? ఇదికూడానా నేను చెప్పాలి?' అన్న చంచల మాటలు నా హీనస్థితిని బయట పెట్టింది.

'వద్దు విమలా! నేను యిప్పుడే వాళ్లింట్లో పీకదాకా మింగివచ్చాను. ఇంతదూరం ఎల్లాగా వచ్చాంకదా అని నిన్ను చూసిపోదామని వచ్చాను. ఇప్పుడు కాఫీవద్దు ఏంవద్దు'

ఒక సోఫాలో చంచల జార్లబడి కూర్చుంది. పసుపు పచ్చ బెనారస్ సిల్కు చీర, మెళ్లో వజ్రాల నక్షత్రమాల, చెవులకి కుండనాలలా వైడూర్య దుద్దులు, నడుమును ఆను కున్న మాణిక్య వడ్డాణం ధగధగ మెరుపూ, తల్లో అలంక రించుకొన్న మల్లెలమాల, ఆమె ఏదో ఒక విందుకు బయల్దేరి నట్లు కనిపించగా, చిరునవ్వుతో నన్ను ఆహ్వానించింది డాక్టరు భార్యా. డబుల్ గ్రాడ్యుయేట్ అయిన నా చిన్న తోడి కోడలు సుశీల.

'నిన్ను చూసిపోదామని అవాళకూడా వచ్చాను. నువ్వు యింట్లో లేవు. ఊ...వంటిల్లు నువ్వే సొంతం చేసేసు కొన్నట్లున్నావు!' అంది సుశీల నవ్వుతూ.

నేను మాట్లాడకుండా చిన్ననవ్వు నవ్వాను. కాని లోపలమాత్రం 'వాళ్ళిద్దరూ సరిసమమయిన వాళ్ళు. నేనో? నా మెళ్ళో వజ్రాలు ధగాధగా మెరవటంలేదు. మిలమిలా మెరిసే మాణిక్యవడ్డాణం నాకు లేదు. నాభర్త కారులోనే ఆఫీసుకి వెళ్ళివస్తున్నప్పటికి వాళ్ళదృష్టిలో ఆయన ఒక కారు డ్రైవరు' అనే నిజం నాలో కలిగింది.

'సుశీల వచ్చిందని తెలిసేకదా వచ్చావు? కొంచెం కాఫీ తెద్దామనే ఆలోచన కలగలేదా నీకు? ఇదికూడానా నేను చెప్పాలి?' అన్న చంచల మాటలు నా హీనస్థితిని బయట పెట్టింది.

'వద్దు విమలా! నేను యిప్పుడే వాళ్లింట్లో టీకదాకా మింగివచ్చాను. ఇంతదూరం ఎల్లాగా వచ్చాంకదా అని నిన్ను చూసిపోదామని వచ్చాను. ఇప్పుడు కాఫీవద్దు ఏంవద్దు'

అంది సుశీల మొహమాటంగా. అయినప్పటికీ ఆమె హార్లిక్స్ అడిగిందే?

నేను వెనకనైపునుంచి మేడ దిగబోతూ మాగదిలోకి చూశాను. ఆయన, గదిలో, పంట్లాంబొత్తాం ఏదో పోయింది కాబోలు—కుట్టుకొంటున్నారు. ఎవరెవరికో పనిమనిషిలా వుంటున్నానే? నువ్వు కుట్టిపెట్టు అనికూడా చెప్పకుండా ఆయనే కుట్టుకొంటున్నారే! ఆయన స్ఫటికస్వభావాన్ని చూసి ఆశ్చర్యపోయాను.

ఒక కప్పులో కాఫీ, యింకోకప్పులో హార్లిక్స్‌తో ముందునైపునుంచి మెట్లు ఎక్కివస్తూండగా చంచల మాటలు నా చెవుల్లో పడటంతోటే నాకాళ్లు వాటంతటవే ఆగిపోయాయి.

'ఏమిటో వ్యాయవారం బ్రాహ్మడిలా ఉత్తచేతులతో పిల్లను తీసుకొచ్చి దిగబెట్టి వెళ్ళిపోయాడు! నగా, నట్రా అంటూ ఏమీ లేదు! చేతులకి పూచికపుల్లల్లా ఒంటిజత గాజులతో ఎల్లా పంపించిందో ఆ మహాతల్లి! అవైనా చెరిపించి చేయిస్తే రెండూ రెండూ నాలుగవుతాయనే ధోరణిలో సూచనగా అవాళ చెప్పాను కదా?'

'వాళ్ల అత్తయ్య బాగా వున్నమనిషి. పిల్లమీద అభిమానం ఎక్కువ. అన్నీ చేయిస్తుంది అని అమ్మ అనేదే' అంది సుశీల.

'భలే ప్రేమ వాళ్ళత్తయ్యకి! ఆగ్రా జరీ పేరుపొందిన జరీ. ఒక్క చీరేనా కొని పంపలేదు. పంపకపోతే మానె, ఊరుకొంటే చాలా బాగుండేది. మన డాసీది కడుతుందే

నలభయి నెంబరు నూలుచీర, అటువంటివి రెండు చీరలు పంపించింది, అంతదూరంనుంచి ?' అంది చంచల హేళనగా.

ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లుగా నా మనస్సు చెదిరి పోయింది. 'వ్యాయవారం బ్రాహ్మడు' - అయ్యో ! నాన్నా ! కని, పెంచి, పెద్దచేసి, చదువు చెప్పించి యీ యింటికి పంపించినందుకు యిది మీకు పట్టపు పేరా ? అభిమానం లేని హృదయం అని ఒకవిధంగా అనుకొన్నప్పటికి, నా ఎదురుగా మాటల్లోని నిజాన్ని తెలుసుకొన్న తరువాత, నాకు తగిలిన ఎదురుదెబ్బని భరించలేనిదానిలాగనే తోచింది. పాదో, పామో అనే సందేహంలో కలిగే భయానికి, నిజంగానే అది కదుల్తున్నప్పుడు కలిగే అదిరి - బెదిరిపోయే భయానికి వ్యత్యాసం లేదా ?

కొంచెం విసురుగానే కప్పులని 'టక్' మని శబ్దం చేస్తూ బల్లమీద పెట్టాను. వాళ్లు మాట్లాడుకొన్నది నేను విన్నట్లు నా ముఖంలో ఏమైనా కనిపించిందేమో ? కల్మష మైన మనస్సుతో విమవునవ్వు నవ్విన చంచల 'అప్పుడే తెచ్చేశావే !' అంటూ ప్రేమగా మాట్లాడుతున్నట్లు పలికింది.

'నాకు యిప్పుడు ఎందుకు కాఫీ ? నేను వద్దని చెప్పాను కదా విమలా ?...చంద్రం లేడా ?' అని సుశీల అడగటం, ఆయన గదిలోనుంచి బయటకు రావటం ఒక్కసారే జరిగాయి.

'ఏం వదినా ? పొద్దున్నే యిల్లా దయచేశారేమిటి ? అన్నయ్యకూడా వచ్చాడా ?' అన్నారు.

'ఆయన రాలేదు. నేనే వచ్చాను. నువ్వు యీ మధ్య కంట్లో నలుసులా తిరుగుతున్నా వేమిటి ? అన్నయ్య కంపె

నీలో చేరటమయితే చేరావుకాని, కనిపించటం అపూర్వంగా వుందే! తను రాకపోతే రాకపోయాడు మనమేనా ఓసారి చూపివద్దామని వచ్చాను. ఏదో ఒక ఆదివారంపూటేనా అదీ నువ్వూ కలసి అటువైపు రాకూడదూ? 'బాబయ్య' రావటం లేదేమిటమ్మా అంటోంది గిరిజ. పిన్ని వచ్చిందికదా యింకెల్లా వస్తాడులే అన్నాను నేను' అంటూ కలకలా నవ్వింది సుశీల.

ఆయన ఎక్కడ ఉద్యోగం చేస్తున్నారో? బావగారి ఆఫీసుకు దగ్గరలోనే కాబోలు అనుకొంటూ ఏదో అభిప్రాయ పడ్డానే? నాకు తెలియనిదంతా ఎవరెవరికో తెలిసేవుంది! చంచల నన్ను హీనంగా ఎందుకుచూడదు, ఆయన వాళ్ళకింద పనిచేసే పనిమనిషేకదా! దానికితోడు నా అంతస్తును పైకెత్తటానికి వీల్లేకుండా, నగలూ నాణ్యాలు లేని పుట్టింటి బీదరికంకూడా నాకు వుంది! ప్రేమ, అభిమానం, ఆశ, నిష్కళంకమైన మనస్సు, నాగరీకం అంటూ ఏమేమో పిచ్చి పిచ్చి ఆలోచనలు చేశానే! అత్తయ్య యిల్లువదలి వెంటనే రావటానికి వీలయింది. ఇక్కడ స్వతంత్రం అనేదే లేని పరిస్థితులలో, నాకు ఏవిధమైన రక్తసంబంధం లేని ఒక స్త్రీయొక్క అలక్ష్యాన్ని, అహంభావాన్ని, హేళనని సహించుకొంటూ జీవితాన్ని గడపాలా? అత్తయ్యయింట్లో అత్తయ్యకూడా నా ఎదురుగా నన్ను ఏమీ అనలేదు. మా బామ్మ నా తండ్రిని కన్నతల్లి—నన్ను కొట్టటానికి కౌగలించుకోవటానికి కూడా అర్హతవున్న ఆమె మాటలకే నాకు అంతపౌరుషం వచ్చిందే!

ఇక్కడ...? ఈ యిల్లే నా కాపరస్థలం. ఇది వదలి ఎక్కడకీ వెళ్ళటానికి వీల్లేదు! జీవితమంతా......

'నేను వెళ్ళొస్తాను విమలా! ఒకసారి యిద్దరూ కలసి వీలుచూసుకొని రండి' అనే సుశీల మాటలు, పరిగెత్తే నా ఆలోచనా గుఱ్ఱాన్ని 'సడన్'గా ఆపివేసింది.

గిజగిజలాడుతూ గిరగిరా బొంగరంలా తిరిగిపోతూన్న మనస్సుతో నేను మా గదిలోకి వచ్చాను. పక్కయింటిలో ఆఫీసుకువెళ్తున్న ఆయనతో ఆవిడ బ్రతిమాలుతూ, కులుకుతూ ఏదోచెప్పటం నాకళ్ళబడింది. అంతులేని ఆవేదన అంగలువేసుకొంటూ నన్నుచేరగా, నేను మంచంమీద వాలాను. మనస్సులో వున్న భారాన్ని ఏడ్చి ఏడ్చి కరిగిస్తేనే కాని తగ్గేటట్టులేదు. అత్తగారిని, వంటింట్లో పనులని మర్చిపోయి వెక్కి వెక్కి ఏడ్చాను.

'విమలా! విమలా!' అంటూ ఖంగారుపడుతున్న గొంతుకతో, ఆయన ప్రియమైన చేతులు నన్ను తాకాయి.

ఆవేశాన్ని అణగగొట్టుకోలేని నా మనోబలహీనం నాకు అప్పుడే అర్థమయింది. తెలివితక్కువదానిలా వెక్కి వెక్కి ఏడ్చాను! ఆయనకు ఏమని సమాధానం చెప్పను? నా చర్య ఆ మరుక్షణంలో ఏం ఫలితాన్ని యిస్తుందో ఆలోచించలేని అబలనైపోయానే! తల ఎత్తి నా ఏడుపు ముఖాన్ని ఆయనకు చూపించటానికే నాకు సిగ్గేసింది.

'విమలా! ఏమిటిది? ఎందుకు ఏడుస్తున్నావు?' అంటూ ఖంగారుపడుతూ, నా తలను ఎత్తి నా కళ్ళల్లోకి చూస్తూ—'ఏమిటి విమలా? చిన్నపిల్లల్లా ఏడుస్తున్నావా? ఏం

జరిగిందో నాతో చెప్పవా?' అంటూ బ్రతిమాలే ధోరణిలో చూస్తూ నా కళ్లు తుడిచినపుడు నాకు యింకా సిగ్గేసింది.

'ఏమీ... లేదు...'

'ఏమీ లేదా? వెక్కి-వెక్కి ఏడ్చావే విమలా? నాతో చెప్పకూడనిదా? ఇంకా నీకు ఎక్కిళ్ళు వస్తూనేవున్నాయే విమలా! నాకు చెప్పవా నీ బాధ!'

నే నెంత పిచ్చిదానిని! ఆయనతో ఏమని చెప్పను? మీ వదిన మా నాన్నగారిని 'యాయవారం బ్రాహ్మడు' అని, నగలేమీ చేయించలేదని అందని చెప్పనా? ఛీ...! చిన్నపిల్లల దెబ్బలాటా యిది? ఆమె ఏమంటేమాత్రం నాకేం? వెలకట్టలేని 'ప్రేమ గని' అయిన ఆయన నా సొంత మయినప్పుడు, నాకు ఏమిటి లోటు? ఈ అల్పవిషయాలని ఆయన చెవిని వెయ్యటం చాలా తప్పు. 'ఒక్కొక్కరి గుణం ఒకోవిధంగా వుంటుంది. వాళ్ల స్వభావానికి తగి నట్లుగా అంతా మన మంచికే అన్నట్లు సంచరించాలి' అన్న నాన్న ఉపదేశం జ్ఞాపకం వచ్చింది.

ఇవ్వకూడని వస్తువుకోసం పిల్లవాడు ఏడిస్తే, తల్లి మాటల చాతుర్యంతో ఆ వస్తువును మర్చిపోయేటట్లు చేస్తుంది. కాని, కొంచెం సమాధానపడిన పిల్లవాడు నిద్రపోతూ, నిద్రలో జ్ఞాపకం వచ్చినట్లయితే మళ్ళీ ఏడుస్తాడు. అల్లాగే నాన్న నిశ్చయం నా మనస్సును తీరని బాధకు గురిచేసింది. చంచల హీనమైన మాటలు, ఆయన పరితాపమైన, వాడి పోయిన శరీరము అన్నీ నన్ను మళ్ళీ వేదనకు గురిచేశాయి. మళ్ళీ ఏడుపు వచ్చేసింది!

ఆయన నన్ను తనలోకి తీసుకొంటూ - 'ఏమీలేదంటూనే మళ్ళీ ఏడుస్తున్నావే? నాతో చెప్పవా నీ బాధ!' అన్నారు లాలనగా.

ఈ అపూర్వఘట్టంలో 'విమలా!' అని కేక వేస్తూ నా అత్తగారు వచ్చింది!

ఎప్పుడైనా నాలో ఏదైనా నరం బెణికినట్లయితే 'నరుక్, నరుక్' మని బాధకలిగేది. కొన్ని సమయాలలో ఏవిధమైన మందూ కూడా అక్కర్లేకుండా, నడుస్తూండగానో, నిద్రలోనో తగ్గిపోయేది. నా అత్తగారి గొంతుక బెణికిన నరంవల్ల కలిగే బాధలా ఒక్కసారిగా నా మనఃక్షోభనంతటిని అంతంచేసి, వంటింట్లో పని దిగబడిపోయిందని జ్ఞాపకం తెచ్చింది. అయినప్పటికి దొంగిలించిన వస్తువుతో సహితంగా దొరికిపోయిన దొంగలా ఏడ్చిఏడ్చి వాచిపోయిన కళ్ళతోను, వాడిన ముఖంతోను ఆదరంచూపిస్తున్న ఆయన మీద వాలిపోయి, ఆయన చేతులు నన్ను పెనవేసుకొన్న సమయంలోకదా నేను దొరికిపోయాను? ఏదో చెప్పటానికి వచ్చిన నా అత్తగారు మమ్మల్ని చూసి దిగ్భ్రమచెందిన దానిలా గుమ్మంలోనే నిలబడిపోయి తెల్లబోయి చూసింది.

ఆయన చేతులనుంచి పట్టు విడిపించుకొని కళ్లు తుడుచుకొంటూ 'నాకు తలపోటు ఎక్కువగావుంది' అన్నాను మెల్లిగా.

'చాలాబాగుంది! తలపోటుగా వుంటేనా ఏడుస్తున్నావు? ఏం? ఈ యింట్లో ఎన్ని మందులు లేవు? ఏదో ఒకటి రాసుకొంటే తగ్గిపోతుందిగా! ఏమిటో, ఏదో అనుకొని నేను

పాడలిపోయాను. ఏమిటోనమ్మా! మా కాలంలో యీ వయస్సులో గిరగిరా తిరిగే బొంగరంలా, పరిగెత్తే పాములా పని చేసేవాళ్ళం! ఇక్కడ అసలు పని అనేది ఏముంది? చేత్తో ఓ బిందె, భుజంమీద యింకోబిందె పెట్టుకొని నీళ్లు మొయ్యాలా? ఇల్లంతా అలకాలా? పాలు పితకాలా? ఏం చెయ్యాలి యిక్కడ? ఆ పొయ్యి ఎక్కించి దింపటానికి కళ్లూ కాళ్లూ తేలేస్తారు యీ కాలం పిల్లలు!' అనేసి వెళ్ళిపోయింది నా అత్తగారు.

ఆయన ఏమీ మాట్లాడ లేదు అప్పుడు. నా అత్తగారు వెళ్లిపోగానే 'నిజంగా ఏమిటి విమలా నీ బాధ? తలపోటని అబద్ధమేకదూ చెప్పావు?' అని ఆయన చూసిన ఆ చూపు నా మనస్సును దూసివేసింది.

'ఏమీ లేదు. నిజంగానే నాకు తల్ల పోటుగావుంది. ఏదో అనుకొన్నాను—అమ్మా, నాన్నా జ్ఞాపకం వచ్చారు. అంతకంటే యింకేంలేదు' అని ఆ అబద్ధానికి ఆధారాన్ని చెప్పాను. శ్రమపడి నవ్వటానికికూడా ప్రయత్నించాను. కాని సాధ్యంకాలేదు.

మేఘాల్లోనుంచి బయటికివచ్చిన చంద్రునిలా ఆయన నవ్వారు. 'వెఱ్ఱిదానా! అమ్మా, నాన్నలని తల్చుకొని చిన్న పిల్లలా యిల్లా ఏడ్చావు? ఈ నాలుగు నిముషాల్లోనే నేను ఎంత ఖంగారు పడిపోయానో తెలుసునా? ఇకనించి నీ ముఖం యిల్లా కంపకూడదు—తెలిసిందా? మీ అమ్మా నాన్నలని నువ్వు ఎప్పుడు చూడాలనుకొన్నా తక్షణం బయల్దేరి వెళ్ళ వచ్చు. ఎవరడ్డు పెట్టినా పంపించేవాణ్ణి నేనుండగా నీ కెందు కా బాధ?' అని పసిపిల్లను లాలించినట్లు లాలించారు.

ఈ సమయంలో నా అత్తగారు అమృతాంజనం బుడ్డి ...కొని వచ్చింది. 'ఇంద! ఇది రాసుకొని కొంచెంసేపు పడుకో అదే తగ్గిపోతుంది. తలపోటంటూ చిన్నపిల్లలా బాగా ఏడ్చావు!' అని వెళ్ళిపోయింది.

'నువ్వు పడుకో నేను రాస్తాను' అంటూ నన్ను మంచం దగ్గరికి లాగారు ఆయన.

'అందరూ భోజనాలు చేసే వేళయింది. నేను వెళ్ళి వడ్డించాలి - వదలండి' అన్న నన్ను బలవంతంగా పడుకోబెట్టి అమృతాంజనం రాసి, ఆయన వెళ్ళిపోయారు.

నా తెలివి తక్కువతనానికి నన్ను నేనే నిందించుకొన్నాను. నిష్కళంకమైన ప్రేమతో నిండిపోయిన ఆయన మనస్సును అనవసరంగా బాధపెట్టానే! భోజనం చేసివచ్చి, ఆయన పలికిన పలుకులు! ఆ రోజంతా ఆయన అనురాగాన్నే తల్చుకొని ఆశ్చర్యపడేటట్లు చేశాయి!

'విమలా! నిన్ను చూస్తూంటే నాకు ఎంతగర్వంగా వుందో తెలుసునా? ఈ యింట్లో పిల్లల దగ్గరనుంచి పెద్ద వాళ్ళదాకా వాళ్ళందరిని యీ కొద్దిరోజుల్లోనే ఎంత చక్కగా ఆకర్షించివేశావు? వచ్చిన మరుక్షణమే, యింటి గుట్టంతా బయట పెట్టి, కుమ్ములాటలూ కీచులాటలూ తెచ్చేకోడళ్ళున్న యీ రోజుల్లో, ఓర్పు సహనాలతో పల్లెత్తు మాటకూడా మాట్లాడకుండా సంచరించే నువ్వు నా భార్యగా దొరకటం నేను చేసుకొన్న భాగ్యమని నాలో నేను ఎంత సంతోషిస్తున్నానో వర్ణించలేను. నువ్వు అలిగి నీ కళ్ళు కలిగితే నేను

ఎల్లా సహించగలను విమలా?' అని పొగిడి నన్ను పులకరింప చేశారు.

అత్తవారింట్లో నేను చూపించే సహనానికి, శ్రమకి యింతదూరం కృతజ్ఞత తెల్పే యీయన కదా నిజమైన ఆదర్శపురుషులు! ఆయనమనస్సు బాధపడకుండా, ఆయనకు నా మీదవున్న ప్రేమానురాగాలను నేను అర్థంచేసుకోనద్దా? అది ఒక్కటే నా జీవిత లక్ష్యం!

'వజ్రంలోనూ చుక్కవుంటుంది, ముత్యంలోనూ చొట్టవుంటుంది' అని నేను వినలేదా? ఆయన యిక్కడ వున్నప్పుడు యిటువంటి అల్పవిషయాలను అసలు లెక్ఖచెయ్య కూడదు - అని నిశ్చయించుకొన్నాను.

ఆరాత్రి చంచల భోజనానికి కిందకు రాలేదు. అందుకు బదులు తనపర్వత శరీరాన్ని మోస్తూ కిందకీ పైకీ తెగతిరిగింది ఆమెతల్లి. నాభర్త ఆఫీసునుంచి వచ్చినదగ్గరనుంచి డాక్టరు యింటికీ మందులషాపుకీ తిరగటంతో సరిపోయింది. రాత్రి పదిగంటల తర్వాతే సందడి కొంచెం తగ్గింది. 'ప్రసవానికి యింకా టైం వుందన్నారు డాక్టరు' అని మా బావగారు నా అత్తగారితో చెప్పటంనాకు వినిపించింది.

పనంతా పూర్తిచేసుకొని నేను మేడమీదకు వచ్చే సరికి నాకు ఎటువంటి ఎదురుదెబ్బ కాసుకొని వుందో అర్థ మయింది. మాగదే ప్రసవానికి 'అచ్చి' వచ్చిందిట! అక్క డున్న కొన్ని సామానులు మధ్యహాలులోకి మార్చి వేశారు! నా భర్త మధ్యహాలులో ఒక మడతమంచం వేసుకొని పేపరు నిశ్చింతగా చదువుకొంటున్నారు! మామూలుగానే

నా బావగారు వారిగదిలో దినపత్రిక చదువుకొంటున్నారు. నిర్మల ఆమె గదిలో ఏదో రాసుకొంటూంది! నిర్మల గదిలో పెట్టబడిన నా సామానులు, ఆ రాత్రే కాకుండా ఆ తర్వాత ఎన్ని రాత్రులో ఆమెతో ఆ గదిలోనే వుండాలని ఎవరూ చెప్పనక్కర్లేకుండా తెలియజేశాయి! అర్థంలేని, ఎవరితోను చెప్పడానికి వీల్లేని, ఒక కోపం, యీర్ష్య, జుగుప్స, బాధ, ఆశాభంగం, ఏడుపు అన్నీ ఒక్కసారిగా నన్ను చుట్టుముట్టాయి!

ఎన్నివిధాల మంచి ఉద్దేశ్యాలతో సరిపెట్టుకొన్నప్పటికి, పెద్ద జడివానకీ, తుఫానుకి కదలని కారు మేఘాల్లా అన్ని ఆవేశాలు నన్ను చిత్రవధ చేసేస్తున్నాయి! యువదంపతులు తహతహలాడుతూ ఏకాంత సమయంకోసం ఎదురు చూస్తూ వుంటారని యీ యింట్లో ఎవరూ పట్టించుకోవటం లేదు! ఏం? నా అత్తగారుమాత్రం? జీవితంలో కష్టసుఖాలు అనుభవించినది కాదా? నా బావగారికి మావిషయంలో కళ్లు గుడ్డివైపోవాలా? నేను బీదదానినే కావచ్చు - ఆభరణాలూ పట్టుచీరలూ నన్ను అలంకరించకపోవచ్చు-కారులో విహారానికి వెళ్ళటం, విందులు వైభవంగా అనుభవించటం, ఎలక్ట్రిక్ ఫాన్ కింద కూర్చుని అధికారం చలాయించటం, మొదలైన హక్కులు ఆమెకు వుంటే వుండవచ్చును. కాని అనురాగమే ఆదర్శంగావున్న భర్తను చేపట్టిన హిందూస్త్రీని కదా నేను? తన పంచప్రాణాలు నామీదే పెట్టుకొనివున్నట్టు కనిపించే నా భర్తతో నేను ఏకాంతంగా వుండటానికి హక్కులేని దానినా!

క్రొత్తదనమే లేకపోతే పువ్వులు ఎక్కణ్ణుంచి వస్తాయి? పళ్ళు ఎక్కణ్ణుంచి వస్తాయి! అసలు, యీ యింట్లోవాళ్లు అంతా అంతులేని స్వాధీనంతో 'విమలా, విమలా' అంటూ సర్వస్వాధీనంగా పనులు చెప్పి చేయించుకోవటం ఎందుచేత వచ్చింది? నేను ఆయన్ని పెళ్లిచేసుకోబట్టేకదా?

అత్తవారింట్లో అందరికి లోబడి బానిసబ్రతుకు బ్రతకాలని, అంతటితోనే తృప్తిపడాలని, ఎంత బీదవాళ్ళ పిల్ల అయినాకూడా, ఏం? అంగవిహీనం, అవలక్షణం వున్న పిల్లకూడా అనుకోదే! బయటికి ఎక్కడికీ వెళ్ళకూడదు, చుట్టుపక్కలవాళ్ళతో ఎవరితోనూ మాట్లాడకూడదు, పుట్టింటివారితో సంబంధముంచుకోకూడదు అనే మొదలైన స్వతంత్రాలు కావాలంటే అడ్డుకొని, హక్కులని చంపుకోవచ్చు. కాని దాంపత్యజీవితంలో జీవనాడియైన హక్కుకు కూడా స్థానంలేని యింట్లో నేను ఎప్పటికీ కూడా చలనం లేకుండా ఎల్లా జీవించగలను? నా తెలివితక్కువతనం నాకు బాగా అర్థమయింది. నాకు యిక్కడ సకలసౌకర్యాలు, సర్వస్వతంత్ర సర్వాధికారాలు వుంటాయని, కమల మాదిరిగా నాకు ఏవిధమైన బాధలు వుండవని కోటలుకట్టి కలలు కన్నాను. కాని అదంతా నా భ్రమ! నా అజ్ఞానం! నా మనస్సులో చెలరేగే తుఫానుతో నేను పోరాడుతున్నాను — కాని, ఆయన......?

ఎప్పటిలాగనే శాంతముఖంతో, పెదిమలమీద ఎప్పటి చిరునవ్వుతో పిల్లలతో సరళంగా, చనువుగా, నిశ్చలంగా తిరుగుతున్నారు! ఇది తల్చుకొంటే నాలో చెలరేగే తుఫా

నును ఎదిరించేశక్తి తగ్గిపోయినట్లు తోచింది. ఆయనకూడా చాలా బాధపడవలసినవారేకదా? ఇప్పుడు నన్ను బాధించే సంఘటన ఆయన్నికూడా బాధించి వుండాలికదా? మరి వాటి ఛాయ లేనా ఆయనలో కనిపించటంలేదే! నన్ను చూసి నప్పుడుకూడ చంచలంలేకుండా ఎప్పటి చిరునవ్వునే ప్రదర్శిస్తున్నారే!

బంగారు వర్ణంతో నిండిపోయిన ఆకాశంలో చీకటి దేవత అధికారంలోకి వచ్చినట్లయితే, అంతకుముందు జగజ్జ్యోతిలా మనస్సును మైమరపించే రమణీయ దృశ్యంగా కనిపించిన ఆ ఆకాశమేనా యిది అని సందేహపడేటట్లు ఆ బంగారు వర్ణ రేఖలు కూడా కనిపించకుండా అంధకారం కప్పుకు వచ్చేస్తుంది. ఆయన అనురాగంలోని అవతారమని కావ్యాల్లో కనిపించే ప్రేమదైవమని, సర్వగుణ సంపన్నుడని, నా అదృష్టంకొద్దీ దొరికిన ఆదర్శ పురుషుడని- అని ఏమేమో నిర్ణయించానే! అవన్నీ నిజమేనా?

ఈ సందేహం ఆయనమీద నేను పెట్టుకొన్న పూరని నమ్మకమనే రాతికట్టడంలో చిన్నఅనుమానానికి దారి యిచ్చినట్లు తోచింది. భయపడేవాని కళ్ళకు కనిపించే చీకటి అంతా పిశాచమయమే' అన్నట్లు భ్రమో, ఏమిటో నేను ఎంత ప్రయత్నించినా, ఆయన మొదటిరోజు కౌగలింత, మనస్సును మైమరపించిన ఆ ప్రేమ పలుకులు - అన్నీ నా మనో తెరలో 'క్లియర్'గా పడకుండా, తెరచిన తలుపుల ముందు చూసే 'మ్యాటినీషో' మాదిరిగా వుంది. నిజం చెప్పాలంటే స్త్రీ సిగ్గు తెరలో వుంటుంది. ఈ రేగింపులో నాచేతిని నొక్కి, నన్ను

మాట్లాడించటానికి ధైర్యంగా ముందడుగు వేసిన ఆయన యిప్పుడు నాతో ఏకాంతం ఏర్పాటు చేసుకోలేరా? పెద్ద వాళ్ళ మనస్సుకి తగినట్లుగా నడుచుకు పోవాలన్నప్పటికీ అందుకు ఒక హద్దు లేదా! ఇంతదూరం అడుగులకి మడుగు లొత్తే పిరికివందా ఆయన? మర్యాదకోసం అనుకొన్నప్పటికీ అందుకూ ఒక హద్దు లేదా? అల్లాగయితే ఆయనకు నామీద అంతులేని అనురాగం వుందనుకోనేందుకు ఆధారమే లేదే! ఆయన చెప్పినట్లు తన మనస్సంతా నా ప్రేమ వ్యాపించి వున్నట్లయితే యిటువంటి అర్థంలేని మర్యాదకు స్థానం వుంటుందా? అత్తవారిల్లు ఇంద్రలోకంలా వుంటుందని నేను కట్టిన కోటలు మట్టిలో మట్టిగా కలసిపోవటంవల్ల నాకు కలిగిన బాధ నేను భరించలేనిదిగా వుంది. తలపగిలినా భరించవచ్చు మనస్సు పగిలిపోతే భరించలేము. దుప్పటి కప్పుకొని బయ టకు తెలియకుండా మౌనంగా కన్నీరు కార్చాను.

## 11

ఆవాళ యిల్లంతా ఒకటే గందరగోళంగా వుంది. కార్ల శబ్దము, డాక్టరు నర్సుల పాదరక్షల శబ్దములు, వేన్నీళ్ళంటూ వంటింట్లో వున్న నాకు వచ్చే టెలిగ్రాములలాంటి వార్తలు, నా అత్తగారు నిముష నిముషానికి పైకి పరిగెత్తటం, అర్జంటు పని ఏదైనా వుంటుందని నాభర్త ఆఫీసుకు వెళ్ళక పోవటం – ఆ యింటికి చంచల – పట్టాభిషేకం కాబోయే మహారాణి అనిపించేటట్టుంది. పగలు సుమారు పదిగంటల ప్రాంతంలో

మగపిల్లవాణ్ణి ప్రసవించింది చంచల. తుఫాను తర్వాత కని పించే ప్రశాంతతలా యింట్లో గందరగోళమంతా సాయం త్రానికి తగ్గింది.

కాలేజినుంచి వచ్చిన నిర్మల నాతో అంతరంగంగా మాట్లాడాలనో ఏమిటో సందర్భంకోసం ఎదురు చూస్తూ వంటింట్లో వచ్చి కూర్చుంది. అప్పటి దాకా ఇంగువను మాత్రలుగా చేస్తున్న నా అత్తగారు మేడమీదకు వెళ్ళింది. చేస్తున్న పని చేస్తున్నట్టుగానే నేను నిర్మలవైపు చూశాను.

నాకు లోపల ఎంత బాధగా వున్నప్పటికి ఆమెముఖం చూసిన వెంటనే అమావాశ్య చీకటిలోనుంచి పౌర్ణమివెన్నెల లోకి వచ్చినట్లుగా వుంటుంది. మనస్సులు కలసిపోయిన ప్రాణ స్నేహమంటే యిల్లాగే వుంటుంది కాబోలు!

'తర్వాత ఏమయింది? రాధాకృష్ణను కలుసు కొన్నారా? ఆయనకి ఏం సమాధానం చెప్పావు? నాతోటి ఏమీ చెప్పలేదే! మళ్ళీ యింకోసారి ఏదైనా ఉత్తరం రాసి కొంప ముంచేస్తారేమో! అవాళ తప్పించుకోవటమే దేవుడి పుణ్యాం! ఆవాళ అత్తగారు చూశారుకాని, చంచల అయి నట్లుంటేనా...? నాన్న నాకు రాసిన ఉత్తరమే చదవకుండా నాకు యివ్వను. అటువంటప్పుడు యీ వుత్తరం చూడకుండా యిస్తుందా?' అని నేను మెల్లిగా చంచల చెయ్యకూడని పనిని బయట పెట్టాను.

'కొందరు తెలిసే కావాలనే కొన్ని పనులు చేస్తు న్నారు. వాటిని నువ్వు లెఖ్ఖచెయ్యకపోవటం ఏమీ బాగా లేదు విమలా! ఇంకోసారి అల్లాచేసిందంటే, ముఖాన్నేసి

కొట్టినట్లు 'ఏమిటి విశేషాలు, మీరే చెప్పేసెయండి అక్కా!
చదివారుగా !' అని అడుగు. అక్కయ్య చూపించే సర్వాధి
కార స్వభావం చూస్తే నాకు ఒళ్లు మండిపోతోంది. భయ
పడాలని, మర్యాద అని అంటే మాత్రం దానికి ఒకహద్దు
లేదా ?' అని నన్ను కోప్పడింది నిర్మల.

'నేనడిగినది చెప్పనేలేదే' అన్నాను నేను.

'మొన్న శనివారంనాడు రాధాకృష్ణని చంద్రం కలుసు
కొన్నాడుట చెప్పాడా ?' అంది నిర్మల.

'ఉహూ' అని తలతిప్పాను.

'ఎక్కడో హోటల్లో కలుసుకొన్నాడుట. విమలకు
నువ్వు బంధువని నాకు యిన్నాళ్ళదాకా తెలియనేలేదు.
అప్పుడప్పుడు యింటికి వస్తాండమని ఆహ్వానించాడుట.'

'మీరు నన్ను పిలవనక్కర్లేదు. నన్ను అక్కడకు
లాగివేసే అయస్కాంతం ఒకటి అక్కడ వుందని చెప్పారు
కాబోలు.'

'ఏయ్ విమలా !' అని కోపంగా నన్నుచూసిన నిర్మల
'ఆయన యిక్కడకు వస్తారంటేనే నాకు భయంగావుంది.
నాలుగైదు రోజులముందు నేను కాలేజినుంచి వస్తాంటే
దారిలో కలుసుకొన్నారు. కొంచెంసేపు బొటానికల్ గార్డె
న్సుకు వెళ్ళి కూర్చున్నాం. ఇవాళకూడా అక్కడే కలుసు
కొంటానన్నారు కాని ఆయన రాలేదు. చూసిచూసి నేను
వచ్చేశాను. ఎందుచేత రాలేదో అనేబాధ ఒకపక్క వుండగా
యిక్కడ అందరికి తెలిసిపోతే ఏం జరుగుతుందో అనేభయం
మరొకపక్క – నాకేం తోచటంలేదు' అంది నిర్మల.

'ఓహో! అల్లా చెప్పండి! అందుకే యీమధ్య తమరు కాలేజీనుంచి వచ్చేటప్పటికి చీకటి పడిపోతోంది! అవాళ 'యిప్పుడే కాలేజీనుంచి వస్తున్నావా నిర్మలా!' అని బావగారడిగినపుడు 'అవును, కాలేజీలో ఏదో మీటింగ్' అనే అబద్ధాన్ని చెబుతూ అద్భుతంగా నటించారే!' అని నేను ఆశ్చర్యంగా, వేళాకోళంచేశాను.

'ఉష్! నోరుముయ్యి! చంద్రం వస్తున్నాడు!' అని మెల్లిగా హెచ్చరించింది నిర్మల.

'ఏమిటి 'యిక్కడ యీ అంతరంగ మంత్రాలోచన? పువ్వుతో కలిసిన నారకు కూడా వాసన వచ్చిన కథలా? నిర్మలాదేవి యీ వంటింట్లో యిదివరకు అసలు కనిపించేదే కాదే? ఇప్పుడేమో వంటింట్లోనే ఐక్యమయిపోయేటట్టుం దేమిటి? ఎడతెరిపి లేకుండా మాట్లాడుకొనే మాటలు మీకు ఏమున్నాయో?' అంటూ నవ్వుతూ వచ్చారు 'ఆయన.'

'చూసుకో విమలా! నువ్వు పువ్వు - నేను నారుని. ఏదో కొత్తకోడలు కదా అని కాసేపు కబుర్లుచెప్పుతూ కాల క్షేపం చేస్తూన్నందుకు నాకు ప్రతిఫలం యిది. హు! ఎల్లా అయినా మంచికి కాలంకాదు యిది' అంది నిర్మల.

'విమలా! చెప్పటం మర్చిపోయాను. ఇప్పుడే వాల్తేరు స్టేషన్‌లో రాధాకృష్ణని చూశాను. అతని చెల్లెలు పోయిం దిట! ఇంటికి వెళ్తున్నాడు. ఆడదానిలా ఏడుస్తున్నాడు. పాపం...! ఒక్కత్తే చెల్లెలుట' అన్నారు ఆయన. ఆమాటలు విని తెల్లబోయాను.

'అయ్యో పాపం! ప్రసవించాకే పోయినట్టుంది'
అన్నాను నేను.

'అంతే అనుకొంటాను. సాయంత్రం అయిదు గంటలకి ఎవరో స్నేహితుణ్ణి చూద్దామని బయలుదేరబోతూండగా టెలిగ్రాం వచ్చిందట. వెంటనే మెయిల్‌లో బయలుదేరాడు. అతన్ని ఆ సమయంలో చూస్తే నాకుకూడా కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. నాలుగైదు నెల్లనుంచి అతని తండ్రికూడా పక్ష వాతంతో వున్నారుటకదూ. అదికూడా చెప్పి భోరు - భోరున ఏడ్చాడు.'

నిర్మల భ్రమించి శిలావిగ్రహంగా మారిపోయింది!

ఈ మాటలు విన్నదగ్గరనుంచి నాకు కాలూ చెయ్యీ పనిచేయలేదు. ఆ అమ్మాయిని నేను చూడాలేదు కూడా. రాధాకృష్ణ మాటలవల్ల ఆమెను చూడా లనుకొన్నాను. ఏమయినప్పటికి సహోదరపాశం అంతులేని ఆనందాన్ని కలగ జేస్తుం దనేది నిజం. 'నాకు కూడా యిటువంటి అన్నయ్యే ఒకరు వున్నట్లయితే...!' అని చాలాసార్లు అనుకొనేదానిని. తన చెల్లి పోయిందన్నవార్త అతనిని దుఃఖసముద్రంలో ముంచి వేయటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. అందుచేతనే అతను అన్నట్టుగా నిర్మలను కలుసుకోలేదు.

ఆరాత్రి నిర్మల చేసినపని నా జీవితమార్గాన్నే మార్చి వేసేటట్లుగా చేసింది! నిన్నటిలాగనే ఆమె రాసుకొంటున్న సమయంలో యింటిపనంతా పూర్తి చేసుకొని అలసటతో వచ్చి మంచంమీద వాలాను. కొంచెం మగతన్నిద్ర పోయి వుంటాను. నేను కళ్ళు తెరిచేటప్పటికి లైటార్పేసి వుంది.

గదిలో నిర్మల లేదు. ఆమె పక్క తీసుకొని కిందకు వెళ్లి పడుకోబోతోందని నాకు ముందుగా తెలియలేదు. టైము ఎంతయిందోనని చూశాను. పదకొండు కావస్తోంది. దీపం ఆర్పేసి అప్పుడే వెళ్లిపోయి వుంటుంది. ఛీ...! ఎంత సిగ్గు చేటు! ఇంతంతా ఆయన అర్థంలేని మర్యాదవల్ల వచ్చిందే కదా! ఆయన ఆవిధంగా చలనం లేకుండా వున్నప్పుడు యిదంతా నా యేర్పాటే అని నా అత్తగారు నన్ను హీనంగా చూడదా? కోపము, విరక్తి మితిమీరిపోయాయి. ఆ పాత సంఘటనలు! — భవిష్యత్తులో జరగబోయే వాటిని ముందుగానే నేను తెలుసుకొనేటట్లు కనిపించిన దుశ్శకునాలు!— నా మనస్సులో చెలరేగాయి — చేదును మింగినట్లు అన్నింటిని మింగివేసి నిద్రపోయాను.

ఎక్కడచూసినా వసంతంలోని సువాసనే వీస్తోంది. కొంచెంముందు నాకళ్లకు కనిపించిన స్థలమంతా రంగురంగుల రకరకాలు పువ్వులతో నిండిన మొక్కలు నన్ను మైమరపించాయి. ఎప్పుడూచూడని దేవేంద్రలోకంలోని నందనవనంలో ప్రవేశించానా అని ఆశ్చర్య పడ్డాను. కుహూ కుహూ మంటూ కోయిలలు మధురాతి మధురమైన రాగాలాపన చేస్తున్నాయి. గునగున మంటూ తెల్లటి పావురాలు అటూయిటూ జంటజంటలుగా ఎగురుతున్నాయి. రజనీవల్లభుని కాంతిలో మైమరచి పులకాంకింతగా నెమళ్ళు పురివిప్పి నాట్యం చేస్తున్నాయి. శృంగార ప్రియుడైన రజనీకాంతుని సరససల్లాపాలను చూసి తమ సతీమణులతో కలసి తలలెత్తి తన్మయత్వంతో తోకలమీద నిలబడి నాట్యం

చేస్తున్నాయి నాగరాజులు. ఆనందపరవశంతో తమ జతగాని కోసం వెతుక్కుంటూ జగన్మోహనంగా ఛెంగుఛెంగున గెంతుతున్నాయి జింకలు. వాటన్నింటినిచూసి పులకాంకితురాలయి వర్ణించలేని పరవశంతో నేను కూడా గెంతుతూ, నాయిష్టం వచ్చినట్లు పరిగెడుతూ, పాటఃకూడా పాడాను. కాని ఎందుచేతనో అంత ఆనందంలో కూడా నేను పాడేపాటలలో శోక రసమే ధ్వనిస్తోంది! నా తియ్యటి గొంతులోనుంచి సంతోషాన్నిచ్చే నాదస్వరమే రా లేదు! పాడిపాడి అలసిపోయి, చివరకి వెక్కి-వెక్కి ఏడ్చేశాను !

'విమలా. . .!' కన్నీటి మధ్యనుంచే చూశాను. ఆహా! ఆ స్వరలో ఎంతప్రేమ ! ఎంత అనురాగం ! ఎంత ఆదరణ ! ఎంతజాలి ! 'ఇల్లారామ్మా !' అని ప్రేమానురాగములే రూపంపొందిన దైవంలా రెండు చేతులు ముందుకువచ్చాయి! చిన్నపిల్లలా, చాచిన చేతులలోకి నన్ను నేను మైమరచి పరిగెత్తబోయాను.

ఛ. . .! ఏమిటీభ్రమ. . .! ఎవ్వరూ లేరే ! ఆ చేతు లేవీ? అని అనుకొంటూ కళ్లుతుడుచుకొని ఖంగారుగా చూశాను.

ఆ. . . ! ఇదేమిటి !

మెరుపులా ఒక కాంతి నా కళ్ళు మూయించేసింది ! చెవులు చిల్లులుపడేటట్లు మేఘాలు గర్జించాయి ! చూడ్డానికి అతిభయంకరంగాను, ఎఱ్ఱగా చింత నిప్పుల్లాంటి కళ్ళతోను, వాడియైన కొమ్ముల్లాంటి కోరలుతోను, చీల్చి చెండాడే బాకుల్లాంటి పళ్ళతోను, తాడిచెట్టంత ఎత్తైయిన ఒక భయంకర

రాకారం, భూమిదద్దరిల్లి పోయేటట్లు – 'హాహ్హాహ్హా!' అని సింహంకన్నా అతి భయంకరంగా గర్జిస్తూ నాముందు ప్రత్యక్షమయింది!

నాకళ్లు యింకా గట్టిగా మూసుకొంటూ – 'ఎవరు నువ్వు? నన్ను ప్రేమతో పిలిచిన ఆయన ఎక్కడ? ఆ చేతు లేమై పోయాయి?' అని అరిచాను.

'నేనే!...నేనే పిల్చాను...నేనే!' అంటూ పిశాచం నవ్వు నా చెవుల్లోపడింది. నేను 'హా!' అంటూ అనుస్తూ అలరి వెనక్కి పరిగెత్తి కాలుజారి పడిపోయాను...

నా ఒళ్ళంతా చెమటలు పోశాయి, నా చెంపలమీద చల్లగా ఏదో తగిలింది. గిజగిజ తన్నుకుంటూ కళ్లు తెరచి చూశాను.

'భయపడ్డావా విమలా!' అంటూ ప్రేమతో నా చెక్కిళ్లు తాకారు ఆయన.

ఇదిరాత్రి...నేను యింతకు ముందు చూసినది కల! తలుపు తీసుకొని ఆయన వచ్చారు; అని నేను తెలుసు కొనేందుకు కొన్నిక్షణాలు పట్టింది.

ఆ కల...! అమ్మయ్యో...! ఎంత భయంకరంగా వుంది...? ప్రేమతో చాచిన ఆ చేతులు...నిజమైన మనిషి చేతులు కావు...!

నా బలం అంతా ప్రయోగించి ఆయన చేతులు తోసి వేశాను!

'విమలా? నేను విమలా...నన్ను చూడు...' అని తన ముఖాన్ని నా ముఖానికి అతి దగ్గరగా తీసుకొచ్చారు.

నాకు విరక్తి, కోపము, ముంచుకొచ్చేశాయి. దెబ్బతిన్న నాగుపాములా ఛీదరించుకొంటూ ఆయన్ని తోసేశాను!

'ఏమిటి విమలా యిది? ఏదైనా పీడకల కన్నావా?' అని మళ్లీ ఆయన నా దగ్గరగా వచ్చారు.

'ఛీ...! నన్ను ముట్టుకోకండి! ఇంత హీనమైన మనస్సున్న మీరు నన్ను ముట్టుకోనటానికి అర్హత లేనివారు! మీ ఆశకి నేను బలికాను! బయటకి పోతారా లేదా?' అని ఆవేశంలో ఏం మాట్లాడుతున్నానో, ఎవరితో మాట్లాడుతున్నానో కూడా తెలియకుండా మాట్లాడేశాను.

'విమలా...!' అన్న ఆయన గొంతుకలో నుంచి ఆ స్వరం, కళ్లూ అన్నీ బతిమాలుతున్నట్లు కనిపించాయి. నేను ఏం చేస్తున్నానో నాకే తెలియటంలేదు! నా అప్పటి పరిస్థితి నా ఆవేశాన్ని యింకా ఎక్కువచేసింది!

'పోతారా......లేదా.....?' అంటూ లేచిన నేను, వెర్రెత్తిన దానిలా ఆయనచేతులు పట్టుకొని గుమ్మంవైపు లాగాను. ఆయనంతట ఆయనే తలవంచుకొని వెళ్ళిపోయారు. నేను తత్తాలున తలుపు గడియ వేసేశాను. ఒక స్త్రీకివుండే ధైర్యం కూడా లేని భయస్తులు! ఇతరుల దయా దాక్షిణ్యాలలో బానిసగా బ్రతికే పిరికిపంద ఆయన! నాగుండె అదిరిపోయింది! నాఒళ్ళు వణికిపోయింది! నాకళ్ళు తిరిగాయి! అల్లాగే మంచంమీద పడిపోయాను!

అమ్మ ప్రేమతో నాతల నిమిరింది. 'విమల చిక్కిపోయింది. ఈ ఆరు నెలల్లోనే యింత చిక్కిపోతుందని నేననుకోలేదు' అంది అమ్మ,

'నాలుగైదు రోజులనుంచి కొంచెం జ్వరంగా వుంటోందిట. దానికితోడు ప్రయాణ బడలిక ఒకటి. మన విమలకి ఆయింట్లో లోటేముంది?' అన్నారు నాన్న.

'అత్తారింటికి వెళ్ళాకకూడా యింకా చిలిపితనం పోలేదు! అక్కడకూడా చిన్నపిల్లలా యిల్లాగే వుంటున్నావా విమలా' అంది అమ్మ ఆశ్చర్యంగా.

'అదెందుకడుగుతావు? ఆయింట్లో అంతా చిన్నపిల్లలే. దీని తోడికోడలు చెల్లెలు ఒకర్తివుంది అక్కడ. ఆ అమ్మాయి ఒక్కత్తిచాలు అందరిని కడుపుబ్బ నవ్వించటానికి; మొన్న స్టేషనుకి వచ్చేముందు అయింట్లో పిల్లలంతా 'నేనూవస్తా, నేనూవస్తా' అంటూ అందరూ స్టేషన్కివచ్చారు. అందులో వనజ అని ఒక అమ్మాయి – 'పిన్నీ! నేను లెక్కపెడుతూనేవుంటాను. పదిరోజులు అయిపోగానే నువ్వు నాపక్కనుండాలిసుమా!' అని చూపుడువేలు ఆడిస్తూ భయపెడుతున్నట్లు హెచ్చరించటం చూస్తే నాకు నవ్వాగింది కాదు. చిన్నపిల్లలదగ్గరనుంచి పెద్దవాళ్ళంతాకూడా 'విమలా, విమలా' అంటూ ప్రియంగా పిలుస్తూంటే నేను పరవశమయిపోయాను. విమల అంతపెద్ద కుటుంబంలో ఎల్లావుంటుందో అని భయపడేవాడిని. ఇప్పుడు విమలగురించి యింక నాకు బెంగలేదు. తను నా కూతురైనందుకు నేను గర్వపడు

తున్నాను. తన అత్తగారు, బావగారు, తోడికోడలు – ఏం? తన భర్తకూడా, దీనిని యిప్పుడు పంపించటం వాళ్ళకి ఏమాత్రం యిష్టంలేదు. వాళ్లని ఎల్లాగో శ్రమపడి నచ్చ చెప్పాను' అని నాన్న నన్నుచూస్తూ బ్రహ్మానందపడ్డారు.

నేను నవ్వనా? ఏడవనా?

వాళ్ళకి ఎల్లా తెలుస్తుంది నాజీవితం ఆనాటి మలేరియా మాత్రలా సాగుతోందని? బంగళా, కారు, రేడియో, అను రాగమైన భర్త అని ఆయనికి, పరాయివాళ్ళందరికి కూడా నా జీవితం ఒక అందమైన పువ్వులగుత్తిమాదిరిగా వుంద న్నట్లు కనిపిస్తోంది. కాని చూడటానికిఅందంగానే వుందికాని యీ దాంపత్య జీవితం వాసనలేని కాగితపు పువ్వులగుత్తి అనే సంగతి నాకుకదా తెలుసును? బంగళాలో సుఖంగా ఎలక్ట్రిక్ ఫాన్ కింద కూర్చున్నవాడు చెట్టువుగట్టు నీడకోసం వస్తాడా? ఎండలో అలిసిపోయిన వాడికికదా రావిచెట్టునీడ ఆహ్లాదాన్ని యిస్తుంది? అంత అభిమానంతో నేను అమ్మ దగ్గరకి వచ్చానని నాన్న తెలుసుకోగలిగితే యిల్లా మాట్లా డరు. ఆయనతో నాబాధను నేను ఎల్లాచెప్పగలను? ఆయ నంతట ఆయనే తెలుసుకొన్నట్లయితే అంత బాధగావుండదు. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్లు అనుకొనే కల్మషం, కపటంలేని అమాయకపు నాన్న. నా అత్తవారింటి పటాటో పాన్నిచూసి భ్రమించి పోయినప్పుడు, నాజీవితం జీవంలేనిదని చటుక్కున ఎల్లా అర్థంచేసుకో గలరు? కాని అమ్మ! స్త్రీ మనోతత్వాన్ని అర్థంచేసుకోగలిగే దేవతామూర్తి! నన్ను సరిగ్గా అర్థం చేసికోగలదు! నా మనస్సునంతా విప్పిచెప్పి

అనుతాపాన్ని పొందుతాను. నా జీవితం పవిత్రంగా గడపాలో ఆమె నిర్ణయం ప్రకారం తీర్మానిస్తాను. ఇంకొక నెలరోజుల లోపలే నేను మళ్ళీ అక్కడికి వెళ్ళిపోవాలా?

అత్తవారింటి నుంచి తిరిగి వచ్చిన కొత్త విమలని కదా నేను? నన్ను చూడ్డంకోసం చుట్టుపక్కల వాళ్ళంతా చెంగు చెంగు మంటూ వచ్చారు.

'ఊరికే వచ్చినట్టు లేదే! మనిషి ఆకారం చూస్తే అనుమానంగానే వుంది' అని నన్నుచూసి కళ్ళు చిట్లిస్తూ మా పక్కవీధి హైవేస్ ఆఫీస్ గుమాస్తాగారి భార్య తులశమ్మగారు తమ అభిప్రాయం బైటపెట్టారు.

'నేను అప్పుడే చెప్పలేదా? మన విమల భారసాల భోజనం మనకి చాలా తొందరలోనే తెచ్చేసింది?' అంటూ ఆవిడ సందేహాన్ని వెంటనే తీర్చేసింది మా ఎదురింటి పద్మావతమ్మగారు!

ఈ సందేహం మొదట్లోనే తోచని కోమల తల్లి – 'ఏమండీ! నిజంగానా? నాకు చెప్పకూడదని దాచారా?' అంటూ ఆమె సందేహాన్ని అమ్మకు అందజేసింది.

'మనకితోచనీ ఊహలన్నీ వీళ్ళకి ఎంతెంతగా తోస్తున్నాయి! నా విషయంలో ఎంత ఆశ ఆనందాన్ని చూపిస్తున్నారు!' అని చుట్టుపక్కల వాళ్ళతో పరిచయంలేని పట్టణంనుంచి తిరిగినచ్చిన నాకు, వాళ్ళమాటలు నాకు సంతోషాన్ని కలగజేశాయి. వాళ్ళు అడిగే ప్రశ్నలు నాకు అంతగా నచ్చనప్పటికీ ముఖం ముడుచుకొంటూ, సిగ్గుపడుతూ 'అటువంటిది ఏమీలేదు' అన్నాను కోపం తెచ్చుకొంటూ.

'లేకపోతే నువ్వు చెబుతావేమిటి ? నువ్వు దాచాలనుకొన్నా దాచలేవమ్మా తల్లీ ! దాగదు !' అంటూ ఊర్జితం చేసేసింది పద్మావతమ్మగారు.

'వాళ్ళంతా వెళ్ళిపోయాక సందులో కిటికీలోనుంచి 'ఏమండీ ! అమ్మాయి వచ్చిందటకదూ ?' అంటూ నాకు పరిచయంలేని ఒక స్త్రీ గొంతుక అమ్మను పిల్చింది.

'విమలా ! యిల్లా రామ్మా !' అంటూ అమ్మ నన్ను పిల్చింది. ఎదురుగా కిటికీలో ఒక వయస్సు మళ్ళి నావిడ, సుమారు యిరవైఅయిదు సంవత్సరా లుండవచ్చు అనుకొనేటట్లు ఒక అమ్మాయి కనిపించారు.

'ఇది మా మూడో అమ్మాయి విమల. అయిదేళ్ళపాటు సంగీతం చెప్పించాం. ఇప్పుడు ఎల్లా పాడుతోందో మరి ? మనింట్లో వున్నంతకాలం మనం అన్నీ చెప్పిస్తాం. కాని ఆడపిల్లలు మనకి శాశ్వతమా చెప్పండి' అంది అమ్మ.

వాళ్ళు నాకు పూర్తిగా కొత్తవాళ్ళు. నల్లగావున్న ఆ అమ్మాయి ఆవిడకు దత్తపుత్రిక అట. మద్రాసు సంగీత కళాశాలలో 'డిప్లమో' పొంది కొవ్వూరులో యీమధ్యనే కొత్తగాపెట్టిన ఆడపిల్లలబళ్ళో సంగీతం మాష్టరుగా చేరిందిట- ఈ వివరాలు అమ్మ తర్వాత చెప్పింది నాకు.

'సంగీతం, చదువు చెప్పించి మా శక్తికి మించిన సంబంధం చేశాం. ఆడపిల్ల అంటే కళ్లు నలుపుకోకుండా మంచియింట్లో పడితేనేకదా మనస్సుకి తృప్తిగా వుంటుంది. మననేమో ఏమీ తెలియని జడుల్లా వుంటున్నాం. మనలో నుంచి వచ్చినవాళ్ళేనా సుఖంగా వుండాలనే నా ఆశ. దాని

అదృష్టంకొద్దీ చాలా మంచిచోటే దొరికింది. అల్లుడు చాలా మంచివాడు. తెలివైనవాడు. అన్నగారితోను వాళ్ళతోను కలిసి మెలిసి వుంటూ ఏవిధమైన మనస్పర్థలు లేకుండా సంతోషంగా వుంటున్నారు. ఇంతకన్నా మనకి యింక కావల్సింది ఏముంటుంది చెప్పండి ?' అని అమ్మ లోకాభిరామాయణంలా మాట్లాడుతూ నా అత్తవారింటిని గురించి గొప్పగా చెప్పుకొంది. ఈ మాటలు విన్న నేను, బలవంతంగా వేపకాయలు నమలుతున్నట్లయింది. ఇంత నిశ్చలఅభిప్రాయాన్ని పెట్టుకొన్న అమ్మతో నిజాన్ని బయటపెట్టి వేపచెట్టుని ఎల్లా చూపించను!

'మీరన్నదంతా నిజం. కని, పెంచి, పెద్దచేసి పెళ్లిచేసి నప్పుడు మంచి భర్త, మంచి యిల్లుదొరకాలనేకదా అందరూ కోరుకొనేది. మీ అమ్మాయి చాలా అదృష్టవంతురాలు' అన్న ఆవిడ ఒక్కక్షణం ఆగి — 'నే నడుగుతున్నానని మరోలా అనుకోకండి. అందరూ అనుకొంటూంటే నా చెవిని పడింది. నిజమేనా ?' అంది ఆవిడ నన్నుచూసి నవ్వుతూ.

'అల్లా అని ముందుగా మాకు ఏం తెలియపర్చలేదు. కాపరానికెళ్ళి ఆర్నెల్లు దాటింది కదా అని ఓసారి తీసుకొచ్చాం. మీరందరూ అనేమాటలూ, దాన్నీ చూస్తుంటే నాకే అనుమానంగా వుంది' అంది అమ్మ నన్నుచూసి నవ్వుతూ.

నాకు ఒళ్ళు మండిపోయింది—

'ఏమిటమ్మా అది ? నువ్వూ మొదలెట్టావా ? అటువంటిదేం లేదు' అంటూ కోపంగా అక్కణ్ణుంచి లోపలికి వచ్చేశాను.

అప్పుడు నాకు ఒక సంఘటన జ్ఞాపకం వచ్చింది. నా అత్తగారి తరఫు బంధువులో కావిడ ఒకరోజున వచ్చింది. కొత్తకోడలిని కదా నేను? నన్ను నమస్కరించమన్నారు. నేను వంగి నమస్కారం చేస్తూంటే 'శీఘ్రమేవ సుపుత్రా ప్రాప్తిరస్తు' అని ఆమె బోసినోరు తెరచి నన్ను ఆశీర్వదించింది. ఆ నోటివాక్కు ఎక్కడ ఫలించి పోతుందో అని భయపడ్డట్టు—

'ముందు అతనికి పెద్ద ఉద్యోగం అయి పెద్దజీతం రావాలని దీవించండి. మొట్టమొదట కావాల్సింది అదే!' అంది చంచల. ఆమె అన్నది నిజమేనన్నట్టు—

'అవునవును. ఈ యింట్లో పిల్లలకేం లోటులేదు. ఇప్పటినుంచి ఎందుకు పిల్లలు, పీచులు' అంది నా అత్తగారు.

ఈ అమాయకపు పల్లెటూరివాళ్ళతో వాళ్ళ మన స్తత్వాలను పోల్చిచూసి దీర్ఘనిట్టూర్పు విడిచాను.

చాలా రోజులతర్వాత నాన్న పక్కని కూర్చుని అమ్మ చేతివంట తిన్నప్పుడు నాకు ఆనాటి భోజనం అమృతంలా తోచింది. ఇంట్లో ఏమీ పనిలేకుండా అటూ యిటూ తిరుగుతూ మధ్యమధ్య నాలుగుమాటలు మాట్లాడుతూంటే, అంతవరకు నేను ఎరగని ఒకకొత్త ఆనందం నాలో కలిగింది. 'విమలా! విమలా!' అంటూ అక్కడ కూడా నిముషానికి నూరుసార్లు పిలిచేవారు. కాని యిక్కడ అదే 'విమలా!' అన్న పిలుపు యింతవరకు వినపడనంత సంతోషంగా కదా వినిపిస్తోంది? నా అత్తవారి యింట్లో నేను సంతో

షంగా వుంటున్నానని గర్వపడి తన్మయత్వం చెందే నా కన్న వారికి నా ఆవేదన జీవితం అర్థమయినట్లయితే ఎంత మనః క్షోభ కలుగుతుంది? స్వర్గలోక భోగాలలో యీదులాడు తున్నానని నమ్ముకొన్న వాళ్ల ముందు, వందలు వందలుగా పిశాచాలు, భూతాలు వచ్చి నిలబడినట్లయితే ఎల్లా వుంటుంది? ఇదేనా వాళ్లకి ముట్టే ప్రతిఫలం? నా మన స్సంతా అమ్మదగ్గర విప్పిచెప్పి అనుతాపాన్ని పొందాలని వచ్చిన నేను, యిక్కడికి వచ్చింతరువాత వీళ్ళ మాటలు, వీళ్ల మనోభిప్రాయాలు చూసినతరువాత, అది సరైనపనేనా అనే అనుమానం కలిగింది. తను ఏవిధమైన పరిహారాన్ని చూపించగలుగుతుంది? నిజంగా జరిగిందంతా చెప్పేస్తే, ఒకవేళ అమ్మ నన్నే తప్పు పట్టుకుంటుందేమో? నాకే యింకా ఏ నిర్ణయమూ కలగలేదే!

ఒక విధంగా ఆలోచించినట్లయితే తప్పు నామీద కూడా వుందనిపిస్తోంది. ఏనుగు తన నెత్తిమీద తనే మన్ను పోసుకొని చెడిందన్నట్లు, జీవంలేని నేటి నా జీవితానికి ఆనాడు నేను ఆవేశంతో ఖంగారుగా మాట్లాడటమే కదా కారణంగా కనిపిస్తోంది? ఆ రాత్రి ఎంత రాక్షసిలా సంచ రించాను! ఆయన మనస్సు మాత్రం వుండుపడదా? పౌరుషంవుండదా? ప్రేమభిక్ష కోరుతూ వచ్చినవారిని, అనరానిమాటలని తోసివేశానే? స్త్రీ బుద్ధే బలహీనమైనది అనే విషయం నా విషయంలో ఎంత చక్కని నిదర్శన మయిపోయింది! తప్పు చేసినందుకు తపించిపోతూన్న నన్ను, తప్పుచేసిన పిల్లవాడిని దండించినట్లు — నాకు కూడా వెంటనే

ఏదైనా దండన విధించి, నన్ను తనదాన్నిగా చేసుకోని వుండకూడదా? బయటకుమాత్రం ఎవళ్ళకీ ఏవిధమైన అను మానమూ కలగకుండా వుండేటట్లు 'విమలా! విమలా!' అంటూ ప్రేమగా వున్నట్టుగానే పిలుస్తూవచ్చారేకాని, నన్ను ఒంటరిగా కలుసుకోవటానికి సాహసించటంలేదే! నాన్నతో పాటు బయల్దేరుతూంటే అందరి ఎదురుగా, తను ఎంతో బాధపడుతూన్నట్లే నటించారు. కాని నాకు సంబంధించి నంతవరకు ఆయన పూర్తిగా మారిపోయారు! తన భార్య 'నన్ను ముట్టుకోవద్దు' అని ఆగ్రహంలో అన్న మాటని పాండురంగని మీద ఒట్టుగా భావించిన పరమభాగవతోత్త ముని మాదిరిగా నేను ఆ రాత్రి పీడకలకన్న ఆవేశంలో అన్నమాట, ఒట్టుగా భావిస్తూ సంచరిస్తున్నారే!

మంత్రవేత్త చేతిలోని మంత్రదండంలాగా మనస్సు నన్ను ఆడించివేస్తోంది. ఒకచోట స్థిరంగా వుండకుండా అటూ యిటూ ఒకదిశనుంచి మరొకదిశకు పరిగెడుతోంది. ఒక పక్క తప్పు నామీద వున్నట్లు చూపిస్తూ మరోపక్క నుంచి ఆయన తప్పులను వాదించటానికి తయారవుతోంది!

నిజంగా ఆయనకి నామీద అనురాగం వున్నట్లయితే ఏదో పీడకలకన్న ఆవేశంలో మాట్లాడేశానని సమా ధానపడి, నన్ను క్షమించి, నాతో ఒంటరిగా మాట్లాడకుండా వుంటారా? ఒంటరిగా నన్ను చూసినంతమాత్రంచేత కర్ణుణ్ణి చూసిన కుంతీదేవి మనస్సు తడబడినట్లు, ఖంగారుపడిపోతూ అటూ యిటూ చూస్తూ హడావుడిగా ఆ వెధవ ఆఫీసు కాగితాలలో బుర్ర దూర్చేసుకొంటున్నారే! నేను తన

దగ్గరకి వచ్చినంతమాత్రంచేత సూర్యుణ్ణి చూసి కరిగిపోయే మంచులా ప్రేమావాహిని పొంగిపారలే ఆమనస్సు, యిప్పుడు ఒక్కసారిగా ఘనీభవించి పోయిందెందుచేత? ప్రేమలోని పాశానికి, మమతలోని మమకారానికి, అనురాగంలోని ఆదర్శానికి ఆయన ఆదర్శపురుషులని, స్త్రీలకి సర్వస్వతంత్రాన్నిచ్చేవారని కోటలు కట్టిన నా ఎదురుగుండానే, ఆయన, ప్రేమలో పాశమే లేనట్లు, మమతలో మమకారమే లేనట్లు, అనురాగంలో ఆదర్శమే లేనట్లు అస్వతంత్రంగా నడిచే తన జీవితంలో నేనుకూడా ఒత్తుకుపోవాలని నన్ను నిర్బంధపరిచేటట్లు ఆయన నడుస్తూంటే, నాకు ఏర్పడే అంతులేని ఆశాభంగంలో విరక్తి కలగటం తప్పెందుకవుతుంది? అన్నగారిమీద వదిన గారిమీద ఆయనకు మితిలేని విశ్వాసముంటే వుండవచ్చును. ఆ విశ్వాసంలో వాళ్లు ఏంచేసినా ఆయనకుబాధలేకపోవచ్చు! కాని నన్ను తన హృదయపీఠంలో పెట్టి పూజిస్తున్నానని, అలంకారస్వరాలు పలికిన ఆయనకు, వాళ్లు నన్ను నమ దాసీదాని స్థానంలో వుంచినట్లు నడవటం ఆయన కళ్ళకి ఎందుకు కనిపించలేదో! ప్రేమకన్నా విశ్వాసమే కదా ఆయన హృదయంలో స్థానమేర్పరచుకొంది? ఆలోచించి, ఆలోచించి చూసినట్లయితే నామీద తప్పేమీ లేదనిపిస్తోంది!

ఆలోచనాసాగరంలో మునిగిపోయి అంతుతెలియని నేను, నా బాధనంతా నావాళ్ళతో చెప్పుకోవాలని వచ్చిన నేను, యిప్పుడు నాకు వాళ్లతో చెప్పగలిగే ధైర్యం రావటం లేదు. తల్లిప్రేమలో, పుండ్లుపడిపోయిన నా మనస్సుకు మందు వేసుకోవటానికి పరుగెత్తుకువచ్చిన నాకు, ఆ పుండ్లు అన్నీ

రేగి బాధ ఎక్కువైందేకాని చితిపివేయగల ధైర్యం రాలేదు. జ్వరంగా వున్నట్లు చెబితే అమ్మ యింట్లోనుంచి బయటికి వెళ్ళనివ్వదని భయపడి వంట్లో ఏమీా సుస్తీ లేనట్లు తిరిగే పిల్లవాడిలా, నేనుకూడా లోలోపల ఏడుస్తూ బయటకు నవ్వుతూ సంచరించాను.

మా పక్కింటి అమ్మాయి జానకికి, నాకూ సంగీతంతో బాగా స్నేహం కలిసిపోయింది. ఆమె గొంతుక అంత శ్రావ్యంగా వుండదు. నేను పాడిన నా గొంతుక శ్రావ్యాన్ని విని ఆమె చకితురా లయింది.

'ఇంత శ్రావ్యంగా పాడగల నువ్వు అలక్ష్యంగా వుంటున్నావే విమలా! నీ సాధకాన్ని వదలకుండా అభివృద్ధి చేసినట్లయితే కళారంగంలో చీకట్లో చంద్రునిలా ప్రకాశిస్తావు విమలా!' అంటూ నాలో ఆశను రేకెత్తించింది జానకి. నేను అక్కడ వుండగానే, ఒకనాడు ఆమె విజయవాడ రేడియో స్టేషన్‌కి వెళ్ళి పాడి వచ్చింది. నేను, అమ్మ, వాళ్ళమ్మ - అంతా పోస్టుమాష్టరుగారి యింట్లో రేడియోలో ఆమె సంగీతాన్ని విన్నాము. 'జానకి లాగనే నేను కూడా పాడనా? అకస్మాత్తుగా, ఆయన ఆశ్చర్యపడేటట్లు ఆకాశ వాణి పుస్తకంలో 'విమలా - చంద్రశేఖరం' అనే పేరుపడితే ఎల్లావుంటుంది!' అని ఓకొత్త ఆలోచన ఒకటి తోచింది. నాకు తోడుగా వున్న మా పక్కింటి అమ్మాయి జానకితో కలసి, నా పాత సంగతులన్నీ మర్చిపోయి ఓ కొత్తలోకంలో ప్రవేశించాను. ఒక కొత్త లక్ష్యం నా ముందు ప్రత్యక్ష మయ్యింది!

అల్లుడి ఆజ్ఞ ఆ మరుక్షణమే నెరవేర్చేటట్లు నావాళ్లు చేసే నా ప్రయాణ సన్నాహాలుచూసి నాకు బెంగ పట్టు కొంది. ఆరాత్రి అమ్మతో అంతరంగంగా నాబాధ చెప్పటం ఆరంభించాను.

'అమ్మా! యిప్పుడు నన్ను దిగబెట్టనక్కర్లేదు. మెల్లిగా వెళ్లచ్చు. ఖంగారేంలేదు' అన్నాను మెల్లిగా.

నన్ను ఆశ్చర్యంగా చూసింది అమ్మ!

'అల్లాఅంటే బాగుంటుందా విమలా? అతను ఆశపడి ఆహ్వానించి నప్పుడు నువ్వు యింకా యిక్కడే వుంటానంటే తప్పు మామీద పడుతుంది విమలా!' అంది అమ్మ.

'కాదమ్మా! నాకు అక్కడికి వెళ్లాలనే లేదు. ఎందుకు వెళ్లాలా అని ఏడుపొస్తోంది!'

'చాలాబావుందీ వరస! పుట్టింట్లోనుంచి వెళ్లాలంటే మొదట్లో అల్లాగే వుంటుంది. తెలివితక్కువ తనంగా వాళ్లం దరి ఎదురుగుండా యిల్లా మాట్లాడకు. వాళ్ళేమనుకొంటారు యిదివింటే?'

'నీకు తెలీదమ్మా...! అక్కడ...నాకు చాలాబాధగా వుంది. నేనే అన్నిపనులూ చెయ్యాలి. నా అత్తగారికి పెద్ద కోడలి మీదే ప్రేమ. ఆవిడగారు ఎంతంటే అంతే! అందుకే నన్ను యిప్పుడు పిలుస్తున్నారు' అని చిన్నపిల్లలా గారాబం చేశాను.

'భలే తెలివైన దానివేనే నువ్వు! చదవేస్తే వున్నమతి కాస్తా పోయిందా ఏమిటి? బయటికి చెప్పుకొంటే సిగ్గుచేటు! ఏమిటే నీకక్కడబాధ. ఆడపిల్లగాపుట్టింది అత్తారింట్లోఆడుతూ

ఈ సమయంలో నాన్న నాకు ఒక ఉత్తరం యిచ్చారు. 'శ్రీమతి విమలా చంద్రశేఖరం' అని అచ్చులా అందంగా రాయబడిన అక్షరాలున్న ఉత్తరాన్ని యింతకుముందు, యిదే యింటిలో నేను అందుకొన్నప్పుడు నా మనస్సు చంద్ర బింబాన్ని చూసి పరవశమయిన సాగర రాకుమారిలా పులకరించిపోయిందే! అప్పుడు అంతులేని ఆనందపరవశంతో వణికిన నా చేతులు, ఇప్పుడు వివరం తెలియని విరక్తితోను, భయంతోను వణికాయి! ఆ కవరులో నాన్నకు ఒక ఉత్తరము, నాకు ఒక ఉత్తరము వున్నాయి. నా ఉత్తరంలో ఇంగ్లీషులో సరిగ్గా నాల్గే పంక్తులు. దాని భావం—

ప్రియమైన విమలా!

వేసంకాలం విహారానికి అన్నయ్య, వదిన మొదలు అంతా సిమ్లా వెళ్ళటానికి నిశ్చయించాం. అందుచేత యీ ఉత్తరం అందిన వెంటనే మీ నాన్నగారిని నిన్ను తీసుకొచ్చి దిగబెట్టమని చెప్పు. ఆయనకికూడా వేరే వుత్తరం పంపు తున్నాను. ఏదో ఒక కారణాన్ని కల్పించుకొని రాకుండా మాత్రం ఉండిపోకు. — చంద్రం.

అమ్మా, నాన్నలసంతోషం వర్ణనాతీతం. నేను ఏదో ఒక మహారాజుకు జీవితాన్ని ధారపోసిన మహారాణిగా భావించి వాళ్లు పరవశులైపోయారు. కాని పర్వత నివాసం అనుభవించబోయే మహారాజుకి, మహారాణికి పనిమనిషిగా వుండటంకోసమే నాకు యీ పిలుపు వచ్చిందని నాకు కదా తెలుసును?

పాడుతూపని చేసుకొంటూనే పోవాలి? కమలని చూడు-వచ్చి నాలుగు రోజులుందంటే చాలు, ఎప్పుడు వెళ్లిపోతానా అన్నట్లుంటుందేకాని వెళ్లనని అంటుందా? ఆశతో పిలుస్తున్నారు - నువ్వేమో వెళ్ళనంటూ కూర్చో. అన్నా తమ్ములంటూ సోదరభావంతో ఏ గొడవలు లేకుండా వుంటున్నారే యింకా యీ రోజుల్లో! అందుకు మేం ఎంత గర్వపడుతున్నామో తెలుసా? పిచ్చి పిచ్చి వాగుడు నాగి మా పేరు చెడగొట్టకు -' అంది అమ్మ కోపంగా.

అల్లుడిమీద నేనుకూడా నమ్మలేనంత మంచి అభిప్రాయం వీళ్ళలో పాతుకుపోయినప్పుడు నేను ఏంచెప్తేమాత్రం వీళ్లు నమ్ముతారు? మొదట్లోనే, అమ్మ నామీద అనుతాప పడటానికి బదులు ఎదురుతిరిగిన అమ్మ, నాకూ, నా భర్తకూ మధ్యవున్న అగాధసంబంధాన్ని చెబితే నమ్ముతుందా? అంత మంచి అల్లుడిగా కనబడి, అమ్మా నాన్నల దగ్గర మంచి పేరు సంపాదించుకొన్న ఆయనమీద నాకు పట్టలేని అసూయ కలిగింది. పైకిమాత్రం అనురాగం వున్నట్లు నటించే ఆయన మనస్సులో నిజంగా ఏముందో!

ఏమిటో...ఆడదాని మనస్సు అర్థంకాదు, అర్థంకాదు అంటూ కథారచయితలు, కావ్యకర్తలు, వందలకొద్దీ పేజీలు వారి రచనా చాతుర్యంతో రాసేస్తున్నారు. కాని యీ మగవాళ్ళ మనస్సుకన్నా అర్థంకానిది ఏదీ లేదని నేను అనుభవపూర్వకంగా తెలుసుకొన్నానే! చంచలంగా చెదిరిపోయిన నా మనస్సు ఆయన మనోగుహాలో దాగివున్న నిజాన్ని వెతికి తెలుసుకోలేకపోయింది.

' అమ్మా! నువ్వు అనుకొంటున్నట్లు నేను చిన్న పిల్లలా పిచ్చి పిచ్చిగా మాట్లాడటం లేదు. నువ్వా తెగపొగిడే నీ అల్లుడిలాంటి రాతిగుండె కలిగిన మనుష్యులు యీ ప్రపంచంలో నే వుండరు! ఆయన అన్నయ్య, వదినలు ఆయనకి ఎంత చెబితే అంత! అనురాగం, ఆదరం లేని ఆ యింట్లో యింక చెఱనాల జీవితం అనుభవించలేనమ్మా!' — నాకు ఏడుపు ముంచుకొచ్చేసింది.

'ఏమిటి విమలా యిదంతా! నువ్వు సుఖంగా వున్నావని మేము ఎంతో సంతోషిస్తున్నామే! మీ నాన్నేమో నీకన్నా అదృష్టవంతురాలు యీ ప్రపంచంలో లేదంటూ పరవశమయిపోతున్నారు! నువ్వేమో అందరిని నట్టేట్లో ముంచేటట్లు మాట్లాడుతున్నావే! అనురాగం, ఆదరం లేని భర్తేనా యింకా ఒక నెలేనా పూర్తికాకుండా రమ్మంటూ రాస్తాడు? కుటుంబం అన్నతర్వాత మంచీ, చెడ్డా రెండూవుంటాయి. ఈమాత్రంకూడా అర్థంచేసుకోకుండా యిక్కడే వుండిపోతానంటే నలుగురూ ఎవ్వరూ? ఒకవేళ నువ్వన్నట్లు నిన్ను కష్టపెట్టినప్పటికి, తలవంచుకొని తిరగటమే ఆడదానికి మంచిది. కొడుక్కి సంబంధం చూసి పెళ్లి చేసింది — మనుమలు, మనుమరాళ్లు కూడా పుట్టి వాళ్ళ పెళ్ళిళ్ళుకూడా అయ్యాయి—ఇప్పుడు కూడా మీ బామ్మా, అత్తయ్యలు నన్ను దెప్పి పొడుస్తూంటే నేను వాళ్ల ఎదురుగుండా ఏం మాట్లాడగలుగుతున్నాను? — అన్నయ్య వదినలు ఎంతంటే అంతేనంటున్నావు! కాని నువ్వా ఆమాట అనచ్చునా? ఓర్పు సహనమూ వుండఖర్లా? చెడ్డపేరు తెచ్చుకోవటానికి ఎంతోసేపు పట్టదు

విమలా? కాని మంచిపేరు తెచ్చుకోవాలంటే ఎంతో శ్రమ పడాలి. ఎంతో కష్టపడాలి. కొన్ని సంవత్సరాలుకూడా పట్టచ్చు, కాని 'మంచిది' అని చెప్పుకోకపోయినా 'చెడ్డది' అని నలుగురూ చెప్పుకోకుండా వుంటే ఆడదానికి అంతకంటే యింకేమీ అవసరం లేదు. బయటతిరిగి వచ్చిన భర్త ఒకో సమయంలో కోప్పడవచ్చు. అంతేకాదు కొట్టేసేవాళ్లుకూడా వున్నారు. ఓర్పుతో సహించుకోవాలి! అసలు నీకు తొందర ఎక్కువ! మంచీ చెడ్డా అని ఆలోచించే జ్ఞానం లేదు నీకు! ఏం మాట్లాడుతున్నామో ఎవరితో మాట్లాడుతున్నామో అనే ఆలోచనకూడా లేకుండా అవక తవక వాగుడు వాగటం నీకు బాగా అలవాటు! నే నిల్లాఅంటే నీకు కోపం వస్తుంది - ఏం? అత్తయ్య నీకు రెండు చీరెలు యిస్తే, మొహాన్నేసి కొట్టినట్టు, అబద్ధం చెప్పి ఆ అబ్బాయి చేతికిచ్చి పంపించేశావే! పెద్దవాళ్ళం మేము యింకా వున్నామని, మంచీ, చెడ్డా, మర్యాద అనేది ఏమైనా ఆలోచించావా? నువ్వు చేసిన ఆ తెలివితక్కువపని నా నెత్తిమీదకదా వచ్చి పడింది? అక్కడకూడా యిల్లాగే వున్నావు కాబోలు. అందుకే యిల్లా తయారయావు! పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యక యిక నించేనా తిన్నగా వుండు!' అని అమ్మ, పాతకుప్ప నంతా వెల్లగించి నన్నే తప్పుపట్టుకొని నాకు హితోపదేశం చేసింది.

ఈ ఘట్టంలో ఎక్కడికో వెళ్ళిన నాన్న అప్పుడే వచ్చారు. 'తల్లీ కూతుళ్ళిద్దరూ కలసి ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నా రేమిటి?' అంటూ నవ్వుతూ వచ్చారు.

నాకు నోటమ్మట మాటకూడా రావటంలేదు. కాని ఎంత విచిత్రం! అమ్మ చమత్కారంగా 'ప్లేట్' మార్చేసింది!

'ఆలోచనా? ఆలోచనా లేదు; ఏం లేదు. పల్లెటూరి దాన్ని కదా నేను. పట్టణవాసం కబుర్లూ, అత్తవారింట్లో దాని సంతోషం చెబుతూంటే ఆశ్చర్యపోతూ వింటున్నాను' అంటూ నవ్వుతూ భోజనాలు వడ్డించింది అమ్మ.

'అవును. మన విమల పూర్వజన్మలో ఎంత పుణ్యం చేసికొందో? ఈనాడు దాని ఫలితాలన్నీ చక్కగా కనిపిస్తున్నాయి! ఒకవిధంగా తను మన కూతురైనందుకు మనం అదృష్టవంతులం' అన్నారు భోజనానికి కూర్చున్న నాన్న నన్నుచూసి నవ్వుతూ.

అమ్మ ఎందుకు యిల్లా ప్రవర్తించింది? నా నిజ సంగతులు నాన్నకి తెలిస్తే తప్పేముంది? నేనే చెప్దామనుకొన్నానే! కాని అమ్మ ఒక్కసారిగా అన్నింటిని కప్పివేసినప్పుడు నేను ఏం చెయ్యను? ఏం చెప్పను? ఎల్లా చెప్పను? దాంపత్య జీవితం నాకు మనఃక్షోభతో నిండిపోయిన దుఃఖ చెఱసాల అయిపోయిందే! ఆహా! ఆ ప్రకాశంలేని ఆ ఆకాశం – ఆ వాన – ఆ మెరుపులు – ఆ ఉరుములు – ఆ పిడుగులు – ఆ ఛంచలపాట – ఆ కొత్తచీర చిరగటం – ఆ కల – ఆ రాక్షసరూపం – నా భవిష్యత్తుకు ఎంత చక్కని నిదర్శన సూచకాలు!

ఇంట్లో యింటిపని చేయటానికి ఆడది కావలసినప్పుడు యిష్టాన్ని తీర్చుకొనేందుకు తీసుకురాబడిన ఆడదానికి 'భార్య' అని అర్థం కాబోలు! ఒకదాని వెనకాల ఒకటిగా అంతు

లేకుండా గొలుసులా వచ్చే ఆశాభంగాలకోసమేనా నేనీ ఆడజన్మ ఎత్తాను?

తుఫానులో సముద్రం మధ్యలో చిక్కుకుపోయిన ఓటి పడవలా, ఆధారమనేదే లేకుండా జీవితసాగరంలోని సుడి గుండంలో చిక్కుకుపోయా ననిపించింది. శ్వాస వున్నంతవరకు, మరణంతో పోరాడే వ్యాధిగ్రస్తునిలా నేనుకూడా నా జీవిత సాగరాన్ని నాలో శ్వాస వున్నంతవరకూ యీదుతూ దాట ప్రయత్నించవలసిందేగా? లేక మరి నాకు దారేముంది?

# 13

తానొకటి తలచ దైవమింకొకటి తలచునన్నట్లు, అత్తయ్య యింట్లో కాలు పెట్టకూడదనుకొన్న నేను, అత్తయ్య యింటికి రావలసి వచ్చింది. నూతనజీవితంలో ప్రవేశించబోతున్నామనే ఉత్సాహంతోను, ఆనందంతోను పరవశించిన రోజులవి. ఎంత చిన్నమాటకైనా నా మనస్సుకు పౌరుషాన్ని తెచ్చిన రోజులవి. మనస్సుకు పాఠాలునేర్పే ప్రకృతి పరిస్థితులే చాలా విచిత్రమైనవి.

'ఇక్కడనుంచి తిన్నగా సిమ్లా వెళ్ళేకన్నా ఆగ్రాలో నాలుగు రోజులుండి వెళ్తే బాగుంటుంది' అని మా ప్రయాణానికి ఒక 'ఎమెండ్ మెంటు' తీసుకొచ్చారు నాభర్త.

'అవును చంద్రం! నేనూ అదే అనుకొంటున్నాను. ఆగ్రాలో విమల అత్తయ్య వుంది. అక్కడ ఒక వారం రోజులు వుందాం. పెళ్ళిలోనే వాళ్ళతోపాటు వాళ్ళింటికి రమ్మంటూ

మరీ మరీ బతిమాలింది. ముందు టిక్కెట్లు ఆగ్రాకే రిజర్వు చేయించు' అని వారి అభిప్రాయాన్ని సమర్థించి, 'ఆర్డరు జారీచేసింది నా తోడికోడలు చంచల.

ఆయింటికి ఆవిడగారు మహారాణికదా? ఆవిడ అభిప్రాయానికి అడ్డుకూడా వుందా?

నిర్మల మాతోకూడా వస్తున్నట్లు లేదు. ఎందుచేతనో అని నేను బాధపడ్డాను.

'ఏం నిర్మలా? అందరికన్నా నువ్వేకదా ముఖ్యం? మోహనరావుకి, నువ్వు రావేమోనని అనుమానం కలిగిందో ఏమిటో - నిర్మలకి పరీక్షలు అయిపోయా యనుకొంటాను. అంటూ నాజూగ్గా రాశాడు వుత్తరం' అన్నారు నాభర్త ఆమెను ఎగతాళిచేస్తూ.

'మొట్టమొదటగా పెళ్లికూతురులా ఆయింట్లో కాలు పెట్టాలనుకొంటోందేమో! తన ఆశ ఎందుకు చెడగొట్టావు? అన్నారు నా బావగారు యింకా వేళాకోళంగా.

ఎదటి మనస్సు తెలుసుకోకుండా పరిహాసం చేస్తూ పెద్ద 'డర్బీ స్వీప్ప్రైజు' కొట్టేసినట్లు సంతోషపడుతూంటారు కొందరు పెద్దమనుష్యులు. మా ఊళ్ళోవాళ్ళంతా నన్ను 'ఉత్తిమనిషిగా రాలేదు' అని నాకడుపుమంటను ఎగదోసినప్పుడు నేను ఎంతబాధ పడ్డానో, యిప్పుడు నిర్మలకూడా అల్లాగే బాధపడుతోందని నాకుమాత్రమే కదా తెలుసు!

మా రాకను అత్తయ్య, మావయ్య, బామ్మ అంతా చాలా ఆత్రతగా ఎదురుచూస్తున్నారన్నట్లు కనిపించారు.

'ఆ టెక్కు టక్కులాడి దీన్ని నానా పాట్లూ పెట్టి దీని గడ్డి దీని కెడుతుంది' అని చంచలకు 'సర్టిఫికేట్' యిచ్చిన అత్తయ్య చంచలతో మురిసిమురిసి మాట్లాడటం, చంచల అత్తయ్యతో తరచితరచి తలపోయటం చూసి, నాభిలో ఒకటి నాలుకమీద మరొకటి పెట్టుకొని మాట్లాడటం ఒక కళగా నేర్చుకొన్నారేమోనని నేను భ్రమించిపోయాను. శ్యామల యీ ఏడెనిమిది నెల్లలోను చాలా మారిపోయింది. ఆమె కట్టూ, బొట్టూ, నడక, నవ్వూ అన్నీ ఆమె ఒక నాగరీక 'కాలేజిగర్ల్' అనే ముద్రతో కనిపించింది. ఈర్ష్య, జుగుప్స, మదమాత్సర్యాలు ఆమెలో శాశ్వత స్థానం ఏర్పరచుకొన్నాయి. ఇదివరకు 'విమలా, విమలా' అంటూ అస్తమానూ నా చుట్టూ తిరిగే ఆమె, యిప్పుడు నాతో మాట్లాడటానికి కూడా ఆమెకు ఏదో అనమానంలాగున్నట్లు కనిపించింది. నిజమే! నేను ఐశ్వర్యం లేని పేదరాలిని. తోడికోడలు పిల్లవాడికి పాలు పట్టించటం, నీళ్లు పోయటం, నిద్ర పుచ్చటంతోనే సరిపోతున్న నాకు, నేను చీర మార్చుకోవటానికి తలదువ్వుకోవటానికి కూడా శ్రద్ధ చూపించక పోవటంతో ఆమె కళ్ళకి నేనొక దాసీదానిలా కనిపిస్తున్నానేమో!

తన అంతస్థుకు సరిసమమైన వాళ్ళని అత్తయ్య చంచలతో కొత్తకొత్త నగల గురించి, పట్టుచీరలు గురించి మాట్లాడుతూ తన యినప్పెట్టె తెరిచి చూపించి అభిప్రాయం అడిగింది. నేను యింట్లో ఆమె పిల్లవాడిని కనిపెట్టుకొని వుంటే వాళ్ళంతా ఊరంతా తిరుగుతున్నారు! వాళ్ళని

ఉత్సాహపరుస్తూ అత్తయ్య ఇంకా పదిరోజులుపాటు వుండి వెళ్ళండి, ఇక్కడ చూడవలసినవి ఎన్నో వున్నాయి. ఒక్క తాజ్ మహల్, యమునానది-ఇవి చాలు సంవత్సరాలతరబడి చూస్తూ కూర్చున్నా తనివితీరదు. మళ్ళీ యీ పక్కకి ఎప్పు డొస్తారో!' అని చంచలను యింకా ఉత్సాహపరిచింది.

ఆహా! ఈ డబ్బుకి ఎంత గౌరవం? మగవాళ్ళలో ఇంత తేడా వుంటుందో లేదో తెలియదు. కాని, మూడునంతుల ముప్పాతిక పాళ్ళు ఆడవాళ్ళలో ముఖ్యంగా పడుచువాళ్ళు, వాళ్ళు పెట్టుకొన్న నగలతోను కట్టుకొన్న బట్టలతోను వాళ్ళ గొప్పతనాన్ని కొలిచేస్తున్నారు! నా అత్తయ్యకు చంచలమీదవున్న అభిమానం, మర్యాద, ఆమెకన్నా ఎక్కువ దగ్గర, చనువు అయిన అమ్మమీద వుందా? ధగధగ మెరిసే వజ్రాలు, మిలమిల మెరిసే పట్టుచీరలు దాని దగ్గర ఎక్కడున్నాయి? బోసి మెడతోను, గాజుగాజులతోను, నూలు చీరతోను అమ్మగనక యీ యింటికి వచ్చినట్లయితే ఆమెకు ఎటువంటి మర్యాద జరుగుతుంది? 'ఇదివరకు వచ్చినప్పుడూ ఏమీ చూడలేదు' అనే అభిమానంతోనైనా అత్తయ్య కూడా, నన్ను వాళ్ళతోపాటు ఊళ్లో వింతలు చూడ్డానికి రమ్మని పిలవలేదు! అసలు యిరవైనాలుగు గంటలూ తనూ చంచలా కలసి మాట్లాడుకోవటానికే చాలనప్పుడు నా సంగతి ఆలోచించేందుకు ఆమెకు వ్యవధి ఎక్కడుంది?

బామ్మకి నా మీద కలిగిన అభిమానమే చాలా విచిత్రమైనది!

'ఏమే పిల్లా! ఈ గాజు గాజులేసుకొని వాళ్ళముందు తిరగటం ఏం బాగుండలేదు. మీా అమ్మకీ నాన్నకీ ఈ మాత్రం కూడానా తెలియలేదు? పెళ్ళయి కాపరానికి వెళ్ళే పిల్లకి నాలుగు వస్తువులు చేయించి పంపాలనే జ్ఞానంకూడా లేదు మీా అమ్మకి! ఏమిటో...మళ్ళీ, చెమటోడ్చి సంపాదిస్తున్నాడు మీా నాన్న! ఈ డబ్బంతా ఏం చేస్తున్నారో! పిల్లకి పెళ్లిచేశారుట పెళ్ళి! ముక్కూ చెవులకీ కూడా లేకుండా...ఛీ!' అంది బామ్మ ఒకరోజున నన్ను చూసి సహించలేనట్లు.

అవును! నిజమే! వేలకివేలు సంపాదించే ఆగర్భ శ్రీమంతుని కూతురు కదా శ్యామల! చెవులకి బండి చక్రాల్లాంటి దుద్దులు, ముక్కుపుడకే లేని ముక్కూ, గాజులే లేని మొండిచేతులు, బామ్మకి చూడటానికి చాలా బాగుంది! డబ్బున్న వాళ్లు అనే డమారం ముద్ర పడ్డప్పుడు తల్లకిందులుగా నిలబడినా, ఒళ్ళంతా కనిపించేటట్లు అసహ్యంగా బట్టలు కట్టుకొన్నా, అదంతా నాగరీకమని, నాజూకని సరి పెట్టుకొని సంతోషిస్తున్నారు. బీదదాని నవటంచేత, అణకువగా వుండటంచేత వాళ్ళ కళ్ళకి చూడ్డానికి అసహ్యంగా కనిపిస్తున్నాను నేను!

స్త్రీలు ముందుకు రావాలని ముందుకు రావాలని గొంతుకు బొంగురుపోయేలా గొంతెత్తి గోలచేస్తారు. కాని యీా బట్టలు, నగలుకు సంబంధించినంతవరకు పద్ధెనిమిదో శతాబ్దం స్త్రీలకి యీా యిరవయ్యో శతాబ్దం స్త్రీలకి యించుమించు గుణగణాలు ఒకేలాగున్నాయి. కాసులపేర్లు, కంటెలు

అనేవి రకరకాల నెక్లస్‌లగా అవతారాలెత్తాయి. అంతే! అంతవరకూ మాత్రమే! లేకపోతే అత్తయ్యకూ నాకూ మధ్య యింత పెద్ద అగాధం వుండటానికి కారణం ఏమిటి? నాలో అందం లేదా? చదువు లేదా? జ్ఞానం లేదా? గుణంలో మాత్రం నేను ఎందులో తక్కువ? ఈ చంచల నన్ను యింత చిన్న తనంగా ఎందుకు చూస్తుంది? నాకు బదులుగా యీ శ్యామల ఆమె తోడికోడలయి వుంటే— 'పిల్లవాడు ఏడుస్తున్నాడు, కొంచెం హార్లిక్స్ పట్టు శ్యామలా' అని చెప్పగలిగే ధైర్యం ఆమెకు వుంటుందా?

అవాళ తీసుబడిగా లోకాభిరామాయణం తిరగవేస్తూ 'బహుశా యింకో రెణ్ణెల్లలో పే మా శ్యామల పెళ్లి చేసేస్తాం, అప్పటికి మీరు యింకా సిమ్లాలోనే వుంటారేమో కూడా. తప్పకుండా రావాలి' అని అడ్వాన్సుగానే ఆహ్వానించింది అత్తయ్య చంచలని.

'మేమూ అదే అనుకొంటున్నాం. బడి తెరిచినా కూడా పిల్లలని పంపేసి, నేను నాలుగు నెల్లపాటు ఇక్కడే వుండి ఆరోగ్యం బాగుపడ్డాకే యింటికి వెళ్ళాలనుకొంటు న్నాను. అమ్మాయి చదువుకొంటునట్లుందే - అప్పుడే పెళ్ళి చేసేస్తారా?' అంది చంచల.

'చదువుకొంటూంటే ఏం? మేనరికమే! అతనికి యీ సంవత్సరంతో చదువు పూర్తయింది. ఏదో అదికాస్తా అయిందనిపించేస్తే బెంగ తీరిపోతుంది చూడండి. వాళ్ళ నాన్నకి కొద్దిరోజులనుంచి ఆరోగ్యం బాగుండలేదు. అందు

చేతే తొందరపడుతున్నాం. అతను కలకత్తాలో యీ సంవత్సరమే 'బి. ఇ.' పూర్తిచేశాడు' అంది అత్తయ్య.

నాకు అంతవరకు రాధాకృష్ణ సంగతి జ్ఞాపకమే రాలేదు. ఆహా! ప్రకృతి ఎంత విచిత్రమైనది! అక్కడ నిర్మలకి మోహనరావు! ఇక్కడ శ్యామలకు రాధాకృష్ణ! నిర్మలకి యీ సంగతి తెలిస్తే ఎంత బాధపడుతుంది? ఆడదంటే ఆమెకదా ఆడది! చదువులోను, అందంలోను, అన్నింటికన్నా మించిన గుణంలోను ఉత్తమమైనది! ఇదివరకు ఎంతో చనువుగా నాతో తిరిగిన శ్యామల యిప్పుడు ఎడమొహం పెడమొహంగా తిరుగుతోందే! బయటిరూపాన్ని చూసి మోసపోకుండా, అంతరంగంలోని అందాన్ని చూసి అర్థంచేసికొని నడిచే ఆమెకదా నిజమైన నాగరీకం కలిగిన ఆడది? శ్యామల మాదిరిగా ఒళ్ళంతా కనిపించే బట్టలు, 'మేకప్' అంటూ ఏమీ లేకుండా, వంచిన తల ఎత్తకుండా అణకువగా ఆమె కాలేజీకి వెళ్ళివచ్చే ఒక్క గుణం చాలునే! నిర్మలకు యీసంగతిని నేను తెలియపర్చవద్దా? అనురాగం ఆదరం లేని ఆ యింట్లో నన్ను ఆనందింపచేసే ప్రాణి ఆమె ఒక్కత్తే కదా?

అమ్మకూడా నన్ను ఆమె ప్రేమలోనుంచి తోసివేసినట్లే తోచింది. ఆమె అనుతాపాన్ని ఆదరాన్ని ఎదురుచూసిన నన్ను, తప్పంతా నాదేనన్నట్లు మాట్లాడిందే! తొందరపడే దానిని అంటూ అసలు సంగతిని అల్లాగే అణిచివేసిందే! అదికూడా తెలిసికొని వున్నట్లయితే యింకా నన్ను ఏవిధంగా తిట్టేదో?

కొత్తగా ఏదైనా అలంకారం చేసికొన్నట్లయితే అద్దంలో తనకు తానే చూసుకొని ఒక అభిప్రాయానికి రావటంకన్నా, యితరులకంట పడి వాళ్ళ అభిప్రాయమే సరియైన దనుకొంటాం కదా ? అటువంటిదే అయివుంటుందా నా మనస్సుకూడా ? నన్ను చిన్నపిల్లనుంచి పెంచి పెద్దదానిగా చేసిన నా తల్లికి, నా మనస్తత్వం నాకన్నా బాగా తెలుసునా ? అల్లా చూపినట్లయితే నేను ఆరాత్రి తొందరపడ్డాననే కదా అర్థమవుతోంది ! ఒక్క చుక్క విషంబిందెడు పాలనీ కూడా విషమయం చేయగలశక్తి కలిగిందన్నట్లు ఆరాత్రి నా రాక్షసత్వం ఆయన అపారప్రేమని, అనురాగాన్ని అంతర్థానం చేసేసిందా ?

నిర్మలసంగతి ఆలోచిస్తూ ఎల్లాగో యీ ఆలోచనలోకి వచ్చేశాను. తీగ కదిపితే డొంకంతా కదిలిందన్నట్లు యిల్లా ఆలోచిస్తూంటే మనస్సు పాడవటమే కాని ప్రయోజనం ఏమీ వుండదు ! నా మనస్సును గిల్లుకుంటూ గిల్లుకుంటూ పోయినందుకు ఫలితం, యింకా సందేహాలు, ప్రశ్నలు ఎక్కువయాయేకాని, ఆయన మనస్సు లోతును కొలవగలిగే కొలబద్ద నాకు దొరకలేదు.

నిర్మలకు నా మనఃక్షోభ గురించి ఏమీ తెలియదు. ఆమె నాకు ఏదైనా దారి చూపలుగుతుందని ఒకోసారి అనుకొనే దానిని. కాని నా అంతట నేను సిగ్గువిడిచి యీ సంగతులు ఎల్లాచెప్పను ? ఎంత ప్రాణస్నేహమయితే మాత్రం ? నాగురించి ఏమీ చెప్పుకోవటానికి వీల్లేకుండా

నా నోటిని ఏదో మూసివేసినప్పుడు నేను ఏం చెయ్యను!
ఎల్లాచెప్పను ?

అవాళ వాళ్ళందరూ తాజ్ మహల్ చూడ్డానికి వెళ్ళారు. సుందరం బావ ఏదో 'ఎక్స్‌కర్షన్' వుందంటూ అలహాబాద్ వెళ్ళాడు. శ్యామల 'టెన్నిస్ మాచ్' వుందంటూ క్లబ్బుకి వెళ్ళిపోయింది. బామ్మ వంటింట్లో ఏదో పని చేసుకొంటోంది. నేనుమాత్రం, ఏడ్చే నా తోడికోడలు పిల్లవాడిని భుజాన వేసుకొని లాలిస్తూ మేడమీద పచార్లు చేస్తున్నాను! మేడ మెట్లమీద ఎవరో వస్తున్నట్లు జోళ్ళ అలికిడి వినిపించింది!

'ఇంట్లో ఎవళ్ళూ లేరా ఏమిటి?' అంటూ నవ్వుతూ వచ్చాడు రాధాకృష్ణ.

'మీరా...! రండి! ఎప్పుడొచ్చారు? వాళ్ళంతా యిప్పుడే తాజ్ మహల్ చూడ్డానికి వెళ్ళారు' అన్నాను నేను.

'నేను యివాళే వచ్చాను. మీవరందరు యిక్కడికి వచ్చేసట్లు నిర్మల చెప్పింది. తాజ్ మహల్ చూడ్డానికి నువ్వెందుకు వెళ్ళలేదు? ఇదివరకు వచ్చిన సారికూడా యీ యింటినీ స్టేషన్‌ని దర్శించి వెళ్ళిపోయావు.' అంటూ నవ్విన రాధాకృష్ణ నన్ను పరిశీలనగా చూశాడు.

'అప్పుడు సందర్భం కుదరలేదు. ఇప్పుడు యీ పాప వుంది' అని జవాబు చెప్పినపుడు నా గొంతుక కొంచెంబొంగురు పోయింది. ఎల్లాగో సర్దుకొని ఒక అర్థంలేని నవ్వునవ్వాను.

'అదేమిటి విమలా! కొత్తగా మాట్లాడుతున్నావు! చంద్రశేఖరం రాలేదా?' అని అతను అడిగిన ప్రశ్నలో అనుమానము, ఆశ్చర్యము కలిశాయి.

'వచ్చారు' అని తల ఆడించాను.

'మరి యిక్కడ నిన్ను ఒంటరిగా ఎందుకు వదిలి పెట్టారు?...ఓహో! అందరితోను కాకుండా నిన్ను తనతో కూడా తీసుకువెళ్ళామనా...?' అని పరిహాసం చేశాడు.

నా మనస్సు అగ్గిమీద గుగ్గిలం వేసినట్లయింది యీ మాటలతో. దుఃఖంలో పొంగిపోయే కన్నీటిని పాపాయిని అడ్డంపెట్టుకొని బలవంతంగా ఆపుచేసికొన్నాను. వాన లేక ఎండిపోయిన బీడు ఒక్క చుక్క నీరు దొరికినా వదిలిపెడు తుందా? ఎవ్వరూ నామీద అనుతాపం చూపించటం లేదని కుళ్ళిపోతూన్న నాకు, అతని అనుతాపం నన్ను మంచులా కరిగించివేసింది.

'ఏం విమలా! అల్లా వున్నావు? వంట్లో బావుండ లేదా?' అన్నాడు రాధాకృష్ణ అతి సహజధోరణిలో.

'ఏం లేదు' అని గొణిగాను. అతను చూడకుండా నా కళ్ళు తుడుచుకొన్నాను. నేను తడబడటం చూసిన అతను

'ఏమిటిది విమలా? ఏదో బాధ...' అని పూర్తి చెయ్యకుండానే సగంలో ఆగిపోయాడు. ఆ మరుక్షణంలో నే ఎల్లాగో సర్దుకొన్నాను.

'ఏం లేదు! మీరు నిర్మలని కలుసుకొన్నారా? మీకు పెళ్ళిట కదూ?' అని సంభాషణ మార్చాను.

ఈ ఘట్టంలో బామ్మ మేడమీదకు వచ్చింది.

'రాధాకృష్ణా వచ్చాడు? ఎప్పుడొచ్చావు? నువ్వు రావటం నేను చూడనేలేదే!' అంది బామ్మ అతన్ని చూస్తూ.

'నేనూ యిప్పుడే వచ్చాను. ఇంట్లో ఎవళ్ళూ లేకే మీటూ అన్నాను మీరూ వచ్చారు. ఒక్క క్షణం మనిద్దరికి తేడా అయింది' అన్నాడు రాధాకృష్ణ.

'పిల్లాడు నిద్రపోతున్నట్టున్నాడు. కింద ఉయ్యాలలో పడుకోపెట్టు విమలా, అని నాతో చెప్పిన బామ్మ, తన మనవరాలికి కాబోయే భర్తతో మాట్లాడటానికి కూర్చుంది.

సాధారణంగానే చెప్పిందనుకొన్నాను. ఆరాత్రి అందరి భోజనాలు అయ్యాక వంటింట్లో—

'ఏమే విమలా! నీ కసలు బుద్ధనేది వుందా? అతను వస్తే వాళ్ళెవరూ లేరని చెప్పి, కిందకు వచ్చి నాతో ఆ సంగతి చెప్పాలని తోచలేదూ? అక్కడ అతనితో నీ కేమిటి మాటలు! వయసొచ్చిన కుర్రాడి ఎదురుగా నిల్చుని మాట్లాడుతావా? సిగ్గులేదూ? కాపరానికొచ్చి కూడా యింకా నీకు యీ సంగతి తెలియలేదూ? ఆ సమయంలో నేను రాకపోతే ఏం జరిగేది? ఛి! ఛీ! భలే అలవాట్లు చేసింది, మీ అమ్మ నీకు' అంటూ నేనేదో అతని వళ్ళో వాలిపోయినట్లు మాట్లాడేసింది బామ్మ.

టెన్నిస్ బ్యాట్‌ను ఒయ్యారంగా తిప్పుకొంటూ, ఒంటరిగా ఊరంతా తిరిగి వచ్చే శ్యామల సిగ్గూ లజ్జా లేకుండా నా భర్తతోను, నా బావగారితోను యిల్లెగిరేలా నవ్వుతూ, యిష్టంవచ్చినట్లు కేరింతాలు కొడుతూ, వేళాకోళం మొదలైన వెకిలి చేష్టలు చేస్తూంటే చూసిన బామ్మకి తప్పుగా తోచలేదు! ఇంట్లోనే పడుండి, దిక్కూ, మొక్కూ లేని నా దుర్విధిని నిందించుకొంటూ, రాధాకృష్ణతో రెండు

మాటలు మాట్లాడటం బొమ్మకి తప్పుగా తోచటమేకాకుండా ఆ తప్పుకి అర్థంకూడా చాలా దూరం వెళ్లింది! ఎంత విచిత్రమైన మనుష్యులు! డబ్బు చేసే వింతలలో యిదికూడా ఒకటి కాబోలు!

మర్నాడు ప్రొద్దున్న యింటి ఎదురుగావున్న తోటలో పందిరిమీద బట్టలు ఆరవేస్తూంటే రాధాకృష్ణ వచ్చాడు. 'అందరూ యింట్లో వుంటారనుకొంటూనే వచ్చాను. ఉన్నారా?' అని నన్ను పలకరించాడు. రాత్రి బొమ్మ పెట్టిన వాత యింకా మండుతూనే వుంది! నోరు తెరవకుండా తలూపి నా పనిలో నేను లీనమయాను. అతను లోపలికి వెళ్ళాడు. కొన్ని క్షణాల్లోనే మళ్లీ 'విమలా' అంటూ గట్టిగా కేక వేశాడు రాధాకృష్ణ.

'ఇదెక్కడ గొడవరా బాబు!' అనుకొంటూ 'ఎందుకు?' అంటూ వెనక్కు తిరిగాను. నా భర్తకూడా అతని కూడానే నా దగ్గరకు వచ్చారు.

'సిన్న నేను చెప్పలేదా? ఇవాళ యీయన 'ప్లాను' ఏమిటో తెలుసునా?' అంటూ నవ్వాడు రాధాకృష్ణ.

ఆయన నవ్వుతూనే మా నాన్ని సాధించారు. ఇదివరకులా ఆయన కళ్లు నన్ను పరవశం చేయటంలేదు. ఆ నవ్వులో సహజత్వం లేదు. జీవంలేదు. అర్థంలేని వెకిలి నవ్వులా వుంది. రాధాకృష్ణ ప్రశ్నతో నాకు ఏమీ సంతోషం కలగలేదు.

'ఏమిటా ప్లాను?' అన్నాను.

మా యిద్దరికి మధ్య ఏదో ప్రణయకలహం రేగిందని మా ముఖాలు అతనికి చెప్పేసివుంటాయి. దానికి నేనేం

చెయ్యను ? పరిస్థితులను మర్చిపోయి నటించగలిగే నటనా శక్తి నాకు లేదే! ఎంత ప్రయత్నించినప్పటికీ, అనుతాపమైన మాటలు వినేటప్పటికి నన్ను నేనే సముదాయించుకో లేక పోతున్నానే ?

'చూశావా రాధాకృష్ణా! నేను పిలిస్తే రాదని నాకు తెలుసు ! అందుచేతనే తనదారికి అడ్డం రాకూడదని, నిన్న నేను మాట్లాడకుండా వెళ్ళిపోయాను'. అన్నారు నా భర్త.

ఈ మాటలలోని అంతరార్థం ఎంతలోతైనదో నాకు కదా తెలుసును ?

'నిజమే ! మీరు పిల్చారు ! నేను రాలేదు. ఏమయినప్పటికి పిల్లాడిని చూసుకొనేందుకు ఒక మనిషి కావాలి కదా ? మీ వదినగారికి యిప్పుడు తప్పితే మళ్లీ ఎప్పుడు వీలౌతుందో ? నాకు అల్లాగా మరి – రేపు శ్యామల పెళ్లికి మళ్ళీ వస్తాను. అప్పుడు చూడచ్చు ? తొందరేముంది ?' అని నాకు ఏమీ బాధలేనట్లుగా, సహజంగా జవాబిచ్చాను.

తన మాటల్లో అంతరార్థం నాకు బయటపడినట్లు, తన వదినగారు నన్ను భావించే విధానం ఆయనకు లోపల ఛెళ్లు మనాలనే నేను అల్లా మాట్లాడాను! మేము ఏదో ముసుగులో గుద్దులాడుకొంటున్నట్లు రాధాకృష్ణ గ్రహించివేశాడు ! మమ్మల్ని సమాధానపరచాలని కుతూహలపడుతున్నట్లు కనిపించిన అతను – 'ఏమిటిది విమలా ? నువ్వు ఆయనతో యింత బెట్టుసరిగా మాట్లాడుతున్నావ్ ?' అని నన్ను కోప్పడి, ఆయన వైపు తిరిగి – 'అయిందేదో అయిపోయింది. ఇవాళ మీరు

విమలని తీసికెళ్లి ఊరంతా చూపించండి. సాయంత్రం అల్లాగే తాజ్ మహల్, యమునానది చూపిరండి' అన్నాడు.

ఎటూ దొరకని వాడిలా! ఓ యస్! నాకేం అభ్యంతరంలేదు. నేను ఎప్పుడూ 'రెడీయే' అని ఒప్పుకొన్నారు ఆయన.

'మీరుకూడా వస్తారుకదూ?' అని చటుక్కున అనేశాను ఆలోచించకుండా!

'ఏడిసినట్టే వుంది! కాశీకి వెళ్లినా ఖర్మం తప్పలేదని, నేనుకూడానా? నిన్న నే, నిన్ను ఒంటరిగా తీసుకెళ్లాలని ప్లాను వేసుకొని మాట్లాడకుండా కూర్చున్నారు. మీ యిద్దరికి మధ్యా నేనెందుకు — పానకంలో పుడకలా?' అని కల్మషం, కపటం లేని రాధాకృష్ణ మమ్మల్నిద్దర్నీ చూస్తూ విరగబడి నవ్వాడు.

'నువ్వుంటేనే కాలక్షేపణ చాలా బాగా జరుగుతుంది. ఆట్టే బెట్టుసరి చెయ్యకు! శ్యామలను కూడా పిలుస్తాను లే!' అని అతన్నిచూసి అర్ధపుష్టిగా నవ్వారు ఆయన.

కారుమబ్బులతో కప్పబడిపోయిన సూర్యునిలా ఒక్క క్షణంలోనే వాడిపోయిన అతన్ని నేను చూస్తూండగానే, శ్యామల అక్కడికి వచ్చింది, చేతులో టెన్నిస్ బ్యాట్ వయ్యారంగా తిప్పుకొంటూ.

'ముగ్గురూ కలిసి ఏదో మంత్రాలోచన చేస్తున్నట్టున్నారే! నేనుకూడా వినచ్చునా?' అంది శ్యామల.

'వినచ్చునా అంటున్నావా? నీ గురించే మాట్లాడుకొంటున్నాం...' అని నాభర్త పూర్తిచేసేలోపుగా—

'ఓహో! నా గురించి మీ బుర్రలు బద్దలుచేసి కొం టున్నారన్నమాట! ఈ రాధాకృష్ణకి అందరితోటి నాగురించి ఏదో ఒకటి చెప్పి, బుర్రకి పనిచెప్తేనే కాని తనకి పొద్దుగడ వదు! ఏమంటున్నాడేమిటి నాగురించి?' అని, రేపు ఆమెకు కాబోయే భర్తతో కలహానికి కాలుదువ్వింది 'అప్‌టుడేట్ గర్ల్' శ్యామల.

'చూశారా! ఆమె మాటనా ఎత్తలేదు నేను. నన్ను దెప్పి పొడవటంకంటే ఆమెకింకేమీ మాట్లాడటం చేత కాదు!' అన్నాడు రాధాకృష్ణ.

'అరెరె! అప్పుడే మీరిద్దరూ భామకలాపన ప్రారం భించేశారేమిటి?' అని విరగబడి నవ్విన నాభర్త-'శ్యామలా! ఇవాళ యమునా విహారానికి వెళ్దామా? నువ్వులేకుండా రాధాకృష్ణ రాడట!' అన్నారు.

'నో! నో! ఇవాళ నేను యమునా విహారానికీ రాలేను గోకుల విహారానికి రాలేను. ఇవాళ మా క్లబ్బులో టెన్నిస్‌మాచ్ సెమిఫైనల్స్! నేను ఆడుతున్నాను. ఇవాళ కూడా నేను గెల్చానంటే రేపు ఫైనల్స్‌లో నాదే ఛాన్స్!' అన్న శ్యామల తన చేతి రిస్టువాచీ చూసుకొని - 'ఓ! మైగాడ్! జలజ నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది. నేను వెళ్ళాలి!' అని, ఎత్తు మడమల జోళ్ళను టక్ టక్ మని పించుకొంటూ చకచకా వెళ్ళిపోయింది శ్యామల.

రాధాకృష్ణ ఏం మాట్లాడలేదు. అతను ఏదో దీర్ఘా లోచనలో మునిగిపోయాడు. అతని భుజంమీద చెయ్యివేసి తట్టుతూ—'వాట్ యీస్ దిస్ రాధాకృష్ణా! అసలు యీ

ప్రపంచంలోనే లేనట్లున్నావేమిటి? ఏం? ఆమె రాకపోతే మాతోకూడా రావుకాబోలు!' అన్నారు ఆయన నవ్వుతూనే.

నిర్మలతో శ్యామలను పోల్చి చూస్తున్నాడని నాకు కదా తెలుసును? శ్యామల కాలేజీలో చదువుతోంది. నిర్మల కూడా కాలేజీలో చదువుతోంది. ఇద్దరూ అందమైన వాళ్ళే. కాని యీ శ్యామల, నిర్మల కాలిగోటికి పనికి వస్తుందా? విజ్ఞానం, వివేకం, దూరదృష్టి, మంచి మర్యాద అణకువ వున్న ఆ నిర్మల ఎక్కడ? నాగరికం, నాజూకు అంటూ, ఒళ్ళంతా కనిపించేలా బట్టలు కట్టుకొని, సున్నం పూసినట్లు 'మేకప్' చేసుకొని, మంచి మర్యాద అనేదే లేకుండా, పుట్టింది ఆడదిగానైనా మగవాడిలా తిరిగే యీ శ్యామల ఎక్కడ? భవిష్యత్తు నిర్ణయం ఏమైయినప్పటికి, ప్రస్తుతం రాధాకృష్ణ ఆమెకు కాబోయే భర్త. భర్తతో భార్య యిల్లాగే మాట్లాడుతుందా? ఈ శ్యామలని చేసుకొంటే రాధాకృష్ణ సుఖపడతాడా? కాలేజీ చదువులవల్ల యిటువంటి గుణాలుకూడా అబ్బుతాయి కాబోలు! అందుకే కాబోలు నాన్న—'చదువువల్ల వచ్చే విజ్ఞానాన్ని స్త్రీలు మంచిపద్ధతిలో మాత్రమే ఉపయోగించుకోవాలి'! అన్నారు. ఎంత అనుభవం ఆయనకి!

తమాయించుకొన్న రాధాకృష్ణ 'మీకు అడ్డుగా వుండనని తోస్తే రానటానికి నాకు అభ్యంతరం లేదు' అన్నాడు దీర్ఘ నిట్టూర్పు విడుస్తూ.

# 14

అత్తయ్య, బామ్మ, చంచల, శ్యామల - అందరూ భ్రమించి పోయేటట్లు నేను ఆయనతో కారులో ఎక్కి-కూర్చున్నాను. వెనకాల సీట్లో కూర్చున్న రాధాకృష్ణ, ఇది ఘూానది, అది ఫలానది అంటూ నా కళ్ళముందునుంచి పరిగెత్తే కట్టడాలని వాటిని గురించి చెప్తూ వస్తున్నాడు. మొట్టమొదటిసారిగా ఆయన పక్కనే కూర్చుని ఆగ్రా రోడ్ల మీద వెళ్తూంటే నాకు ఎందుచేతనో సంతోషం కలగలేదు. జీవితంలో మొట్టమొదటి అడుగు పెట్టినప్పుడు ఒకదాని వెనకాల ఒకటిగా ఆ ఆశాభంగాలు జరగకుండా వుండివుంటే, యిప్పుడు నాకు మేఘమండలంలో మన్మథ విమానంలో విహారం చేస్తున్నట్లుంటుంది కదా? ఇప్పుడు ఆయన మనస్సును దరిజేరటానికే నాకు భయంగా వుంది. రాతిబండతో మూసి వేయబడిన చీకటి గుహలా వున్న ఆ మనస్సును నేను దగ్గరగా వెళ్ళి గుద్దుకొంటే మాత్రం ప్రయోజన మేముంది? నా హృదయం చితికిపోతుంది. చీకటిని చూసి యింకా దుఃఖ మెక్కువౌతుంది. అంతకంటే ఊయలలా ఊగిసలాడే యీ పరిస్థితే మంచిది కదా? ముంజేతి కంకణానికి అద్దం కావాలా అన్నట్లు, ఆయన నాతో ఏకాంతాన్ని కోరటం లేదని నాకు తెలుస్తూనే వుంది! అమ్మ చెప్పినట్లుగా తొందర పడి నేనే తప్పుచేశానని ఆయన అనుకొంటున్నారా? 'నన్ను క్షమించండి! అజ్ఞానంవల్ల మూర్ఖత్వంగా ప్రవర్తించాను' అని చెప్తూ నేను ఆయన కాళ్ళమీదపడి క్షమార్పణ కోరాలని చూస్తున్నారా?

ఇందుకు నాలోని స్త్రీ స్వభావం తావివ్వలేదు! పురుషస్వభావానికి అంత అధైర్యమూ, అహంభావమూ వున్నట్లయితే నేను నడిచిన దానిలో ఏమీ తప్పులేదు. అనవసరంగా శరణాగతి ఎందుకవాలి? నా స్వతంత్రంలోను, సుఖసౌకర్యాలలోను కొంచెం కూడా శ్రద్ధ చూపించని ఆయన దగ్గర నేను శరణాగతి అయినట్లయితే, ఆయనకి యింకా లోకువ అయిపోనా? ఆయన చేతి కీలుబొమ్మలా ఆడేందుకు ఎంతమాత్రం స్థానం యివ్వకూడదు!

నేను బయటకు చూశాను, యమునానది ఆనకట్ట కొద్ది దూరంలో వుండగా కారు ఆపుచేశారు ఆయన. 'లోప లికి నడిచి వెళ్దామా? కారులోనే వెళ్దామా?' అన్నారు.

'నడుద్దాం. ఏం విమలా? కారులో వెళ్ళటం నాకు అంతగా బాగుండలేదు' అన్నాడు రాధాకృష్ణ.

'సరే' అంటూ కారు దిగాను.

ముగ్గురం ఆనకట్టమీద నడిచాం.

అంతులేని ఆహ్లాదంతో తన నాయకుణ్ణి చేరటానికి పరుగు పరుగున పరిగెత్తుతూ వచ్చే యమునా కన్యని, మానవశక్తి, పర్వతబలమూ కలసి అడ్డుపడి అడ్డుకొన్నాయి. ఆవేశం పట్టలేని ఆగ్రహం ఒకపక్క, అంతులేని అవమానం మరొకపక్క తనను ఆవరించగా, ఆకాశాన్ని భూమిని ఏకం చేసేటట్లు విచ్చుకొని నిలబడిపోయి నురగలు కక్కుతోంది! అల్లాగే అణచి వేసినట్లయితే, కాళికాదేవి కోపంలా యమున ఆగ్రహం అంతరిక్షాన్నంతటిని అంతంచేసేటట్లు కనిపించింది నాకు. అందుకనే ఆనకట్టలు కట్టారు కాబోలు! కొంచెమేనా

దారి దొరికిందే అని ఎంత ఆనందం తనకు! ఆహ్లాదంతో అల్లరిచేస్తూ తన బలాన్నంతా ప్రయోగించి ఆవేశం వచ్చిన దానిలా యింకా పొడుగైన తన దూరమార్గాన్ని మనస్సులో తల్చుకొని, తన మనోనాయకుణ్ణి కలవటానికి పొంగి పులకాంకితురాలవుతూ పరుగెత్తుతోంది! ప్రేమలోని తన్మయత్వం, తన్మయత్వంలోని తహతహ, తహతహలో తల్లడింపు – ఒక్కసారిగా చూసిన నేను, నన్ను మైమరచి అల్లాగే నిలబడిపోయాను! నా పక్కనుంచి కార్లు వెళ్ళాయి. జనం నడిచారు. రాధాకృష్ణా, ఆయనా ఏదో మాట్లాడుతూ ముందుకు నడిచారు. ఏదీకూడా నా కళ్ళముందు నిలబడ లేదు. ఆ పక్క చూసినప్పుడు యమునాకన్య కుమిలే మనస్సును కౌగలించుకోవాలని, అనుతాపం పొందాలని తోచింది! పొంగి పొరలే ఆమె అలలను, నా చేతులతో ముట్టుకోవాలనిపించింది! ఈ పక్క చూసినప్పుడు, ఆమె ఆనందంతో చేసే అల్లరిలో నేనుకూడా పాల్గొనా లనిపించింది! ఆమె వెళ్ళే దారిలో నేనుకూడా ఆమె చెలికత్తెలా పరిగెత్తాలనే ఆశకూడా కలిగింది!

నన్ను వదిలి చాలాదూరం ముందుకు వెళ్ళిపోయిన రాధాకృష్ణా, నా భర్తా వెనక్కి తిరిగిచూశారు. 'విమలా! విమలా!' అంటూ వాళ్ళు కేకలేయటం నాకు వినిపించ లేదు. వాళ్లు నా దగ్గరకువచ్చి, శిలావిగ్రహంలా నిలబడిపోయిన నన్ను చూసి – 'ఏమిటిది విమలా? ఇక్కడే నిలబడిపోయావు? గోకులం చూడద్దూ?' అని ఆయన పలకరించేవరకు నాకు స్మృతి రాలేదు.

మెట్లమీదుగా ఆనకట్ట దిగినప్పుడు, నిజంగానే భూలోకం వదలి మరో లోకంలోకి వచ్చినట్లుగానే తోచింది నాకు.

కళ్ళు చెదరగొట్టే వర్ణ దీపాలలో యమున ఎంత అందంగా వుంది! ఒక పక్క నెమలి పింఛెంలా నీలం ఎరుపు రంగులతో నిగనిగలాడింది. ఇంకొక పక్క రాజహంసలా నడచింది. మరొక పక్క వజ్ర వైడూర్య మకుట మరకత మాణిక్య నవరత్న ఖచిత సర్వాలంకార భూషితమైన మహారాణిలా ప్రకాశించింది. మరింకొక పక్క జలజలమని సప్తస్వరసంగీత వీణానాదంలా మానవులను మైమరపిస్తోంది. గట్టుమీద రకరకాల రంగు రంగుల పువ్వులముందు తన చెలికత్తెలను చేర్చుకొని ఆడి అలరిస్తోంది. తను ఆడే ఆ స్థలంలో యీ ప్రపంచంలోని అన్నింటిని మర్చిపోయి నేనుకూడా ఆడాలనే ఆశ రేకెత్తిం చింది నాలో. తనలో పొంగి పొరలే తన్మయత్వం పొంగు లోని అంశం చూస్తూ జీవితమంతా నిశ్చింతగా గడిపివేయ చ్చని తోచింది. వింత వింత పువ్వుల ప్రకాశం ముందు తన చెలికత్తెలతో ఆడుతూ పాడుతూ తిరిగే యమునను చూసిన తరువాత, నేను కూడా ఒక ఉపనదిగా మారిపోయి తనలో కలసిపోయి తనతో ఆడుకోవాలని తహతహలాడింది నా మనస్సు. తను కొలువుతీర్చి వున్నప్పుడు తనకి వింఝామరం విసిరే సేవకురాలి పదవి లభించే భాగ్యమేనా నాకు కలగ కూడదా అని తోచింది.

యమునాకన్య సల్లాప మందిరాన్ని అలంకరించిన ఆ వర్ణదీపాలకు ఎంతగర్వం? ఆకాశ మండలాన్నంతటిని

అందంగా అలంకరించిన ఆ నక్షత్రాలను చూసి కూడా సిగ్గు పడకుండా 'మాతో సమానమైనవాళ్ళా మీరు?' అని హేళన చేస్తున్నట్లు ప్రకాశించాయి. మానవులను మైమరపించే మహా సౌందర్య రాశియైన యమునాకన్యకి అలసట కలగకుండా వుండాలనే కాబోలు, వాయుదేవుడు తన చల్లని చేతులతో విసురుతూనే వున్నాడు!

నోరు నెప్పెట్టేలా ఆయనతో ఏదో మాట్లాడుకుంటూ పోతూన్న రాధాకృష్ణగాని, ఆయనగాని నన్ను చూడలేదు. కొలువుకూటంలా విద్యుద్దీపాలతో అలంకరించబడిన మండపం దగ్గరికి వచ్చాకనే వాళ్ళు నన్ను చూశారు.

'నా మట్టుకు నేను తెగవాగుతూ వస్తున్నానే! ఏమిటి విమలా, మ్మా యిద్దరికి మధ్య పీడెందుకు వచ్చాడా అని నన్ను శపించుకొంటున్నావా?' అన్నాడు రాధాకృష్ణ నవ్వుతూ.

'అదేంలేదు. ఇక్కడకువచ్చిం తరువాత భూలోకం నుంచి మరేదో లోకంలోకి వచ్చినట్లు భ్రమ ఏర్పడింది. మాట్లాడటానికి మాటలే రావటం లేదు' అన్నాను పరవశమయిపోతూ.

'ఇంకా నయం! మూగదానివై పోలేదు! చాలా బావుందికాని—మీ రిద్దరూ యిల్లా వచ్చి నిల్చోండి' అంటూ అతని భుజాన్ని వేళ్లాడుతున్న 'కెమేరా' తెరిచాడు రాధాకృష్ణ.

ఆయన నిల్చున్నారు. ఆయన పక్కనే నేనూ నిల్చున్నాను. 'ఇంకా కొంచెం దగ్గరగా...విమలా! కొంచెం తల

ఎత్తాలి...అరెరె...వంచేస్తున్నావు...ఏదీ, చిన్న నవ్వు...' అన్ని అతనంటూంటే నేను కొత్తపెళ్ళికూతురిలా సిగ్గుపడి పోయాను!

నేను ఆయన దగ్గరగా నిలబడినప్పుడు ఆయన 'కోటు' నా చీరకు అంటుకుపోయింది. నేను ఆనకట్టకట్టి అడ్డం చేసుకొన్న ఆ మనఃక్షోభ గట్టు తెంచుకొని పొంగిపోయేటట్లు గంతులేసింది. బలమైన ఆయన చేతుల కౌగలింతలో అణిగిపోయి చిన్నపిల్లలా ఆయన గుండెల్లో తలదాచుకోవాలనే తాపం కలిగింది. ఈ ఘట్టంలో రాధాకృష్ణ 'కొంచెం నవ్వు ముఖం' అన్నప్పుడు నేను నిజంగా నవ్వానో, ఏడ్చానో తెలియదు!

ఫోటో తియ్యటం పూర్తి చేసిన అతను—'మీరిక్కడే కూర్చోండి, నేను వెళ్ళి 'కాంటీన్'లో, తిండానికి ఏమైనా తెస్తాను. ఇక్కడే కూర్చుని తిందాం' అన్నాడు రాధాకృష్ణ.

అంతలోకే ఆయన—'నువ్వెళ్ళద్దు. నువ్వు యిక్కడే కూర్చుని విమలతో మాట్లాడుతూవుండు. నేనే ఏదైనా తీసుకొస్తాను. అల్లాగే కారుకూడా ఈ పక్కకి తీసుకొస్తాను' అనేసి అతని జవాబుకూడా వినకుండా గబగబా వెళ్లిపోయాను!

భ్రమించిపోయిన రాధాకృష్ణ నన్నూ ఆయన్నీ వింతగా చూశాడు. నేను అతని దృష్టికి కనిపించకుండా యమునానది వైపు చూశాను. నాతో ఏకాంతంగా వుండటానికి ఆయనకి యిష్టంలేదు! అందుకనే వెనక్కి చూడకుండా భయంతో పారిపోతున్నారు! నా హృదయం బద్దలయిపోతుటట్లయింది. నిజంగా, ఆయన ఆ సమయంలో నాతో ఏకాంతంగా వుండి

వున్నట్లయితే, ఆయన కాళ్ళమీద పడి ఏడ్చివుండేదానిని. నా ఆలోచనలన్నింటిని మూటకట్టేసి నేను చేసిన తప్పుకు నన్ను క్షమించమని కన్నీరు కార్చివుండేదానిని. రాధాకృష్ణ వెళ్తానని చెప్పినపుడు, ఆ క్షణంనుంచి ఒకరి నొకరు అర్థం చేసికోని మానదాంపత్య జీవితానికి అంత్యదశ వచ్చేసిందను కొన్నాను. కృంగి కృశించిపోయిన నా మనస్సుకు, అప్పుడు ఆయన కొంచెం దారి యిచ్చివున్నట్లయితే అది ఈ యమునా నదిలా పొంగి పొరలి వుండేది. కాని అందుకు ఆయన తావు యివ్వలేదు. ఏకాంతం ఆవేశంతో ఆకర్షించి వేస్తుందని, రాతి గుండెను కరిగించి వేస్తుందని ఏకాంతచ్ఛాయలకే దొరక కుండా పారిపోతున్నారు !

ఇల్లా ఎందుకు పారిపోవాలి ? మానవులు తప్పులు చెయ్యరా!ఆయనకన్నా నేను చాలాచిన్నదానిని.అనుభవంలేని దానిని. తప్పు నామీదే వున్నప్పటికి, ఆయన హృదయంలో నిజంగా నామీద ఆయనకి అనురాగం వున్నట్లయితే, నన్ను మన్నించరా ? రాధాకృష్ణ బలవంతంమీదే నన్ను తీసు కొచ్చారు కాని ఆయన తీసుకురావాలని తీసుకురాలేదు !

'విమలా !' అన్న రాధాకృష్ణ పిలుపు విని అదిరి పడ్డాను.

తల ఎత్తి చూశాను. ఎక్కడచూసినా జగజ్జ్యోతిలా ప్రకాశించే విద్యుద్దీపకాంతి, 'హోరు' మనే నీటిశబ్దం, నిర్మానుష్యమైన ఇంద్రలోకంలాంటి స్థలం, ఏకాంతం. రాధా కృష్ణ పలకరిస్తున్నాడు.!

'విమలా! చంద్రశేఖరానికి నీకూ ఏదో చిన్న ప్రణయ కలహం అనుకొన్నానే కాని పరిస్థితి యింతదూరం వచ్చిందని నేను అనుకోలేకపోయాను. ఇప్పుడు నేను కదా బోనులో చిక్కుకుపోయాను! నువ్వుమట్టుకు నువ్వు మౌనవ్రతాన్ని సాధిస్తున్నావు. నేను వ్యత్యాసంగా అర్థం చేసికోకూడదని, అర్థంలేని నవ్వు నవ్వుతూ, ఆయన నీతో మాట్లాడటం చాలా విచిత్రంగా వుంది. ఏమిటి యిదంతా విమలా? నిన్న నిన్ను యింటిదగ్గరే వదిలిపెట్టి, తను వాళ్ళందరితోటి వెళ్ళారని విన్నప్పటినుంచి నాకు అదోలా వుంది. దంపతుల మధ్య ఏదో చిన్న ప్రణయకలహం రేగింది అనుకొని తమాషాగా మాట్లాడుతూ యిక్కడకు లాక్కొచ్చాను మిమ్మల్నిద్దరిని కలపాలని. కాని నేను అనుకొన్నట్లు కాకుండా యిదేదో చాలా పెద్ద వ్యవహారంలాగనే వుందే!' అని ప్రశ్నమీద ప్రశ్న అడిగాడు రాధాకృష్ణ.

మనస్సులో తోచినట్లు ముందూ వెనకా చూడకుండా బయటికి చెప్పే అమాయకస్వభావమే అతనిది. అయినప్పటికి మా దాంపత్య జీవితరహస్యాన్ని గురించి యితనికి ఎందుకు యింత శ్రద్ధ! 'పెద్ద కారణమయితేనేం, చిన్న కారణమయితేనేం, మనకెందుకు?' అని మాట్లాడకుండా వుండచ్చునే!

కళ్ళల్లోని నీటిబిందువులు బయటపడకుండా బలవంతంగా ఆపుచేసికొన్నాను. అతనికి ఏమని జవాబు చెప్పను? వయస్సులో వున్న యువకుడు అతను. కనుచూపుదూరంలో మా కళ్ళకి ఎవళ్లూ కనిపించటంలేదు. నన్ను యిల్లా వదిలి

ఆయన ఎందుకు వెళ్ళిపోవాలి? భార్యను సందేహించే కుత్సిత బుద్ధి తనకు లేదని గొప్పగా అతనికి తెలియచెయ్యటానికా? నా మౌనాన్ని చూసి రాధాకృష్ణ నా ఆలోచనలు అర్థం చేసేసుకొన్నాడు కాబోలు!

'నేను విషమంగా అడుగుతున్నానను కొంటున్నావా? నిన్ను నా చెల్లి సరోజలా చూసుకొంటున్నాను కదా విమలా? మొట్టమొదటగా నిన్ను నేను చూసినప్పుడు ఎందుకో నీ మీద నాకు అటువంటి అభిప్రాయం కలిగింది. అందులోను సరోజ పోయాక నువ్వే నా సరోజ అనే అభిప్రాయంతో వుంటున్నాను విమలా. మీ వ్యవహారాలలో నేను జోక్యం కలగ చేసుకోవటం నీకు తప్పుగా తోచవచ్చు. నేను ఎప్పుడు మీయింటికి వచ్చినా వాడిన ముఖంతో వంటింట్లోనుంచి బయటకు వస్తావు. నీ మనస్సులో ఏదో బాధ రేగిందని నేను తెలుసుకొని బేజారెత్తిపోయాను విమలా. మొట్టమొదటగా నిన్ను నేను మీ ఊరికి తీసుకువెళ్ళినపుడు, నువ్వున్న స్థితికి, యిప్పటి నీ స్థితికి ఎంతో వ్యత్యాసముంది. నాకు చెప్పవా నీబాధ? నావల్ల నీకు ఏం కావాలన్నా చేస్తాను విమలా! చంద్రశేఖరం నీతో ప్రేమగానే వుంటున్నారా?' అని ఎదురు ప్రశ్నలోకివచ్చి ఆగిపోయాడు రాధాకృష్ణ.

నాకుకూడా యిటువంటి ఒక అన్నయ్య వున్నట్లుంటే అని అనుకొన్న నా మనస్సు వెంటనే 'అన్నయ్యా' అంటూ ఏడవాలనిపించింది.

నామీద అతను ఎంత అభిమానం చూపించి నప్పటికి నాకూ నా భర్తకు మధ్య వున్న మనస్పర్థలు నిర్మలతో

చెప్పటానికే సిగ్గుపడ్డ నేను, యితనితో ఎల్లా చెప్పను? 'ఆయనకు నామీద ప్రేమ లేదు' అని చెప్పటానికి కూడా నా మనస్సు ఒప్పుకోలేదు. ఎల్లాగో మనస్సుని రాయి చేసుకొన్నాను. అతి శ్రమపడి నవ్వగలిగాను. కొన్ని సమయాల్లో నటన చాలా అవసరమవుతోంది కదా?

'అటువంటిదేం లేదు. అర్థం లేని కారణాన్ని దేన్నో ఆధారంగా తీసుకొని అనవసరంగా మీ మనస్సుని బాధ పెట్టుకొంటున్నారు. దీనికేంగాని—మీకు పెళ్లిట కదూ? నిన్ననే మిమ్మల్ని యీ సంగతి అడిగాను. అంతలోకే బొమ్మ వచ్చింది' అని సంభాషణ మార్చేశాను.

'నిజమేనా విమలా?' అన్నాడు రాధాకృష్ణ.

నేను యింకా గట్టిగా నవ్వాను.

'ఏది నిజం? ఆ సంగతి నేనుకదా అడగాలి? నాకు ఒక అన్నయ్య లేడే అని నా బాధ. అది తీరిపోయిన నేను యిప్పుడు సంతోషం పట్టలేకుండా వున్నాను. ఎందుకో తెలుసునా?'

అతను మాట్లాడ లేదు. నేనే మళ్ళీ—

'నాకు యింకో ఆశ కూడా వుంది. ప్రేమ వివాహాన్ని చూడాలని – అందులోను నాకు బాగా తెలిసిన ప్రేమికులై వుండాలని ఆశపడ్డాను. ఆ ఆశ నిరాశ అయేటట్లు కనిపిస్తూండటంచేత నాకు యిప్పుడు ఏదీ నచ్చటంలేదు' అన్నాను,

'అయ్యయ్యో! నువ్వు సరిగ్గా సరోజలాగనే మాట్లాడుతున్నావే విమలా! తనుకూడా అస్తమానూ యిల్లాగే అంటూండేది.' అని బొంగురుపోయిన గొంతుకతో అన్నప్పుడు, 'ఎందుకు అల్లా మాట్లాడానా' అని అనిపించింది.

పాపం! పాతసంగతులన్నీ జ్ఞాపకం వచ్చి అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

'చిట్టి చివరసారిగా కూడా నన్ను యిల్లాగే గేలి చేసింది. నీ చీరలను నా పెట్టెలో చూసి – 'రాబోయే వదిన కోసం కొన్నావా అన్నయ్యా? పచ్చగా వున్నట్టయితే సెలక్షన్ 'ఫస్ట్‌క్లాస్.' నాకు చాలా రోజులనుంచీ ఆశగా వుందన్నయ్యా. మీ యిద్దరికీ మధ్య నేనుకూడా రానా? తనెక్కడుందో నాకు చెప్పవా?' అని ఏమేమో మాట్లాడి నన్ను పరవశం చేసిన నా సరోజ యిప్పుడు లేదే!' అని దీర్ఘ నిట్టూర్పు విడిచాడు రాధాకృష్ణ.

అతని బాధ చూసి నా మనస్సు కరిగిపోయింది. ఇంక యీ విషయంలో ఏమీ మాట్లాడి అతని మనస్సును బాధ పెట్టకూడదని నేను యమునానదివైపు చూశాను.

అప్పుడు ఒక చిత్రాన్ని చూశాను. ఇద్దరు ఆడవాళ్ళు, ఇద్దరు మగవాళ్ళు మెట్లుదిగి వస్తున్నారు. అందులో ఒక జత ప్రేమికులో, దంపతులో అర్థంకాలేదు. కొంచెంకూడా సిగ్గూ లజ్జా లేకుండా, అతను – ఆమె, ఒకరి భుజాలమీద మరొకరు చేతులు వేసుకొని ఉల్లాసంగా నడుస్తూ మా వైపుకు వస్తున్నారు. చూడగా చూడగా ఆ ఆడవాళ్ళిద్దరూ అక్కచెల్లెళ్లలా కనిపిస్తున్నారు. సిగ్గు, అసహ్యమూ లేకుండా వాళ్లు కట్టుకొన్న బట్టలు వళ్లంతా కనిపించేటట్లు చేస్తున్నాయి. 'అణకువకి, మర్యాదకి, అందానికి పేరుపొందిన మన భారత స్త్రీలు, యిటువంటి బట్టలు కట్టుకొని యిల్లా తిరిగే కాలం కూడా వచ్చేసింది కదా?' అని కృంగిపోయిన నాకు, వాళ్లను

చూడ్డానికే అసహ్యం కలిగింది. విడిగావున్న ఆ మగమనిషి ఆ జంటని వివిధకోణాల్లో నిల్చోబెట్టి ఫొటోలు తీశాడు. నా దృష్టి వాళ్ళనుంచి మరల్చినపుడు రాధాకృష్ణ కూడా వాళ్ళను చూశాడనుకొన్నాను.

'రానురాను శ్యామల కూడా యిల్లాగేతయారయింది' అన్నాడు రాధాకృష్ణ.

'చాలా ఆలస్యమయిందా ?' అంటూనే వచ్చారు నా భర్త మా వెనకవైపు నుంచి చేతిలో ఏవో పొట్లాలతో.

పట్టపగలులా వున్న విద్యుద్దీపాల కాంతిలో ఆయన్ని చూసిన వెంటనే, విడిగా వున్న అతను 'హాల్లో !' అంటూ మా దగ్గరకు వచ్చాడు.

'అరె ! ఏమిటీ అకస్మాత్ ప్రత్యక్షం !' అంటూ నవ్వుతూ కరచాలనం చేశారు నా భర్త అతనితో.

'వాళ్ళు విశాఖపట్టణంనుంచి 'సీజన్'కి మన పక్క బంగళాకి వచ్చారు. నిన్ననే యిక్కడికి వచ్చాం, మీరంతా తిన్నగా అక్కడికే వస్తారనుకొన్నానే ! ఇక్కడికి ఎప్పుడు వచ్చారు ? మీ ఆవిడ వచ్చిందా ?' అని అడిగాడు అతను.

'మేమువచ్చి ఓ వారం రోజులయింది. రేపు అక్కడికి బయలుదేరాలనుకొంటున్నాం. ఇదో 'నా విమల' అని నన్ను చూపించి, నవ్వీన ఆయన, ఒకక్షణం ఆగి, 'ఈయన. . .దానికి 'కజిన్' మిస్టర్ రాధాకృష్ణ' అని అతన్నికూడా పరిచయం చేశారు నా భర్త.

ఇతను ఎవరయి వుంటాడా అనే సందేహంతో నేను అతనిని చూసినపుడు, అతను నన్ను పైకి కిందికి ఎగాదిగా

చూసి 'వెరీబ్యూటిఫుల్ గర్ల్' అన్నాడు విరగబడి నవ్వుతూ. నాకు ఒళ్ళు మండిపోయింది. ఎవరితను ? స్నేహితుడా— ?

వెంటనే ఆయన ఏదో జ్ఞాపకం వచ్చినట్లు— 'రాధా కృష్ణా ? ఇతనే మిష్టర్ మోహనరావు. ఎం. ఏ. నిర్మలను తనదాన్నిగా చేసుకొనేందుకు తపస్సు చేస్తూ కాచుకొని కూర్చున్న మిస్టర్ మోహనరావు!' అంటూ హేళనగా నవ్వుతూ కొంచెం గట్టిగా నొక్కి చెబుతున్నట్లే చెప్పారు, నా భర్త.

# 15

మేమంతా సిమ్లా చేరేటప్పటికి రాత్రి పదయివుంటుంది. ప్రయాణ బడలికతో అలసిపోయిన నేను, పడుకొన్న తక్షణం నిద్ర పట్టేసింది.

పొద్దున్న నేను లేచి బయటకు చూసినప్పుడు, అందం తోనూ శాంతంతోను తన కరుణాపూరిత మైన ముఖాన్ని చూపించి, చిరునవ్వు చిందించే ప్రకృతిమాత ఒడిలోకి వచ్చా ననిపించింది. ఉదయభానుని అరుణకిరణాలలో వజ్రాలు పొదగబడినట్లు మంచు బిందువులతో నిండిపోయి మిల మిల మెరిసే పచ్చని పచ్చగడ్డి; మనుష్యుల చేతుల నుపయోగించి కత్తిరింపబడినట్లు అందంగా ఎత్తుగా పెరిగిన గోపురాల్లాంటి వృక్షాలు; మిట్ట పల్లాలలో అక్కడొకటి యిక్కడొకటిగా ఎగుడు దిగుడుగా కనిపించే యిళ్లు; కన్య ఒకత్తె చమరీవాల ములవంటి తన కురులను పూలచెండ్లమధ్య చుట్టిచుట్టి అల్లి

నట్లు కొండలచుట్టూ వంకరటింకరగా వెళ్లేరోడ్డు – అన్నీ కూడా నేను వచ్చివున్న మోహనరావు బంగళాలోంచి కళ్ళను మిరుమిట్లు గొలిపే దృశ్యాల్లా కనిపించాయి. ఇంటి ఎదురుగావున్న తోటలో రంగు రంగుల రకరకాల పూల మొక్కలు, చెట్లు, మనస్సులో ఓ క్రొత్త మధురానుభూతిని కలిగించాయి. చూడ్డానికి అంత పెద్దదిగా కనిపించక పోయి నప్పటికి యిల్లాంతా సోఫాలు, బల్లలు, నిలువుటద్దాలతో విదేశ నాగరీక బాణిలో అలంకరించబడింది. కాళ్ళు నడిచిన చప్పుడుకూడా వినబడకుండా వుండేటట్లు ప్రతీగదిలోనుకూడా చిత్రాతి చిత్రవర్ణాలతో కూడిన మెత్తని తివాసీలు వేయ బడ్డాయి. అలంకారకుండీల్లలో అందమైన పువ్వుల గుత్తులు న్నాయి. దుమ్మూ ధూళి లేకుండా మిలమిల మెరిసే స్నానాల గదులు – అన్నీ నాకు తగని ప్రదేశంలో, నేను నడవటానికే సిగ్గుపడే ప్రదేశానికి వచ్చినట్లుంది.

'మోహనరావు. ఎం. ఏ' అనే బోర్డు వేళ్లాడే రాజ భోగభవనం; ఆడంబర జీవితం; అన్నీకూడా నిర్మలకి సొంతం చేసేందుకు పెద్దవాళ్ళు నిశ్చయించటం చూడటానికి తప్పుగా లేదు. ఏం? మోహనరావుకి మాత్రం ఏం లోటు? ఎం. ఏ ప్యాసయిన పట్టభద్రుడు; సుఖవంతమైన జీవితాన్ని ప్రస్ఫుటంచేసే బలమైన దేహదారుఢ్యం; శోభాయమానంగా ప్రకాశించే పసిడి పచ్చని శరీరకాంతి; ఎప్పుడూ కలకలమని నవ్వుతూనే వుండే స్వభావం —— అన్నీకూడా అతను నిర్మలకి తగినవాడు కాడని చెప్పటానికి వీల్లేకుండా వున్నాయి. కాని పవిత్ర ప్రేమలో పెనవేసుకుపోయిన హృదయానికి

ఎటువంటి అమరలోక జీవితమైనా తుచ్ఛమే కదా ? నిర్మలను తప్పుపట్టటానికి అవకాశమే లేదు.

'నిర్మలను తనదాన్నిగా చేసుకోవటానికి తపస్సు చేస్తూ కాచుకొని కూర్చున్న మోహనరావు!' అని నా భర్త అన్నప్పుడు, రాధాకృష్ణ మనస్సులో ఒక ఆటంబాంబు పేలి పోయిందన్న సంగతి ఆయనకి ఎల్లా తెలుస్తుంది ? ఒక్క క్షణం భ్రమించిపోయినవాడిలా వణికిపోయాడు. ఎల్లాగో సమర్థించుకోగల్గిఎప్పటికి వచ్చేటప్పుడు అతనిలో కః పించిన కలకలమనే నవ్వూ, ఉత్సాహం, ఏమీకూడా కనిపించలేదు వెళ్లేటప్పుడు. మౌనంగా దీర్ఘాలోచనలో మునిగిపోయి శిలా విగ్రహంలా కూర్చుండిపోయాడు కారులో. ఇంతటి విపరీత పరిస్థితికి కారణం నాకుకదా తెలుసును ?

రాధాకృష్ణ, మనస్సులో వున్నది వున్నట్టు చెప్పేసే కల్మషం కపటంలేని అమాయకుడే. అయినప్పటికి యీ మోహనరావు నా ముందరే 'వెరీ బ్యూటిఫుల్ గర్ల్ !' అని అనటం నాకు నచ్చలేదు. అవాళ నిర్మల ఆయన ముందు నన్ను అనేకవిధాలుగా వర్ణించింది. కాని నాకుమల్లే ఆమె ఒక స్త్రీ. నాకు సంతోషం కలిగింది. రాధాకృష్ణ నాతో సహజంగా సరిహాసంగా మాట్లాడినప్పటికీ, ఆ ప్రాణి కల్మషం లేనిదిలాగనే తోచింది. అందులోను అతను సమయం సందర్భం చూసి మర్యాదగా మాట్లాడుతాడు. నా అత్తగారు, చంచల మొదలైనవాళ్లు వున్నప్పుడు 'విమలా !' అంటూ గబగబా లోపలికి రాడు. వెళ్ళేటప్పుడు మాత్రం 'నేను వెళ్ళొస్తాను విమలా !' అంటూ గుమ్మంలో నిల్చునే నన్ను

పలకరించి వెళ్లిపోతాడు. ఇల్లానడిచే అతను నాకు అన్యుడిగా తోచలేదు. అతను చెప్పినట్లు సోదరునిగా భావించిన నాకు, తమాషాగా మాట్లాడటం, పరిహాసం చెయ్యటం కాలక్రమేణా సహజధోరణిలో అలవాటయిపోయింది.

ఇప్పుడు యీ మోహనరావు 'ఏం విమలా! అప్పుడే లేచావేం?' అంటూ మొదట్లోనే ఒక్కసారిగా స్వతంత్రంగా మాట్లాడటం నా కదోలా తోచింది. ఏమీ జవాబు చెప్పకుండా లోపలికి పరిగెత్తుకొచ్చేశాను. ఇంట్లో ఎవ్వరూ నన్ను ప్రత్యేకంగా చూడకపోయినా కూడా అతను నన్ను వదిలేటట్లు లేడు. నా గురించి ఏదో ఒకటి అడిగి వాళ్లందరి సంభాషణలోకి నన్ను లాగేస్తున్నాడు. నిముషాని కొకసారి ఆయన భుజంమీద ఓ గుద్దు గుద్దుతూ 'ఏరా! నీ మిసెస్‌ని నువ్వు సరిగా చూస్తూన్నట్లులేదే!' అని వేరే అడిగి నా కడుపుమంటను ఎగదోశాడు.

'నేనేమిటి? తననేమిటి? చూడ్డమేమిటి? తను కదా నాసంగతి చూడాలి?' అని నన్ను చూడకుండానే అర్థంలేని ఒక వెకిలి నవ్వు నవ్వాడు ఆయన.

వచ్చిన మొదటిరోజు పొద్దున్నే అందరూ ఊరంతా తిరగటానికి బయల్దేరాం. ఎక్కడెక్కడో తిరిగి స్వర్ణసరస్సు దగ్గరకి వచ్చాము. టాంగా దిగి పదడుగులు కూడా వేసి వుండము. ఈలోపుగా వనజ ఎందుకో పట్టుదలగా గొంతు లేస్తూ ఏడవటం మొదలెట్టింది. పాపం! ఆకలో, నిద్రో, ఏమిటో చేతిలో పిల్లాడు కూడా ఏడవటం మొదలెట్టాడు.

కోపంతో వనజను నాలుగు వడ్డించిన చంచల— 'విమలా! పిల్లిద్దరిని తీసికెళ్లి యింటివగ్గర పడేయి ముందు. ఈ లక్షణానికే నేను వీళ్ళతో కూడా యిల్లు వదిలి ఎక్కడికీ కదలను' అని విసుక్కుంటూ నాకు ఆజ్ఞ యిచ్చింది పర్వత నివాసం అనుభవించటానికి వచ్చిన మహారాణి. మోహన రావుతోను, ఆయన అన్నగారితోనూ మాట్లాడుతూ, ముందు నడుస్తున్న ఆయన నన్ను చూశారో లేదో, మోహనరావు టాంగాలో నేను పిల్లలతో యింటికి వచ్చేశాను.

'బయటికి వెళ్లి అందరిముందు అవమానపడే కంటే యికనుంచి యింట్లోనే పడివుంటే మంచిది' అని తీర్మానించు కొన్నాను. ఇంటికి వచ్చాక పిల్లవాడికి పాలు పట్టి పడుకో బెట్టాను. వనజ కూడా భోంచేసి ఆడుకుంటూ కూర్చుంది కుక్కపిల్లల్తో. వచ్చిరావటంతోనే గునిసిన రవికి, మాలతికి అన్నంపెట్టి వాళ్ళని పంపించాను. మిగిలిన, వాళ్ళంతా సావకాశంగా 'రౌండ్ టేబుల్' మీద భోజనానికి కూర్చు న్నారు. నేను వడ్డించటానికి వచ్చాను—నన్ను చూసి మోహనరావు— 'అదేమిటి విమలా? నువ్వు కూర్చోటం లేదా? ఏం?. ఆ వంటవా డేమయ్యాడు? అరేయ్ సుబ్బయ్యా!' అని గట్టిగా అరుస్తూ వంటవాణ్ణి పిలిచాడు.

నేనేమీ మాట్లాడలేదు. ఎవళ్లూ ఏమీ మాట్లాడ లేదు. నేను అందరితోను ఏదో ఒక విధంగా మాట్లాడుతూనే వున్నప్పటికీ, చంచల, నా బావగారు, నా భర్తా, మోహన రావు—వీళ్లందరి ఎదురుగుండా కూర్చుని భోజనం చెయ్య టానికి నాకు సిగ్గేసింది. అందులోను నేను నా జీవితంలో టేబుల్ మీద భోంచెయ్యలేదు.

'చాలా బాగుంది నువ్వు నడ్డించటం. అరేయ్ సుబ్బయ్యా! యింకో కంచం తీసుకురా! నువ్వు కూర్చో విమలా!' అని ఆడంబరంగా కేకలువేస్తూ నన్ను బలవంతం చేశాడు మోహనరావు.

నాకు ధర్మసంకటంగా వుంది. 'నేను తర్వాత తింటాను' అన్నాను ఎక్కడో నూతిలోనుంచి మాట్లాడుతున్నట్లు.

పక్కనే ఏమీ మాట్లాడకుండా కూర్చున్న నా భర్త భుజంమీద గట్టిగా ఓ గుద్దు గుద్దాడుమోహనరావు. 'ఒరేయ్! నోట్లో ఏముందిరా? మాట్లాడవేం? దేవీ! నువ్వా భోజనానికి దయచేయచ్చునే అని మర్యాద చెయ్యరా! నువ్వు కదా చెప్పాలి? అందుకనే అల్లా నిలబడి పోయింది?' అని ఆయనమీద విరుచుకుపడ్డాడు మోహనరావు.

'అ...బ్బా!' అని భుజం తడువుకొన్నారు ఆయన. 'ఈ రెండురోజుల్లోను నీ గుద్దులతో నా కీళ్ళుజారిపోయాయిరా బాబూ! ఏమయినప్పటికి మనిషి ఒకడు దొరికాడు కదా అని యిల్లాగనా? ఇది చాలా చాలా చెడ్డ అలవాటురా నాయనా! రేపు యిదే చెయ్యికదా అలవాటులో పొరపాటులా ముందుకు వస్తుంది? పొరపాటున నిర్మల పక్కనే వున్నప్పుడు చెయ్యి ఎత్తావో—ఫినిష్—అంతే! జాగ్రత్త!' అని అతిచమత్కారంగా సంభాషణ మార్చివేశారు ఆయన.

కాని మోహనరావు సామాన్యుడా?

'ఒరేయ్! బృహస్పతీ! చాలు నాకు నీ ఉపదేశం! ఇన్నిగుద్దులు తగిలినా గొడ్డులా నీకింకా బుద్ధి రావడం పోలేదే! భార్యతో జాగ్రత్తగా వుండాలని నాకు ఉపదేశం

చేస్తున్నాడు ! ఉపదేశం ! ఎంతసేపటినుంచి తను అల్లానిలబడి పోయింది ? కళ్ళకి కనిపిస్తోందిరా ?' అని ఆయన చమత్కారంగా సంభాషణ మార్చినందుకు యీయనగారు మళ్ళీ అందులోకే లాక్కొచ్చాడు!

ఇంతలోకే సుబ్బయ్య నాకు ఒక వెండికంచం తెచ్చి బల్లమీద పెట్టాడు. నాకు ఎందుకనో ఒణుకు పట్టుకొంది.

కుర్చీలోనుంచి లేచిన ఆయన 'మీరుకూడా భోజనానికి కూర్చోవచ్చునే!' అంటూ నాటకంలోలా మాట్లాడుతూ ఖాళీగావున్న కుర్చీని చూపించినప్పుడు నాబావగారితో సహితంగా అందరూ గొల్లున నవ్వారు. నాముఖం జేవురించి పోయింది. నన్ను మధ్య పెట్టుకొని అందరూకలసి నన్నవమానం చేస్తున్నారని కోపం పొంగిపోయింది.

'అదృష్టనశాత్తూ చంచల ముందుకొచ్చింది.

'చాలా బాగుంది మీరంతా కలిసి చేసే అల్లరి ! నువ్వేళ్ళమ్మా విడులా ! మీరందరూ తలోకరీతిగా యిల్లా గోలచేస్తే తనెల్లా భోంచేస్తుంది ? అందులోను తనకి యిటువంటి అలవాట్లులేవు' అని ఒక అదిరింపు అదిరించింది చంచల.

నా జీవితంలో ఒకే ఒక్కసారి నాలో ఆమెను హృదయపూర్వకంగా మెచ్చుకొని అభినందించాను. ధైర్యం వచ్చిన దానిలా తెచ్చినది వడ్డించటం ఆరంభించాను.

'భలే భలే చంచలా! నువ్వసలు చాలా అసాధ్యురాలివి ! తను కూర్చుందామనుకొన్నాకూడా నువ్వు కూర్చోనిచ్చేటట్లులేవే! అలవాటనేది ఎల్లా వస్తుంది ? నలుగురితో కలసిమెలసి నాలుగురోజులు తిరిగితేనేకదా ?' అన్నాడు

మోహనరావు. కాని, అంతటితో యింకా ఆ ప్రస్తావన అంత మయింది.

భోజనం పూర్తి కాబోతూన్న సమయంలో నా భర్త 'తాగటానికి కొంచెం వేన్నీళ్లు తీసుకురా విమలా !' అన్నారు. నేను తెచ్చి బల్లమీద పెట్టాను. గ్లాసును నోటిదగ్గర పెట్టుకొని 'అబ్బ ! ఎంత వేడి !' అంటూ గబుక్కున గ్లాసుని బల్లమీద పెట్టేశారు.

'చాలా వేడిగావున్నాయా ?' అంటూ నీళ్లు చల్లార పోయ బోయాను.

'నోరు కాలిపోయి వుండేది' అన్నారు ఆయన.

అంతటితో ఆ గొడవ ఆగిపోయివుంటే చాలా బాగుండి వుండేది.

'నాకు తెలుసు. తను గ్లాసు తెచ్చినప్పుడే ఆవిరి రానటం నేను చూశాను. గ్లాసు బల్లమీదపెట్టి చెయ్యికూడా విదిలించింది. ఇంత వేన్నీళ్ళా తాగటానికి యివ్వటం ? ఈ మాత్రం కూడానా ఒక ఆడదానికి తెలియదు ! అల్లాగే నోట్లో పోసేసుకొని వున్నట్లయితే ఏమయివుండేది !' అన్న చంచల నన్ను కోరచూపు చూసింది.

ఇది నేను సహించలేక పోయాను. ఆయన అడిగారు నేను తెచ్చాను. వేడి ఎక్కువగా వుందని ఆయన నన్ను కోప్పడవచ్చు. ఏం ? కొడితే కొట్టచ్చుకూడా. నాకు బాధగా వుండదు! ఈవిడగారికెందుకు యీ కోపం ? నేను కావాలనే చేస్తానా ? ఆయన నోరు కాలిపోతె అందుకు నాకు బాధ్యత లేదా ?

నేను ఏపని చేసినా ఏదో ఒక తప్పు పట్టుకోవటం ఆమెకు అలవాటు. ప్రతీరోజూ నా అత్తగారికి ఆమెకూ నేను వడ్డించేటప్పుడు, విశ్వవిద్యాలయం పరీక్షలా నాకు దడ ఎత్తుతుంది. అంత భయపడుతూ, భయపడుతూ చేసినా కూడా పప్పులో ఉప్పు తక్కువైందనో, కూరలో కారం ఎక్కువైందనో, ఏదో ఒకటి చెప్తూ నన్ను దెప్పిపొడుస్తేనే కాని వాళ్లకి ముద్ద దిగదు. వెయ్యిమంది మగవాళ్ళనేనా సమర్థించవచ్చు. కాని సర్వాధికారం వహించిన యిద్దరు ఆడవాళ్ళను సమర్థించటం చాలా కష్టం. ఇటువంటి, వాళ్ళ మనస్తత్వాలతో నా మనస్సు రాయి అయిపోయింది. కాని, యివాళ యిక్కడ నన్ను కూడా వాళ్ళతో సమాన దృక్పథంతో చూసే మోహనరావు ఎదురుగుండా, నాభర్త కూడా నన్ను ఏమీ అననప్పుడు ఆమె నన్ను తప్పు పట్టుకోవటం సహించలేకపోయాను.

'నేను గ్లాసు యిక్కడ పెట్టి చెయ్యి విదిలించానా? నోరు కాలిపోయేటంత వేడిగానా వున్నాయి? ఇదో ముట్టుకొని చూడండి. ఆయన నోరు కాలిపోవాలని, కావాలనే నేను చేసినట్లు, మాట్లాడేస్తున్నారే? మీకు వుండే బాధ్యత నాకు లేదా? తప్పు పట్టుకోవటానికి ఏమీ దొరక్కపోతే యిటువంటి ఏదో ఒక అబద్ధమేనా చెబితేగాని తోచదు కాబోలు!' అని నా కోపాన్నంతా వెళ్ళగక్కేశాను.

నేను యిన్ని మాట లన్నందుకు ఆవిడగారు ఊరుకొంటుందా? కావాలంటే నన్ను ఏమైనా చేయగదు. ఆమెను అడిగేవాళ్ళు లేరు! ఆమె చెప్పుచేతుల్లో వుండే భర్త. అంతు

లేని మర్యాద చూపించే మరిది. కోడలిమీద అపార ప్రేమాభిమానాలు చూపించే అత్తగారు. వీటన్నింటికీ పైగా—తల్లి వుంది — డబ్బు వుంది — సర్వాధికారిణి! ఆమె ఒక్కసారి అలక్ష్యంగా కంచంలో చెయ్యి విదిలిస్తూ— జ్వలించే కోపంతో నా భర్తను చూసింది. 'చూశావా చంద్రం! ఇప్పుడు తనని ఏమన్నాను? తప్పు చేసినందుకు 'యిల్లా చెయ్యకమ్మా' అని నేననటం తప్పా? నోటికొచ్చిన ట్లల్లా మాట్లాడేస్తోందే! నేను అబద్ధం చెబుతున్నానంటూ ఎగిరిపోతోందే! ఇంక నాకు గౌరవం ఏముంది?' అని గబ గబ అనేసింది చంచల.

రెండు పక్కలనుంచి, యిన్నాళ్ళనుంచి అణిగివున్న పొగ బయటికి వచ్చింది! అటూ రావటానిక్కి వీల్లేకుండా, యిటూ రావటానికి వీల్లేకుండా, మధ్యలో నిలబడిపోయిన ఆయన యిప్పుడు ఏ పక్క మొగ్గుతారో చూడాలి. నిజంగా ఆయనకు నామీద అనురాగం వుందో లేదో తెలుసుకోనేందుకు సందర్భం వచ్చింది!' అనుకొంటూ ఆతృతగా ఆయన్నే చూస్తూ నిలబడిపోయాను.

ప్రతాను ఏపక్కకీ కూడా మొగ్గలేదు! మౌనంగానే కంచంముందు నుంచి లేచారు. మోహనరావు మాట్లాడకుండా వుండకూడదా?

'ఏం చంచలా? సమానత్వం సమానత్వం అంటూ ఆడవాళ్ళంతా ఓపక్క ఘోషిస్తూంటే నువ్వుమాత్రం ఎక్కడో బి. సి. దానిలానే వున్నావే! వేన్నీళ్ళు తెచ్చి యిస్తే అవి ఎంత వేడిగా వున్నాయో చూసుకొని తాగటాని

కే మొచ్చింది యీ దొరగారికి? అది కూడానా ఆమె బాధ్యత ? 'భార్య అనురాగంతో సుశ్రూష చేస్తుంది.' అని అనుకోవాలే కాని యిల్లా చెయ్యాలి, అల్లా చెయ్యాలి అంటూ బలవంతంగా నిర్బంధించటం మంచి పని కాదు. నన్నడిగితే, ఒకో సమయంలో భర్తకూడా భార్యకు అదేవిధంగా చెయ్యాల్సి వుంటుందనే చెప్తాను' అంటూ లేచాడు.

చేతులు కడుక్కొని వచ్చిన నా భర్త యీసారి అతని భుజంమీద ఓ గుద్దు గుద్ది – 'ఫర్వాలేదు ! దాంపత్యాన్ని గురించి యీమాత్రం తెలుసుకొన్నావు. బాగుపడతావు' అని నవ్వాడు. అతనులోపల చాలా సంతోషించినట్లు కనిపించాడు. నా బావగారు ఏదీకూడా విననట్లు పొట్ట తడవుకొంటు ఓ త్రేన్పు తేన్చారు. ఆమె చెప్పినది విన్న నాభర్త నన్ను దండించలేదే అన్న కోపం చంచలకి. నాకో, మోహనరావు ఎదురుగుండా నన్ను హీనంగా చూడటం, ఆయన అదంతావిని ఒక మాటేనా మాట్లాడకపోవటం నాలోని పుండు రేగి యింకా బాధపెట్టింది. అతనుకూడా సహించలేకపోయాడు. ఆయన సహించుకొన్నారు ! ఆయనకే అవమానంగా లేదా ? కాని ఆమె మాటలు విన్న ఆయన నన్ను ఏమీ అనకుండా వుండి పోయారే ! అది చాలా గొప్ప విషయమే !

ఆవాళ ఏవో వుత్తరాలు వచ్చాయి. వాళ్ళలో వాళ్లు మాట్లాడుకొని, నాభర్త, పెట్టి సర్దుకోవటం చూసిన నన్ను, ఎవరో నా గొంతుకను నులిపివేస్తున్నట్లయింది. ఆఫీసులో యిద్దరూ కూడా లేకపోవటం వల్ల అక్కడ చాలా యిబ్బం

దిగా వుందిట. అందుచేత ఆయన రేపే కలకత్తా వెళ్ళిపోతున్నారు!

ఆయన నామీద అభిమానం చూపించటానికి రాలేదు. ప్రేమతో మాట్లాడలేదు. అయినప్పటికి ఆయన వున్న యింటిలో నేను వుంటున్నాను. నా కళ్ళముందు ఆయన తిరుగుతున్నారు. ఇకనుంచి యిదికూడా లేదు! సూర్యుడు లేని ఆకాశంలా, చక్రాలులేని రథంలా యీ అందమైన పర్వత ప్రాంతంలో నేను రోజులు లెక్కబెట్టాలి! పిల్లలకు ఆయాలాగ పిలిచిన పిలుపుకు దాసీదానిలా, మూగదానిలా నేను రోజులు గడపాలి!

ఆయన మనస్సెప్పటికి రాయా? ఆదరించే హృదయమే లేదా? నా యీ శోకజీవితానికి అంతమే లేదా? నేను చేసిన తప్పు - అది తప్పుగానే భావించినప్పటికి - జీవితాన్నే బలి చెయ్యాలా! నాలో ఏదో ప్రళయం వచ్చినట్లుంది. రాత్రిళ్లు నాతోకూడా పడుకొనే వనజ, మాలతిలు, 'కథచెప్పు పిన్నీ' అంటూ గారాబం చేసినవాళ్ళ మీద 'కథా లేదు గిథా లేదు పడుకోండి మాట్లాడకుండా!' అంటూ ఎప్పుడూ లేనిది, విసుచుకు పడ్డాను.

మేడమీద మధ్యహాలులో చంచల, నా బావగారు, నా భర్త, మోహనరావు—నలుగురూ కలిసి పేకాడుకొంటున్నారు. నవ్వులు, పేకముక్కల చప్పుడు— మోహనరావు కలకలనవ్వే ఆ నవ్వుకి యిల్లంతా అదిరిపోయేటట్టుంది. గడియారం పదిగంటలు కొట్టింది. ఆ పేకాట యింకొంచెం సేపట్లో పూర్తవుతుంది. తర్వాత ఆయన పిల్లిలా అడుగులో

అడుగు వేసుకొంటూ వస్తారు. నన్ను చూస్తేనే మనస్సు ఎక్కడ తల్లకిందులై పోతుందో అన్నట్లు ముఖం తిప్పేసుకొంటారు. నేను దీపం ఆర్పకుండా కూర్చునే వున్నట్లయితే 'ఇంకా నిద్రపోలేదా? చాలా పొద్దుపోయినట్టుంది— దీపం ఆర్పేస్తే బాగుంటుందేమో!' అంటారు. ఆయన నిశ్చలత్వం నన్ను రాయిగా మార్చివేస్తుంది. నోరు విప్పి ఏదైనా మాట్లాడాలనుకొంటే, దానిని కూడా నమిలి మింగేసేటట్లు చేస్తుంది ఆయన చంచలం లేని మనస్సు!

ఆడవాళ్ళు తమ మాటల చాతుర్యంతోను, మైమరపించే చూపులతోను, చిఱునవ్వులతోను, అన్నింటిని త్యజించిన మునివర్యులని కూడా తల్లకిందులు చేశారనే విషయం నాకు తెలియనిదికాదు. కామవాంఛ లేనిచోట మనస్సును రెచ్చగొట్టేందుకు చేసే ప్రయత్నాలు అవన్నీ. సతి—పతి అనే పునీత బంధుత్వానికి పునాది ఒకరినొకరు అర్థం చేసుకొనే మనస్సుల కలయికే కదా? ఈ పునాది లేకుండా లేచే శరీర కలయికలో వెగటు తోచే కదా నేను ఆనాడు వెనక్కు తోసేశాను. ఆయనకు నామీద నిజమైన ప్రేమ పుట్టుకొచ్చేటట్లు చెయ్యటానికి ఏ విధంగా సంచరించాలో నాకు తెలియటంలేదే?

కిటికీ తెర తీసి అద్దాల తలుపులను తెరచాను. పర్వతాల మీదనుంచి వచ్చే చల్లగాలి 'జిల్లు' మనిపించింది. నా ఒళ్లు జలదరించింది. నా చీరకొంగును లాగి కప్పుకొంటూ బయటకు చూశాను. చీకటి రాత్రులు కాబోలు పర్వత సుందరి అంధకారంలో కలిసిపోయినట్లుంది. ఎక్కడ చూసినా

శూన్యం. ఎక్కడ చూసినా నిశ్శబ్దం. 'నీ జీవితం కూడా యింతే! నీ జీవితంకూడా యింతే!' అని నాలో ఎవళ్ళో ఘోషించారు. వెక్కి-వెక్కి ఏడ్చాను. నా ఆలోచనల నుంచి ఆ యిల్లు, ఆడంబరం, ఆ పేకాట అంతము, అన్నీ దూరమయిపోయాయి. నా శూన్య ప్రపంచంలోని శోక చెఱ సాలలో పడిపోయి ఎంతసేపు కన్నీరు కారుస్తూ వుండి పోయానో?

తలుపు 'క్రీచ్'మని శబ్దం చేస్తూ తెరుచుకొని గడియ వేసిన చప్పుడు వినిపించింది నాకు. మంచంమీదకు వెళ్ళి కూర్చున్న ఆయన, నెత్తిమీద చెయ్యి పెట్టుకొని దీర్ఘ నిట్టూర్పు విడవటం, టిక్ టిక్ మంటూ ఆగిపోతుందనిపించే దడదడ అదిరే నా హృదయం మీద సమ్మెట పోట్లు పొడు స్తున్నట్లయింది. ఆయన నా దగ్గరగా వచ్చి కన్నీటి చారలతో నిండిపోయిన నా ముఖాన్ని పరిశీలనగా చూశారు.

'విమలా!' అన్నారు మెల్లిగా.

రాతిగుండె కరిగిపోయిందా? నా ఒళ్ళు యిల్లా జలద రించి పోతోందెందుచేత? 'ఏం?' అని అడగలేకపోయాను. ఎక్కిళ్ళు వచ్చాయి!

తడబడే గొంతుకను సర్దుకొంటూ ఆయన — 'నా జీవితంలో, నేనొక మన్నించరాని మహా పాపాన్ని చేశాను విమలా!' అన్నారు.

తేలు కుట్టినప్పుడు బాధతో గంతులువేస్తూ మందు కోసం ఆత్రుతగా ఎదురు చూస్తూన్నప్పుడు కాలకూట విషం

శరీరంలోకి ఎక్కిపోయినట్లయితే ఎల్లా వుంటుంది? వెర్రెత్తిన దానిలా ఆయన్ని చూశాను.

'నేను నిన్ను పెళ్ళిచేసుకొన్నరోజున నా కన్నా భాగ్యశాలి మరొకరుండరను కొన్నాను. గర్వించాను. యౌవ్వన మైకంలో, అజ్ఞానంలో నేను నీకు మన్నించరాని మహా పాపాన్ని చేస్తున్నానని తెలుసుకోలేకపోయాను విమలా? పూర్తిగా తెలుసుకోకుండా, ఆలోచించకుండా నీకూ నాకూ మధ్య లోతైన లోయను తవ్వివేశాను. నన్ను క్షమించు. నిన్ను సుఖపెట్టగలిగేందుకు యింతకన్నా మంచి మార్గంలో నడవ లేను విమలా ...!'

మౌంట్ ఎవరెస్టు పర్వతంమీదనుంచి నన్ను ఒక్కసారిగా కిందకు తోసేసినట్లయింది! నేను ఆయన జీవితంలో కలిసినందుకు, అన్నయ్య, వదినగార్లనుండి ఆయన వేరుపడటానికి హేతువైందనే దానిని ఎంత సామర్థ్యంగా చెబుతున్నారు? నన్ను చేపట్టినప్పుడు నా రాక్షసితనం తెలియలేదట! నా మీద ఆయనకు ఏర్పడే అనురాగం నేను ఆయన గౌరవాన్ని పోగొట్టే పునాదిలావుంది! ఛీ! ఎంత స్వార్థంతో కూడుకొన్న మనిషి యీయన! పిరికి! అవును పిరికివారే? లేకపోతే అన్నయ్యను వదిలి నాతో స్వతంత్ర జీవనం గడపటానికి ముందుకు రారా? కారు, బంగళా, నగలూ నాణ్యాలు అక్కర్లేదే! వాళ్ళతో మనస్పర్థలు వచ్చే పద్ధతిలో నడవనే నడవరు. కాని యీ పక్కనుంచి ఆయనమీద విరుచుకు పడతానేమోనని యీ సామర్థ్యం! ఈ త్యాగం కూడా అందుకే. ఏం కావాలన్నా చేస్తారు. కాని వాళ్ళు గీచిన

గీటు దాటరు ! విరక్తి నా వైరాగ్యాన్ని రేకెత్తించింది. గబుక్కున లైటార్పేశాను. తలుపుల కిటికీలు మూసేశాను. ఎప్పుడూలేని నిమ్మదిపడ్డ హృదయంతో కళ్ళు మూసుకొని పడుకొన్నాను !

# 16

మనోహరమైన మహదానందాన్ని కలిగించే సాయంత్ర సమయం. జంట జంటలుగా యువతీ యువకులు వింతవింత రంగుల దుస్తులతో పర్వతప్రాంతాలలో నిశ్చింతగా, ఉల్లాసంగా విహారం చేస్తున్నారు. ఐశ్వర్యవంతులైన సుఖవాసుల ఆడంబర జీవితాలను ప్రతిబింబింప జేసేటట్లు రోడ్ల మీద అటూ యిటూ పరిగెత్తే టాంగాలు, ఆ సాయంత్ర సమయంలో మరింత శోభాయామానంగా వున్నాయి. సంధ్యాభాస్కరుని అంతిమ ప్రయాణాన్ని చూసి కుమిలిపోయే పర్వతసుందరి, కిటికీలోనుంచి పిచ్చిదానిలాచూస్తూ కూర్చున్న నన్నుచూసి నవ్వుతున్నట్లుంది. అత్యంత అందంగా మోహనరావు కట్టించిన యీ బంగళాలో యింతవరకు ఎవ్వరూ కన్నీరు కార్చివుండరు. ఒక విధంగా చూసి నట్లయితే భగవంతుడు కరుణామయుడే. కష్టాలను కూడా కలిగిస్తున్నాడు. ఆ విధంగా ఒకబాధ ఏర్పడినప్పుడు మనం ఎల్లా తట్టుకొంటామో అనే భీతి కలిగినప్పుడు, దానిని తట్టుకొనే శక్తినికూడా ప్రసాదిస్తున్నాడు. ఎల్లా తట్టుకొంటున్నామోకూడా ఆ సమయంలో అర్థంకాదు. ఆలోచించి చూస్తే 'ఆ పర్వతాన్ని మనమా మోస్తున్నాం?' అనే ఆశ్చర్యం కూడా కలుగుతుంది.

నేను భయపడినది యిప్పుడు నిజమయింది. ఇంక ఆయన మనస్సులో ఏముందోనని సందేహపడ నవసరం లేదు. ఆలోచనలతో బుర్ర పాడు చేసుకోనక్కర్లేదు. నాలో చెలరేగే ఆవేశాలకి ఆయన చలించరు. ప్రేమ పవిత్రమైనదని, మమత మాయనిదని, అనురాగం ఆదర్శమైనదని ఆయన కలలో కూడా అనుకోరు! నేను కట్టిన కోటలన్నీ గాలి మేడలు! అదంతా నా అజ్ఞానం! ఏదో ఆయన యిష్టప్రకారం, ఆయన తీసికెళ్ళే చోటల్లా సాగే రబ్బరులా వుంటానని నన్ను కేవలంగా తలచి బొమ్మలాటలా నన్ను పెళ్ళిచేసుకొన్నారు! ఇప్పుడు ఆయనకీ కష్టం! నాకూ కష్టం! లోతైన లోయలోపడి పోతు న్నామేమో, అనే దిగులులోనుంచి నిజంగా యిప్పుడు పడే పోయాను. నాలాంటి అతిశయ జీవితం ఏ స్త్రీకేనా దొరికి వుంటుందా? నామీద అనుతాపం చూపించే అవసరం ఎవరికీ లేదు! నాగరీక కప్పుతో మూతబడిపోయిన ఆడంబర జీవితాల నిజస్వరూపాలు బయటికి కనిపించవు. కమిలిపోయే నా నిజస్థితికూడా ఎవరికీ కనిపించదు!

'ఇది నా తలరాత?' అని ఎన్నివిధాలుగా సమాధాన పడినప్పటికి నా హృదయంలో ఏదో, ఒక మూల మేఘాలు గర్జిస్తున్నట్లు ఘోషిస్తోంది నా ఆవేదన. మనస్సును ఏ విధంగా తిప్పుకొందామా అని పరిపరి విధాల ఆలో చించాను. ఇంటి జ్ఞాపకం రావటంతోటే జానకి జ్ఞాపకం వచ్చింది. కొవ్వూరులోనే నా సంగీతాభివృద్ధిని కట్టిపెట్టేశాను. అప్పుడు యింట్లో ఎవరూ లేరు. పిల్లా పెద్దా అంతా విహా

రానికి వెళ్లారు. మోహనరావుకూడా ఎక్కడికో వెళ్లాడు. రెండు పాటలు పాడదామని గదిలోకి వచ్చాను.

ఇంత ఆడంబరంగా సకల సౌకర్యాలతో నిండిన ఆ యింట్లో ఒక దేవుడి పటంకాని, ఒక దీపపు శెమ్మెకాని లేదు. ఐశ్వర్యము, సుఖము, ఎక్కువైపోతే దైవధ్యానమే అక్కర్లేదు కాబోలు! ఆ గదిలోని అల్మారాలో మాత్రం చాలా కొవ్వొత్తులున్నాయి. ఎప్పుడైనా అకస్మాత్తుగా విద్యుచ్ఛక్తి ఆగిపోతే, వుపయోగించటంకోసం కొన్నారు కాబోలు. ఒక కొవ్వొత్తిని తీసి వెలిగించాను. దీపజ్యోతిని నన్ను నేను మరచిపోయి ఒక క్షణం పరిశీలనగా చూశాను. కాంతి అంతా ఒకే రంగుగా లేదు. అడుగున నీలం, మధ్యన చంద్రకాంతి, చివర ఎఱ్ఱని ఎఱుపు; అన్నింటిని భరిస్తూ దివ్యజ్యోతిలా ప్రకాశిస్తోంది ఇందుచేతనే, తీక్షణంగా కళ్ళను పాడవకుండా మనస్సుకు శాంతిని, హాయిని దీపజ్యోతి కలగజేస్తోంది అని తెలుసుకొన్నాను.

'కష్టాలు, విచారం. అలసట అనేవి వున్నప్పటికి ఈ దీపజ్యోతిలాంటి అనురాగ జ్యోతిలోని జయప్రదమైన జీవితాన్ని ప్రసాదించు దేవీ!' అని నాకు తెలియకుండానే నా మనస్సు అంబికను ప్రార్థించింది.

తర్వాత మనసువిప్పి నా కష్టాలన్నీ మర్చిపోయి పాడాను. ఒక పాట. . . రెండు పాటలు. . . మూడు పాటలు. . . నా మనస్సు పూర్తిగా సంగీతంలో ఐక్యమయిపోయింది. నన్ను అడ్డుపెట్టేవాళ్ళు ఎవళ్ళూ లేరు. ఇష్టం వచ్చినట్లల్లా పాడుతున్న సమయంలోనే కొవ్వొత్తి ఆరిపోయింది. 'తలుపు తీసే

వుంది. గాలికి ఆరిపోయింది కాబోలు !' అనుకొని తలుపు
వేద్దామని లేచాను. వెనక్కి తిరిగిన నేను పాముని తొక్కి
నట్లు బెదిరిపోయి వణికిపోయాను. గది బయట, చేతులు
వెనక్కి కట్టుకొని నిల్చున్న మోహనరావు నన్ను చూసి
చిఱునవ్వు నవ్వాడు ! ఎంతసేపటి నుంచి అక్కడ నిల్చొని
వున్నాడో !

'చాలా అద్భుతంగా పాడుతున్నావ్ విమలా ! పక్క
వాయిద్యాలు లేకుండా రేడియోలో ఎవరు పాడుతున్నారా
అని ఆశ్చర్యపోతూ నువ్వే పాడుతున్నావని తెలుసుకొని
అతిశయంతో భ్రమించిపోయి నిలబడిపోయాను ! ఇంత
శ్రావ్యంగా పాడగలవని నాకు ఎవ్వరూ చెప్పలేదే విమలా!'
అన్నాడు.

సిగ్గూ, భయము నన్నావరించాయి. కదలటానికి
కూడా శక్తిలేని దానిలా అల్లాగే నిలబడిపోయాను.

'ఎన్నాళ్ళు నేర్చుకొన్నావు విమలా ! ఎవరిదగ్గర ?'
అన్నాడు మళ్ళీ.

నేను మాట్లాడలేకపోయాను.

'ఇంకో రెండు పాటలు పాడతావా విమలా ? అప్పుడే
లేచిపోయావేం ? నేను వచ్చాననా ? నేను కూడా కొంచెం
సంగీతం నేర్చుకొన్నాను. ఇప్పుడు వీణకూడా సాధకం చేస్తు
న్నాను.నువ్వు యింత అద్భుతంగా పాడతావని నేను యివాళ
వరకు తెలుసుకోలేకపోయాను కదా ! ఇక్కడ ఫిడేలు, వీణ,
తంబూరా, సితార్ అన్నీ వున్నాయి. వాటిని నీ యిష్టం
వచ్చినట్లు ఉపయోగించుకోవచ్చు' అన్నాడు.

బలవంతంగా బోనులో చిక్కుకుపోయినట్లుంది నా పరిస్థితి. ఇంట్లో ఎవరూ లేరు. అతను కోరినట్లు రెండు పాటలు పాడనా? అకస్మాత్తుగా చంచల, బావగారు వస్తే ఏమనుకోరు? కాని తప్పుగా ఎందుకనుకోవాలి? అతనికి కూడా యీ కళలో జ్ఞానం వుంది. నన్ను గౌరవించి రెండు పాటలు పాడమని కోరుతున్నప్పుడు నేను నిరాకరించటమూ?

నేను కాపరానికి వచ్చి యిన్నాళ్లయినప్పటికి నన్ను పాడమని ఎవరూ యింతవరకూ అడగలేదు. అవాళ ఒక రోజు నిర్మల నన్ను పాడమన్నప్పటికి సందర్భం కుదరలేదు. సాధారణంగా చాలామంది పెళ్లిముందు పిల్లను చూడటానికి వచ్చినపుడు, పిల్లకి పాటలు వచ్చా, నాట్యం వచ్చా అంటూ కళారసికులలా కనిపిస్తారే కాని ఆ పరీక్షతోనే అంత మౌతుంది వారి కళాభిమానం. తీరా పెళ్లంటూ అయాక కాపరానికి వచ్చాక ఆటాపాటా అంతా మూట కట్టేసినంట పొయ్యి దగ్గర కూర్చోబెట్టేస్తారు. పిల్లని చూడటానికి వెళ్ళిన రోజున కనిపింపజేసిన కళాభిమానం ఛాయలేనా వాళ్లలో కనిపించవు. పిల్లలను పెంచటానికి తల్లిప్రేమ ఎంత అవుసరమో కళాకారులకు యితరుల ఉత్సాహ ప్రోద్బలం కూడా అంతే అవసరం. అదిలేకపోయినట్లయితే కళాభిమానం లోలోపలే అణిగిపోయి నశించిపోతుంది. భార్య నేర్చుకొన్న లలితకళను ఉత్సాహపరచి, పెంపొందింప చేసే భర్తలు మన సంఘంలో చాలా అరుదు. నిజంగా భర్త కళాభిమాని అయినప్పటికి పరిస్థితులు సానుకూలంగా సహాయపడటం లేదు.

నాకు సంబంధించినంతవరకు రసికత్వాన్ని ముట్టు కొన్న చేతిని కడుక్కొన్న తర్వాతనే బ్రహ్మ నా భర్తను సృష్టించి వుండాలి! లేకపోతే, ఆయన వాళ్లందరూ సంగీత విద్వాంసులైనప్పుడు ఆయనకు సంగీతం రసించే శక్తైనా లేకపోవటం ఎంత ఆశ్చరం?

ఇప్పుడు మోహనరావు నా సంగీతాన్ని విన్నాడు. ఉత్సాహంతో, యింకా కొంతసేపు పాడమంటున్నాడు. నా కళ యింకా పెంపొందాలంటే యిటువంటి మాట లేకదా కావాలి? నేను ఎందుకు పాడకూడదు? మనస్సులో ధైర్యాన్ని కూడగట్టుకొని ఏ ఏ పాటలు పాడదామా అని ఆలోచించాను. నేను పాడటానికి సుముఖంగానే వున్నానని అతను ఎల్లాగో పసిగట్టేసాడు. 'ఉండు వీణ తెస్తాను' అంటూ వీణ తెచ్చాడు. గబగబ ఒక పాట పాడేసి నేను లేచాను.

'నేను పాడమనటానికి ముందు నువ్వు పాడిన శ్రావ్యం యిప్పుడు రా లేదు విమలా! నేను చాలా తెలివితక్కువ పని చేశాను. నీకు కనిపించకుండా బయటే నిల్చుని విని వుండా ల్సింది' అన్నాడు మోహనరావు నవ్వుతూ.

సంకోచంలో చిక్కుకు పోయి తలవంచుకొని మౌనంగా నిలబడి పోయాను.

'నువ్వు యిందాక పాడావుచూడు. ఆపాట నాకుకూడా వచ్చును. నేను వీణ వాయిస్తాను ఎల్లావుందో చెప్పు చూద్దాం', అనేసి నా సమాధానాన్ని ఎదురుచూడకుండా వీణవాయించటం మొదలెట్టాడు మోహనరావు.

నాకు చెప్పలేనంత సిగ్గేసింది. రాగ తాళాలలో ఎక్కడా భేదం లేకుండా నేను పాడినట్లే అతను వీణ వాయించాడు. అంత అద్భుతంగా అతను వీణ వాయిస్తాడని నేను అనుకోలేదు.

'నన్ను గేలిచేసేటట్లు వాయించారు' అని మెల్లిగా నవ్వాను.

'లేదు విమలా! ఆ మూడో చరణం చివర నువ్వు రాగాలాపన చేశావే, అది నాకు రావటం లేదు. ఏదీ — ఆ చరణం మరొక్కసారి పాడు' అన్నాడు.

సిగ్గు పడుతూన్న నన్ను యీపొగడ్త యింకా ఉత్సాహపరిచింది!

'ఊరికే తమాషా చేస్తున్నారు, నేను పాడను' అంటూ బెట్టుసరిగా లోపలికి పారిపోయాను.

ఇంకా నయం, సరిగ్గా నేను మేడదిగి వచ్చేటప్పటికి అప్పుడే, చంచల, నా బావగారు, పిల్లలు అంతా గేటుదాటి లోపలికి వస్తున్నారు.

'విమలా!' అంటూ పిలుస్తూనే వచ్చింది చంచల. మోహన్ వచ్చి ఎంతసేపయింది? ఏదో టెన్నిస్ మాచ్ అంటూ వెళ్ళాడే!' అని అడిగింది ఏదో అనుమానం తోచినట్లు.

'ఎప్పుడు వచ్చారో నాకే తెలియదు. నేను పనంతా పూర్తి చేసుకొని పిల్లవాణ్ణి పడుకోబెట్టటానికి వచ్చేసరికి, ఆయన పాడుతూండటం విన్నాను' అన్నాను.

మరి, లేకపోతే ఏమని చెప్పను?

'ఊహూ! ఇకనుంచి జ్ఞాపకం వుంచుకో! అతను కొంచెం మితిమీరిన చనువుతో సంచరిస్తాడు. అయినప్పటికీ చూసేవాళ్ళకి బాగుండదు. ఎక్కువగా అతనితో మాటలు పెట్టుకోకు!' అంది కోపంగా చంచల.

అప్పుడే ఆమె బుద్ధి ఎంతదూరం వెళ్ళిపోయింది? ఈ ధర్మసంకటంతో ఆమె యింట్లో వుండిపోవటానికి కుదరదు! నన్ను ఆమెతో తీసికెళ్ళటానికి వీల్లేదు! మోహనరావుని కట్టుబాటు చేయటం అనేది ఆమెకు సాధ్యం కాదు!

అల్లాగే అన్నట్లు తలూపాను.

కావలివాళ్ళు కట్టుబాట్లు అధికంగా వున్నచోటే ఎల్లాగో చిన్నసందు ఏర్పడి తప్పు జరగటం సహజం. మోహన రావుతో నేను మాట్లాడటం విషయంలో చంచల నాకు హెచ్చరిక చేసింది. కాని సందర్భాను సారంగా, ఆమె కట్టు బాటు ప్రకారం నేను మూగదాని నవటం సాధ్యమవు తోందా? పరాయి మగాణ్ణి చూసి అదిరి బెదిరి పారిపోయే పల్లెటూరి పరిస్థితులైనా బాగుండును. రెంటికి చెడ్డ రేవడి లాంటి నేను యిప్పుడు ఏం చెయ్యను!

రాత్రి భోజనాలయాక మాగదిలో నిన్నటి మాదిరి గానే కిటికీలోనుంచి శూన్యమయిన చీకటిని చూస్తుకూర్చుండి పోయాను. టైము పదకొండు అయివుంటుందేమో. దీపం ఆర్పేశాను. నా మనస్సులో ఒకమూల పొదలాగున్న ప్రళయం మెల్లి మెల్లిగా తలఎత్తింది. ఏ కాంతంలో నిన్నరాత్రి నేను యిక్కడ కూర్చుని కన్నీరు కారుస్తూండగా, ఆయన రావటం మాట్లాడిన మాటలు, ఫెళఫెళమని నాముందు పడి ఆడే

నాగపాముకి ఊదే నాగస్వరంలా ఆ ప్రశ్నయానికి ఆవేశాన్నిచ్చాయి !

మానవ జీవితంలో తలవని తలంపుగా ఏర్పడే ఆపదలు, జబ్బులు, జ్వరాలు మొదలైన ఎన్నో ఎదురుదెబ్బలు ఎదురౌతున్నాయి. అవన్నీ విధియొక్క విచిత్రాలని వాటిని అడ్డుకోలేమని అంటున్నారు పెద్దలు. అల్లాగే నాయీ పరిస్థితి కూడా విధియొక్క విచిత్రమే అయివుండాలి. లేకపోతే అల్ప విషయంలో కలిగిన అర్ధంలేని భయంలో ఆరంభమయి, యీనాడు ఆదరమే లేకుండా అల్లల్లాడి పోయే అధోగతికి ఎందుకు వచ్చాను నేను ? ప్రపంచంలోనే లేని అతిశయంలా ఎప్పుడో ఆదరం చూపించిన అన్నయ్య, వదినలమీద విశ్వాసం కోసం కట్టుకొన్న భార్యమీద ప్రేమను తుచ్ఛంగా చూస్తారా యీయన ? ఎంత చెప్పినాకూడా ఎవరూ నమ్మరు !

కన్నీటి తెరలో వున్న కళ్ళను తుడిచి కదలకుండా కిందకి చూశాను. రోడ్డుమీద వరుస వరుసగా కనిపించిన మునిసిపాలిటీ విద్యుద్దీపాలు పర్వత సుందరికి అందంగా పూల మాల వేసినట్లు వున్నాయి. ఆకాశంలో చంద్రుడు లేడు. నక్షత్రాలుకూడా లేవు. చెట్లకొమ్మలు, మొక్కలు, తీగలు, ఎక్కడా ఆకులుకూడా అల్లల్లాడటం లేదు. ఇంటిచుట్టూ తిరిగి వచ్చే కాలిబాటలో ఏదో ఒక రూపం నడిచి వస్తున్నట్లు కనిపించింది. 'ఈ బంగళా దారిలో యీ సమయంలో వచ్చే వారెవరా?' అని కొంచెం పరిశీలనగా చూశాను. ఓవర్ కోట్, నెత్తిమీద టోపీతో ఒక మగరూపం లా కనిపించింది. 'దొంగ ఇల్లాకూడా వస్తాడా?' అని ఒక్కక్షణంలో ఏమేమో ఆలోచించి

వేసిన నాకు, గబుక్కున తలుపు వేసేసి లోపలికి వచ్చేయాలని తోచలేదు! తలవని తలంపుగా, దారిమీద 'టార్చిలైట్' కాంతి పడింది. నల్లటి మేఘాల చివర కనిపించే వెండి చారలా నాలో ఏదో పిచ్చి ధైర్యం కలిగింది. దీపం వేస్తూ వచ్చే యీ మనిషి దొంగ అవునో కాదో చూడాలని, దొంగే అయినట్లయితే ఒక్క కేకతో యింట్లో వాళ్లందరిని లేపివేయవచ్చని చిన్న పిల్లలా అనుకొన్నాను. 'టార్చిలైట్' కాంతి నామీద పడింది! వెంటనే — 'యింకా నువ్వు పడుకోకుండానా కూర్చున్నావు విమలా! చల్లగాలి లోపలికి రానటం లేదా?' అన్నాడు మోహన్‌రావు.

నేను తెల్లపోయాను!

'మీరా' అన్నాను మూలుగుతున్నట్లు.

'ఏం? దొంగ ఎవడో లోపలికి వస్తున్నాడని భయపడ్డావు కాబోలు!' అని నవ్వి — 'నాకు రాత్రిళ్ళు చీకట్లో నిశ్శబ్దంలో చలనం లేకుండా నిలబడే యీ పర్వత సుందరిని చూడటంలో ఒక పిచ్చి. అదో, ఆ మూలనుంచి చూస్తే... ఆహా!...' అన్నాడు తన్మయత్వంతో.

నేను అనుతాపంగా నిట్టూర్పు విడిచాను! మీరన్నట్లు దొంగే అనుకున్నాను. అరుద్దామనుకొన్నాను కూడా' అన్నాను.

'ఇంకానయం!' అన్నాడు.

కిటికీ తలుపులు మూసేద్దామని నేను లేచాను.

'ఈ పర్వత సుందరి రోజు రోజూ యిల్లా చీకట్లో దిగులుతో ములిగిపోయి, తన ప్రియుడు వస్తాడని చూస్తూ

చూస్తూ కన్నీరు కార్చటం చూడటమే కాకుండా, నిజమైన ఒక సుందరికూడా అదేస్థితిలో వుండటం నేను యివాళ ప్రత్యక్షంగా చూడటం తటస్థించింది!' అన్నాడు మోహనరావు.

నేను యీ మాటలు విని అదిరిపడ్డాను, విశాల హృదయం, చనువు, స్వతంత్రం అంటే అందుకు యిల్లా మాట్లాడచ్చు, యిల్లా మాట్లాడకూడదు అనే ఒక హద్దు లేదా? నేను తెల్లబోయి నిల్చోటం చూసి—

'కాని యీ పర్వత సుందరి తాపం వృథాగా పోదు. మకుట మరకత మాణిక్య మయమైన ప్రకాశంతో ఉదయభానుడు తన హృదయద్వారాన్ని తెరచి తన అరుణ కిరణాలతో ఆమెను ఆలింగనం చేసికొంటూ తనలోకి తీసుకొంటాడు. చిందిన కన్నీరంతా పచ్చగడ్డిమీద ఆణిముత్యాల్లా ప్రకాశించేటట్లు ఆమె తన్మయత్వం చెందుతుంది!

ఈ చిత్రమైన మాటలు నన్ను ఆకర్షించాయి! వర్ణ విచిత్రాలను చూసి భ్రమించి మైమరచి నిలబడి పోయిన పసిపిల్లలా, అతని రసికత్వం నన్ను భ్రమింప చేసింది. 'తర్వాత' అని నేనడుగుతున్నట్లు అతనికి తోచివుంటుంది—

'ప్రియుని ఒడిలో పగలంతా తనకు సాటి ఎవరూ లేరన పులకాంకితురాలవుతుంది. మళ్ళీ తను ఆమెవద్ద శెలవు తీసికొనే సన్నివేశం వుందే, అది నువ్వు ఎప్పుడైనా చూశావా విమలా?' అని అడిగాడు.

'లేదు. నేను చూడలేదు. చూసి ఏం ప్రయోజనం? నాకు యిల్లామాట్లాడటం చేతకాదే!' అని జవాబిచ్చిన నన్ను

మనస్సులో—గుఱ్ఱపురౌతు గుఱ్ఱాన్ని, కళ్ళెంపట్టుకొని బల వంతంగా వెనక్కి లాగినట్లు ఏదో నన్ను గట్టిగా లాగింది!

'విమలా! చంద్రశేఖరానికి నీకూ మధ్యజరిగిన నిన్నటి రాత్రి సంభాషణ నేను యీ దారిన వెళ్తూవిన్నాను! చంచల నిన్ను ఒక బానిసలా చూడటం, తను అనుమతించటం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. అప్పటినుంచి నిన్ను చూస్తూంటే నాకు చాలా బాధగా వుంది. నిజంగా నేను నీ మీద అను తాపంతో అడుగుతున్నాను. వాడు మొదటి నుంచి నిన్ను యిల్లాగే చూస్తున్నాడా ?'

వెయ్యి మంటగబ్బలు నన్ను ఒక్కసారిగా కుట్టేశాయి! ఆకాశంలోని కారుమేఘాలన్నీ వచ్చి నన్ను గుద్దుకొన్నాయి! ఒళ్లంతా వణికి పోయింది! ముచ్చెమటలు పోసేశాయి! తలుపులు కిటికీతలుపులు మూసేసి గడియవేసేసి మంచంమీద వచ్చి పడ్డాను.

లోపలవుండు వున్నప్పుడు అంతగా తెలియని బాధ, అది యితరులకు కనిపించి దానిని గురించి వాళ్లు అడిగినపుడు ప్రాణం పోయేటట్లు భరించలేని బాధకలుగుతుంది. అవాళ రాధాకృష్ణ అడిగాడు. ఎల్లాగో సమర్థించుకొని కప్పేశాను. ఈ మోహనరావు – పాములాంటి వాడా? పాదులాంటి అపాయం లేనివాడా? అని నాకు తెలియని మోహనరావు – మాదాంపత్య జీవిత శకటం యొక్క చక్రాలు ఊడిపోయే లాంటి మాటలు విన్నాడు! ఆయన నన్ను నా జీవితాంతం వరకు దుఃఖ చెఱసాలలో తోసేయవచ్చు. కాని, యీచిత్ర వధ, మోహనరావు లాంటి వాళ్లకు తెలియకూడదే! అతని

మాటలు నాకు అనుతాపాన్ని కలగ చేయటానికి బదులుగా, బ్రహ్మాండమైన శబ్దంతో బద్దలయ్యే యాటంబాంబులలా వేదన కదా కలుగచేస్తున్నాయి? తన యిష్టప్రకారం ఆయన నన్ను ఎన్ని విధాలుగా బాధపెట్టినా, చిత్రవధచేసినా భరించ గలిగే శక్తి నాకుంది! కాని, నా ముందరే యితరుల మధ్య ఆయన అగౌరవ పడటం చూసి సహించగలిగే శక్తి నాకు లేదు!

# 17

మోహనరావు చెప్పినది నిజమే! తన ప్రియురాలిని వదలి, ఆకాశంలో మాయమయేటప్పుడు సంధ్యాభాస్కరుడు ఎన్నెన్ని ఇంద్రజాలాలు చేస్తున్నాడు! ఒక్కసారే మాయ మయినట్లయితే ఆమె ఎక్కడ మూర్ఛపోతుందోనని భయం కాబోలు తనకి! ఒక్కక్షణం ప్రకాశమైన తన ముఖాన్ని చూపిస్తాడు. తర్వాత కొంచెంసేపు మేఘాల తెరలలో దాక్కుని ముందుకి నడుస్తాడు. మళ్ళీ 'ఇదిగో, యిక్కడే వున్నాను' అంటూ తన అరుణకిరణాలతో ఆమెను ఆలింగనం చేసికొంటాడు. స్త్రీలని మైమరపించే యీ మురిపించే విద్య తనుకూడా తెలుసుకొన్నాడు! ఈ యింద్రజాలవిద్య తెలియని పర్వత సుందరి, ప్రియుడు తనతో ప్రియంగా దోబూచులాడు తున్నా డనుకొని పరవశం పొందిన దానిలా మైమరుస్తుంది. మేఘ తెరలలో దాక్కున్నవాడు, వస్తాడు, వస్తాడు అని ఆతృతగా ఎదురుచూస్తూ నిల్చున్నప్పుడే ఆ పద్మినీ వల్లభుడు

వెళ్ళిపోతాడు! విరహము, నిరాశ చుట్టుముట్టగా, కటిక చీకటిలో లీనమైపోతుంది ప్రియురాలు. కొన్ని రోజుల్లో పర్వత మోహినిని పరిహాసం చేసేటట్లు, ఆకాశ తోటలో ఆమె ప్రియ ప్రియుడున్న స్థానంలో వేలకొలది నక్షత్రకన్యలతో రజనీవల్లభుడు విహారానికి బయలుదేరతాడు......!

చటుక్కున నాకు మోహనరావు అనుతాపం యీాలెగుచ్చుకొన్నట్లు జ్ఞాపకం వచ్చింది! నేను తతాలున తలుపు వేసేసిన తర్వాత, నా దగ్గర ఏవిధమైన మార్పుకూడా తనలో చూపించలేదు! ఏవిధమైన సంకోచము లేకుండా ఎప్పటి లాగనే సంచరిస్తూ వచ్చాడేకాని, ఆ సంఘటన గురించిగాని, అటువంటి విషయాలను గురించిగాని నాతో మళ్లీ మాట్లాడ లేదు.

'నిజంగా ఏదో అభిమానంకొద్దీ అనుతాపంగా మాట్లాడాడేకాని, వికల్పంగా తీసుకోవటం తప్పు! మగ వాళ్ళతో చనువుగా మాట్లాడటం, అనుభవం లేకపోవటం వల్ల కలిగిన మనస్సంచలనం అది!' అని ధైర్యం తెచ్చు కొన్నాను.

అతను గొంతెత్తి పాడేటప్పుడు గారగొంతుకతో యిల్లంతా అదిరిపోయేటట్లు నవ్వే మోహనరావేనా అని ఆశ్చర్యపడ్డాను. ఏవిధమైన వణుకులేకుండా సన్నని గొంతుక అతిసులభంగా మూడు స్థాయిలలోను కూడా మనస్సు రంజింప చేసేటట్లు సంచారం చేసింది. సాధార ణంగా సాయంత్రం ఆరుగంటల తర్వాత అతను బయటకు ఎక్కడికీ వెళ్ళటంలేదు. చంచల, బావగారు యింట్లోనే

వున్నట్లయితే తనలో తనే పాడుకొంటూ వుంటాడు. లేకపోతే — 'అది యిల్లాగ, యిది అల్లాగ' అంటూ రాగ, తాళ, స్వరాల లక్షణాలగురించి ఏదైనా చెప్తూంటాడు నాతో. నన్నుకూడా రెండుపాటలు పాడమంటాడు. నాకు సంగీతంలో తెలియని విషయాలను యీ కొత్త కళాకారుని స్నేహంతో అతని దగ్గరనుంచి తెలుసుకొన్నాను. మనస్సంచలనం మారి మారి ఏర్పడిన ఉత్సాహంలో అతని దగ్గర నుంచి నాకురాని నాలుగు పాటలుకూడా నేర్చుకొన్నాను! ఈ సంగతులు తప్పించి అతను ఏవిషయాలుకూడా అడగ లేదు.

అవాళ చంచల, బావగారు ఏదో సినిమా చూడటానికి వెళ్ళారు. 'పిల్లలు యింటి ఎదురుగా వున్నతోటలో ఆడుకొంటున్నారు. మోహనరావు ఓ కొత్తపాట పాడుతూ, వీణవాయిస్తూంటే వింటూ గోడకానుకొని నిల్చున్నాను. ఎంత మొండి ధైర్యంగా వున్నప్పటికి అతనికెదురుగా కూర్చుని మాట్లాడేందుకు నామనస్సు సిగ్గుపడింది.

వనజ, రవి యిద్దరూ గబగబా పరిగెత్తుకుంటూవచ్చి 'పిన్నీ! పిన్నీ! బాబయ్య వస్తున్నాడు. వస్తాడని మాతో చెప్పలేదేం?' అంది వనజ సంతోషంగా గెంతుతూ.

'ఎవరు? చంద్రం వస్తున్నాడా? ఇప్పుడు వీడికి బండి ఎక్కణ్ణుంచి వచ్చింది చెప్మా!' అంటూ లేచాడు మోహనరావు.

'నిజంగా చంద్రం బాబయ్యే వస్తున్నాడు. దూరం నుంచి చూసి ఆయనదగ్గరకు పరిగెత్తింది మాలతి' అన్నాడురవి.

నేను గుమ్మంలోకి వచ్చాను. అప్పుడే ఆయన మాలతి చెయ్యిపట్టుకొని గుమ్మంమీాద అడుగుపెట్టారు.

'ఏరోయ్ ! వీణా గీణా వ్యవహారం చాలాదూరం వచ్చిందే! నువ్వేనా వాయించేది? ఇదెప్పణ్ణుంచి?' అన్నారు ఆయన మోహనరావుని వేళాకోళం చేస్తూ.

' ఇప్పుడు నీకు బండేముందిరా? ఎవళ్లతోను చెప్ప కుండా 'తను' జ్ఞాపకం వచ్చేసరికి పరిగెత్తుకొచ్చావా ఏమిటి?' అన్నాడు పరిహాసంగా మోహనరావు.

'అంబాలా వరకూ రావాల్సి వచ్చింది. ఇంత దూరం ఎల్లాగా వచ్చానుకదా అని యిక్కడికి కూడా వచ్చి పోదా మని మధ్యాహ్నం రెండుగంటల బస్సులో బయల్దేరి వచ్చాను' అన్నారు ఆయన.

ఆయనకీ నాకూ మధ్య ఒక అగాధం వున్నప్పటికి యించుమించు నెలరోజుల తర్వాత ఆయన నా కళ్ళబడే టప్పటికి, చందమామను చూచి చలించి తన చందాన్ని చాచిన మయూరంలా, ఎందుకో నా మనస్సు పరవళ్ళు తొక్కింది. కొంచెంసేపట్లో ఆయనకి కాఫీ తెచ్చి బల్లమీాద పెట్టిన నన్ను చూసి మోహనరావు నవ్వుతూ—

'నువ్వు చాలా అదృష్టవంతుడివిరా! ఇంత అణకువగా సుశ్రూష చేసే భార్యను నే నెక్కడా చూడలేదు. చూడు... నువ్వు యింకా తనతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు. కొంచెమేనా కృతజ్ఞతనేదే లేకుండా నాతో ఏదేదో వాగుతూ కూర్చున్నావు. తను నీమీాద ఎంత ధ్యానంగా

వుందో చూడు ! విమలా ! ఏమయినప్పటికి ఈ 'యిడియట్'కి నువ్వు యింత లోకువ యివ్వకూడదు.' అన్నాడు,

'ఏరా ? నేనా ? నువ్వా వాగుతున్నది ? నువ్వు ఏం చెప్పినా కూడా విమల నన్ను కోప్పడదు !' అని నన్ను చూసి నవ్వి కాఫీ కప్పు తీసుకొన్నారు.

'విమలా ! నీకు యింత పక్షపాతం వుండకూడదు. నే నొకణ్ణి యిక్కడ వున్నానని నీకు తెలుసు, వాడి కొక్క డికే కాఫీ తెచ్చావు ! అప్పుడే ఈ పాటికి ఎన్నిసార్లు కాఫీ తాగాడో ! బస్సు దిగిం తరువాత 'ఇంద్రభవన్'లో కాలు పెట్టకుండా వచ్చి వుంటాడా యీ యిడియట్ ? నిజానికి నాకే యిప్పుడు కాఫీ కావాలి ! ఊఁ...సొంత మనిషనేది ఒకత్తి వుంటే ఆ దారేవేరు !' అని అతనన్నప్పుడు ఆయనే కాకుండా, నేను కూడా 'పక్కు'మని నవ్వేశాను.

'నన్ను ఇడియట్, ఇడియట్ అంటూ నిముషాని కొక సారి సహస్ర నామార్చన చేస్తున్నావుగాని, అసలు నీలాంటి 'ఇంటర్నేషనల్ ఇడియట్' ఎక్కడా వుండడు ! సంవత్సరాని కొకసారేనా నిర్మలను ఏదో ఒక వంకతో వచ్చి చూసి పోతున్నావా ? ఇక్కడ 'సొంత మనిషి' లేదే అని మూలుగు తున్నావు ! అక్కడ తనే మందో తెలుసా ?' అని ఆగారు.

ఆయన అల్లా ఆపేసరికి నా మనస్సు దడదడ కొట్టు కుంది. రాధాకృష్ణ సంగతి యీాయనకు తెలిసిపోయిందా ! ఆ సంగతి యితనితో చెప్పేయబోతున్నారా ?

మోహనరావు మాట్లాడ లేదు.

'యం. ఏ. చదువుతుందట. ఆ తర్వాతే పెళ్లిట. అంతవరకు ఏం మాట్లాడటానికి వీల్లేదని తల్లితో ఖచ్చితంగా చెప్పేసింది! నువ్వేమో యిక్కడ సొంతమనిషి లేదే అని ఏడుస్తున్నావ్ !' అన్నారు ఆయన.

నా మనస్సు కొంచెం దడ తగ్గింది.

'ఓస్ ! యింతేకదా ! చదువుకోనీ ! అప్పుడే రిజల్ట్సు వచ్చేశాయా !' అన్నాడు మోహన్.రావు.

'చాలా అందంగా వుందిరా నీ ప్రశ్న. ఏం ? ఏ స్వర్గ లోకంలోనైనా విహారం చేస్తున్నావేమిటి యీామధ్య ? రోజూ పేపరు చూస్తేనేకాని నిద్దరపట్టని పెద్దమనిషికి పేపర్లో రిజల్ట్సు చూసిన సంగతి కూడా జ్ఞాపకంలేదా ? లేదు పేపరు మీాదకు దృష్టే పోవటం లేదా ? రిజల్ట్సు వచ్చి అప్పుడే పదిహేను రోజులైంది. నిర్మల 'ఫస్ట్క్లాస్'లో స్పెషల్ డిస్టింగ్షన్'తో పాసయింది. ఒక 'కంగ్రాట్యులేషన్ లెటర్' ఏ నారాసి పడేయ్ !' అన్న నాభర్త వీణవైపు చూస్తూ 'ఇదెప్పణ్ణుంచి ?' అన్నారు.

'అకస్మాత్తుగా ఆకాశవాణిలో నా గొంతుక విని మీారంతా అతిశయపడేట్లు చెయ్యాలనుకొన్నాను. నా ప్లానంతా విమలవల్ల పాడైపోయింది. నేను ఏదైనా అడిగితే అదిరి బెదిరి పారిపోయే విమల, వీణని, శృతిపెట్టెని చూసి 'యిక్కడ ఎవళ్లు పాడుతున్నారు !' అని అడిగింది. ఆమే అడిగి నప్పుడు నేను నిజాన్ని ఒప్పుకోవలసి, వచ్చింది' అన్నాడు మోహనరావు.

నేను ఒకక్షణం భ్రమించిపోయాను! పసిపాపని గిల్లట మేకాకుండా తొట్టిలో పడుకోపెట్టి లాలిపాట కూడా పాడే మనిషా యితను? తను పాడటం నేను చూసి అడిగానా?

'అవును! విమల చాలా బాగా పాడుతుంది. బాగా నేర్చుకొని సాధకం చేసింది. అందుచేతే అడిగి వుంటుంది. ఊఁ...నువ్వు రేడియోలో కూడా పాడబోతున్నావా? బావుంది...విమల నీ విద్యను బయటపెట్టక పోయినప్పటికి నువ్వనుకొన్నట్లు మేమంతా ఆశ్చర్యమూ పడము, అదిరీ పడము. ఎంతోమంది గాడుగేదెల్లా అరుస్తూ బుర్రలు బద్దలు కొట్టుకుంటున్నారే యిప్పుడు - వాళ్ళలో నువ్వూ ఒకడను కొంటాం. పైగా - సాధారణంగా, ఏదైనా 'క్రికెట్ కామెంటరీ' వుంటేతప్ప నేనసలు రేడియో విననే వినను. వార్తలో అంటావా తెల్లవారేసరికి ప్రతిరోజూ పేపర్లో వస్తూనే వున్నాయి. అందుచేత నువ్వు పాడినా, ఆడినా మేమెవ్వరం కూడా వినం, చూడం. నాకుమాత్రం ఆడవాళ్ళు పాడితేనే వినాలనిపిస్తుంది. గాడుగేదెల్లా మనమంతా పాడటం ఆరంభిస్తే యింక వినక్ఖర్లేదు' అని తన మనోభిప్రాయం బయటపెట్టారు నాభర్త.

'వినక్ఖర్లేదా! నువ్వు రసించగలిగే లక్షణమే అంత! బాగా సాధకంచేసిన జ్ఞానంవుండి, మంచి కంఠస్వరం కూడా వున్నట్లయితే ఎవరయినా పాడవచ్చు. మగాడయితేనేం? ఆడదయితేనేం? నీకు రసించగలిగే గుణంలేదే అని నాకు చాలా జాలిగావుంది! అందులోనూ విమల యింత శ్రావ్యంగా పాడగలిగినదైనప్పుడు నువ్వే యిల్లా మాట్లాడితే ఆమెకెల్లా

వుంటుంది ? భార్యకోసమైనా నువ్వు సంగీత తత్వాన్ని అనుభవించే గుణాన్ని అలవాటు చేసుకోవాలి !' అన్నాడు మోహానరావు.

'ఓహో ! నాకు నువ్వు ఉపదేశం చేయటం కూడా ఒకందుకు మంచిదే అయింది. నిర్మలకి యీ విషయంలో అ, ఆ లు కూడా తెలియవు. అందులో నాకు అక్కయ్యలాగే వుంటుంది. అందుచేత యికనుంచి నువ్వు ఏరకం గార్దభ స్వరంతో అరిచినా నిన్ను పొగిడేందుకు తయారుగా వుండమని చెప్తానులే !' అని నవ్వారు నాభర్త.

'ఏడిశావులేగాని అది అల్లావుండనీ, భార్యను అల్లా చూస్తాను, ఇల్లా చూస్తాను అంటూ నువ్వు గొప్పగా చెప్పటం నీ పెళ్ళి అయెవరకే లాగుంది. తర్వాత ఏమీ కన్పించటం లేదు! ముందు ఆ మెసిగ్గును పోగొట్టి నలుగురిలోను 'సోషల్'గా తిరిగేటట్టు చేయగలిగావా ! నేను ఏదైనా అడిగితే అదిరి బెదిరి ఆరు మైళ్ళు పారిపోతోంది !' అని నా నడతలో లోటు చూపిస్తున్నట్లు ఆయన దగ్గర ఫిర్యాదుచేశాడు మోహానరావు.

నన్నుచూచి నా భర్త 'అవునా విమలా ? అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా పారిపోయే గుణాన్ని వదిలివేయమని నీ కెన్నిసార్లు చెప్పాను ?' అన్నారు.

ఆయన నన్ను కోప్పడుతున్నారో లేక భయపెడుతున్నారో నాకు అర్థంకాలేదు. ఆయన ముఖంలో మాత్రం ఏమీ మార్పురాలేదు. చిన్నపిల్లలా నాకు కోపం వచ్చింది.

'అబద్ధాలుకూడా ఎందుకు చెబుతున్నారు? అడిగిన దానికి జవాబుకూడా చెప్పకుండానే వుంటున్నాను కాబోలు!' అనేసి లోపలికి వెళ్ళిపోయాను.

అంత తొందరగా నాకు సిమ్లా నివాసం పూర్తవుతుందనుకోలేదు. ఆయన్ని చూసినవెంటనే చంచల—

'సరిగ్గా సమయానికే వచ్చావు. స్కూళ్ళు తెరిచే రోజులు కూడా దగ్గరకొచ్చాయి. నీతో మాలతి, వనజ, రవిలను తీసికెళ్ళిపో. ఏం? విమలను కూడా తీసికెళ్ళు. పాపం! నువ్వు అక్కడ వుంటున్నప్పుడు తను యిక్కడ ఎందుకు?' అని నన్ను చూసినవ్వింది.

ఆహాహా! ఎంతజాలి! ఎంత ప్రేమ! నిజంగా ఆమె నన్ను ఆ వుద్దేశ్యంతోనా తీసికెళ్ళ మంటోంది? కానేకాదు అంది నా మనస్సు. మోహనరావు నాతో చనువుగా మాట్లాడటం, వాళ్ళు ఎవళ్లూ యింట్లో లేనప్పుడు అతను యింట్లోనే వుండి పోవడం; ఆవిడకు గుర గురలాడుతోంది లోపల. అంతా మనమంచికే. నాకుకూడా అతని నడత అంతగా నచ్చలేదు కదా?

అతనితో మాట్లాడిన చనువువల్ల నాలోని బాధ కన్నా యింకా ఎక్కువగా యిపుడు కొత్తగా యింకో తాపం రేగింది. ఆయనమాత్రం రసికత్వం కలిగిన వారయితే......? మోహనరావు మాదిరిగా కళాభిమానము, మనస్సుకు తోచినది వెంటనే చెప్పేసే స్వభావము, వున్నవారయితే......? ఎల్లావుంటుంది నా జీవితం......? ఇల్లా ఆలోచిస్తూ ఊహిస్తూంటే నా మనస్సు రోదన చేసింది.

ఆయనకు నామీద ప్రేమలేదని నే! నెందుకనుకోవాలి? నే నెందుకు బాధపడాలి? నా కళ ఆయన్ని కాంతంలా ఆకర్షించ కూడదా? అప్పుడు, ఆయన నాకోసం ఏంకావాలన్నా చేసే స్థితిలో వుండరా?

ఆయన మనోభావానికి, నా మనోతత్వానికి కొంచెం కూడా సంబంధంలేదు ... ఒక దానితో మరొకటి దైవికంగా ఆకర్షించక పోయినప్పటికి, కాలక్రమేణా పరిచయంలోకూడా జంటగా కలవవు ... నేను ఏంచేసినా ఫలితం వుండదు ... పాలలో తేనె కలుస్తుందికాని చింతపులుసు కలుస్తుందా? దాని స్వభావానికి తగిన ఉప్పూ కారాలే కలుస్తాయి. ఇన్నాళ్ళ నుంచి నాకు తెలియని ఒక నిజాన్ని మోహనరావు నాకు తెలియ జేస్తాడు.

జీవితం ఒక మాయసుడిగుండం లాంటిదని వేదాం తులు — ఏం? నాన్నకూడా చెప్పినట్లు జ్ఞాపకం. అది ఎంత నిజం! ఈ సుడిగుండంలో నేను ధైర్యాన్ని వదలకుండా గిర గిరా తిరుగుతూనే ముందడుగు వేయాలి. బంగారాన్ని కొలి మిలోపెట్టి సాగదీసిన తరువాతనేకదా కళ్ళు చెదరగొట్టే ఆభరణాలు తయారు చేస్తున్నారు. అరగతీయగా అరగతీయ గానేకదా వజ్రం జాజ్వల్యామానంగా తళ తళా మెరుస్తుంది? ఈ జగన్నాటకంలో ముందడుగు వేసి ప్రకాశించే మేధావు లందరి జీవితాలుకూడా పూర్తిగా శోధనగానే వుండివుంటాయి అనేది అందరికి తెలిసినదేకదా? కష్టాల్లో తలవంచుకో కుండా వున్నవాళ్ళే కదా శోధనని జయించి ప్రకాశిస్తారు?

ఈ శోధనలో నేనుకూడా ధైర్యంగా తలఎత్తుకు తిరిగినట్లయితే, చివరకు నాకు మంచి కలుగుతుందేమో!

అందమైన ఆ నగరాన్ని వదిలి వచ్చేస్తూంటే, నా ప్రాణ స్నేహితురాలి నొకదానిని వదిలివెళ్ళి పోతున్నట్లు బాధ పడ్డాను. నా భర్త అర్థంచేసుకోని నా మనస్సుని ఎత్తైన ఆ గోపుర వృక్షాలు అర్థంచేసుకొన్నా యనిపించింది. పూర్వం భర్తవద్దకు వెళ్లేముందు చెట్లు, మొక్కలు, పువ్వులు, తీగెలు, లేళ్ళు మొదలైన వాటిదగ్గర శలవుతీసుకొన్న శకుంతల మాదిరిగా నేను కూడా బాధగా, 'ప్రకృతిమాత పరిపూర్ణ కరుణని పొందిన చెలీ, పర్వత సుందరీ, నేను మళ్లీసారి వచ్చి నపుడు సంతోషంగా వస్తానేమో!' అనే నమ్మకాన్ని నేనే తెచ్చుకొని, శలవుతీసుకొని, బండిలోఎక్కి కూర్చున్నాను.

మొట్టమొదటిసారిగా నేను నా భర్తతోపాటు ఫస్టు క్లాస్ పెట్టెలో ఎక్కి కూర్చున్నప్పుడు, ఇదివరలో నేను రాధాకృష్ణతో ప్రయాణం చేసినప్పుడు నేననుకున్నదంతా జ్ఞాపకం వచ్చింది. ఏమీ మాట్లాడకుండా కూర్చున్న నన్ను చూసి వనజ 'పిన్నీ! నిన్నకూడా కథ చెప్పనేలేదు. ఇప్పుడు చెప్పకపోతే వదిలిపెట్టను ?' అంటూ తన చూపుడు వేలు కదిలిస్తూ భయపెట్టింది.

మోడయిపోయిన నా జీవితం ఆ అమాయకపు పసి పిల్లల ముద్దుమాటలతో చిగిరించినట్లయింది. వాళ్ళ తల్లి దండ్రులు నన్ను అగౌరవపరచటం అర్థంచేసుకోలేని యీ పసిపిల్లలు కల్మషం, కపటం లేకుండా యిల్లాగే పెరిగి పెద్దవా రవుతారా ?

నా దగ్గరకు చేరిన పిల్లలను చూసి — 'నిర్మల పిన్నిని మీరు యిల్లా ఎప్పుడూ అడగరేం? దానిని చూస్తే మీకు కిట్టదా?' అని పిల్లలను అడిగారు ఆయన.

'నిర్మల పిన్నికి అల్లరిచేయకు, అల్లరిచేయకు అంటూ మా మీద ఎగిరిపడటం ఒక్కటే తెలుసు. నిర్మల పిన్ని నాకు నచ్చలేదు — ఏం? నువ్వూ నాకు నచ్చలేదు; మా విమల పిన్ని మాకు ఎన్నో కథలు చెబుతుంది. ఈ పిన్ని అంటేనే నాకు ఎంతో యిష్టం' అని నన్ను కౌగలించుకొంది వనజ. నాకు తెలియకుండానే నా చేతులు ఆమెను నిమిరాయి. అది చూసిన ఆయన ముఖంలో అర్థంలేని శోకచ్ఛాయలు కనిపించాయి. దీర్ఘ నిట్టూర్పు విడిచారు.

చటుక్కున జ్ఞాపకంవచ్చిన వారిలా 'చెప్పటం మర్చిపోయాను విమలా! ఒక వారం రోజుల కిందట రాధాకృష్ణ మనింటికి వచ్చాడు. ఉన్నత విద్యాభ్యాసం కోసం అతను విదేశాలకి వెళ్తున్నాడు. ముందు స్విట్జర్లాండ్ వెళ్తున్నాడు, తర్వాత లండన్ వెళ్తాడట' అన్నారు.

ఓహో! అందుకే కాబోలు నిర్మల యం. ఏ. చదవటం అనుకొన్నాను.

'మీ మావయ్యకూడా వచ్చారు. అతను వెళ్ళే ముందు మనింటికివచ్చి అందరితోను సంతోషంగా గడిపాడు. అమ్మ ఒక రోజున అతనికి 'డిన్నర్' కూడా చేసింది. 'తెల్లవారితే విమానమెక్కాలి జయంగా తిరిగిరావా' లని ఆశీర్వదించమని అమ్మకి సాష్టాంగ నమస్కారం చేశాడు వెళ్ళే

ముందు. నవ్వీ నవ్వీ నవ్వించే అతను చాలా మంచివాడు' అన్నారు.

నాకు యీ వార్త చాల సంతోషాన్ని కలిగించింది. బయల్దేరేముందు. నిర్మలా అతనూ వాళ్ళ వాళ్ళ మనోభిప్రాయాలు ఏ ఏ విధంగా తెలియబర్చుకొన్నారు, ఏమేమి మాట్లాడుకొని సంతోషపడ్డారో, నన్ను చూడగానే ఆమె సంతోషాన్ని పట్టలేక ఎంత ఆనందంగా ఆ విషయాలన్నీ చెబుతుంది, ఈ పిచ్చి మోహనరావు ఆమెను తల్చుకొని ఎల్లా పొంగి పోతున్నాడనే సంగతులు చెప్పి ఆమెను ఎల్లా నవ్విస్తానో అని ఎన్నో ఆలోచనలు నాలో కలిగాయి.

కలకత్తాలో నేను యింట్లో కాలుపెట్టేటప్పటికి నేను అనుకొన్నట్లుగా నిర్మల వచ్చి తన్మయత్వంతో నన్ను కౌగలించుకో లేదు! నేనే ఆమెను వెతుక్కుంటూ ఆమె గది లోకి వెళ్ళినప్పుడు ఆమె ముఖం నాకు అంతులేని ఆశాభంగాన్ని కలగ చేసింది! ఒక వాడిపోయిన పువ్వులా నా కళ్ళకి కనిపించింది నిర్మల!

'ఇల్లా వున్నారేమిటి అక్కా! ఒంట్లో బాగుండ లేదా?' అని అడుగుతూనే ఆమె గదిలోకి వచ్చాను.

'నువ్వా విమలా? ఇల్లా అకస్మాత్తుగా ప్రత్యక్షమయ్యావేమిటి? చంద్రం నిన్ను తీసుకొస్తానని చెప్పనేలేదే! ఊఁ ... సిమ్లానివాసం ఎల్లావుంది?' అంది నిర్మల.

'చాలా బాగానేవుంది కాని, రాధాకృష్ణ వచ్చారుట కదూ!' అంటూ ఆమెనుచూసి కళ్ళు చిట్లించి నవ్వాను.

నేను యిల్లా అడిగినందుకు ఆమె ముఖం పద్మంలా వికసిస్తుందని, ఎంతో సంతోషంగా మాట్లాడుకొన్న మాటలన్నీ చెబుతుందని ఆశించిన నాకు నిరాశే ఎదురయింది!

'అవును' అని తలూపి – 'పిల్లలంతా వచ్చేసినట్లున్నారు. ఇంటి యజమానులకు యింకా పర్వత నివాసం వదల్లేదు కాబోలు' అంది నిర్మల సంభాషణ మార్చేస్తూ.

'రాధాకృష్ణ మాట ఎత్తితేనే పులకరించిపోయే ఆమె, అకస్మాత్తుగా యిల్లా మారిపోయిందెందుచేత? ఇద్దరికి మధ్య ఏదైనా మనస్పర్థ ఏర్పడిందా?' అని అనుకొన్న నేను –

'రాధాకృష్ణ ముందు స్విట్జర్‌లండ్ వెళ్తున్నారుట కదూ? తిరిగి రావటానికి ఎంతకాలం పడుతుంది? పాపం! మోహనరావు మిమ్మల్ని తల్చుకొని తల్చుకొని పరవశమయి పోతున్నారు' అన్నాను పరిహాసంగా నవ్వుతూ.

'ఏమయితే ఎవడిక్కావాలి? 'పాపం' అంటూ నువ్వు వకాల్తునామా పుచ్చుకొచ్చావు కాబోలు! విమలా! ఇకనుంచి యిటువంటి విషయాలు నాతో మాట్లాడకు. అన్నింటిని మర్చిపోయి అసలు పెళ్ళే చేసుకో కూడదని తీర్మానం చేసుకొన్నాను' అన్న నిర్మల మాటలు విని నేను అదిరిపడ్డాను.

'ఏమిటి నిర్మలా ఇదంతా? మీరేనా మాట్లాడుతున్నది? ప్రేమమాలను ఉల్లాసంగా వేసుకొన్న మీమనస్సు యింత బాధపడేటట్లు రాధాకృష్ణ ఏం చేశారు?'

'ఏం చేశారా? వల్లకాడు చేశారు! –నువ్వు కూడా నాతో చెప్పనేలేదే? ఇప్పుడు ఎవళ్లు చేసేది ఏమీలేదు. నా

మీద ప్రేమ, అనురాగం అంటూ ఏమేమో కల్లబొల్లికబుర్లు చెప్పి, తనకోసం కాచుకొనివున్న తన మేనమామ కూతుర్ని చేసుకోబోతున్నారు ! నిన్నా, యివాల్టిమాట కూడా కాదుట యిది ! పెళ్ళేముందు కూడా ఆయన యీ సంగతి నాతోటి చెప్పనేలేదు ! తన వాక్చాతుర్యంలో నేను మోసపోయాను విమలా ! ఇంత వంచకంగా నన్ను ఆయన మోసం చేస్తారని నేను కల్లో కూడా అనుకోలేదు ' అంది నిర్మల ఆవేశం వచ్చిన దానిలా.

' అయ్యయ్యో ! పాపం !... మీరు కొంచెం కూడా ఓర్పు వహించలేక పోయారే ! తమ కోసం తపస్సు చేస్తూన్న మోహనరావు సంగతి తమరు ఎప్పుడైనా రాధాకృష్ణతో చెప్పారా ? ' అంటూ ఆమె చెంపమీద చిన్న దెబ్బ కొట్టాను.

' చెప్పవలసిన అవసర మేముంది ? నేను మోహన రావుని చేసుకొంటానని ఎప్పుడైనా చెప్పానా ? ఆయన కోసం ఎవరినైనా సరే ఎదిరించటానికి నేను తయారయాను. ఆసంగతి చెప్పి అనవసరంగా బాధపెట్టటమెందుకని కదా నేను మౌనంగా వుండిపోయాను. పైగా నేను ఎప్పుడైనా ఒప్పుకొని వుంటేకదా ఆ సంగతి చెప్పాలి ? కాని ఆయన అల్లాగనా ? '

' ఏం ? ఆయన కూడా అదే పరిస్థితిలో వున్నారేమో ? '

' అల్లా నా కోసం తెగించే మనిషి కాబోయే మామ గారి ఐశ్వర్యంతో విదేశాలకి వెళ్తున్నారు కాబోలు ! తిరిగి వచ్చాక తన కూతురిని చేసుకొంటారనే కదా వేలకి వేలు ఖర్చు చేయటానికి సిద్ధపడి, విమానాశ్రయానికి కూడా వచ్చి

విమాన మెక్కించారు మీ మావయ్య. ఇప్పుడు యీ పట్టి కెళ్లిన డబ్బంతా చివరకి తన కూతురిని చేసుకోనని చెప్పటాని కేనా? విమలా! నువ్వు ఏ మనుకొంటున్నావో కాని, యీ మగవాళ్ళంతా ఆడవాళ్ళని మోసంచేసే విద్యలో ఆరితేరిన వాళ్ళు!' అంది పొంగిపోయేకోపంతో.

'ఇదంతా మీకు ఎల్లా తెలిసింది?'

'తెలియటానికేముంది? తనుచేసే యీ సహాయాన్ని నిముషానికి నూరుసార్లు గొప్పగా చెప్పుకొంటూ డప్పు వాయించారు మీ మావయ్య. తర్వాత మాటల సందర్భంలో చంద్రంకూడా చెప్పాడు. అప్పుడే నాకు మతిపోయినట్లయింది. ఇంతజరిగాక కూడా ఆయన ఆ సంగతి చెప్పకుండానే వెళ్ళి పోయారు' అంది నిర్మల.

ఎంతమోసం యిది! రాధాకృష్ణ కూడా నిజంగా యీ గుంపులో చేరినవాడేనా? అవాళ అంతనొక్క మాట్లా డాడే? ఆ శ్యామలనేనా ఆతను చేసికోవటానికి యిష్టపడ్డాడు! చదివి పట్టభద్రురాలైన నిర్మల, బయట ప్రపంచంలో ఎంతో అనుభవంపొంది నలుగురితోనూ వాదించ శక్తికలిగిన నిర్మల కూడా రాధాకృష్ణ వంచకంలో చిక్కుకుపోయిందే! అందు కనే ఆ రోజున బొమ్మ అంత తీవ్రంగా కోప్పడింది!

ఇటువంటి గుంపు ఒకటి ప్రపంచంలో వుండటం ఏమో నిజమే. శకుంతలా— దుష్యంతులకథ ఒక్కటే చాలు ఈనిజాన్ని తెలుసుకొనేందుకు. ప్రపంచంలో ప్రేమ పుట్టినప్పుడే యీ మోసంచేసే విద్యకూడా పుట్టివుంటుంది. అందులోను ఋది మగవాళ్ళలోనే ఎక్కువగా గూడుకట్టుకొని వుంది.

బయటికి మాత్రం కల్మషం, కపటం లేని నిర్మలమైన వాళ్ళుగా కనిపించే వాళ్ళందరిలోను యిది దాక్కునివుంది! అది కనిపించకుండా వుండటం కోసమే యీ వేషం, ఆడంబరం — అంతా!

అబలత్వం, అందం, పడుచుతనం — యీ మూడూ ఎటువంటి మగవాడినైనా తమలోకి లొంగతీసేసు కొంటున్నాయి. అల్లాలొంగిపోయిన మగవాడు తను ఏంచేస్తున్నాడో కూడా తెలుసుకోకుండా తనని ఆకర్షించిన స్త్రీతో కలసిమెలసి తిరుగుతాడు. సర్వస్వాతంత్రుడుగాను, లక్ష్యవాదిగాను కనిపిస్తాడు. బాధ్యత వహించవలసిన కాలంవచ్చేవరకే యీ పగటివేషమంతా. బాధ్యత వహించవలసిన సమయం వచ్చేసరికి, అప్పుడు బయటపడుతుంది వాళ్ళ డాంబికం, డమారం. ఏంచేస్తాం! అంతా విధియొక్క చిత్రం — ఇల్లా పరిపరి విధాల ఆలోచించిన నేను, నిర్మలకు ఏదైనా ఓదార్పుమాటలు చెప్పా లనుకొన్నాను. కాని ఏమీ చెప్ప లేక పోయాను.

'మీరు చెప్పింది పూర్తిగా నిజం. ఆడవాళ్ళు చటుక్కున దేనినైనా సరే నమ్మటంవల్ల, మగవాళ్ళు వాళ్ళని సులభంగా మోసంచేయటం వీలౌతోంది' అని మాత్రం అన్నాను.

ఈ మాటలు అనుభవపూర్వకంగా నాలోనుంచి వచ్చాయని నిర్మల తెలుసుకొందో ఏమో?

# 18

తీసుబడి అనేదేలేని యింటిపనులు, పిల్లల నవ్వులు, ముద్దుమాటలు, నా కష్టాన్నంతా మర్చిపోయేటట్లుచేసే ప్రాణ సఖి నిర్మల, లేని యీ వేరింటి కాపరం నేను ఏదో శూన్య ప్రదేశంలో ప్రవేశించినట్లుంది. ఎక్కువపని చేయాలనే బాధ లేదు. అధికారం చలాయించే అత్తగారు లేదు. నిముషానికొకసారి గడబిడచేసే తోడికోడలు లేదు. ఒకదాని తరువాత ఒకటిగా రెండు గదులు. చిన్న 'డ్రాయింగ్ రూమ్'. సామానులు పెట్టుకొనేందుకు చిన్నగది. చిన్న వంటిల్లు. విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కలిగిన కుదిమట్టమైన చిన్నయిల్లు. భార్యా, భర్త, యిద్దరే కుటుంబం. నా యిష్టంవచ్చినట్లు ఏదైనా చెయ్యటానికి నాకు స్వతంత్రం, అధికారం — అన్నీ వున్నాయి.

కాని దాంపత్య జీవితానికి ఏది ముఖ్యమో, ఏది పునాదిలాంటిదో, అది లేదని నాకు తప్ప మిగిలిన వాళ్లకి ఎల్లా తెలుస్తుంది? ఈ వేరింటి కాపరాన్నా నేను కోరాను? రాత్రిళ్లు నిశ్శబ్దంలో సముద్ర కెరటాలు ఘోషించినట్లు యీ వేరింటి కాపర జీవితం నన్ను భరించలేని వేదనకు గురి చేస్తోంది! 'కుటుంబ ఐకమత్యాన్ని విడదీసే వేరుపురుగులా నువ్వుండ కూడదమ్మా' అని అమ్మానాన్నలు నాతో ఎన్నోసార్లు చెప్పారు. ఆలోచించగా, ఆలోచించగా నేను యీ ఆడజన్మ ఎందుకు ఎత్తానో అర్థంకాలేదు. ఇతరులను బాధ పెట్టడం, నేను ఏడుస్తూ కూర్చోటమేనా నా జీవిత లక్ష్యాలు? స్త్రీ జీవితం దేనివల్ల ప్రకాశిస్తుంది? భర్తతో సంతోషంగా

వున్నట్లయితేనే కదా ? అందులో నేను పూర్తిగా పరాజ యాన్ని పొందాను. నా భర్త బంధువులకేనా నేను మంచిగా వుండగలిగానా? ఆయన వాళ్ళకోసం గిరగిరాతిరిగే బొంగరంలా పనిచేసి పాటుపడ్డాను. ఆయనవాళ్ళమీద ఆయనకున్న గౌరవం చెడగొట్టకుండా వుండటంకోసం ఆయన నా హృదయాన్ని పిండివేసినప్పటికి భరించుకొన్నాను. 'నీ జీవిత సౌకర్యాలన్నిం టిని నువ్వు ఎంతెంతగా తగ్గించుకొంటే నీకు అంతంతగా మంచిది' అన్న నాన్న ఉపదేశపు మాటలు గణగణ మని యింకా నా చెవుల్లో వినిపిస్తూనే వున్నాయి. ఏ సమయంలో ఏమనుకొని చెప్పారోకదా ? వేళకి నేను తిండితిన్నానా లేదా అని ఎవరూకూడా చూడని యింట్లో నా స్వంత సౌకర్యా లంటే ఏమిటో కూడా ఆలోచించకుండా నా జీవితాన్ని త్యాగం చేశాను. చివరకు నాకు ముట్టిన ప్రతిఫలం ఏమిటి ? నా శోధనకాలం సమాప్తమయిన పిదప ఏదోకిరీటం లభించ బోతుందనే ధైర్యంతో నాలో ఊపిరి వున్నంతకాలము మొండిగా ముందడుగు వేయాలని తీర్మానించుకొన్నానే, అందులోనైనా నా లక్ష్యం సిద్ధి పొందిందా ? గంటల తరబడి శ్రమపడి కూర్చుని భోగినాడు పెట్టిన ముగ్గు వానకురిసి ఒక్క క్షణంలో నాశనమయినట్లు, యిన్నాళ్ళనుంచి నేను పడ్డశ్రమ, చేసిన త్యాగము రూపురేఖలేనా కనిపించకుండా ఆయన ఒక్కరోజు ఆవేశంలో చేసిన పనిలో ఆహుతిఅయిపోయాయి!

ఇన్నింటికి, 'ఈ యింటిలో నేను ఒక్కక్షణం కూడా వుండలేను. మీకు వేరింటి కాపరం యిష్టంలేకపోతే నేనిక్కడ వుండను. మీకు నేనే కావాలంటే వేరే కాపరం పెట్టండి.

లేదా నన్ను రై లెక్కించండి'— అని నేనేమైనా రాక్షసితనం
చేశానా ?

ఆ విధంగా ఆయనతో దెబ్బలాడి, యీ వేరింటి కాప
రానికి నేను వచ్చి వున్నట్లయితే యింత దూరం ఆలోచించి
నా మనస్సు పాడుచేసికోనక్కర్లేదు. నా పట్టుదల కొంచెం
కొంచెంగా మాయమయి, అధికారానికి, అహంభావానికి
అణకువగా తలవంచుకొని తిరుగుతున్న సమయంలో ఆయన్ని
యీ పని చెయ్యమని ఎవరు మొరపెట్టుకొన్నారు ? 'ఏ పరిస్థి
తులలోనూ దాని మనస్సు నిశ్చింతగా వుండకూడదు' అని
ఆయన కంకణం కట్టుకున్నారనేదికూడా నేను తెలుసుకోనే
తెలుసుకొన్నాను ! ఆయనకు నా మీద ప్రేమ లేదనే నిజాన్ని
మోహనరావు యింట్లో ఆనాడు ఆయన నోటినుంచే విన్న
నేను పడ్డ బాధ, నామీద పిడుగుపడినాకూడా అంత బాధగా
వుండదేమో !

మనస్సుకు శాంతి నిచ్చే దిశలో నా మనస్సును తిప్పు
కోవడానికి ప్రయత్నించాను. నా సంగీతం ఒక్కటే అందుకు
తగినదిగా కనిపించింది. నా సంగీత సాధనకి కొంచెం టైము
ఏర్పరచుకొన్నాను. పొద్దున్నే నేను రోజూ లేచే వేళకన్నా
యింకా ఒకగంట ముందుగానే లేవటం అలవాటు చేసు
కొన్నాను. తెల్లవారకట్ల కలిగే నూతనోత్సాహంలో నా
సంగీతాన్ని సాధకం చేయటం ప్రారంభించాను.

'నీకు అవసరమైనవి యితరులు నీకు కలగ జేస్తారని
ప్రతిదానికి నువ్వు భయపడితే, నువ్వు భయపడుతూ కూర్చో
వాల్సిందే' అని నిర్మల చెప్పినది జ్ఞాపకం వచ్చినది. నాలో

ఏదో చెప్పలేని ధైర్యం కలిగింది! ఎవరు ఏం చెప్పినాసరే, ఏమన్నాసరే సంగీత కచ్చేరీలకి, నగరంలో జరిగే విద్వత్సభలకి హాజరవటం ప్రారంభించాను. 'ఇవాళ సాయంత్రం ఫలానా చోట సంగీతకచ్చేరి...ఫలానాచోట నాట్యం...తీసికెళ్తారా?' అని నేను ఆయన్ని అడగటమే ఆలస్యం — భార్య గీచినగీటు దాటని భర్తలా ఆయన నన్ను తీసుకెళ్ళి లోపల కూర్చోబెట్టి వచ్చేస్తారు. పూర్తయే సమయానికి మళ్ళీ వచ్చి నన్ను యింటికి జేరుస్తారు. ఈ విషయంలో ఆయన చర్య చంచల, అత్తగారు సహించలేకపోయారు. నేను యింట్లో లేనప్పుడు వాళ్ళు ఆయన ఓర్పును చెదరగొట్టి వుంటారు. లేకపోతే, ఒక నాడు జరిగిన చిన్న సంఘటన మాత్రంచేత ఎన్నాళ్ళనుంచో వాళ్ళను అంటుకు పోయినట్లుంటున్న ఆయన వాళ్ళనుంచి వేరు పడతారా?

తెల్లవారకట్ల నేను సంగీతసాధన చేయటం వాళ్ళకి నిద్రాభంగ మవుతోందని ఎన్నోసార్లు నన్ను చంచల హెచ్చరించింది. నేను పట్టించుకోలేదు. అందుకని నేను ఎక్కడికి పళ్లను? ఈ స్వాతంత్ర్యాన్ని నేను వదులుకోవటానికి యిష్టపడలేదు. ప్రత్యేకమైన ఒక సంతోషాన్ని – నా కష్టాలని, బాధని మరపింపచేసే ఒక శాంతినిచ్చే యీ దారిని – నేను వదిలిపెడతానా?

ఒకరోజు తెల్లవారకట్ల నేను పాడుకొంటూవుండగా, ఉగ్రస్వరూపిణియైన కాళికాదేవిలా రూపందాల్చి, చంచల వచ్చింది. 'ఏమిటిది విమలా? నేను ఏరోజు కారోజు చూస్తునే వున్నాను. నీకు ఎన్నిసార్లు చెప్పాను యిల్లా పొద్దున్నే

పాడద్దని? నువ్వు నామాటే వినేటట్లులేవే! నువ్వు యిల్లా అనుస్తూంటే తన నిద్ర చెడిపోతోందని ఆయన కేకలేస్తు న్నారు' అంది గర్జిస్తూ.

నేను ధైర్యంగా జవాబిచ్చాను.

'అందుకని నన్ను పాడుకోవద్దంటారా? మీారేం కావాలన్నా చెప్పండి - చేస్తాను. కాని, దయచేసి నా యీ ఒక్క స్వతంత్రంలో మాత్రం కలుగజేసుకోకండి. ఇక్కడ మీాకు అడ్డుగా వుందనిపిస్తే, రేపట్నుంచి కిందకువెళ్ళి పాడు కొంటాను.' - అని బ్రతిమాలుతున్నట్లు చూశాను.

'ఇప్పుడు యిక్కడ నీ స్వతంత్రం ఏం బజీ పోయిం దేమిటి? ఒకే ఒక్క స్వతంత్రం అంటూ నొక్కి నొక్కి మాట్లాడుతున్నావ్? పెద్దవాళ్లు, మంచి, మర్యాద అనేది ఏమైనా వుంటే యిల్లా మాట్లాడుతావా నువ్వు?

నా భర్తకూడా నిద్రపోలేదు. వింటూనే వున్నారు. 'ఏమిటి వదినా పొద్దున్నే గొడవ?' అంటూ లేచారు.

'లేకపోతే ఏమిటి చంద్రం యిది? రోజూ మీా అన్నయ్యకోప్పడుతున్నారు. తెల్లవారకట్లే ఎవళ్లకేనా కొంచెం నిద్రపడుతుంది. అప్పుడే అదే సమయం అన్నట్లు యీావిడగారు అనుస్తూ పాడటం మొదలెడుతుంది. సంగీతమట! సంగీతం! తెల్లారాక పాడమ్మా అంటే ఏమిటో స్వతంత్రం, గితంత్రం అంటూ మాటలు వస్తున్నాయి. మీారు స్వతంత్రంగా వుంటా నంటే మధ్య నాకెందుకు? ఇదిగో చూడు చంద్రం - తను యిక్కడ మమ్మల్ని అనవసరంగా దెప్పుతూ, తిట్టుకుంటూ బాధపడనక్కర్లేదు. రేపటినుంచి వేరేకాపరం పెట్టుకో.

ఐకమత్యమనేదే లేకుండా ఎన్నాళ్ళిల్లా వుండగలం?' అని ఆర్డరు జారీచేసేసింది చంచల.

నిజాన్ని చెప్పి బ్రతిమాలుకొన్నందుకు నాకు యిది ప్రతిఫలమా? వాళ్ళే శాశ్వతమని, ఆయనకన్నా ఎక్కువగా గౌరవాన్ని చూపిస్తూ ఉదాసీనాలను లెక్కచెయ్యకుండా నేను పడ్డపాట్లకి నాకు బహుమానమా యీ మాటలు? పగిలిన నా హృదయంనుంచి పొంగిపోయిన నా దుఃఖం కన్నీరుగా మారిపోయింది. చేతులు అడ్డంపెట్టుకొని చిన్నపిల్లలా వెక్కి వెక్కి ఏడ్చాను.

'ఇప్పుడు ఎవళ్ళే మన్నారు? మాట్లాడితే ప్రతిదానికి యీ ఏడు పొకటి! ఎక్కణ్ణుంచి వస్తుందో? చూసేవాళ్ళు నవ్వుతారనే సిగ్గేనా లేదు!' అనేసి తన చీరకొంగును అలక్ష్యంగా విదిలిస్తూ వెళ్ళిపోయింది ఆ యింటి మహారాణి చంచలాదేవి.

మొట్టమొదటిసారిగా నా భర్త వదినగారి నడత తనకి నచ్చనట్లు 'ఏడవకు విమలా! తన మాటలు లెఖ్ఖచెయ్యకు' అన్నారు అనుతాపంగా.

ఆయన అనుతాపంగా మాట్లాడిన మాటల్తో నా మనస్సు ఎంత ఆశగా తలయెత్తింది? కాని ఆయన ఆ అనుతాప మాటల్తో మాట్లాడకుండా ఊరుకోకూడదా? నేను అదిరిపడేటట్లు ఆయన తలవనితలంపుగా యిటువంటిపని చేస్తారని నే ననుకోలేదు – ఒక వారంరోజులు గడిచాక ఒకరోజు రాత్రి భోజనాలన్నీ అయాక నేను వంటిల్లు కడుగుతూండగా ఆదిశక్తి స్వరూపంతో నా అత్తగారు గబగబా వచ్చింది.

'ఏమే విమలా! పరమ సాధువులా మసుల్తూ లోపల లోపల వాడికి నూరిపోసేసావే! పెద్దవాళ్ళున్నారని, అమ్మ యింకా బతికేవుందని నాతో మర్యాదకోసమైనా ఒకమాట చెప్పాడా?' అంది అత్తగారు అమాంతంగా నన్ను మింగివేసే టట్లు చూస్తూ.

నాకు మొదలూ, చివరా కూడా అర్థం కాలేదు. 'ఏంచేశా రత్తయ్యా?' అన్నాను.

'ఎంత నంగనాచి వే! ఏం తెలియనట్లే నటిస్తున్నావే! ప్రాణానికి ప్రాణంగా అన్నయ్య, వదిన అంటూ వున్నవాడిని కొంచెం కొంచెంగా కరిగించి వేశావే! అంత పోదల్చుకొన్న వాళ్ళు రెండేళ్ళనుంచి ఎందుకున్నా రిక్కడ? అప్పుడే పోక పోయూర్గా? డల్హౌసీ స్క్వేర్ లో యిల్లు చూసుకొన్నాను రేపే వెళ్ళిపోతున్నా నన్నాడు యిందాక. ఈ మాట విని పెద్దాడు రాయియిపోయూడు. నే నింకా బతికే వున్నాననే జ్ఞాన మేమైనా వుందా? నువ్వు వచ్చి మాకు చాలా మంచి పాఠం నేర్పావు!' అని ఆయన చేసేపనికి నేనే బాధ్యురాలి నన్నట్లు నన్ను దెప్పిపొడిచింది నా అత్తగారు.

'ఇకనుంచి ఆ అన్నదమ్ములు యెప్పుడు విడిపోయినా, అందుకు నువ్వు బాధ్యురాలివి కాకపోయినా అందరూ నిన్నే నిందిస్తారు!' అన్న నాన్న ఉపదేశం జ్ఞాపకం వచ్చింది. నా భవిష్యత్తులో యిల్గా జరుగుతుందని ఆయన అప్పట్లోనే ఎల్లా ఊహించగలిగారో కదా!

'నాకు తెలియనే తెలియదు అత్తయ్యా, నాతో యీ విషయంలో ఏమి చెప్పలేదు ఆయన' అన్నాను బెదిరిపోతూ.

'తెలుసని నువ్వు ఒప్పుకొంటావేమిటి ? ఇప్పుడు ఎవళ్లని ఏమంటే మాత్రం ఏం లాభం ? పెద్దాడి మనస్సు విరిగి పోయింది. డబ్బు యివాళవుంటుంది. రేపు పోతుంది. ఇవాళ ఎడముఖం, పెడముఖం పెట్టుకొని వెళ్తున్నారు. రేపు ఏదైనా అవసరమంటూ వస్తే మనుష్యులెవరూ దొరకరు !' అనేసి విసురుగా వెళ్లిపోయింది నా అత్తగారు.

ఈవిషయంలో నాకు ఏమీకూడా తెలియదని గొంతుక చించుకొని అరిచినా ఎవరూ నమ్మరు ! తాడిచెట్టు కింద కూర్చుని పాలు తాగినా ఎవళ్లూ నమ్మరు ! నా నిజ జీవితస్థితి చెప్పినా అంతా నవ్వుతారు ! ఇప్పుడు యిల్లు విడిపోయి, నా తలమీద యీ అపవాదు కూడా వేయించాలనుకొన్నారా ఆయన? ఈబుద్ధి మొదట్లో ఏమయింది? నాతోటి ఏమాత్రం కూడా చెప్పకుండా ఆయన చేసే యీ పనికి ఏమిటి అర్థం? 'నిన్ను చేపట్టినప్పుడు అల్లా అనుకొన్నాను. ఇప్పుడు నా అభిప్రాయం తప్పని తెలిసింది' అని ఆనాడు రాత్రి ఆ తప్పుని నా నెత్తినే రుద్దాడుకదా? ఏం ? సిమ్లానుంచి వచ్చిన వెంటనే మార్చేయక పోయారా ? ఆనాడు నా కన్నీటిని చూసికూడా చలించని ఆయన యిప్పుడు ఎందుకు యిల్లు విడిపోతున్నారు!

నా అత్తగారి ఎత్తిపొడుపు మాటలు, చంచల మెరిలి కన్నీళ్లు, బావగారి పట్టింపులేని మానస్థితి, పిల్లల నిజమైన మనస్సంచలనం, మనస్సును ఆకర్షించిన ప్రియచెలి నిర్మల ఎడబాటులోని దుఃఖం, ఆయన చలనం లేని నిశ్చయతాభిప్రాయం—వీటి మధ్య అమ్మా నాన్నలను తల్చుకొంటూ నా కొత్త యింటిలో కాలుపెట్టాను.

# 19

బంగారపు గాజులకోసం ఆశపడిన పేదరాలికి క్రొత్తగా మెరుగుపెట్టబడి బజారులో అమ్మే యిత్తడిగాజులు, చేతినున్న గాజు గాజులకన్నా ఆకర్షణీయంగా వుంటాయి. ఆశలోని వ్యామోహంలో వాటిని కొనుక్కొని చేతికి వేసుకొంటుంది. నాలుగైదు రోజులయిన తరువాత యిత్తడియొక్క నిజ స్వరూపం బయటపడుతుంది. మెరుగు మాసిపోయి, మగ్గి, కిలుముపట్టి అవలక్షణ చిహ్నంగా కనిపించేవాటిని చూసి నప్పుడు, ఆమె పగలగొట్టి అవతల పారేసిన గాజు గాజులే ఎంతో మంచివని ఆమెకు తోస్తుంది.

ఏకాంతానికి ఎక్కువ అవకాశం లేకుండా, కోతిబుద్ధి కలిగిన మనస్సు కుప్పిగంతులు వేయటానికి సందర్భం లేకుండా చేతినిండా ఏదో ఒకపని వుంటూవచ్చిన ఆ యిల్లే యీ వేరింటి కాపరానికన్నా చాలా బాగుందనిపించింది.

భార్యతో అనురాగంగాను, అన్యోన్యంగాను వుండ టానికి యిష్టంలేని ఆయన ఏ కారణంతో యీ వేరింటి కాపరం పెట్టారో నాకు అర్థంకాలేదు. నామీద ఆయనకు జాలి కలిగిందా? లేక నేను మనశ్శాంతిగా వుండకూడదనా?

పొద్దున్న సుమారు తొమ్మిదిగంటల ప్రాంతంలో ఆయన వెళ్ళిపోతారు. మళ్లీ పునర్దర్శనం రాత్రి పదిగంటల ప్రాంతంలో. భోజనం పనిమనిషికిచ్చి పంపించాలి. అంతే! గదిలోని కిటికీలలోనుంచి రోడ్డుమీద వెళ్ళే జంటలను చూస్తూ, నిట్టూర్పులను విడుస్తూ, కాలంగడుపుతూ నేను తృప్తిచెందాలి!

మనస్సు విప్పి పాడటానికి వీల్లేదే, పరిస్థితులు సానుకూలంగా లేవే, అని నేను బాధపడినదిపోగా, యిప్పుడు నాకు పొద్దుగడవటం యమయాతనగా వుంది. నేను పాడినా, నవ్వినా, ఏడ్చినా, అడిగేవాళ్ళూ లేరు. వినేవాళ్ళూ లేరు !

కొడి ఆరిపోయిన జ్యోతిలా కృంగిపోయిన నా ఉత్సాహాన్ని వెలిగించి ప్రోత్సహిస్తున్నట్లు జానకి నా జీవితంలో ప్రవేశించింది. ఎప్పటిమాదిరిగానే, నేను రోడ్డుమీదకు చూస్తూ గదిలోనే కూర్చున్నాను. రోడ్డుమీద జానకి గబగబా ఎక్కడికో వెళ్తున్నట్లు కనిపించింది. మనస్సులో కలిగిన ఆత్రుతలో, నేను గదిలోనుంచే 'జానకీ ! జానకీ !' అంటూ గట్టిగా పిలిచి, గుమ్మంలోకి వచ్చాను. ఆమె ఒక్క క్షణం వెనక్కి తిరిగి చూసింది. కాని ముందుకు నడిచి వెళ్ళిపోయింది. ఆమెచర్య నాకు అర్థం కాలేదు. ఆమె జానకి అయినట్లయితే నన్ను చూసికూడా వెళ్ళిపోతుందా ? జానకి కాదేమో ? రోడ్డుమీద వెళ్ళే మరెవరినో అల్లా పిలిచినందుకు నాకు సిగ్గేసింది.

లోపలకువచ్చి గడియారం చూస్తే మూడుగంటలయింది. నాకోసం అని ప్రత్యేకంగా ఏదైనా చేసుకోవటం అనేది నాకు యిష్టంలేకుండా పోయింది. 'ఆయనకి భోజనం పంపాలి – రాత్రి భోజనానికి వస్తారు' అనే యీ రెండు పనులు మాత్రం శ్రద్ధగా చేసేదానిని. నాకు సంబంధించినంత వరకు, ఒకరోజు పన్నెండింటికి, యింకొకరోజు ఒంటిగంటకు, మరొకరోజు రెండింటికి యిల్లా యిష్టం వచ్చినట్లు యెప్పుడో తినేదానిని. తాగాలనిపిస్తే కాఫీ కాచేదానిని. ఒకరోజు

అదికూడా అనవసర మనిపించేది. ఏం కావాలన్నా చెయ్యటానికి కలిగిన యీ స్వతంత్రాన్ని నా యిష్టం వచ్చినట్లు ఉపయోగించుకొన్నాను.

అప్పుడు నాకు యేదో జ్ఞానోదయం కలిగినట్లయింది. జీవితాన్ని యిల్లా బద్ధకంగా, సోమరితనంగా యెందుకు గడపాలి! శుభ్రంగా బట్టలు కట్టుకొని సింగారించుకోకూడదా! ఎప్పుడూ యింట్లోనే యెందుకు పడివుండాలి? చుట్టుపక్కల వాళ్ళతో స్నేహంచేసి బయటతిరిగిరాకూడదా? ఇప్పటికే మసిమాలిపోయిన నా జీవితానికి నా చేతులతో నేనే యింకా ఎందుకు మసిపూసుకోవాలి? – అనే కొత్త ఆలోచనలు కలిగాయి.

'ఇక్కడ ఎవరు నన్ను పిలిచింది?' అనే గొంతుక గుమ్మంలోనుంచి వినిపించింది. 'జానకి గొంతుకే' అనే సంతోషంతో గబగబ పరిగెత్తుకొచ్చాను.

'నువ్వా విమలా! ఆనవాలే తెలీలేదే? అంది జానకి ఆశ్చర్యంగా.

'అవును నేనే పిల్చాను' అంటూ నవ్వాను.

'ఉత్తరం ఒకటి అర్జంటుగా పోస్ట్ చెయ్యాల్సి వచ్చింది. కొంచె మాలస్యమయినాకూడా, యీపాటికి 'పెట్టి' తీసేస్తాడేమో నని తొందర తొందరగా వెళ్ళిపోయాను. తీరా నేను వెళ్ళేటప్పటికి అప్పుడే ఉత్తరాలు తీసేస్తున్నాడు 'పోస్ట్ మేన్'. వాడి చేతికిచ్చి వచ్చాను. ఊఁ...నువ్వు యిక్కడే వుంటున్నావా? వేరే కాపరం వచ్చేనారా?' అంది జానకి.

ఎన్నో రోజుల తర్వాత అవాళ నాకు ఎందుకో ఎంతో సంతోషం కలిగింది.

'మీరు కొవ్వూరునుంచి ఎప్పుడొచ్చారు? ఇక్కడేం చేస్తున్నారు? ఎక్కడుంటున్నారు' అని ప్రశ్నమీద ప్రశ్న పరంపరగా అడిగేశాను జానకిని.

పాత స్నేహమంటేనే అందులో ఒక ప్రత్యేక ఆనందం వుంది! జానకి నాతో మూడు గంటలసేపు మాట్లాడుతూ కూర్చుంది. కాని మూడు గంటలూ మూడు నిముషాల్లా గడిచిపోయినట్లు తోచింది నాకు.

ఆమె మా పక్క వీధిలోని సంగీత కళా మందిరంలో అధ్యక్షురాలిగా పనిచేస్తున్నానని, కొవ్వూరు వదిలి సుమారు సంవత్సరం దాటిందని చెప్పింది. నన్నుపాడమని, నా పాట విన్న ఆమె, ఆశ్చర్యంతో —

'నీ సాధనలో యిప్పుడు నీ గొంతుక యింకా మాధుర్యంగా వుంది విమలా! నువ్వు స్టేజి ఎక్కి కచ్చేరి చేశావంటే కీర్తి ప్రతిష్టలు నిన్ను వెతుక్కుంటూ ఎల్లా వస్తాయో తెలుసునా?' అని నన్ను ఎంతో ఉత్సాహపరిచింది.

నాకు ఏదో సార్వభౌమ పదవి లభించినట్లనిపించింది!

జానకితో నా స్నేహం ఆనాటినుంచి నా వెగటును పోగొట్టే మందుగా పెంపొందింది. నా జీవితంలో కొత్త బాటలు లేచాయి. పంజరంలోనుంచి బయటకి వచ్చిన చిలుకలా, యింట్లోనే పడి వుండటం వదిలి ఆమె కళామందిరంలో కళాభిమానులతోను, కళానిపుణులతోను కాలం గడపటం ఆరంభించాను. ఆమె స్నేహంవల్ల అనేకమంది సంగీత

విద్వాంసులతో నాకు పరిచయం కలిగింది. ఒకరోజున ఆమె ఒక అప్లి కేషన్ ఫారం తెచ్చి యిచ్చి 'పూర్తిచెయ్యి విమలా!' అని నవ్వుతూనే ఆజ్ఞ యిచ్చింది. నాలో సంతోషం పొంగి పోయినప్పటికి, చంద్రునిమీద కనిపించే నల్లని నీడలా నాలో కూడా కొంచెం నీడ పడింది! 'ఆయనతో చెప్పద్దా?' అన్నాను.

ఒక క్షణం ఆలోచించి — 'నీకు యింత స్వాతంత్ర్యాన్ని యిచ్చిన నీ భర్తని పద్ధెనిమిదో శతాబ్దం పల్లెటూరి బైతులా భావిస్తూ భయపడుతున్నావే విమలా! ఆయన అడ్డు పెడతా రని నాకు ఏమాత్రం నమ్మకం లేదు. అడగాలని వుంటే అడుగు, నేను మళ్ళీ రేపువస్తాను' అని జానకి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి దానిని ఆయనకి చూపించాను. ఆ అప్లి కేషన్ చూసి, ఏ విధమైన మనస్సంచలనం లేకుండా— 'నేను ఎందుకు అడ్డు పెడతాను విమలా? నీ దారిలో స్వతస్సిద్ధంగా ఏ విధ మైన అక్కర నాకు లేకపోయినప్పటికీ, నీ ఆశ నిరాశ చేస్తా ననుకొన్నావా విమలా?' అన్నారు.

నా విద్యను బయట ప్రపంచానికి పరిచయం చెయ్య టానికి ఏ మీ అడ్డుపెట్టని ఆయన విశాల హృదయాన్ని నా మనసాక్షి ఎంతో మెచ్చుకొంది. కాని అదే సమయంలో ఆయన అంతరంగంలో నాకు స్థానం యివ్వకుండా, నా మెళ్లో మంగళసూత్రం కట్టిన కారణం చేత నన్ను భార్యగా చూసే ఆయన మనోనిశ్చలత్వం నన్ను విపరీతమైన వేదనకు గురి చేసింది. నేనుకూడా స్త్రీ స్వభావంలోని పిచ్చల కళ్లాన్ని వదులు చేయకుండా, కొత్త ప్రపంచంలో పేరు ప్రతిష్టలతో

ప్రకాశించబోతున్నాననే ఆనందంతో నా బాధనంతా కప్పి వేశాను.

నా విజ్ఞాపన విజయాన్ని పొందింది. ఆకాశవాణిలో "శ్రీమతి విమలా - చంద్రశేఖరం" అనే పేరు తరచు విని పించటం ఆరంభమయింది.

కాల ప్రవాహంలో మరో నాలుగు నెలలు గడిచి పోయాయి. కాని స్త్రీని వికసింపచేసే జీవప్రకాశం నా జీవన జ్యోతిని యింకా గ్రహణంలా పట్టుకొని పీడిస్తూనే వుంది!

వీధి తలుపు తట్టిన చప్పుడు విని తలుపు తీశాను. నిర్మల, పిల్లలను తీసుకొని వచ్చింది.

'అబ్బ! ఎంత ఎండ! నిద్రపోతున్నావేమో అను కొన్నాను' అంది నిర్మల లోపలికి వస్తూ.

బస్సుస్టాండ్ దగ్గరనుంచి ఎండలో నడచివచ్చి నందున ముఖాలు కందిపోయిన ఆ పిల్లలనుచూసి, వాళ్ళ అమాయక ప్రేమముందు నేను యేదో తప్పుచేసిన దానిలా నిల్చున్నట్లు తోచింది నాకు.

'ఎండ చంపేస్తోంది? వీళ్ళిద్దరూ యివాళ నీ దగ్గరకి తీసికెళ్తేనేగాని వీల్లేదంటూ ఒకటే గొడవ. సాయంత్రం వెళ్దామ్రా అని యెన్ని చెప్పినా వినలేదు. ఇప్పుడే వెళ్లాలి అంటూ కూర్చున్నారు. ఏం చెయ్యనింక! సరే అని యీ నెత్తీ, కాళ్ళూ కాలే యెండలో బయలుదేరాను' అని నే నిచ్చిన నీళ్ళతో కాళ్లూ, ముఖమూ కడుక్కుంటూ అంది నిర్మల.

డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి కూర్చున్నాం.

'పిల్లలని చూడాలని అస్తమానూ అక్కడికి రావాలని నేనెంతో ఆశపడుతున్నాను. ఆయన యింటికి వచ్చేటప్పటికి రాత్రి తొమ్మిది దాటిపోతోంది. చంచల, అత్తయ్యకూడా యింక మా ముఖం చూడమన్నట్లుంటున్నారు. ఏదో పిల్లలనేనా రానిచ్చారు. అదే చాలు. నిన్ననే అన్నాను ఆయనతో. స్కూళ్ళకి సెలవు లిచ్చారుకదా, పిల్లలు అందరూ పదిరోజుల పాటు యిక్కడ వుండేటట్లు తీసుకురమ్మన్నాను. అందుకు బావగారిని చూసే పదిహేనురోజు లయింసన్నారు. ఏం నిర్మలా? బావగారు పొరుగూరు ఎక్కడికేనా వెళ్లారా? ఆఫీస్‌కి వెళ్ళటం లేదా?' అని అడిగాను.

'ఊళ్లోనే ఉన్నాడు. రోజూ ఆఫీసుకు వెళ్తూనేవున్నాడు. కాని చంద్రం ఎలా చూడగలుగుతాడు? టవున్‌కి వెళ్ళి అన్నయ్యను చూసేందుకు తనకు టైము ఏదీ?' అంది నిర్మల.

నాకు చాలా ఆశ్చర్యమేసింది.

'కొత్తగా ఏదైనా బ్రాంచి పెట్టారా నిర్మలా?'

నిర్మల నన్ను ఆశ్చర్యంగా చూసింది.

'లేదే. నిజంగా నీకు ఏమీ తెలియదా విమలా?'

'ఏమిటి?'

ఆమె ఆశ్చర్యం యింకా ఎక్కువైంది.

'కుటుంబంలోనుంచి విడిపోవడమే కాకుండా, అప్పట్లోనే వాళ్ళ కంపెనీలో ఉద్యోగంకూడా మానేసాడుటకదూ? జాన్సన్ అండ్ జేమ్స్ కంపెనీలో ఏదో మేనేజరుగా వుంటున్నాడనికదా అంటున్నారు' ఆ తర్వాతకూడా రెండుమూడు సార్లే యింటికి వచ్చాడు' అంది నిర్మల.

నేను శిలా విగ్రహాన్నయిపోయాను !

ఏం భర్త యీాయన ? తను ఎక్కడ వుద్యోగం చేస్తున్నారో కూడా భార్యతో చెప్పని యీాయన్ని ఎందులో జమ కట్టవచ్చు? నేను కొత్తగా కాపరానికి వచ్చినపుడు ఆయనంతట ఆయన చెప్పని యీా విషయాన్ని నిర్మలను అడిగి తెలుసుకోవటానికి సిగ్గుపడ్డాను. ఇప్పుడు, రెండు సంవత్సరాలు దాటిపోయాక కూడా, ఆయన ఎక్కడ పని చేస్తున్నారు ? ఎంత జీతం ? అనే విషయాలు కూడా తెలియని దానిలా నిర్మల కళ్ళకి కనిపించవలసివచ్చింది ! ఛ...! 'అన్నయ్యను చూసి పదిహేనురోజులయింది' అని ఆయన అన్నప్పుడు, యిప్పుడు నిర్మలని అడిగిన ప్రశ్న అయన్నే అడిగేసి వుంటకూడదా ?

అడక్క పోతేమాత్రం ? ఇటువంటి విషయాలు ఆయనంతట ఆయనే చెప్పకూడాదా? నాగరీక స్త్రీల మాదిరిగా తన భర్త యొక్క పనిలోను, ఆదాయంలోను అక్కరవున్నట్టు నేను ఆయనను అడగలేదని యిటువంటి విషయాలు ఎందుకు చెప్పాలనుకొన్నారా ? నేను యిల్లా మోడుపడిపోవటానికి కారణం ఎవరు ? ఆయనే కదా ?

ప్రతీనెలా ఒకటవ తారీఖున ఏదో జీవనాధారం యిస్తున్నట్లు, నా ఖర్చులకి కొంతడబ్బు డ్రాయర్లో పడేస్తారు. ఇంట్లోకి కావలసిన సామానులు ఎప్పటికప్పుడు చెప్పక్కర్లేకుండానే వస్తూంటాయి. నాకు యింకా ఆకాశవాణి కేంద్రం నుంచి డబ్బు వేరే వస్తోంది. నగలూ అవీ చేయించుకొందామా అంటే అందుకు ఉత్సాహం లేదు.

'ఏమిటి విమలా? అల్లా స్తంభించిపోయావు? చంద్రం నిజంగా నీతో యివన్నీ చెప్పటం లేదా? అక్కడ అందరూ ఇదంతా నీ పనే అని అస్తమానూ ఆడిపోసుకొంటున్నారు. చాలా విచిత్రంగావుందే!' అంది నిర్మల.

'నేను శ్రద్ధగా అడగలేదు. ఆయన కూడా అంతగా పట్టించుకోలేదు' అని నవ్వాను.

'ఎంత చిత్రమైనదానివే నువ్వు! ఈ నవయుగంలో భర్తచేసే ఉద్యోగం కూడా తెలియని భార్యకూడా వుందా? ఆలోచించగా ఆలోచించగా నీ ఓర్పు నాకు అంతులేని ఆశ్చర్యం కలిగిస్తోంది. ఈ వేరింటికాపరానికి అంతా నీదే తప్పన్నారు. ఇప్పుడూ అల్లాగే అంటున్నారు. నువ్వేమో నీకు ఏదీ కూడా తెలియదంటున్నావు. చంద్రం మాత్రం – యీ నాలుగు నెల్లనుంచి యీ యింట్లో తిరిగే ఒకే ప్రాణితో యీ విషయాలన్నీ చెప్పకుండా ఎల్లా వుంటున్నాడు? కొత్త విషయం ఏదైనా వున్నట్లుంటుంటే తన ప్రియమైనవాళ్లతో చెప్పకపోతే తల పగిలినట్లుందే' అంది నిర్మల.

'అవును. ఆయన ఒక వింత భర్త. మా దాంపత్యం మరింత వింత దాంపత్యం' అని యింకా గట్టిగా నవ్వాను.

బజారులో షోరూమ్‌లో అందంగా కనిపించే బొమ్మలను చూసి అతిశయంతో నిలబడిపోయిన చిన్నపిల్లలా, నిర్మల నన్ను చూస్తూవుండిపోయింది. ఇంతలోనే 'పోస్టు' అంటూ కేక వినబడింది. నేను గుమ్మంలోకి వెళ్ళేటప్పటికి, రెండు కవర్లు లోపల పడేసి పోస్టుబంట్రోతు వెళ్ళిపోతున్నాడు. వాటిని తీసుకొని ఎడ్రసు, దస్తూరీ చూస్తూ లోపలికి వచ్చాను.

శ్రీమతి విమలా - చంద్రశేఖరం అనే పేరు యిప్పుడు నాకు ఎంత బాగా పరిచయమైపోయింది! ఒక్కొక్కసారి, నేను ఆకాశవాణి నిలయంలో పాడి వచ్చినతరువాత, నా సంగీతాన్ని మెచ్చుకొంటూ ఎవళ్ళో ఒకళ్ళు ఉత్తరాలు రాస్తూనే వున్నారు. ఆ వుత్తరాలన్నీ మూడు వంతులు పొగడ్తలుగానే వుంటాయి.

ఒక కవరుమీద ఆగ్రా ముద్రవుంది. కింద 'శ్యామల' అనికూడా రాసివుంది. కవరు చింపాను. లోపల రెండు ఉత్తరాలు వున్నాయి. ఒకటి మావయ్య ఆయనకు రాసినది.

'రాధాకృష్ణ చదువు పూర్తిచేసుకొని వచ్చేవారం వస్తున్నాడట. అతనికి స్వాగతం యివ్వటానికి వాళ్ళంతా కలకత్తా వస్తారుట. రాధాకృష్ణ వచ్చిన వెంటనే ఉద్యోగంలో చేరబోతున్నాడు. కాబట్టి వచ్చే నెలలోనే శ్యామల నిచ్చి వివాహం చేయటానికి నిశ్చయించుకొన్నారుట.' దాన్ని మడిచి రెండవ ఉత్తరాన్ని విప్పాను.

'......ఇప్పుడు నువ్వు సామాన్యమైన దానివా విమలా? ఆకాశవాణిలో ప్రకాశించే గంధర్వ కన్యవై పోయావు! నాకు ఒక ఉత్తరం రాయటానికికూడా నీకు తీరుబడి లేదా? పత్రికల్లో నీ సంగీతాన్ని గురించి వర్ణించే వర్ణనలను చూసిన నేను, కిందటివారమే నీ సంగీతాన్ని శ్రద్ధగా విన్నాను. నిజంగా నీ కంఠంలో మహత్తరమైన శ్రావ్యంవుంది. భవిష్యత్ సంగీతసరస్వతి అయిన నువ్వు నా ప్రియ చెలి అని తలుచుకొంటూంటే నాకు పరవశం కలుగుతోంది. నాన్నగారు అక్కడికి వస్తారని తెలుసుకొన్న తరు

వాళ్ళ, నిన్ను చూడాలని ఆశగా వుండడంచేత, నేనుకూడా ఆయనతోపాటు అక్కడికి రావటానికి నిశ్చయించుకొన్నాను. నీతో సంతోషంగా, కనీసం ఒక వారంరోజులపాటైనా...' అని ఏమేమో వర్ణిస్తూ రెండు పేజీలు నింపేసింది శ్యామల.

రెండు సంవత్సరాలకి ముందు నాతో మాట్లాడటమే అవమానంగా భావించిన యీ శ్యామల యిప్పుడు నన్ను గౌరవిస్తూ నా యింటికి రాబోతోందిట! అప్పుడు నన్ను తమ దాసీదానికన్నా హీనంగా చూసిన అదే మనుష్యులు యిప్పుడు నా యిల్లు వెతుక్కుంటూ ఎందుకు వస్తున్నారు? నేనేమి మారాను?... అవును... నిజమే... నా నిజ స్వరూపం వాళ్ళకి తెలియదు. ఐశ్వర్యము, కీర్తి వున్న గుంపుకే బయట వాళ్ళకి గుర్తి! అప్పటికన్నా యిప్పుడు నేను బయటవాళ్ళ కళ్ళకి చాలా గొప్పదాననయ్యానుకదా? . భయపడుతూ, భయపడుతూ, బెదురుతూ, బెదురుతూ అందరికి అడుగులకు మడుగులొత్తే పేద విమలనా నేను యిప్పుడు? నాకూ ఒక యిల్లూ, వాకిలీ అని సొంతంగా వున్నాయి. అందుకు తోడు కీర్తి నిచ్చెనమీద కాలుకూడా పెట్టాను. ఒక్క ఉత్తరంతోటే ఆలోచనలలో మునిగిపోయిన నన్ను చూసి నిర్మల —

'ఏమిటి విమలా! ఒక్క ఉత్తరంతోటే అంత ఆలోచిస్తున్నావు? ఎవరేనా 'క్రిటిక్' నిన్ను తెగపొగిడేశాడేమిటి?' అని పరిహాసం చేసింది.

'రాధాకృష్ణ వచ్చేవారం వస్తున్నారట. అత్తయ్య వాళ్ళంతా యిక్కడికి వస్తున్నారుట' అని నే ననేటప్పటికి

నిర్మల ముఖం నల్లగా వాడిపోయింది. రాధాకృష్ణని పూర్తిగా మర్చిపోయానని చెప్పిన నిర్మల యిల్లా మారిపోయిందేమిటి ?

'ఏమిటి నిర్మలా యిల్లా అయిపోయావు ! రాధాకృష్ణని పూర్తిగా మర్చిపోయానన్నారుగా !' అని నేను పరిహాసం చేశాను.

నా భర్త నా మీద అంతులేని అనురాగాన్ని కలిగి వున్నారని నేను నమ్మి ప్రేమ లోకంలో సంచరించిన రోజుల్లో నిర్మలా, రాధాకృష్ణల ప్రేమ ఎంతో గొప్పదనుకొనే దానిని. తర్వాత — నా జీవితంలో అమావాశ్య చీకటి ప్రవేశించిన తర్వాత — ప్రేమ అనే మాటలో గౌరవం పోయిందనలేను. వాళ్ళిద్దరిని చూసినప్పుడు నాకు ఎంతో సంతోషం కలిగేది. రాధాకృష్ణ సర్వగుణ సంపన్నుడని, నేను పరిచయం పొందిన దగ్గరనుంచి అనుకొనే దానిని. కాని నిర్మల చెప్పిన విషయా లన్నీ విన్నతరువాత, నిర్మల మనస్సు తనవైపు లాక్కొని, చివరికి శ్యామలను చేసుకోవటానికి యిష్టపడ్డాడని తెలుసు కొన్న తర్వాత నాకు అతనిమీద కలిగిన సదభిప్రాయంమీద అసహ్యం వేసింది. నా అనుభవం, నా కళ్ళయెదుటే అతను నిర్మలను మోసం చేయటం, 'మగవాళ్ళనే నమ్మకూడదు' అని నా మనస్సులో వేరూని పాతుకుపోయింది. అందుచేత నేను యిప్పటి నిర్మల పరిస్థితికి జాలిపడలేదు. ఒకవిధంగా గండంనుంచి తప్పించుకొందనికూడా అభిప్రాయపడ్డాను. నా మాదిరి కాదుకదా ఆమె ?

రెండవ కవరుమీంద దస్తూరీ పరిచయం లేనిదిలావుంది. ముద్రకూడా సరిగా కనిపించలేదు' ఎవళ్లో సంగీత రసికులు రాసి వుంటారని అలక్ష్యంగా టేబుల్ మీంద పడేసి —

'వచ్చే నెలలో శ్యామల వివాహం చేయాలనుకొంటు న్నారుట' అన్నాను.

'నన్ను యిప్పుడేం చెయ్యమంటావు విమలా? ఇంట్లో కూడా నా పెళ్లి విషయాలే మాట్లాడుకొంటున్నారు. అది అడగటానికే యీ నెత్తి కాలిపోయే ఎండలో వచ్చాను' అంది నిర్మల.

నేను విరగబడి నవ్వాను. ఆమెకు కోపం వచ్చింది.

'నీకు నవ్వులాటగావుందా విమలా!'

'చాలా బాగుందిది! నేను ఒక ఆలోచన చెప్తాను వింటారా ?'

'ఊఁ'

'మాట్లాడకుండా జరిగినదంతా మర్చిపోయి మోహాన రావుని చేసుకోండి. ఆయన ఆశ నిరాశ చెయ్యకుండా ఆ రాజ భవనానికి మహారాణిగా వెళ్లండి. ప్రేమ, గీమ అనేది అంతా కూడా కథలు, కావ్యాలు, సినిమాలతోటి సరిపుచ్చుకోవాలి. నిజ జీవితానికి అదిసరిపడదు. గాలిమేడలుకట్టి ఊహాలోకంలో విహారించకుండా నవ్యంగా వివాహం చేసికొన్నట్లయితే, దాంపత్యంలో శాంతీ సుఖమూ లభిస్తాయి' అని నాకు తోచింది చెప్పాను.

'ఏమిటిది విమలా? ఇది నిజంగా నీ అంతరంగంలో నుంచి వచ్చే అభిప్రాయమేనా? చూస్తూ చూస్తూ బోనులో పడమంటావా?'

'ఇంద్రలోకం లాంటి రాజభవనంలో కాలుపెట్ట మన్నానా? బోనులో పడమన్నానా? రాధాకృష్ణ లేకపోతే మీ జీవితాన్నే త్యజించాలనుకొన్నారా? అది సాధ్యమవు తుందా?'

'ఏమాత్రమూ యిష్టంలేని ఒకనితో దాంపత్య జీవితం గడపాలంటే నా మనస్సు బద్దలయి పోతుందనిపిస్తోందే విమలా! జీవితంలో శాంతిని, ఆనందాన్ని అనుభవించటానికే కదా మన పెద్దలు పెళ్లి అనేది చేస్తున్నారు? ప్రేమ అనేది పూర్వ్య మని తెలిసినప్పుడు ఒకరితో మరొకరిని మాంగల్యంతో కట్టి వేస్తే ప్రయోజనమేముంది? ఒకరికి నా మనస్సు సర్పించి, మరొకరితో నా జీవితాన్ని ఎల్లా గడపను విమలా? లేదు, మనః పూర్వకంగా నేను ఆయన్ని చేసుకోలేదని తెలిస్తే, తనేమైనా సంతోషపడగలరా?' అని నన్ను పరితాపంగా చూసింది నిర్మల.

నాకు యీ విషయం అనుభవమయిపోయింది. పాపం! ఆమెకు యింకా కొత్తకదా? ఆ బాధ తట్టుకోలేక పోతోంది!

'రానీండి, రానీండి చెప్తాను! రాధాకృష్ణ యిక్కడకు రాకుండా వుంటారా? ఎప్పుడూ నవ్వుతూ వుండే నా నిర్మలను చీకటి సాగరంలోకి తోసేసిన ఆయన్ని చూసిఊరుకోబోయేది లేదు! ఆయనకి తగినపాఠం నేను నేర్పుతాను!... అనవస రంగా బాధపడకండి. ఇల్లా ఆలోచిస్తూ కూర్చుంటే బాధ యింకా ఎక్కువౌతుందేకాని విమోచనం వుండదు. ఆ పదాని జీవితమే యింత...! కళామందిరంలో యివాళ డాన్స

ఒకటివుంది. కాసేపు అక్కడికి వెళ్దాం. ఏం టిఫెన్ చెయ్యను చెప్పండి!' అంటూ లేచి సంభాషణ మార్చేశాను.

లోపలగదిలో, వీణమీటలను మీటుతున్న పిల్లలిద్దరూ నన్ను చూడటంతోటే, నేను కాదు పిన్నీ అదే, అని ఒకళ్ళ మీద ఒకళ్ళు చాడీలు చెప్తూ, పరిగెత్తుకొనివచ్చి నా కాళ్లకు చుట్టుకొన్నారు. సాయంత్రందాకా వాళ్లతో గడిపినప్పటికి, 'వెళ్ళిపోతున్నారే' అని అనిపించింది నాకు. బస్సుదాకా వెళ్ళిన నేను నిర్మలతో, 'పిల్లలను యిక్కడే వుంచేయ కూడదా ? లేదు రెండురోజులపాటు మీరుకూడా యిక్కడే వుండిపోకూడదా?' అన్నాను.

'చెప్పకుండా చెయ్యకుండా నేను యిక్కడ వుండి పోవటం మంచిదికాదు విమలా. అప్పుడే టైము ఆరుకూడా దాటిపోయింది' అని వెళ్లిపోయింది నిర్మల.

'ఈశ్వరా' అనుకొని నిట్టూర్పువిడిచి, కాళ్ళీడ్చుకుంటూ, యింట్లోకి వచ్చేసరికి, యిందాక అలక్ష్యంగా బల్లమీద పడేసిన కవరు కనిపించింది. అలక్ష్యంగానే చింపాను. లోపల కాగితంమీద 'మోహనరావు ఎం. ఏ' అనే అచ్చు చూసి ఉలిక్కిపడ్డాను. సిగ్గుపడి చటుక్కున కవరు చూశాను. శ్రీమతి విమలా చంద్రశేఖరానికే ఆ ఉత్తరం!

శ్రీమతి విమలా!

ఈ ఉత్తరం నీకు ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు. కాని యిది రాయటం నా బాధ్యత. రసికుణ్ణి అనే ధోరణిలో చెబు తున్నాను. నీ విద్యలో నాకు కలిగిన అభిప్రాయం నేను ఏ మాత్రమూ అనుకోని విధంగా, అద్భుతంగా ప్రకాశించింది.

సాధారణ పొగడ్తగా అనుకోకు. సంగీతం కోసమే బ్రహ్మ నీకంఠాన్ని సృష్టించివుండాలి! సంగీత జ్ఞానము, సరళమైన కంఠస్వరము ఒకటిగా చేరేచోట, సంగీత కళ–తేనె, పాలు కలసినట్లుగా వుంటుందని నేను వేరేచెప్పాలా? కిందటివారంలో నువ్వు ప్రపంచానికి అందచేసిన నీ అమరగానము–మువ్వావు గంటసేపు గంధర్వలోకంలో వున్నట్టు తోచింది నాకు. తోడిరాగాన్ని ఆలాపనచేసావే! అద్భుతం! అది యింకా నా చెవుల్లోనుంచి పోలేదు. రాగరసాన్ని నువ్వు ఆలాపన చేసిన విధులూ, మురిపించి మురిపించి పరవశం చేసి కమతాలు, మూడుస్థాయిల్లోనూ, మైమరపించిన నీ సంగీతం విన్నతర్వాత, నిన్ను మహా విద్వాంసినీవర్గంలో చేర్చవలసిందేనని అభిప్రాయపడుతున్నాను. నృత్యం ఒకటి పాడావుచూడు — అది 'ఎక్సలెంట్!' కల్యాణి కలకలమని కొత్తనీటి ప్రవాహం పొంగులా పొంగిపోయింది. భైరవి నీ దగ్గర భ్రమించింది. మోహన, వినేవాళ్లందరిని మోహించి తనలోకి లాక్కుంది. అన్నింటిని మించిపోయింది — చిట్టచివర నువ్వు పాడిన పాట – 'ఎవరితో చెప్పనే చెలీ!' అన్న ఆ పాట విని నన్ను నేను మైమరచిపోయాను అంటే అతిశయోక్తికాదు. ఆ గోవిందుడు గనుక నీ గీతాలను కొంచెం చెవి ఒగ్గి విని వున్నట్లయితే, నీ కంఠస్వరానికి వశమయిపోయి నిశ్చయంగా నీ ముందు ప్రత్యక్షమయి వుండేవాడు! — మోహనరావు' అంటూ వర్ణించి వర్ణించి రాశాడు.

మోహనరావు దగ్గరనుంచి యిటువంటి ఉత్తరం ఒకటి వస్తుందని నేను ఎప్పుడూ అనుకోలేదు. అతను నా గానాన్ని

వింటానన్న ఆలోచన కూడా ఎప్పుడూ కలగలేదు. ఇప్పుడు నా సంగీతాన్ని అతను విని తెలియజేసిన అతని అభిప్రాయం నా మనస్సులో నేను అంతవరకు ఎరగని వ్యామోహాన్ని కలగ జేసింది.

అనేకమంది రసికులు నాకు తమ అభిప్రాయాలను ఉత్తరాలద్వారాను, స్వయంగాను వచ్చి తెలియజేశారు. వాటిలో నిశ్చయంగా యింత మధురత ధ్వనించలేదు. 'సంగీతం కోసమే బ్రహ్మ నీ కంఠాన్ని సృష్టించి వుండాలి!' అని ఎవళ్లూకూడా అనలేదు; కాని మోహనరావు నాతో పరిచయమున్నవాడు కదా? ప్రతీదాన్ని కొంచెం అతిశయంగా చెప్పటమే అతని స్వభావం. ఇందులో తప్పేముంది?

నిజమైన రసికుని పొగడ్త మాటలను చూసిన నాకు ఎటువంటి తప్పు ఉద్దేశ్యము తోచలేదు. ఎటువంటి విజ్ఞానులనైనా పొగడ్త మాటలు మైమరపింపచేస్తాయికదా? ఇంకా ప్రపంచంలో తగినంత అనుభవం పొందని నేను, విముఖము, విరక్తి సహజంగానే కలిగే స్థితికి రాని నేను, పొగడ్త మాటలకు వశమైపోయి ఆశపడటం అసహజం కాదుగదా?

# 20

మామయ్య, అత్తయ్య, శ్యామల, అంతా అవాళ వస్తున్నారని తెలుసుకొన్న తర్వాత, నాకు వాళ్లమీద కలిగిన అనూయని ఎత్తిపొడిచేటట్లు నడుచుకోవాలనిపించింది. అప్పుడు వాళ్లు నన్ను హీనంగా చూసిన సంఘటనలన్నీ

నాలో పొంగి నా యిల్లు వెతుక్కుంటూ వచ్చే వాళ్ళ ముందు వాళ్ల గౌరవాన్ని అలక్ష్యంగా చూస్తూన్నట్లు కనిపించాలని పించింది. 'గ్రహచారమే' అని బాధపడుతూ ఆరంభించిన నా వేరింటికాపరానికి తగినన్ని సామానులు కూడా కొన లేదు. నాకు మంచి బట్టలుకూడా లేవు. అందుచేత సందర్భాన్ని ఉపయోగించుకొని, యిన్నాళ్ళనుంచి దాచిన డబ్బంతా బయ టికి తీసి; యింటిని ఆడంబరంగా అలంకరించే సామానులన్నీ కొన్నాను. కొత్త రకాల నాలుగు పట్టుచీరలు, ఒక నెక్లెస్ కూడా కొనేశాను. ఇల్లంతా ఎక్కడా దుమ్ము, ధూళి కంటికి కనిపించకుండా అతిశుభ్రముగా వుండేటట్లు తుడిపించాను. మా చిన్నయిల్లు రాజభోగ భవనం కాకపోయినప్పటికి, అంద మైన రకరకాల పువ్వులన్నీ తెప్పించి యిల్లంతా అందంగా అలంకరించాను. ఏ రోజూ లేనివిధంగా నేను సింగారంగా అలంకరించుకోవటం చూసిన నాభర్త 'ఏమిటి విమలా యిదంతా! అత్తయ్య వస్తోందనే హడావుడా? లేక విదేశాల నుంచి తిరిగి వచ్చే రాధాకృష్ణ కళ్ళముందు గొప్పగా నిలబడ టానికా?' అని పరిహాసం చేశారు.

ఈ మాటలకి అంతరార్థమేమిటో నాకర్థం కాలేదు. ఇన్నాళ్ళనుంచి నేను ఏ విషయంలోను కూడా శ్రద్ధవహించక పోవటాన్ని ఎత్తిపొడుస్తున్నారా? లేక అత్తయ్య వస్తోందనేనా శ్రద్ధగా వుంటున్నానని తృప్తిపడి పొంగుతున్నారా? — అని అనుకొని ఆయన్ని పరిశీలనగా చూశాను. పొంగి పొరలే సముద్రం అడుగున ఏముందో కనుక్కోవచ్చు. కాని ఆయన ఏ వుద్దేశ్యంతో మాట్లాడుతున్నారో నాకు అర్థంకాలేదు.

జీవంలేని చిరునవ్వే నాకు కనిపించింది. మానవుల్లో 'పజిల్స్' లా అర్థంకాని వాళ్ళు ఎవరేనా వున్నారా అంటే – అందుకు నాభర్త ఒక్కరే అని చెప్పాలి.

'ఎల్లాగయినా అవసరమే కదా అనే కొన్నాను' అని జవాబిచ్చాను. ఆయన మౌనంగానే స్టేషన్‌కి వెళ్ళాడు.

రెండున్నర సంవత్సరాల ముందున్న నాటికన్నా శ్యామల 'లిప్‌స్టిక్' పూసుకోనటం లగాయితు యిల్లెగిరి పోయేలా నవ్వటం వరకు అన్ని అంశాల్లోను పెరిగింది. నిట్ట నిలువుగా మగవాడిలా పెరిగింది. ఆమె మాట, నడక–ఎందు లోను కూడా స్త్రీ స్వభావ సౌందర్యమే కనిపించలేదు నాకు.

'ఏం విమలా! కులాసాగా వున్నావా!' అంటూ నన్ను చూసి నవ్వుతూ వెండి మరచెంబును మర్చిపోకుండా చేతిలోకి తీసికొంటూ కారు దిగింది అత్తయ్య. నేను జవాబుగా ఒక అర్థంలేని నవ్వు నవ్వాను. నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడు కూడా మాట్లాడని మామయ్య కూడా 'విమల యింకా చిన్న పిల్లలా అల్లాగే వుంది' అని నవ్వుతూ తన అభిప్రాయాన్ని బయట పెట్టాడు.

వచ్చీరావటంతోనే, ఆమె గొప్పతనాన్ని చూపిస్తు న్నట్లు 'చిన్న పిల్లవు! అనవసరంగా నిన్ను శ్రమపెట్టటం ఎందుకని మా వంట మనిషిని కూడానే తీసుకొచ్చాను. మాతోపాటు నువ్వు అన్నిచోట్లకి వచ్చి సంతోషంగా వుండాలి. ఇంకొంచెం సేపట్లో తను సామాను బండితోపాటు వచ్చేస్తుంది' అంది అత్తయ్య.

తర్వాత యిల్లంతా తిరిగి చూసింది అత్తయ్య. 'కుదిమట్టంగా చిన్న యిల్లు. చక్కగావుంది. ఈ టీసెట్ కొని ఎన్నాళ్ళయింది విమలా! కొత్త మెరుగేనా యింకా పోలేదే? ఇల్లుని ఎంత శుభ్రంగా వుంచుతున్నావు? దుమ్మూధూళీ ఎక్కడా కనపడటం లేదే! ఈ డ్రాయింగ్ రూమ్ ఎంత అందంగా అలంకరించావు! అన్నయ్య పిల్లలలో నువ్వే విమలా చెప్పుకోదగ్గదానివి! ఎంత తెలివిగా, సామర్థ్యంగా కాపరం చేస్తున్నావు! ఈ యింటికి ఎంత అద్దె? పనిమనిషి రోజంతా యిక్కడే వుంటుందా?' అని ఆమె పరవశమయిపోతున్నట్లు ప్రశ్నల వర్షం కురిపించేసింది.

'నాన్నా, నేను ఎన్నాళ్ళనుంచి చెప్తున్నాను మీతో, ఆ పాత 'సెట్' యిచ్చేసి యింకో కొత్త 'సెట్' కొనమని? విమలని చూడండి. 'సెవెన్ వాల్వ్స - లేటెస్ట్ మోడల్' యిది. ఇటువంటి రేడియో ఒకటి యిక్కణ్ణుంచి వెళ్ళేటప్పుడే పట్టుకెళ్ళాలి. అమ్మా! యీ ఎంబ్రాయిడరీ చూడు! నువ్వే అల్లేవా విమలా? షాపులో కొన్నదానికన్నా చాలా బాగుంది. అరె! నెక్లస్ కూడా చేయించుకొన్నావా? చూడమ్మా! యీ నెక్లస్! నక్షత్రాల మాదిరిగా పొదిగిన యీ డిజైన్ చాలా బాగుంది; అమ్మా యిటువంటిది నా కొకటి కావాలమ్మా!' అని ఆమె కంటికి కనిపించినవాటి నన్నింటిని పొగిడింది శ్యామల.

నేను నవ్వనా? ఏడవనా? వాళ్లు మాట్లాడుకొంటూ వుండగానే వాళ్ళకి కాఫీ ఫలహారాలు పట్టుకొచ్చాను.

'అరె! ఏమిటి విమలా యీ తమాషా? మేజిక్ లాగుందే! మాతో మాట్లాడుతూనే వున్నావు - అప్పుడే కాఫీ పలహారాలు తయారయి పోయాయా?' అన్నాడు మానయ్య ఆశ్చర్యపోతూ. నా భర్తకుకూడా గర్వం కలిగింది కాబోలు—

'విమల అన్నింటిలోను చాలా అసాధ్యురాలు' అన్నారు నవ్వుతూ.

'చూసుకో శ్యామలా! భర్త అలిసిపోయి యింటికి వచ్చినప్పుడు, నువ్వు టెన్నిస్ బ్యాట్ తిప్పుకొంటూ 'మాచ్'కి వెళ్తే సంతోషిస్తాడో లేక యిల్లు మర్యాదచేస్తే తను సంతోషిస్తాడో తెలుసుకోవాలి నువ్వు' అంటూ నవ్వాడు మానయ్య.

'అన్నయ్య ఒక్కసారేనా రాలేదట. రావద్దా మరి? నాకు చాలా సంతోషంగావుంది విమల కాపరంచూస్తే. అమ్మనుకూడా తీసుకురావలసిందని యిప్పుడు బాధపడుతున్నాను. విమల యింత జాగ్రత్తగాను, యింత సామర్థ్యంగాను కాపరం చేయటం చూసిందంటే అమ్మ సంతోషానికి యింక పట్టపగ్గాలుండవు' అని అత్తయ్య పొంచిపొంచి చెప్పినమాటలు, యిదివరకటి నా వెగటును మాయంచేసి గర్వాన్ని కలగచేసాయి.

అవాళే అత్తయ్య మా బావగారింటికి వెళ్ళామంది. ఆయింట్లో కాలుపెట్టానంటే ఏదో చెయ్యకూడని పనిచేసినట్లు చంచల అసలు నాతో మాట్లాడనే మాట్లాడదు. నా అత్తగారు మాట్లాడే రెండుమూడు మాటలు నన్ను దెప్పిపొడి

చేవిగానే వుంటాయి. అక్కడ పది నిముషాలుండాలన్నా కూడా నాకు ముళ్ళమీద వున్నట్లుంటుంది. ఎల్లాగో సహించుకొని వచ్చేసాను కిందటి నెలలో నేను అక్కడికి వెళ్ళినప్పుడు. ఇప్పుడు అత్తయ్యముందు చంచల యివెనరకులాగనే మాట్లాడుతుందా ? లేక విరోధంగా మాట్లాడుతుందా ?

నా భర్త ఆఫీసుకు వెళ్ళేముందు, అవాళ నేను, అత్తయ్య, శ్యామల అక్కడికి వస్తున్నట్లు చెప్పమన్నాను.

మేము అక్కడికి వెళ్ళేటప్పటికి బావగారు ఆయన పనిమీద వెళ్ళిపోయారు. నేను ముందుగానే కబురు పంపినందువల్లో మరేందుచేతనో చంచల పిల్లలతో సహితంగా ఎక్కడికో వెళ్ళిపోయింది. నాఅత్తగారు, నిర్మల తల్లి వంటింట్లో కూర్చుని ఏదో టిఫెన్ తయారు చేస్తున్నారు. నేను ఏదో తప్పుచేసిన దానిలా అడుగులోఅడుగు వేసుకొంటూ లోపలికి వెళ్ళాను. మేమంతా కలసివున్నప్పుడు, నా చిన్నతోడికోడలు సుశీల వచ్చినపుడు తిన్నగా మేడమీదకే వెళ్ళిపోతుంది గాని కింద మా అత్తగారితో ఒక్కమాటకూడా మాట్లాడను. అల్లా సంచరించిన సుశీల కూడా నా అత్తగారికి మంచిదయింది. భయపడుతూ, భయపడుతూ యింటిచాకిరీ అంతా చేసిన నేను ఆవిడకు చెడ్డదాన్నయాను.

'మా అత్తయ్య వచ్చింది' అని నేను మెల్లిగా అన్నప్పుడు నాగుండె దడదడ అదిరింది.

'అవును చంద్రం చెప్పాడుకదూ. ఎక్కడుంది ? ఇల్లా రమ్మను' అంది నా అత్తగారు.

'ఇల్లా రా అత్తయ్యా' అని హాలులోనే కూర్చున్న అత్తయ్యను పిలిచి, వంటింట్లో ఒక పీట వేశాను.

నా అత్తగారు చేతులు కడుక్కుంటూ—'పిల్లలందరూ సినిమాకి తీసికెళ్తేనే గాని వీల్లేదంటూ దాని ప్రాణం తీశారు. మీరంతా యివాళే కదా వచ్చారు, అప్పుడే యిక్కడికి వస్తారా అనుకొంటూ పిల్లలని తీసుకొని సినిమాకి వెళ్ళింది చంచల. ఊఁ...ఓ పదిరోజుల పాటుంటారా?' అని కుశలం విచారించింది నా అత్తగారు మా అత్తయ్యను చూసి.

ఎత్తు మడమల జోళ్ళతో బయటే నిలబడిపోయిన శ్యామల 'విమలా!' అంటూ కేకవేసింది సంకోచం ధ్వనించే టట్లు.

'ఎవరు అక్కడ? మీ అమ్మాయా? ఇల్లా రామ్మా!' అంది నా అత్తగారు.

జోళ్లువిప్పి, అత్తయ్యపక్కనే వచ్చినిల్చుంది శ్యామల. ముసలాళ్ళు యిద్దరూ తల్లితో మాట్లాడటం చూస్తూ అక్కడ వుండటం ఆమెకు యిష్టంలేదని ఆమె ముఖంలో నిదానంగా కనిపించింది నాకు.

'నిర్మల కూడా వెళ్లిందాండి?' అని నిర్మల తల్లిని అడిగాను.

'లేదే మేడమీద వున్నట్లుంది' అంది ఆవిడ.

'రా శ్యామలా!' అంటూ శ్యామలను తీసికొని మేడ మీదకు వచ్చాను.

నిర్మల గదిలో అడుగు పెట్టేసరికి నేను నిశ్చేష్టురాలనై పోయాను! బల్లమీద ఓ కట్ట కాగితాల్ని విప్పి పెట్టుకొని ఏవో

లెక్కలు చూస్తున్నారు నా భర్త! కొంచెం దూరంలో నిర్మల ఏదో చదువుకొంటున్నట్లు కూర్చుంది. ముందు ఆశ్చర్యం పట్టలేక శ్యామలే మాట్లాడింది. 'మీరు యిక్కడ వున్నారా!' అంటూ వెళ్ళి ఆయన టేబుల్ మీద చేతులు ఆన్చి నిలబడింది.

నిర్మల అదిరిపడినట్లు గబుక్కున లేచి నిలబడి —'ఓ, నువ్వా విమలా!' అని నన్ను పలకరించి, శ్యామలను చూసింది.

'మీరంతా యిక్కడికి వస్తారని విమల చెప్పమన్న సంగతి నాకు మధ్యాహ్నం ఒంటిగంట తర్వాత జ్ఞాపకం వచ్చింది. వచ్చాను. అన్నయ్య నిన్ననే, యీ ఎకౌంట్సులో ఏవో తప్పులున్నాయి చూడమంటూ యిచ్చాడు. అదేదో యిక్కడే కూర్చుని చూద్దామని కూర్చొన్నాను. నిర్మలా! ఇది ఎవరో తెలుసునా?' అంటూ నవ్వుతూ నిర్మలవైపు చూశారు.

అతి శ్రమపడుతూ నవ్వటానికి ప్రయత్నించి అల్లాగే నిలబడి పోయిన నిర్మలతో ఆయనే మళ్ళీ మాట్లాడారు.

'మిసెస్. రాధాకృష్ణగా అవటానికి కాచుకొని వున్న శ్యామల! — శ్యామలా! నిర్మలా - రాధాకృష్ణలు యిది వరకే పరిచయమున్న వాళ్ళు' అంటూ ఆయన నిర్మలను శ్యామలకు పరిచయం చేశారు.

'ఓహో! చాలా సంతోషం!' అని 'షేక్ హ్యాండ్' యిచ్చిన శ్యామల, 'వాళ్ళందరితో పాటు మీరు అప్పుడు ఆగ్రా ఎందుకు రాలేదు?' అంది నిర్మలతో.

దుస్స్వప్నం ఏదో కన్నదానిలా అదిరిపడిన నిర్మల 'రాలేదు' అని మాత్రం అనగల్గింది ఒక అర్థంలేని నవ్వు నవ్వుతూ.

మనస్థితి బాగున్నట్లయితేనే సంభాషణ సరళంగా వుండటానికి మాటలు కూడా వాటంతట అవేవస్తాయి. శ్యామల ఒక్కత్తే గబగబా ఏమిటేమిటో మాట్లాడేస్తోంది. నిర్మలకి ఏం మాట్లాడాలో కూడా అర్థంకాక 'ఉ...ఊ...' అంటూ వచ్చిందేకాని ఏమీ మాట్లాడలేక పోయింది. నాకేమో ఆయన్ని అక్కడ చూసిన దగ్గరనుంచి నాకు తెలియకుండానే నాలో ఏదో బాధ చెలరేగింది.

'ఆయన శ్యామలకు చెప్పిన కారణం నిజమేనా? ఆఫీసు కాగితాలు యింటికి ఎందుకు వచ్చాయి? ఈ సమయంలో ఆయనకి తన ఆఫీసు లేదా? అన్నయ్య బంధంలో నుంచి విడిపోయిన ఆయన యివన్నీ ఎందుకు చూడాలి?' అని అనేక ప్రశ్నలు తలలెత్తాయి. ఆయన తనంతట తానుగా ఏమీ చెప్పలేదు. నేనూ యీ విషయంలో ఏమీ కలగ జేసుకోవటం లేదు. అయినప్పటికీ, యింకా నేను ఏమీ అడగకుండా ఊరుకోవటం సరైనదేనా? మనస్సు ఒప్పుకోవటం లేదే!

ఇంటికి తిరిగి వెళ్లిపోయేముందు 'మీరు రావటానికి యింకా ఆలస్యమవుతుందా?' అని నే నడిగిన దానికి "ఊ...ఊ" అంటూ తలకూడా కదపకుండా జవాబిచ్చారే కాని ఏమీ మాట్లాడలేదు. ఆయన రావటానికి యింకా ఆలస్యమవుతుంది కాబోలనుకొని నేను వెనక్కు తిరిగాను.

ఆయిల్లు దాటి బయటపడ్డాక నిర్మల గురించి శ్యామల ముందు మాట్లాడింది.

'ఆ అమ్మాయికి చాలా అహంభావంలావుంది! రెండు మాటలు మాట్లాడితే నోటంట ముత్యాలు రాలిపోతాయను కొంది కాబోలు! ఇటువంటి మనిషి యం. ఏ. ఎల్లా చదివిందో? ఏం విమలా? మీ ఆయన యిక్కడుంటానని చెప్పనే లేదే? అన్నగారి కంపెనీ లెక్కలు తను యిక్కడే కూర్చుని ఎందుకు చూడాలి? మీ యింట్లో చూడకూడదా?' అంది శ్యామల.

'ఏమ్మా విమలా! మీరు వేరే కాపరం రావటం దెప్పుళ్ళా దెబ్బలాటలతోనా బయటికి వచ్చారు? మీ అత్తగారు ఏ నేమిటో అంటూ నిన్ను దెప్పిపొడుస్తోందే! నీతోడికోడలు చూడు ... నేను యివాళ యిక్కడికి వస్తానని తెలిసే కదూ యింట్లో వుండకుండా ఎక్కడకో పోయింది? నేను ఆనాడే అనుకొన్నాను వీళ్ళ గుణం మంచిదికాదని. ఏదోలే...వేరే వచ్చేసి బతికి బయటపడ్డారు. అతను నీతో ప్రేమగా వున్నాడు. ఎవరెల్లాపోతేనేం అదేకదా ముఖ్యం' అంది అత్తయ్య.

'ఇదివరలోనే చెప్పావు కదా నీ అభిప్రాయం. నీ నోట్లో యింత పంచదార పొయ్యొచ్చు' అని నాలో నేను గొణిగాను.

మేము యింటికి వెళ్ళేటప్పటికి సుశీల గుమ్మంలో నిల్చుంది. నన్ను చూడ్డంతోటే 'అమ్మగారు వచ్చే వేళయింది కూర్చోండి వెళ్ళిపోకండి' అన్నాను మీరూ వచ్చారు' అంది మా పనిమనిషి.

'చిన్నతోడికోడలు నీ కళ్ళకి చిన్నదిగా కనిపించింది కదూ విమలా! అందుకనే, ముందు మీ అత్తయ్యను అక్కడికి తీసికెళ్ళావు' అంది సుశీల నవ్వుతూ.

'అదేం లేదు అక్కా! దగ్గరలోనేకదా అని అక్కడికి వెళ్లాం. మేము వెళ్ళేటప్పటికి చంచల కూడా యింట్లో లేదు. ఏదో సినిమాకి వెళ్ళిందిట. కూర్చో' అన్నాను.

అత్తయ్యతోను, శ్యామలతోను సాంప్రదాయంగా ఏదో కొంచెంసేపు లోకాభిరామాయణం మాట్లాడింది సుశీల.

ఆమె బయలుదేరబోయేముందు శ్యామల బట్టలు మార్చుకోనేందుకు లోపలకి వెళ్ళింది. అత్తయ్య ఏదో పని మీద పెరట్లోకి వెళ్ళింది సుశీల నాతో మెల్లిగా—

'విమలా! నేను యిల్లా అంటున్నానని మరోలా అనుకోకు. నేను నీ మంచికే చెబుతున్నాను. నేను సిన్న అక్కడికి వెళ్లాను. అప్పుడు కూడా చంచలయింట్లో లేదు. చంద్రం మేడమీద నిర్మలగదిలో కూర్చుని ఏవో ఆఫీసు కాగితాలు చూస్తున్నాడు. ఆఫీసు కాగితాలు యింటికి ఎందుకు రావాలి? జాన్‌సన్ అండ్ జేమ్స్ కంపెనీలో మేనేజరుగా వున్నాడని కదా అన్నారు—అక్కడ తన పక్కనే నిర్మల ఏదో చదువుకొంటున్నట్లు కూర్చుంది. కింద ముసలాళ్ళిద్దరూ కాళ్లు పారజాపుకొని కబుర్లు చెప్పుకొంటు న్నారు. బావగారు ఊళ్లో లేరుట. నాకుమాత్రం — చంద్రాన్ని ఆ సమయంలో అక్కడ చూడటం ఏం బాగా లేదు. ఏం? ఆ ఆఫీసు పని యిక్కడ కూచుని చెయ్యకూడదూ? పైగా అన్నయ్యనించి విడిపోయానన్న తర్వాత

ఆ కంపెనీ ఏమయితే తనకెందుకు ?' నేను మీ బావని అడిగాను. రెణ్ణెల్లనుంచి ఆ ఆఫీసులో ఏవో విపరీతాలు సంభ వించాయట. అందుకని చంద్రం తన ఉద్యోగానికి ఓ నెల రోజులు సెలవుపెట్టి ఆ కంపెనీ ఏకౌంట్లన్నీ చూస్తున్నాడుట. ఇదెంత నిజమో ! నువ్వు పరమసాధువు విమలా ! లేకపోతే ఆ రాక్షసులతోటి ఆ యింట్లో అన్నాళ్లు నువ్వెల్లా వుండ గలిగావో ? ఏదో ... వేరే వచ్చేశారని నేను చాలా సంతో షించాను. తెల్లనివన్నీ పాలని నువ్వనుకుంటున్నావు విమలా! ఇది చెప్దామనే నేనిక్కడకు వచ్చాను. మగ మనస్సేకదా ? సమయం సందర్భం కలిసివచ్చినట్లయితే ఏం జరుగుతుందో ? పెళ్ళికముందు ఆమెతో విచ్చలవిడిగా మాట్లాడినప్పటికి పెళ్ళయాక యిల్లా వుండటం ఏం బాగాలేదు. నువ్వు చంద్రా నికి తెలియజెప్పాలి. చేతులు కాలాక ఆకులు పట్టుకొంటే ఏం లాభం ?' అంటూ గుమ్మంలో నిల్చునే ఒక ఉపన్యాసం యిచ్చి వెళ్ళింది నా చిన్న తోడికోడలు సుశీల.

నా తలమీద వెయ్యిబాంబరు విమానాలు వెళ్తోన్నట్లు, సుశీల చెప్పిన ఒక్కొక్కమాట ఒక్కొక్క బాంబులా నామీద పేలి పోతున్నట్లు తోచింది నాకు. సుశీలను చంచలతో పోల్చి చూసినట్లయితే, చంచలకన్నా సుశీల ఎన్నోరెట్లు మంచిదనే చెప్పాలి. ఆమె అనవసరంగా ఒకరి జోలికి వెళ్ళదు. ఎవళ్ళేనా ఆమె విషయంలో జోక్యం కలగచేసుకొన్నారంటే వాళ్ళని ముప్పుతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించే స్తుంది. నాకు సంబంధించినంతవరకు నాతో ఎక్కువ చనువుగా

మాత్రం తను సంచరించలేదు. కాని నాకు కనిపించినపుడు నాతో మర్యాద తక్కువగా మాట్లాడనూ లేదు.

'మగమనస్సేకదా ? సమయం, సందర్భం కలసివచ్చి నట్లయితే ఏం జరుగుతుందో...'— యీ మాటలు యీ తెల్లాగుచ్చుకొన్నాయి నాకు. నాకళ్ళముందు రంకుల రాట్నంలా తిరిగాయి. నా మనస్సును సమ్మెటమీద పెట్టి సుత్తులతో నలగగొట్టేసున్నట్లయింది. ఆ మగ మనస్సు ఎటువంటిదో ? ఊరికేనే సుశీల యిల్లా చెబుతూన్నప్పుడు మా దాంపత్య జీవితం కోలాహలంకూడా ఆమెకు తెలిసి నట్లయితే... !

నిర్మల నిప్పులాంటిదే కావచ్చు! కాని ఆ నిప్పుని ఆర్పివేయగల నీళ్ళవంటి శక్తి ఆ మగ మనస్సుకి వుండి వున్నట్లయితే... ?

ఛీ...! ఇదేమిటి ? ఈ తెలివితక్కువ ఆలోచన ! నిర్మలనా నేను యిల్లా సందేహిస్తున్నాను ! నా మనస్సుకు ఏమైనా పిచ్చి ఎక్కిందా ఏమిటి ! కల్మషం, కపటం లేని నిర్మల తెలియదా నాకు ?

పరిస్థితులు యింతదూరం వచ్చినపుడు తను అన్నగారి నుంచి విడిపోయామని కూడా నాతో చెప్పలేదే! ప్రతిరోజు ఆయన తన ఆఫీసుకు వెళ్తున్నారని నేను అనుకొంటూంటే ఆయన అక్కడ వెళ్ళి కూర్చోటం చూడటానికి బాగుందా ? నా కళ్ళకి కరతలామలకంలా కనిపించకపోయినప్పటికి సుశీల మొదలైనవాళ్ళంతా చూసి చెప్పటం ఎంత హీనమైపోయింది!

అవాళరాత్రి ఆయన్ని అడిగాను.

'మీరు అన్నగారి కంపెనీలో లేరని విన్నాను...' అని మెల్లగా ఆరంభించాను. అకస్మాత్తుగా అలవాటు లేని మాటలు ఆయనతో మాట్లాడాలంటే నేను ఏదో పామును సమీపిస్తున్నట్లుంటుంది నాకు.

పేపరు చదువుతూ మంచంమీద పడుకొన్న ఆయన దృష్టికూడా మరల్చకుండా 'అవును. నీకు తెలిసే వుంటుందనే నేను చెప్పలేదు' అన్నారు.

కొంచెం ధైర్యంగా 'రెండురోజులనుంచి మీరు ఏవో కంపెనీ లెఖ్ఖలు చూస్తూ అక్కడే వున్నారు. ... చెప్పటం మర్చిపోయాను. సాయంత్రం మీ సుశీల వదిన వచ్చింది. నిన్నకూడా మిమ్మల్ని అక్కడ చూశానని చెప్పింది' అన్నాను.

ఈసారి నన్ను చూస్తూ 'యింకేం చెప్పింది వదిన?' అన్నారు.

ఏం? యింకేమైనా చెప్పివుంటుందని భయమా? తప్పుచేసిన మనస్సు దడదడలాడుతోంది కాబోలు!

'ఇంకేం అనలేదు! ఏదో మాటల సందర్భంలో మీ ప్రసక్తి వచ్చింది. చెప్పింది. అంతే!' అన్నాను.

'నీకు సంబంధించింది ఏమీకాదు. నువ్వుబాధ పడవల్సిందికూడా ఏమీ లేదు. అన్నయ్య కంపెనీ యీ మధ్య చాలా ఒడుదుడుకుల్లో పడింది. ఆ ఎకౌంట్సు విషయాలలో కొన్నికొన్ని మోసాలు జరుగుతూంటాయి. అవి అన్నయ్య కన్నా నాకు బాగా తెలుసును. అందుకని ఆ ఎకౌంట్సు చూసి పెట్టమన్నాడు అన్నయ్య. చూస్తే

న్నాను. అంతకంటే యింకేంలేదు'— అని చెప్పి మళ్లీ పేపరు చదవటంలో లీనమయారు...

ఇంతకంటే యింకేం అడగను? 'సమయం సందర్భం కలసి వచ్చినట్లయితే ఏం జరుగుతుందో? మగమనస్సేకదా?'- యీ మాటలే నాలో గణగణమని మారుమ్రోగాయి. ఏం తెలియచెప్పను? ఎల్లా తెలియచెప్పను? సుశీల యిల్లా అందని చెప్పనా?

ఆయనతో దెబ్బలాడాలని, ఆయనమీద విరుచుకు పడాలని ఏమేమో అనుకొంటానే కాని చీకటి పడేటప్పటికి నా కోపమంతా మాయమయి పోతుంది. ఆయన్ని చూసేసరికి నా నోరు పెగలదు. నా గొంతుకను ఏదో నొక్కివేస్తుంది. పైగా 'వదిన యింకేమంది?' అన్నారు. ఇప్పుడేం మాట్లాడ కూడదు! బయటికి శాంతంగా, సుఖజీవనంలా సాగే సంసారనౌక, లోపలంతా చిల్లులే అనేది, అత్తయ్య మావయ్య, వీళ్ళంతా వున్న సమయంలో బయట పెట్టటం చాలా తెలివి తక్కువపని!

కాని స్త్రీ సహనమనేదానికి హద్దనేది లేదా! దగ్గరగా వచ్చి మాట్లాడటానికే వీల్లేకుండా తూచితూచి మాట్లాడుతూ, గుల్లలోకి దూరిపోయిన నత్తలా మనస్సును కట్టిపెట్టేసుకొంటున్నారుకదా! మొండి ధైర్యంగా దగ్గరగా వెళ్లి దొలిచివేయటానికి నాకు బలం చాలటంలేదే!

ఆయన మొదట్లో యిల్లాగనే ఉన్నారా? ఆహా! ఆ ఊరేగింపురోజున ఆయన నన్ను పలకరించటం, నాకు పెన్ను ప్రైజుగా యివ్వటం, ఆ మొదటి రాత్రి తెరతీస్తు

న్నప్పుడు నా మనస్సులో పొంగి పరవళ్లు తొక్కిన ఆనందం– అదంతా అబద్ధమేనా? ఆ ఒక్క రాత్రికూడా ఆయనతో మనస్సు విప్పి మాట్లాడటానికి, ఆయన మనస్సును అర్థం చేసుకోవటానికి కూడా సందర్భం కలగకుండా నా జీవితమంతా వ్యర్థమయ్యేటట్లు భూకంపాలలా ఎన్నో సందర్భాలు ఒకదాని తరువాత ఒకటిగా గొలుసులా వచ్చేస్తున్నాయే!

నేను మొదట్లో అనుకొన్నట్లు కామవాంఛ లేని వారయినప్పటికి యింత విముఖంగా వుండరు. నిజమైన మన స్సంచలనం వున్నాకూడా యీ వైరాగ్యానికి తావులేదు. ఏ కారణంతో ఆయన యిల్లా వుంటున్నారు? ఆయనకు యీ మనోబాధ ఎందువల్ల కలిగివుంటుంది?

నా నెత్తిమీద వెయ్యి పిడుగులు ఒక్కసారిగా పడ్డాయి!

వేరెవరి మీదేనా యీయన మనస్సుందేమో...? ఆకలయికే యీయన యిల్లా వుండటానికి హేతువైందేమో?

'పెళ్లికి ముందు విచ్చలవిడిగా మాట్లాడినప్పటికి యిప్పుడు కూడా అల్లాగే వుండటం ఏం బాగుండలేదు'

నిజమేనా?

ఎంతమర్చి పోదామన్నా, నాకు మళ్లీ అదే జ్ఞాపకం వస్తోంది. రాధాకృష్ణని ప్రేమించి, మనస్సు విరిగిపోయి బాధపడుతున్న నిర్మలనా నేను సందేహిస్తున్నాను? ఛీ...! నేను విశ్వాస ఘాతకురాలిని! నా మనస్సులో నిజంగా నిల బడిన ప్రాణచెలియలి కదా ఆమె? ఆమె నాకు ద్రోహం చేస్తుందా?

తెరమీద కనిపించినట్లు, నాలోనుంచి యింకో గొంతుక—

'అవంతా యిప్పుడు. కాని నువ్వు ఆయనను పెళ్లి చేసుకోకముందు? అందమైన పడుచుపిల్ల ఆమె...ఇంట్లో చనువుగా సంచరించేవారు ఆయన ... ఆయన మనస్సు కల్మషం లేకుండా నే వుండివుంటుంది అని ఏ ఆధారంతో నమ్ముతున్నావో అదే ఆధారంతో ఆయన మనస్సు కల్మషంతో వుండివుండచ్చు అని అనుకోనేందుకు అవకాశం లేదా? ఆయన నిన్ను పెళ్లి చేసుకోవటానికి ముందు ఆమెను ప్రేమించి వుండకూడదా?'— అని అంది.

తలచుకోవడానికే దడదడలాడింది నా మనస్సు.

అయినప్పటికి మనస్సు దీనికే ఒప్పుకోవల్సివచ్చింది. ఆమె పట్టు యీాయనని వదలటం లేదు కాబోలు! మనస్సును కుదుటపరచుకొని నామీద ప్రేమగా వుండటానికి ప్రయత్నించినప్పటికి ఆమె మనస్సు ఆయనని వెనక్కిలాగుతోంది కాబోలు! అదే అయివుంటింది.

'నేను నిన్ను పెళ్ళి చేసుకోవటంలో పొరపాటు జరిగింది. నీకు నేను మహాపాపాన్ని చేశాను.....'

ఆ మాటలకి అర్థం, యిప్పుడు యీ విషయం తెలుసుకొన్నాక కదా కరతలామలకంలా అర్థమవుతోంది!

నేను చదువుకొనే రోజుల్లో ఏకవర్ణ సమాసాలని, ద్వివర్ణ సమాసాలని లెఖ్ఖలు చేయటం జ్ఞాపకం వచ్చింది. ఆ నోటు పుస్తకంలోని లెఖ్ఖలులా, నా మనో పుస్తకంలో నేను అక్కడా యిక్కడా తెలుసుకొన్న సమాసాలతో అర్థం

కాకుండా వున్న ఆయన మనస్సులోని నిగూఢ స్థితికి 'అన్సరు' కనుక్కొన్నాను! నా 'ఆనస్సు' సరియైనదేనా అని సరిచూసుకొన్నట్లు యీ 'అన్సరు'తో పోల్చి చూసుకొన్నాను. ఇంతకన్నా సరైన 'అన్సరు' మరొకటి వుండదు! ఒక టే జవాబు! మా యిద్దరి మధ్య పెరిగిపోయిన యీ రాతిగోడ నిర్మల సౌందర్యాన్ని పునాదిగా నిర్మించుకొనే లేచింది.

నిర్మల! ఏ స్వరూపాన్ని నా ప్రాణ సఖిగా నా మనస్సులో పెట్టుకొన్నానో ఆ స్వరూపమే నా సుఖజీవితంలో పానకంలో పుడకలా అడ్డుకొంది. ఏ ప్రియసఖి మాటలు నాకు సంతోషాన్ని కలిగించి నా బాధనంతా మర్చిపోయేటట్లు చేసి నాలో అమృత వర్షాన్ని కురిపిస్తున్నాయనుకొన్నానో ఆ ప్రియసఖి మాటలే నాకు మితి లేని దుఃఖాన్ని కలిగించి, నన్ను మితమైన వేదనకు గురిచేసి నా జీవితంలోని సుఖాన్నంతా మాయంచేసి, కాలకూటవిషమయమైన శోకసాగరంలోని అలలులా నన్ను మోదుకొంటున్నాయి !

కాని ... నిర్మలదా తప్పు? ఆమె సౌందర్యవతిగా పుట్టడం ఆమె తప్పా? మనస్సు ఆకర్షించగలిగేటట్లు మాట్లాడటం, చనువుగా వుండటం తప్పా? ఆమెను నా విరోధిగా, నా సుఖజీవితానికి శనిదేవతగా తల్చుకోవటానికి నా మనస్సు ఒప్పుకోలేదు. తప్పంతా ఆయనదే! నీడ ఒక పక్కనే వుంది!

అటూ యిటూ దొర్లుతూ, ఆ రాత్రంతా నాకు అసలు నిద్రపట్టలేదు. కళ్లు మూస్తే చాలు...నిర్మల కనిపించింది...ఆయన కనిపించారు. ఇద్దరూ కలసి నా మనస్సులో దాగుడుమూత లాడారు !

'తెల్లవారగానే ముందు నిర్మలను కలుసుకోవాలి. ఏకాంతంగా నా బాధనంతా ఆమెతో చెప్పుకొని అనుతాపం పొందాలి. ఆ మగమనస్సు ఎటువంటిదో ఆమెదగ్గరే తెలుసుకోవాలి' అని చివరకు ఒక నిశ్చయానికి వచ్చాను.

ఏదీకూడా అనుకొన్నట్లు జరగకుండా వుంటున్నప్పుడే పిచ్చి పిచ్చి ఆలోచనలు కలిగించుకొని అహంభావంతో నిలబడే మానవవర్గానికి అనుకొన్నట్లల్లా జరిగేటట్లు భగవంతుడు వరం యిచ్చినట్లయితే ప్రపంచమే తల్లకిందులై పోతుందేమో ? నేను అనుకోనిదే జరిగింది తెల్లవారేసరికి !

'నాన్నగారి ఆరోగ్యం చాలా ప్రమాదంగా వుందని, వెంటనే బయలుదేరి రమ్మని కొవ్వూరు నుంచి నా తమ్ముడు రామం టెలిగ్రాం యిచ్చాడు. టెలిగ్రాం చదివి గజగజవణికిపోయి, ఖంగారు ఖంగారుగా ఆ రోజే నేనూ, అత్తయ్యా కొవ్వూరు బయలుదేరాం.

# 21

రాజవైద్యాన్నే కబళీకరంచేసేసే 'ట్యూబర్క్లోసిస్' వ్యాధి బీదగుమాస్తా అయిన నాన్న ఒంట్లో నాట్యం చేస్తోంది. డాక్టరు ధర్మంగా యిచ్చిన ఫినాయిల్ వాసన లోపల అడుగు పెడుతూంటేనే 'గుప్' మని ముక్కుని బద్దలుచేసింది. అత్తయ్యను చూసి అమ్మ భోరుమని ఏడ్చింది.

'డాక్టరు ఎవరేనా చూస్తున్నారా లేదా ? నాలుగైదు నెల్లకిందట ఏదో దగ్గు, ఆయాసం వస్తోందని మీ అన్నయ్యా

రాశాడంటూ ఆయన అన్నారు. నేను ఏదో సాధారణమే అనుకొన్నాను కాని యింత ముదిరిపోతుం దనుకో లేదు. డాక్టరు యిప్పుడు ఏమంటున్నారు?' అంది అత్తయ్య.

'రోజూ వచ్చి చూసి వెడుతూనేవున్నారు. ఫర్వా లేదు. తగ్గి పోతుందనే అంటున్నారు. మొన్న పరిస్థితి చూసి మేము చాలా ఖంగారు పడ్డాము. ఒకో సమయంలో ఏమిటో ధైర్యంగా మాట్లాడుతున్నారు. ఇంకోసారి ఏమిటేమిటో పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నారు' అంటూ అమ్మ చీర కొంగుతో కళ్లు తుడుచుకొంది.

మెళ్లో తాడు పసుపుకూడా కనిపించకుండా వేళ్లాడే మంగళసూత్రం, వెలిసిపోయి మాసిపోయిన చీర, విచారము, బాధ, శోకంతో నిండిపోయిన ముఖం—ఇదేనా మ్మా అమ్మ! ఆమెను కౌగలించుకొని ఏడవాలని పించింది.

నాన్న ! నాన్నేనా ఆయన ! కాదు ! కొంచెం కొంచెంగా ఆయన శరీరంలో వున్న రక్తమాంసాలను తినేసి ఎముకలను మిగిల్చిన వ్యాధి మాత్రమే మంచంమీద పడుకొని వుంది. లోతుగా పీక్కుపోయిన ఆ రెండుకళ్లు నన్ను చూసి కన్నీళ్లు కార్చాయి. ఆయన ఆకారాన్ని చూసి బెదిరిపోయిన నేను ఆయన వ్యాధిగ్రస్తుడనే సంగతి కూడా మర్చిపోయి 'నాన్నా!' అంటూ ఆ ఎముకలగూడు మీద పడి వెక్కి వెక్కి ఏడ్చేశాను.

'ఏడవకు విమలా ! నాకు తొందరలోనే తగ్గిపోతుం దమ్మా!' అని హీనస్వరంతో పలికిన నాన్న నా తల నిమిరారు.

ఈ సమయంలో డాక్టరు వచ్చారు.

'ఇదేమిటి ? రోగిష్టిమనిషి దగ్గర అందరూ యిల్లా గుంపుగా కూడారు ? విమలా ! ఎప్పుడొచ్చావమ్మా నువ్వు ? చదువుకొన్న దానివి నువ్వుకూడానా యిల్లా అధైర్యపడు తున్నావ్ ? అమ్మకి ధైర్యం చెప్పాలికాని...లే...లే...' అంటూ ప్రియంగా పలకరించారు' డాక్టరు. ఇదివరకు ఆస్ప త్రిలో వున్న డాక్టరే ఆయన.

ధర్మామీటరుతో జ్వరాన్ని చూశారు. తర్వాత ఏదో 'యింజక్షను' యిచ్చారు. ఆయనకూడా బయట గుమ్మం దాకా వచ్చిన నేను 'నాన్నగారికి యిప్పుడు ఎల్లావుంది డాక్టర్ ! తొందరగా తగ్గిపోతుందా ?' అని ఖంగారుగా అడిగాను. దేవుణ్ణి వరం కోరుతూ నిలబడినట్లు ఆయన్ని ఆతృతగా చూస్తూ నిలబడిపోయాను.

'మీ ఆయన వచ్చారా విమలా ?' అని అంటూ వెనక్కి తిరిగారు.

'లేదు డాక్టర్. నిజం చెప్పండి. నాన్నగారికి యిప్పుడు ఏం చెయ్యాలి ?' అన్నాను నేను ఖంగారుగా.

'ఈ వ్యాధి యీ విధంగా చూస్తే తగ్గేది కాదమ్మా ! ముందు యిక్కణ్ణుంచి ఏదైనా ఒక 'శానిటోరియం'కి ఆయన్ని మార్పించాలి. కేవలం మందులతో తగ్గే వ్యాధి కాదమ్మా యిది. ఆరోగ్యకరమైన భోజనం, చల్లని గాలి ముఖ్యంగా వుండాలి. ఇవి సరిగా యిక్కడ లేకపోవటంచేతే యిప్పుడు బాగా ముదిరిపోయింది. కాని, పాపం ! మీ అమ్మగారు ఏం చేస్తుంది విమలా ? వందలకి వందలు ఖర్చుచేయవలసిన

వ్యాధికదా యిది? అందుకనే అన్నీ ఆలోచించే మీా ఆయన వచ్చారా అని అడిగాను' అన్నారు డాక్టరు.

నా ఖంగారు, నాన్నగారి స్థితి అన్నీ ఆయన చేతిలోనే వున్నాయనుకొన్న నా తెలివితక్కువతనం, అన్నింటికి ఆయన యిచ్చిన సమాధానం 'ఫుల్‌స్టాప్' పెట్టేసింది!

'అయితే ఆయన్ని రమ్మని రాయమంటారా డాక్టర్!' అన్నాను.

'అవునమ్మా! అదే మంచిపని' అని ఆయన వెళ్ళిపోయారు.

'డాక్టర్ ఏమన్నారు విమలా? పాపం! చాలా మంచి వారు. ఈ అయిదు నెల్లనుంచి కూడా ఎంతో శ్రద్ధగా వచ్చి చూస్తున్నారు. ఎంత డబ్బిచ్చినా కూడా ఆయన ఋణాన్ని తీర్చుకోలేం. రోజూ ఏదో యింజక్షన్లు యిస్తూనేవున్నారు. ఏవో మందులు మారుస్తూనేవున్నారు. మన శనిరోజులకి ఆయనమాత్రం ఏం చేస్తారు! ఎన్ని మందులిచ్చినా తగ్గటం లేదు యీా వ్యాధి' అంది అమ్మ.

పాపం! యీా వ్యాధిగురించి అమ్మకేం తెలుసు? ఏవో యింజక్షన్‌లు, మందులు యిస్తున్నారని, ఏదో పెద్ద వైద్యమే జరుగుతోందనుకుంటోంది. కొండనే మింగేసిన వాడికి మిరియాల కషాయంలా యీా చికిత్స ఏమాత్రం?

డబ్బు! ఆయన దగ్గరనుంచి ఏ విధమైన ఉపకారమూ కోరకూడదనుకొన్న నేను యిప్పుడు నాన్నని నా వైరాగ్యానికి బలిచేయాలా? ఊళ్లోవాళ్లంతా నేను చాలా మంచి స్థితి పరుల యింట్లో పడ్డానని, యీా సమయంలో నాన్నకి

సహాయం చేస్తానని అందరూ అనుకొంటూ వుండబట్టేకదా డాక్టరు 'మీ ఆయన వచ్చారా?' అని నన్నడిగారు. అయ్యయ్యో! ఇక్కడ నాన్న మంచమెక్కి లేవలేని స్థితిలో పడిపోతే, అక్కడ నేను అయిదు వందలు పెట్టి నెక్లెస్ అని, చీరలని, టీసెట్లని టేబుల్‌క్లాత్‌లని ఆడంబర వస్తువులకోసం ఖర్చుపెట్టేశానే! చేతిలో వున్న డబ్బంతా ఖర్చుపెట్టేసి యిప్పుడు నా గౌరవాన్ని కాపాడుకోవటానికి చేతిలో పూర్తిగా యాభయి రూపాయలు కూడా లేకుండా నిలబడి వున్నానే! ఆయనకి రాసినట్లయితే తగిన సహాయం చెయ్యకుండా వుంటారా? ఈ సంగతి తెలిసి, ఆయన గౌరవాన్ని నిలబెట్టుకోవటంకోస మేనా రాకుండా వుంటారా?

ఒంట్లో శక్తి వున్నంతకాలం నాన్న ఎన్నో శ్రమలకోర్చి జీవనాధారం కోసం పడరానిపాట్లు పడ్డారు. కాని ఆయన పడిపోయేటప్పటికి, యిప్పుడు ఆదుకొనేవాళ్లు లేరు! రామం యీ సంవత్సరమే కదా స్కూల్‌ఫైనల్ పూర్తి చేశాడు? పాపం! చాకలి తెచ్చిన చొక్కా తొడుక్కునేందుకుకూడా వాడు పెట్టిపుట్టలేదు! చిన్నతనంలో కలిగే యిటువంటి స్వల్ప ఆశలని కూడా తనలోనే అణచుకొని, నూతి దగ్గర తన బట్టలు తనే వుతుక్కొంటూంటే చూసేసరికి నా కళ్లమ్మట నీళ్లు తిరిగాయి. అయిదు వందలు ఆడంబరంగా ఖర్చుచేసేస్తూ నాకు వున్న యీ ఒకే ఒక్క తమ్ముడి గురించి కూడా ఆలోచించలేని మూర్ఖురాలినయిపోయానే! ప్రపంచం అంటే ఏమిటో తెలియని ఆ పదహారు సంవత్సరాల పసివాడు యిప్పటి నాన్న వ్యాధికి ఏ విధంగా పరిహారం వెతకగలడు?

తనకి చేతనయినదల్లా ఆస్పత్రినుంచి మందులు తీసుకురావటం, డాక్టరును పిల్చుకు రావటం. నాన్నకి నెలనెలా వచ్చే ఆదాయం క్షీణించిపోవటంవల్ల యిల్లుకూడా బాగుచేయించ లేకపోయారు. ఇంటి మీద యిప్పటికే మూడు వేలు అప్పు! ఇంటి వాసాలన్నీ పుచ్చిపోయాయి. ఎక్కడ చూసినా దుమ్ము! చవుడు పట్టిపోయిన గోడలు! సెలవు లేకపోవటం కారణంగా, నాన్న సగం జీతంమీద సెలవు పుచ్చుకోవటంచేత, ఆ వచ్చే జీతం మందులు కొనటానికే చాలటం లేదంటోంది అమ్మ. అత్తయ్య వచ్చిందికదా - తప్పకుండా యీ సమయంలో అన్నగారికి సహాయం చేస్తుందని నేను నమ్మటానికి వీల్లేకుండా కుటుంబ విషయాలన్నీ దాచిదాచి మాట్లాడింది అమ్మ. అమ్మేమో యీ డాక్టరు చేసే చికిత్సకన్నా ఎక్కువ ఏమీ వుండదని అభిప్రాయపడుతోంది. అత్తయ్య, తనంతట తానే కలుగచేసుకొంటుందా ?

అత్తయ్య అవాళ దొడ్లో నాతో మాట్లాడిన మాటలు నాకున్న కొంచెం నమ్మకాన్నీ తల్లకిందులు చేశాయి.

'చూశావా విమలా! పరిస్థితి యింత ముదిరిపోయే వరకు రాయకూడదని వుండిపోయారే. ఇంకా తల్లి బతికుంది, తోబుట్టువుంది; వాళ్ళకి తెలియపర్చాలనే జ్ఞానం లేక పోయిందే మీ అమ్మకి. రేపు నలుగురూ, నన్ను ఆడిపోసు కోనటానికే కదూ యీ పని? ఇక్కడ తను యిల్లా ముభావంగా వుంటే నా అంతట నేను మీ మావయ్యని వైద్యం చేయించమన ఏ ముఖంపెట్టుకొని అడగను? ఆర్నెల్ల ముందు ఏదో రాశామంటూ గొణుగుతోంది. అప్పుడు ఏదో

దగ్గూ ఆయాసం అంటే అప్పటికే యిప్పటికి తేడా లేదా ?'
అంటూ అమ్మని దెప్పిపొడిచింది అత్తయ్య.

నాన్న ప్రాణంకన్నా నా వీళ్ళ కుటుంబ చచ్చురవులు ?
అమ్మ వెంటనే అత్తయ్యకి యీ సంగతి రాయద్దా ? మనకి
పెద్దయెత్తున సహాయం కావలసివచ్చినపుడు, యిదివరకు
కలతలు మనస్సులో పెట్టుకొని చేతులూ కాళ్ళూ కట్టుకుని
కూర్చుంటే చివరకి బాధపడేవాళ్ళెవరు ? ఒకవేళ ఏ కారణం
చేతనైనా మావయ్య ఏదైనా అన్నప్పటికి తర్వాత ఏదైనా
శానిటోరియంలో చేర్పించకపోయివుంటారా ? అత్తవారింట్లో
అందరితోను, అణకువగా సంచరిస్తూ వాళ్ళ యిష్టాఅయిష్టాల
ప్రకారమే సర్దుకుపోవాలని నాకు బుద్ధిమతి చెప్పిన అమ్మ
యిల్లా ఎందుకు ప్రవర్తించింది ?

అత్తయ్య చేయూత అవసరంలేకుండా, యీ విచిత్ర
అల్లుడిగారి చేయూత లభిస్తుందనే అమ్మ మూర్ఖ అభిప్రాయం
బయటపడింది.

'అతనుకూడా వస్తాడనుకొన్నాను విమలా. ఇక్కడ
సమయానికి ఆదుకొనేవాళ్ళు ఎవళ్ళూ లేరు. ఆ యిద్దరి అల్లుళ్ళ
వల్ల ప్రయోజనమే లేదు. మీ మావయ్య సంగతి ఆలో
చించనే అక్కర్లేదు. ఇంతకాలంనుంచి కూడా నువ్వు బెంగ
పెట్టుకొంటావని మీ కెవ్వరికీ తెలియజెయ్యలేదు. డాక్టరు
దగ్గరనుంచి అందరూ కూడా నీకు తెలియపర్చమని బలవంతం
చేస్తే. చివరకి నీకు టెలిగ్రాం యిప్పించాను. మీ నాన్నగారి
జీతం మందులకే చాలటంలేదు' అంది అమ్మ ఆర్థ్రాతి
రహస్యంగా.

నేను మెల్లిగా 'ఏమ్మా! మీరు అత్తయ్యకు ఉత్తరమే రాయలేదా?' అన్నాను.

అమ్మకి కోపం పొంగిపోయింది.

'రాయకపోవటమేమిటి? ఆరోగ్యం బాగుండలేదు. ఇక్కడ ఆస్పత్రి లేదు. అక్కడికి వచ్చి వైద్యం చేయించుకోవాలని వుంది. దయచేసి సహాయం చెయ్యవలసింది అని సిగ్గువిడిచి నాలుగు ఉత్తరాలు రాశారు మీ నాన్న. ఎక్కడ వచ్చి పడిపోతారో అని ఒక్క ఉత్తరానికి కూడా జవాబివ్వలేదు తను. ఇటువంటి తనని, యిప్పుడు యిక్కడికి ఎవరు రమ్మన్నారు? ఈ ముసలి కన్నీళ్ళు నే నెరగనివేం కావు. భగవంతుడి దయవల్ల నా పసుపూ కుంకం నిలబడాలి' అంటూ అమ్మ కన్నీళ్లు కార్చింది.

నేను ఏది నమ్మను?

అమ్మ నాతో యీ సంగతులు చెప్పటానికి ముందే ఆమెకు తెలియకుండా, యిక్కడి పరిస్థితి అంతా వివరంగా రాస్తూ సహాయం చెయ్యవలసినదని కోరుతూ ఆయనకి ఒక ఉత్తరం రాశాను. ఉత్తరం రాసిన మూడు నాలుగు రోజుల్లో ఆయన వస్తారని ఆశగా ఎదురుచూశాను. ఆయన రాలేదు! కనీసం జవాబుకూడా రాలేదు! డాక్టరు చనువుగా 'మీ ఆయన ఎప్పుడు వస్తారమ్మా!' అనికూడా అడిగారు. నేను ఏం సమాధానం చెప్పను? ఆయన అనుతాపంగా ఒక జవాబేనా రాయలేదు!

'నేను వచ్చి పదిరోజులయిందప్పుడే. అమ్మని రమ్మని చెబుతాను. ధైర్యంగావుండు వదినా!' అంటూ 'అమ్మని ఓదార్చి అత్తయ్య వెళ్ళిపోయింది.

ఈ ఆడజన్మ ఎందుకు ఎత్తానా అని ఎన్నో సార్లు దేవుడి ముందు నేను ఏడ్చాను. ఇప్పుడు నా బాధ ఉచ్ఛస్థితికి వచ్చింది. నేనుమాత్రం మగపిల్లవాడిగాపుట్టివున్నట్లయితే...? నాన్నని యీ గతిలో చూసేదాన్నేనా? ఈ వయస్సుకి కుటుంబాన్నంతటిని భరించగలిగే శక్తి కలిగివుండేది కదా? అసలు యీ కుటుంబం ఎండిన బీడుగా మారిపోవటానికి కారణం నేను ఆడపిల్లగా పుట్టివుండటమేకదా? అయ్యయ్యో! నేను పెళ్ళే చేసుకోకుండా వుండి. వున్నట్లయితే స్వయంగా నా తండ్రిని ఆదరించగలిగే స్థితిలో వుండి వుండేదానిని కదా?

'విమలని కాలేజిలో చేర్పించండి. ఆమెకు యిప్పట్లో పెళ్ళి చెయ్యొద్దు' అన్నవాళ్ళ మాటలు లెఖ్ఖచెయ్యకుండా నీకు పెళ్లిచేశాను' అని ఆనాడు అంత గర్వపడ్డారే నన్ను చూసి! ఆ జీవికి నేను ఎడముఖం పెడముఖంగా వుండటమేనా నేటి నా కృతజ్ఞత? నాకు సుఖమా? ఆయనకు సుఖమా?

వెల్తురు తగలక పోవటం చేత చుట్టలు చుట్టలుగా చుట్టుకు పోయిన మొక్కలా నాలో కొన్ని ఆలోచనలు నన్ను చుట్టుముట్టాయి.

ఇకమీదట మాత్రం? ప్రేమలేని భర్తతో కాపరం చేసేకన్నా, అసలు పెళ్ళే జరగనట్లు కాలం గడపకూడదా? నలుగురు పిల్లలకి సంగీతం చెప్పినా కూడా ఎంతో వుపకారా

గంగా వుంటుందే! కాని నేను అకస్మాత్తుగా అల్లా సంచరిస్తే అమ్మకి, మంచానపడ్డ నాన్నకి కలవరం కలుగుతుందేమో!

అల్లుడు వచ్చి సహాయం చేస్తాడని గర్వంగాను గొప్ప గాను ఆశపడే మనస్తత్వాలు, తమకూతురే కష్టపడి సమయా నికి ఆదుకోవటాన్ని ఎందుకు హీనంగా చూడాలి? పెళ్లి చేసు కొని ఆమె హక్కులన్నింటిని వదులుకోవటం స్త్రీకి గౌర వమా? కాని అదే సమయంలో కొడుకు కష్టపడి సంపాదించి ఆదుకొంటే సంతోషిస్తారు! కొడుకు కూతుళ్లు యిద్దరూ తల్లి తండ్రులకు సమానమేకదా! ఎందుకో మరి యీ వ్యత్యాస మనస్తత్వం! సృష్టి విచిత్రాలలో యిదికూడా ఒకటనేందుకు సందేహం లేదు!

ఆయన దగ్గరనుంచి ఏమీ సహాయంరాలేదు! రోజులు గడిచినకొద్దీ నాన్న వ్యాధి ఎక్కువైంది. కుటుంబంలో కష్టాలు కూడా యింకా ఎక్కువైపోయాయి. ఇంక భర్తదగ్గరకు వెళ్ల కూడదనే వైరాగ్యం కూడా నాకు కలిగింది! ఏకాంతంగా రాత్రి ఆలోచిస్తూకూర్చుండగా అకస్మాత్తుగా నాకో ఆలోచన తట్టింది. నా మెళ్లోవున్న నెక్లస్ యించుమించు మూడువందలు ఖరీదు చేస్తుంది. ఇది అమ్మేస్తే...? ఇది నేను సంపాదించిన ఆస్తికదా?

తెల్లవారగానే అమ్మకి నెక్లస్ యిస్తూ 'అమ్మా దీన్ని రామంచేతనేనా ఎవరిచేతనేనా పంపి అమ్మించేయి. నాన్న జ్వరం తగ్గిపోతే చాలు. తర్వాత చూసుకోవచ్చు' అన్నాను.

నా చేష్ట ఆమెకు విచిత్రంగా తోచింది. 'నీకు మతే మైనా పోయిందా ఏమిటి? అతనికి ఉత్తరంతానినా ఏమైనా

ప్రయోజనం వుంటుంది. గొలుసు అమ్మటమా? ఇటువంటి దుడుకుపనులు యింకెప్పుడూ చేయకు' అని కేక లేసింది అమ్మ.

హు! ఉత్తరం! తన ప్రియమైన అల్లుడు జవాబు కూడా రాయని లక్షణాన్ని, నేను ఆయనతో గడిపే జీవితాన్ని విప్పిచెప్పటానికి యిది సమయమా?

బామ్మ ఏడుస్తూ యింట్లో అడుగుపెట్టింది. కన్నతల్లి పాశం కట్టు తెంచుకు పొరలిపోయింది. 'నే నింకా బతికేవున్నానని మర్చేపోయూరర్రా! మూడు కానులు కార్డుముక్క రాయటానికికూడా మీకు చేతులు రాలేదా!' అంటూ నాన్నదగ్గర కూర్చుని భోరుమంటూ రోదనచేస్తూ దెప్పిపొడిచింది, మమ్మల్ని అదే సమయమన్నట్లు.

నా తండ్రిమీాద ఆమెకున్న అక్కర నా తల్లికి లేదా? ఆమె ఏదో మహా ఉపకారంచేసేదానిలా ఎవరూ కూడా చూడ లేదంటూ నోటికొచ్చినట్లల్లా మాట్లాడేసింది బామ్మ. భర్త విషయంలో భార్యకే మొదటి హక్కు-అనే విషయం వీళ్లు ఎందుకు మర్చిపోతున్నారు?

సాధారణంగా చాలా కుటుంబాలలో భార్య స్థితి అధఃపాతాళంలోనే వుంటోంది. చిన్నపిల్లగా, అనుభవరహితంగా కొత్తగా కాపరానికి వచ్చివున్నట్లయితే, పెద్దవాళ్లు ఆమెను తప్పుదారి పట్టకుండా వుండేటట్లు చూడటం అవసరమే. కాని కోడలని పెద్దవాళ్ళని వున్నట్లయితే ఆమెను అస్తమానూ కోప్పడటమూ, దెప్పిపొడవటమూ పెద్దవాళ్ళకు మంచిదని తమలో తామనుకొని తమ అధికారాన్ని దుష్ప్రయోజనం చేసినట్లయితే ఏం చెయ్యగలం? పెంకితనం, అధిక ప్రసంగం

చేసే నెల్లూరు నెరజాణల లాంటి పిల్లలసంగతి యిక్కడ నేను చెప్పటంలేదు. నా తల్లి నిన్నామొన్నానా కాపరానికి వచ్చింది! బొమ్మ నడత నాలో కోపాన్ని రేకెత్తించింది.

ఏమీా తోచక వీధి గుమ్మంలో నిల్చుని వుండగా పోస్టు బంట్రోతు ఒక ఉత్తరాన్ని యిచ్చి వెళ్ళాడు. ఎడ్రసు దస్తూరి చూసి అది ఆయన దగ్గరనుంచేనని గ్రహించేసుకొన్నాను.

పచ్చని కొబ్బరిబొండామును చూసి బాగా ముదిరి వుంటుందని పగలగొట్టి చూస్తే ఆశ నిరాశకావటం సహజం. నా ఆశని ఆయన ఉత్తరంలో చూసిన ఆశాభంగం అల్లాగే చేసింది. ఢిల్లీ హెడ్డాఫీస్‌నుంచి ఆయన ఉత్తరం రాశారు.

'ప్రియ విమలా!

నేను ప్రస్తుతం యిక్కడే వున్నాను. మీా నాన్నగారి ఆరోగ్యం ఎల్లావుంది? నువ్వు రావటానికి యింకా ఆలస్య మవుతుందా? నాకు యిక్కడ ఆఫీస్ పని చాలా ఎక్కువగా వుంది. జవాబు వ్రాయి — చంద్రం'

ఇదే ఆ ఇంగ్లీషు ఉత్తరం అర్థం! ఈ ఉత్తరం ఆయన రాయలేదని యిక్కడ ఎవరు ఏడ్చారు? ఆయన అక్కడికి వెళ్ళి ఎన్నాళ్ళయిందో వ్రాయలేదు! నా ఉత్తరాన్ని చూశా రనుకోనా లేదు చూడలేదనుకోనా? చూడకపోయినట్లయితే 'నువ్వు అక్కడికి వెళ్లి నెలదాటిందే ఉత్తరం ఎందుకు రాయలేదు? ఆరోగ్యం బాగుండలేదా?' — అని రాసి వుండాలికదా? నా ఉత్తరాన్ని చూసే ఆయనకు సంబంధం లేనట్లు మాట్లాడక ఊరుకొన్నారు!

హు ! ఎంత రాతిగుండె! నే నేమిా సహాయం చేయలే ననే అనుతాపమైన మాటకూడా లేదు ! ఇటువంటి మనిషితో నేను సుశ్రూషచేస్తూ ఎందుకు కాపరం చెయ్యాలి ? భర్త అనే పేరుకు ఆయన చూపించే యీా అద్భుతమైన అనురాగానికి, చిత్రమైన చనువుకి నేనుమాత్రం నిజమైన భార్య నని అనుకొంటూ ఆయనతో ఎందుకు కాపరం చెయ్యాలి? పొంగిపొరలే సముద్రానికి కూడా ఒక హద్దనేది వుంది. సహనంలో సంచరించే భూదేవి కూడా తనలో అణిచి వేసు కొన్న వేడి హద్దుదాటిపోయిందంటే ఒకోసమయంలో బయటికి వదిలి వేస్తుంది. నేను ఆయన భార్యనని అనుకొంటేనే నాకు ఒళ్ళు మండిపోయేస్థితికి నేను వచ్చేశాను !

ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చింపిపారెయ్యాలనిపించింది. చింపిపారేయటం కాదు — పొయ్యిలో పడేసి కాల్చి బూడిదచెయ్యాలని వంటింట్లోకి వెళ్లాను ముక్కలు ముక్కలుగా ఉత్తరాన్ని చింపేస్తూ. వంటింటి గుమ్మం పక్కనే అమ్మ, రామంతో చెబుతున్న మాటలు విని నా చెవులను నేనే నమ్మలేకపోయాను.

'ఏం చేస్తాం రామం? మిా బావ మంచివాడే! మనమ్మాయికే మనమిాద శ్రద్ధలేదు. ఒక ఉత్తరం రాస్తానన్నా చెప్పిందేమో చూశావా? గొప్పగా గొలుసు తీసి యిచ్చి అమ్మమని చెప్పింది. దీన్ని వాళ్ళంతా పువ్వుల్లో పెట్టి పూజించినట్లు చూసుకొంటున్నారు. అది తల్చుకొంటే ఎంత కావాలన్నా అతను పంపకుండా వుంటాడా? ఇంకే అమ్మాయేనా అయినట్లుంటే యిటువంటి పరిస్థితుల్లో పుట్టింటివారిని

ఆదుకోకుండా వుంటుందా? దానికే యిష్టంలేనప్పుడు ఏం చేస్తాం? భగవంతుడే మనకి దిక్కు' అని అమ్మ కంటతడి పెట్టుకొంది.

నా తల్లేనా యిల్లా మాట్లాడుతోంది? తల్లి ప్రేమ కల్గిన మా అమ్మేనా మాట్లాడుతోంది? సిరిసంపదలేనా ఆమె తల్లిప్రేమకు పునాది! ఆనాడే చెప్పానే? నాకు అత్త వారింట్లో సుఖంలేదని ——! నామాట ఎందుకు నమ్మలేదు? కని, పెంచి, పెద్దదానిని చేసిన ఆమె, నేను అబద్ధమాడతానా అని ఎందుకు ఆలోచించలేదు? 'అప్పుడే అమ్మాయి అత్తా రింటికి వెళ్ళనంది. ఇప్పుడు ఎల్లావుందో దాని స్థితి?' అని తల్లి ప్రేమకే స్వాభావసిద్ధమైన సహజ లక్షణం ఆమెకు నామీద ఎందుకు కలగలేదు?

ఎప్పుడో నేలమీదపడ్డ విత్తనం కాలక్రమేణా మొలవ కుండా మట్టిలో మట్టిగా కలసిపోతుంది. కాని మనస్సులోపడ్డ విత్తనం అప్పుడే అణగగొట్టివేయబడినప్పటికి, సరైన జీవ ధాతువుల్లాంటి పరిస్థితులు సంఘటనలు కలసి వచ్చినట్లయితే, వేరూరి లోతుగా నాటుకుపోతుంది. నా తల్లికి నామీద ప్రేమలేదని పసిపిల్లలా ఊహించిన నా ఊహ యిప్పుడు యింకా బలపడింది.

మనస్సు పరిగెత్తి ప్రవహించే నీరులాంటిది. ఇసుక నేలలో ఊరి ప్రవహించే నీరు స్వచ్ఛమైనదిగా వుంటుంది. పాటినేలలో ప్రవహించే నీరు దాని సారాన్ని కలుపుకొని ప్రవహిస్తుంది. సున్నపుగుట్టలమీదుగా అయినట్లయితే దానినీ లాక్కొని ప్రవహిస్తుంది. రంగు, వాసన, గుణము అంటని

కొబ్బరి నీళ్ళలా, అదేవిధంగా మనస్సు ఉండటం చాలా చాలా అరుదు. ఏ పరిస్థితులలో అది ముదురుతుందో ఏ ఏ మనస్తత్వాల మానవుల దగ్గర అది అనుభవాల్ని పొందుతుందో, ఏ ఏ సంఘటనలు అందుకు దోహదమిస్తున్నాయో, వాటి అన్నింటి సారాంశమూ దాని సహజ స్వాభావికగుణాన్ని యింకా చాలా చాలా దూరం తీసుకొని వచ్చేస్తోంది.

'నేను అదృష్టహీనురాలిని; అనురాగం, ఆదరం చూపేవాళ్లు నాకు ఎవరూ లేరు; ఇంక నా జీవితమంతా శూన్యమయిన చీకటిమయమే' అనే నిశ్చిత నమ్మకంలో మునిగిపోయిన నా మనస్సు, 'కన్నతల్లికికూడా నామీద ప్రేమ లేదు; ప్రకృతి సహజ స్వభావానికి విరుద్ధంగా నా విషయంలో ఆమెకూడా ఆమె కర్తవ్యాన్ని మరిచిపోయింది' అని ఏవేవో ఆలోచనలు పెంచుకొని, నా జీవిత ప్రకాశాన్ని యింకా కటిక చీకటిమయం చేసుకొని, అర్థంలేని పద్ధతిలో నన్ను నేనే సముదాయించుకొన్నాను.

ఈ పరిస్థితిలో నా అంతట నేను కలగజేసుకొని నా తండ్రికిగాని, నా కుటుంబానికిగాని సహాయం చేయ నవసరంలేకుండా, ఎవరి దయాదాక్షిణ్యాలు తనకి అక్కర్లేదన్నట్లు నాన్న—జీవితంలో సుఖం అంటే ఏమిటో ఎరగని నాన్న—శాశ్వతంగా కళ్ళుమూశారు! ఆయన ఒక్కరికే నామీద నిజమైన ప్రేమ వుంది. నా సుఖంకోసం శ్రమపడి, పడరానిపాట్లుపడి శ్రద్ధ చూపించిన నాన్న—తంటే పళ్లు పుల్లగావుంటాయన్నట్లు నా దాంపత్యజీవితంలోని నగ్నసత్యం వింటే మనస్సు విరిగి బాధపడే ఒకే ఒక్క జీవి వెళ్ళిపోయింది!

అమ్మ, బామ్మ – అందరూ యిల్లెగిరిపోయేలా భోరున వెక్కి వెక్కి ఏడ్చారు. నాకు ఏడుపు రాలేదు – ఒక్క కన్నీటి చుక్కకూడా రాలేదు! జీవితంలో సంతోషం దుఃఖం మితిమీరి నట్లయితే యించుమించు రెండూ ఒక్కటే. అయినా నేను ఏడవటానికి నాకు యింక ఏముంది?

జీవితంలో కష్టాలలో విడిపోయినవాళ్ళు కూడా చావు నాడు కలిగిన దుఃఖంలో కలవటం సహజం. నాన్న పోయిన తర్వాత, అంతవరకు మా కుటుంబం మంచిచెడ్డలు గురించి ఏమాత్రమూకూడా కలుగచేసుకోని బంధువులు, స్నేహితులు——అంటూ ఎవరెవరో వచ్చి మమ్మల్ని ఓదార్చి వెళ్ళారు. ఈ గుంపులో ఒకరోజు నా భర్తకూడా వచ్చారు. ఆయన్ని చూడ్డంతోటే నాలో భగ భగ మండిపోతూన్న అగ్నిజ్వాల ఒక్కసారిగా బయటకి పొంగు కొచ్చేసింది——

'సమయానికి ఆదుకోనటానికి ఇష్టంలేనివాళ్ళు 'చావు' అనటంతోటే యిక్కడికి ఎవళ్ళు రమన్నారు? మీరు రాలే దని యిక్కడ ఎవళ్ళేడ్చారు?' అంటూ అడిగినదాని కల్లా ఆయనమీద విరుచుకుపడ్డాను.

పదిరోజుల లోపుగా అందరూ రావటం వెళ్ళటంకూడా అయింది. నర్సాపురంనుంచి వచ్చిన మా చిన్న తాతయ్యో రామాన్ని, అమ్మను తనకూడా తీసుకునెళ్ళటానికి నిర్ణయించాడు.

నేను...... నేను?

ఆయనే బయల్దేరేముందు – 'నువ్వు బయలుదేరు తున్నావా?' అన్నారు.

ఆయనతో బయల్దేరనా? వద్దా? 'క్వొశ్చన్‌మార్క్' నా బుర్రని బద్దలుచేసేటట్లు విశ్వరూపం దాల్చినట్లుంది. వెళ్లకుండా వుండిపోయి ఏం చెయ్యను? లేదు వెళ్తే మాత్రం అక్కడ మహాసుఖపడి పోతున్నానా? ఈ ఒంటరి జీవితంలో నైనా కొంచెం విశ్రాంతి దొరుకుతుందేమో!

'నేను యిప్పుడేం రాదల్చుకోలేదు' అని పేలవంగా జవాబిచ్చాను.

'కోప్పడకు విమలా! నీ ఉత్తరం వచ్చిన సమయంలో నేను ఢిల్లీలో వున్నాను. మొన్న యింటికి వచ్చాకనే నేను నీ ఉత్తరం చూశాను. పరిగెత్తుకొని వచ్చాను, కాని చెయ్యి దాటి పోయింది. నేనేం చెయ్యను? పోనీమల్లీ, నా ఉత్తరం చూసిన తర్వాతనేనా, యింకో వుత్తరం రాసివుండకూడదా? చివరికి సమయానికి నేను ఆదుకోలేక పోయానని చెప్పుకోవ టానికే నాకు చాలా బాధగావుంది...నాతో యిప్పుడు రావ టానికి నీకు యిష్టం లేకపోతే నేను అభ్యంతరం చెప్పను. నువ్వు ఎప్పుడు రావాలనుకొంటే, అప్పుడే రా! నీ మనస్సు శాంతించే దారిలో నేను ఎప్పుడూ కూడా అడ్డు నిలబడను విమలా!' అన్నారు నా భర్త.

ఇటువంటి ప్రియమైన మాటలతో నా కళ్లుమూయాలని చూస్తున్నారు! నేను రాకపోయినా ఆయన కేమీ యిబ్బంది లేదనే దాన్ని యింత నాజుగ్గా బయటపెట్టిన ఆ సామర్థ్యానికి నేను ఆశ్చర్యపడనా లేక ఎందుకు రానని చెప్పానని నా బల హీనమైన స్త్రీ బుద్ధికే సిగ్గుపడనా?

'నువ్వు ఆయనతో వెళ్లటం లేదా?' అన్నట్లు అమ్మ మొదలు యింట్లో వాళ్లంతా తలోకరకంగా చూశారునన్ను. 'నేను యిప్పుడు ఆయనతో వెళ్లదల్చుకోలేదని నన్ను నేను పోషించుకో గలనని' చెప్పగలిగే ధైర్యం అమ్మ ముఖంచూసే టప్పటికే నాకు కలుగుతోంది!

రామం రిజల్ట్సు వచ్చిం తర్వాత సర్టిఫికెట్లు పుచ్చుకొని, యిల్లు అమ్మేసి ఊళ్లోవున్న బాకీలు అన్నీ తీర్చుకొని - అన్నీ చక్కబెట్టే రికి నెలరోజులు దాటింది. వాళ్లు ప్రయాణం అవుతున్నారు. వాళ్లతోపాటు అక్కర్లేని అతిథిలా నేను కూడా బయలు దేరనా?

ఆహా! జీవితం ఎంత చిత్రమైనది! కన్నకూతురినే నేను! రామంలాగనే అదే తల్లి తండ్రులకు పుట్టిన్నదానినే! కాని వేరొకరితో జీవిత ఒప్పందం జరిగిపోయిన నాకు ఆ యింట్లో ఏవిధమైన హక్కూ లేదు! అత్తవారింట్లోని గొప్పతనమే పుట్టింటూరింట్లో గౌరవాన్ని కలిగిస్తోంది! లేక పోతే పుట్టిల్లు అని చెప్పుకోనటానికి కూడా నాలుక పెగలదు!

ఇంక వేరే దారిలేదు — అక్కర్లేని బంధువులా వాళ్ళతో వెళ్లేకన్నా నిరాశతో కుమిలిపోయే ఆ జీవితంలోకి వెళ్ళటమే మంచి పని. ఇంక బయల్దేరవల్సిందే — అని చివరకు ఒక నిర్ణయానికి వచ్చాను.

ఈ సమయంలో అక్కడికి నా పేరున ఆకాశవాణి నిలయంనుంచి వచ్చిన ఒక ఉత్తరాన్ని నా భర్త తిప్పి పంపాడు. వచ్చే నెలలో నిర్ణయించబడిన తేదీన ఒక గోష్ఠి గానంలో పాల్గొనవలసిందిగా కోరుతూ నాకు ఆహ్వానం వచ్చింది

ఆకాశవాణి నిలయంనుంచి. నన్ను చుట్టుముట్టిన బాధ లన్నింటిని మూటకట్టి, నేను వస్తున్నట్లుగా నా భర్తకు టెలిగ్రాం యిచ్చాను. ఆ మర్నాడే ఒంటరిగా నేను కలకత్తా మైల్ ఎక్కాను.

## 22

ఆది, అంతం లేని పరమాణువులతో జీవుడు ఐక్యమయ్యే సన్నివేశాలను శృంగార రసంలో వికసింపచేసిన జయదేవ మహాకవి గీత గోవింద కావ్యంలోని కొన్ని భాగాలను ఏర్చి కూర్చి పాటలరూపంలో సమకూర్చాడు మోహనరావు. మొదటి భాగంగా అతను మాధవుని పాత్ర తీసుకొని గీతాలను గానం చేయగా, నేను రాధగా అతనితో కలసిపాడాలి!

ఆకాశవాణి నిలయంనుంచి వచ్చిన యీ ఆహ్వానాన్ని నేను ఒప్పుకొన్నాను! సమయా సందర్భాలు, సరళమైన నా మనస్తత్వం నాతో కూడా నా యిష్టసుఖగా పాల్గొనేందుకు జానకికూడా వుందనే ధైర్యము – అన్నీ నన్ను ఒప్పించగా, నేను వెళ్లి పాడి వచ్చాను!

ఆయన! నన్ను స్టేషన్‌నుంచి యింటికి తీసుకురావటంతో ఆయన విధిని నిర్వర్తించుకొన్నారు. ఎప్పటిలాగనే బయటికి పొద్దున్న తొమ్మిదిగంటలకి వెళ్లిపోవటం, రాత్రి యే పదిగంటలకో రావటం, భోంచెయ్యటం, పేపరు చదువుతూ నిద్రపోవటం! అంతే! నేను పాల్గొన్న గోష్టిగానం గురించి ఒక్క మాటకూడా మాట్లాడలేదు! ఒక్క ప్రశ్నకూడా

వేయలేదు ! ఎవరెవరో నాకంత మాధుర్యాన్ని తెగపొగుడు తున్నారు. కాని, నా మనస్సుకి, శరీరానికి సొంతమయిన ఆయన—నా భర్త—నా గానాన్ని రసించో రసించకుండానో ఎప్పుడూ కూడా ఒక్కమాట కూడా మాట్లాడటం లేదు ! నన్ను ఆయన ఏ విధంగానైనా నిరాకరించవచ్చు. కాని నా సంగీతకళలో కొంచెంకూడా ఆయనకు ఆపేక్ష లేని లోటు నాకు వున్న అన్ని బాధలకన్నా ఎక్కువ బాధను కలగచేస్తోంది. కాని నేను విచారించి ఏమిటి లాభం ?

నా అంతట నేనే ఆయనతో నాగురించిగాని, నా సంగీతాన్ని గురించిగాని, ఏం ? మోహనరావుని గురించికూడా ఎందుకు చెప్పాలి ? ఆయన అంత అలక్ష్యంగా వుంటున్నప్పుడు నేనుకూడా లెక్ఖ చెయ్యనట్లుగానే వుండాలి. ఆయన మాత్రం ఆయన విషయాలను ముఖ్యంగా నాకు చెప్పవలసినవి– ఆయన ఉద్యోగమార్పు మొదలైనవి నాతో చెప్పకుండా దాచివుంచ వచ్చునా ? ఇప్పుడు, ఇది నా సొంతపని అన్నట్లు ఆయన దూరంగా వుంటున్నప్పుడు నా అంతట నేనుగా ఎందుకు చెప్పాలి ?

పైగా మోహనరావు యీ ఊరు వచ్చిన వాడు యిక్కడికి రాకుండా వుంటాడా ? లేక మా బావగారి యింట్లో ఆయన్ని కలుసుకోకుండా వుంటాడా! అన్నీ తెలిసేవుంటాయి. తెలిసే నన్ను పరీక్షించటానికే యీ ఎదురెత్తు అంతా ! నేను మోహనరావుతో, రాధా మాధవుల గీతగోవింద గానంలో పాల్గొన్నానని చంచల, అత్తగారు ఆయనకి ఏమేమి నూరి పోసారో.

నాలో వున్న భయం మెల్లిమెల్లిగా బయటికి వచ్చింది.

'మోహనరావుతో, నువ్వు రాధగా పాడటానికి ఒప్పుకోవటం తప్పు' అని నాలో ఎవరో నన్ను అదిరించారు. ఆ అభిప్రాయాన్ని సమర్థించేటట్లు అంతకుముందు జరిగిన గోష్ఠిగానం చిత్రం నా కళ్ల ముందు నిల్చింది.

తనని కోపంతో వెళ్ళగొట్టిన రాధ దగ్గర తాపంతో బతిమాలే మాధవునిలా మోహనరావు నన్ను చూస్తూ అతను గానం చేసినప్పుడు, ఆ కంఠస్వరంలో వచ్చిన బాధ, కళ్ళల్లో కనిపించిన ఆశ, — అన్నీ ఆ పాటకి ఆవేశాన్ని మాత్రమేనా కలిగించాయి? ఆ గీతానికి తగినపాత్రగా అతను హావ భావ కళవళికలను అతని ముఖంలో ప్రస్ఫుటంచేసి రాగాలాపన చేసినప్పుడు అతనికి ఏమాత్రమూ తీసికట్టు కాకుండా నేనూ పాడాలనే ఆశనుకూడా నాలో కలిగించి వేసిందే! ఆ క్షణంలో నా కళ్ళముందు అతను మాధవుని గాను, నేను రాధగాను నా మనస్సుకు తోచనప్పటికి, నేను విన్న కంఠస్వరం—ఆవేశం పొంగి, పులకరింపజేసే ఆ కంఠ స్వరం—నేను నిజంగానే రాధలా నన్ను నేను మైమరచి పోయి ఆ గీతంలో ఐక్యమయిపోయినట్లే పాడేశాను!

'ఈ పరిస్థితికి నువ్వు అవకాశం యివ్వొచ్చునా?' అని యిప్పుడు నా అంతరాత్మ న్యాయ స్థలంలో దోషిని 'క్రాస్ ఎగ్జామినేషన్' చేసే అడ్వకేట్‌లా ప్రశ్నించింది.

నేను రాధగా పాడటానికి ఒప్పుకోవటం తప్పు! తప్పా? తప్పవుతుందా? కాదు! ఒక్కనాటికీ తప్పుకాదు! అందులోనూ యీ మహత్తరకావ్యం అతి ఉత్తమ భావాలను

కలిగివుంది. విశాల దృక్పథంతో అర్థంచేసుకోవల్సిన కావ్యంకదా యిది! శ్రావ్యమైన సంగీత స్వరంలోను, ఉత్సాహంగా ఉద్రేకం కలిగించే గీతాలలోను ఎవరైనప్పటికి మైమరచిపోవటం సహజం. రసికత్వాన్ని, కళాభిమానాన్ని కలిగిన నేను, మగత చెందటంలో తప్పేమీ లేదే? తన పిలుపుకు ఎదురు పిలుపుగా భక్తిపారవశ్యంలో నన్ను నేను మైమరచి రాధగా భావించుకొంటూ నేను గానం చేసిన సమయంలో కల్మషానికి స్థానం ఎక్కడ వుంది?

ఈ సంగీత కళా సంభాషణ తప్పితే నాకు మోహనరావుతో మరి మాటలేమున్నాయి? నిజం చెప్పాలంటే, అతను నన్ను క్షేమం విచారించటంతప్ప ఎక్కువగా నాతో ఏమీ మాట్లాడలేదు. 'చంద్రాన్ని వచ్చి చూడాలి. ఎప్పుడో ఒకరోజున వస్తాను. నాకు యిక్కడ చాలా పనులున్నాయి యిక్కడ యింకా ఓ నెల వుంటానేమో! అన్నాడు.' అంతే! ఆలోచించి చూచినట్లయితే కలకలమంటూ మాట్లాడే యిది వరకు మోహనరావులాగనే లేడు. ఒకవేళ నేను ఒప్పుకోనని వున్నట్లయితే నా బలహీన మనస్తత్వం పరిహాసానికి దారి తీసేదేమో! కళాపాక్షిపాన్ని నాలో వుంచుకొని ముందడుగు వేయటానికి బెదిరే నా బలహీన మనస్తత్వాన్ని చూసి అతను నన్ను హీనంగా తలచినా తలచవచ్చు!

ఆయన మాత్రం మోహనరావులాంటి వారయితే...! ఆహా! ఆ జీవితం ఎంత ఆనందంగావుంటుంది...! మోహనరావు కంఠస్వరం నన్ను ఉద్రేకపరచి నా మనస్సును స్వాధీనం తప్పించేస్తోందే యిప్పుడు! అదే శక్తి ఆయన కంఠస్వరానికి

వున్నట్లయితే...? ఆ రాధ మాదిరిగా నన్ను నా నాయకుని తో కట్టివేయదా? నామీద ప్రేమ లేకుండా ఆయన మనస్సు వున్నప్పటికి, యిద్దరికి ఒకటిగావుండే ఉద్రేకం, కళాభిమానం మా యిద్దరిని మరేవిధంగానైనా ఒకటిగా కలిపి వేయటానికి హేతువుగా వుండదా?

గంటల తరబడి జాతక సంబంధ సామీప్యాలను చూసి చూసి మరీ పెళ్ళిళ్లు చేసే పెద్దమనుష్యులను చూసి నవ్వాలో ఏడవాలో నాకు అర్థంకా లేదు!

రేడియో ముందు ఏదో ఆలోచిస్తూ కూర్చున్న నన్ను చూసి మంచంమీద పేపరు చదువుతూ పడుకొన్న నా భర్త, పేపరు మడిచివేసి 'విమలా!' అన్నారు.

'ఊఁ' అంటూ వెనక్కి తిరిగి చూశాను.

'మోహనరావు యివాళ మా ఆఫీసుకు వచ్చాడు. అతను రచించిన గీతాలలో నువ్వు పాడ్తొన్నావుట కదూ? నాతో చెప్పనే లేదే? దాని పేరేమిటి? ఏదో సంస్కృత కావ్యం అని అన్నట్టున్నాడు' అంటూ జ్ఞాపకం తెచ్చుకొంటు న్నట్టు తల తడువుకొన్నారు.

ఈ పద్ధతిలో ఆయన, తనకి ఏమీ తెలియదన్నట్లు మాట్లాడటం నన్ను శూలంతో పొడిచినట్లయింది.

'దానికి గీతగోవిందం అని పేరు. మీరు అంతట మీరూ అడగ లేదు. నేనూ శ్రద్ధగా చెప్పనూ లేదు. ఇవాళే అతన్ని చూశారా? మీ అన్నగారింట్లో యింతకు ముందు కలుసుకో లేదా?'

'లేదు విమలా! అతను అక్కడ వుండటం లేదు. ఎక్కడో ఏదో హోటల్లో వున్నానని చెప్పాడు. పాపం! నిర్మల యింత పెంకితనంగా సంచరిస్తుందని ఎవరూ అనుకో లేదు. స్త్రీలకి యింత దుడుకుతనం, పెంకితనం ఉండటం మంచిదికాదు' అన్నారు ఆయన ఎక్కడో ఆరంభించి.

నేను ఆదిరిపడ్డాను. నిర్మలను గురించి నేను యిన్నాళ్లనుంచి ఆలోచించనేలేదు! నాన్న పోయినప్పుడు అక్కడికి ఆయన వచ్చినప్పుడు నిర్మల కాశీ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా వెళ్ళిపోయిందని చెప్పారు. అప్పుడు నేను వున్న పరిస్థితిలో 'ఊహూ' అన్నాను అలక్ష్యంగా — తర్వాత నాకు జ్ఞాపకమే రాలేదు. ఆయన నిర్మలని గురించి ఆలోచిస్తున్నారు కాబోలు! ఆహా! మనస్సులో ఏది తాండవమాడుతుందో అదేకదా బయటికి మాటల్లో ప్రతిబింబిస్తుంది? మోహనరావుతో ఆమె వివాహ మేమయినట్లు? రాధాకృష్ణ యిక్కడికి వచ్చి వుండాలే? అత్తయ్యకూడా అక్కడా యిక్కడా తిరుగుతూండటంవల్ల శ్యామల పెళ్ళికి యింకా ముహూర్తం పెట్టలేదంది — అనే ఆలోచనలు కలిగాయి.

'ఏం? తప్పేముంది? మరి యం. ఏ. ప్యాసయి వంటింట్లో కూర్చుంటుందా? దీన్నే దుడుకుతనం అంటారు కాబోలు!' అన్నాను.

'అదికాదు విమలా! నేను ఆ సంగతి చెప్పలేదు. మోహనరావును పెళ్ళి చేసుకోవటానికి నిర్మల నిరాకరించింది. ఆ మర్నాడే వెళ్ళిపోయిందికూడా. పెద్దవాళ్ళని లెఖ్ఖచేయ

కుండా 'నేనసలు పెళ్ళే చేసుకోను' అంటూ పెంకితనంగా జవాబిచ్చి ఆమె అల్లా యింట్లోనుంచి వెళ్ళిపోకూడదు. చదువునల్ల కొంతమంది స్త్రీలకి అసాధారణమైన పెంకితనం అబ్బుతోంది...' అని యింకా ఏదో చెప్పబోతూ చటుక్కున ఆగిపోయారు.

ఇంట్లోనుంచి నిర్మల వెళ్ళిపోయినందువల్ల ఆయనకి దూరమయిందని ఆయన బాధ కాబోలు ! నేను తపీమని జవాబిచ్చాను.

'ఏం ? ఆమెకు మోహనరావును చేసికోవటం యిష్టం లేకపోవచ్చు. అందుచేతే పెళ్ళే అక్కర్లేదని చెప్పివుండకూడదా? దాన్నే పెంకితనమని దుడుకుతనమని అంటారా ? స్త్రీలకి స్వాతంత్రం — సమానత్వం, చదువుకోవటానికి నిరభ్యంతరం బయటికి వెళ్ళి నలుగురితోను కలసిమెలసి తిరిగి రావటానికి అనుమతి యిచ్చినంత మాత్రం చాలదు. దాంతోపాటు పెళ్ళి విషయంలోకూడా స్వతంత్రం యివ్వాలి. పూర్వకాలం మాదిరిగా అయిదారు సంవత్సరాల వయస్సులోనా పెళ్లిళ్లు జరుగుతున్నాయి యిప్పుడు ? వాళ్ళవాళ్ళకి వయస్సు వచ్చిన తరువాత, వాళ్ళని వాళ్లు పోషించుకోగలిగే శక్తి వచ్చిన తరువాత 'ఇతన్నే నువ్వు పెళ్లిచేసుకోవాలి' అని నిర్బంధంచేయటం చాలా తప్పు' అని జవాబిచ్చిన నన్ను, ఆయన కొంచెం పరిశీలనగా చూసి—'నువ్వు చెప్పినది నిజమే విమలా ?' అని ఎక్కడో చూస్తూ దీర్ఘనిట్టూర్పు విడిచారు.

నిప్పుశెగలా ఆయన దీర్ఘనిట్టూర్పు నన్నమితమైన వేదనకు గురిచేసింది. ఏదో కొంపమునిగిపోయినట్లు యింత

బాధగా యీ దీర్ఘశ్వాస ఎందుకో? నిర్మల తన చెయ్యి జారిపోయిందనా?

'రాధాకృష్ణ ఎప్పుడు వచ్చారు?' అని సంభాషణ మార్చాను.

'మీరు వెళ్ళిన మర్నాడే వచ్చాడు. రెండు రోజులు కాబోలు యిక్కడ వున్నాడు. తర్వాత వెళ్ళిపోయాడు. నేను ఆ మర్నాడే ఢిల్లీ హెడ్డాఫీస్‌కి వెళ్ళవలసి వచ్చింది. శ్యామలను చేసుకోవటానికి అతనికి యిష్టంలేనట్లు కనిపించాడు. రెండు సంవత్సరాలముందు నవ్వుతూ ఎల్లా వున్నాడో యిప్పుడూ అల్లాగే వున్నాడు. విదేశ నాగరికం అతనిలో ఏమీ మార్పు తీసుకురాలేదు. మొట్టమొదటగా అతను రావటంతోటే—'విమల చాలా పెద్ద గానసరస్వతి అయిందట కదా? అని నీ గురించే నన్నడిగాడు' అన్నారు ఆయన.

'శ్యామలను అతను చేసుకోనని మీతో ఏమైనా చెప్పాడా?'

'లేదు. అతని మాటలధోరణిలో నాకు అల్లాతోచింది.' అని యింక యివాల్టికి యీ మాటలు చాలు—అన్నట్లు వెనక్కి తిరిగి పడుకొన్నారు! 'దీపం ఆర్పివేస్తావా?' అనే ప్రశ్న కూడా రావటంతోటే ఆయన యింకేమి మాట్లాడదల్చుకోలేదనేది స్థిరపడింది.

జ్వాల ఆరిపోవటంతోనే పొగ కమ్ముకువచ్చినట్లు నా మనస్సులో పాత సందేహాలన్నీ పొగలా నన్ను చుట్టుముట్టాయి.

నిర్మల, రాధాకృష్ణని ప్రేమిస్తోందనే నిజాన్ని బయట పెట్టటానికే మోహనరావుని చేసుకోవటానికి ఆమెకు యిష్టం లేదేమో అని సూచన చేశాను. నిర్మల నాతో చాలా చను వుగా వుంటుందని, ప్రాణస్నేహితులలా మసిలినవాళ్లమని ఆయనకు తెలియనిదికాదే! నేను చెప్పిన సూచన విని 'అల్లాగా? అయితే నిర్మల అభిప్రాయం నీకు తెలుసునా?' అని ఆయన ఎందుకు అడగలేదు? అల్లా ఆయన అడుగుతారనే కదా నేను చూశాను? ఆయనేమో అన్నింటిని కట్టిపెట్టేసేటట్లు 'నువ్వు చెప్పింది నిజమే' అని దీర్ఘ నిట్టూర్పు విడిచి మాటలను కత్తి రించేశారే! రాధాకృష్ణ శ్యామలను చేసికోనేటట్లు లేడని ఒక్క రోజులోనే గ్రహించిన మనిషికి నిర్మల నడత ఎందుకు అర్థంకాలేదో? ఆమె విషయంలో ఆయన మనస్సు స్వాధీనం తప్పిపోతోందనే దానికి యింతకన్నా ఏమైనా ఋజువు కావాలా?

తలుపు సందులోనుంచి కొంచెం వెలుతురు కనిపించినా చాలు — లోపల వున్నవి ఒక్కొక్కటిగా చాలా ఖచ్చి తంగా కనిపిస్తాయి. నిర్మల ఆయన్ని ఎప్పుడూకూడా ఆ దృష్టితో చూసి వుండదు. కాని ఆయన విషయం ఆమెకు యిదివరకే పూర్తిగా తెలిసి వుండటంవల్లనే ఆమె నామీద అంతులేని అనుతాపంతో అనురాగం చూపింది. చిట్టచివరి సారిగా ఆమె నన్ను కలుసుకొని మాట్లాడినప్పుడు నామీద కనిపింపచేసిన ఆమె శ్రద్ధలోని మర్మం నాకు యిప్పుడు కరతలా మలకంలా అర్థమయింది!

# 23

నిర్మల దగ్గరనుంచి నాకు అవాళ ఉత్తరం వచ్చింది. నాన్న పోయినందుకు సంతాపాన్ని తెలియజేస్తూ పాతధోరణి లోనే రాధాకృష్ణ ఆమెను మోసం చేసినందుకు మగవాళ్ళనే ఛీకరించుకొంటూ ఒక పెద్ద అధ్యాయమే రాసింది. చిట్టచివరి రోజువరకు అతను ఆమెను కలుసుకొంటాడని ఎంతో ఆశగా ఎదురు చూసిందిట! కాని అతను రాలేదుట! 'ఆయనంతట ఆయన తన వివాహపత్రిక పంపకపోయినప్పటికి నువ్వైనా ఒకటి పంపు' అని రాసింది.

ఎందుకో అతనిమీద ఆమెకు అంత కోపం?

'...నేను ధైర్యంగా మోహనరావుని నిరాకరించాను విమలా! స్త్రీ అయిన నాకున్న ధైర్యంకూడా లేని పిరికి ఆయన! నాలో ఊరిపోయిన ప్రేమకన్నా ఆయన ప్రేమ చాలా సూక్ష్మమైనదని నాకు యిప్పుడు అర్థమయింది! ఆయన నాకు తగినవారు కాదు! ఆయనను నేను వివాహం చేసికొన్నప్పటికి, తర్వాత మా యిద్దరిమధ్య అనేక మనః స్పర్థలకి తావుంటుంది. ఈ మగవాళ్ళను నమ్మటంకన్నా మహాపరాధం మరొకటిలేదు! నా మనస్సు విరిగిపోయింది విమలా! ఇంక నా జీవితంలో సుఖం అనేదిలేదు! నా జీవిత మంతా కన్యగానే జీవించటానికి నేను నిశ్చయించు కొన్నాను!...' అని నిర్మల అన్నదికూడా నిజమేగా?

రాధాకృష్ణ యిల్లా ఎందుకు మారిపోయాడు? నాకు అతనిమీద చాలా కోపం వచ్చింది.

చేతిలో ఉత్తరంతో ఆలోచిస్తూ కూర్చుండిపోయిన నాకు, గడియారం రెండు గంటలు కొట్టటంతో టిఫెన్ చెయ్యాలని జ్ఞాపకం వచ్చింది. అవాళ ఆదివారం. గదిలో ఏవో కాగితాలు చూసుకొంటూ కూర్చున్న నా భర్త మధ్యాహ్నం మూడు గంటలకి కాఫీ తాగి ఆఫీసుకు వెళ్తానన్నారు. ఆ సంగతే మర్చిపోయాను నేను. గబగబా కొంచెం రవ్వ తిరగవేసి ఉప్మాగా మార్చి, కాఫీతో సహితంగా ఆయన బల్లమీద పెట్టాను. ఇంతలో పనిమనిషి రావటంతో నేను దొడ్డివైపు వెళ్ళాను.

సాధారణంగా ఆయన బయటకు వెళ్ళేటప్పుడు చెప్పి వెళ్ళే అలవాటు ఆయనకు లేదు. నేను యింట్లో పనంతా అయ్యాక కళామందిరానికి వెళ్ళి జానకిని కలుసుకొని కొంచెం సేపు కాలక్షేపణ చేద్దామనుకొన్నాను. నేను దొడ్లో పనంతా పూర్తి చేసుకొని లోపలకు వచ్చేటప్పటికి దగ్గరగా వేసివున్న గది తలుపు ఆయన బయటికి వెళ్ళి పోయారన్నట్లు తెలియపర్చింది. తలుపు గొళ్ళెంవేశాను. బయలు దేరదామని వీధి గుమ్మందాకా వచ్చిన నాకు ఎందుకోమనస్సు మారిపోయింది. మనస్సే కోతి కదా? రెండు పాటలు పాడదామని ముందు గదిలో కూర్చున్నాను. చేతివేళ్లు వీణాతంతులను మీటాయే కాని మనస్సు అందులో లయించేటట్లు లేదు. ఆయనకి, నేను మోహనరావుతో ఏ ఏ భావాలను ప్రస్ఫుటంచేసే భాగాలను పాడానో తెలిస్తే...?

తెలిస్తే ఏం? ఆయన మహావిశాల హృదయం కలిగిన వారుకదా? భార్యను శంకించేగుణమే ఆయనకు లేదే! అయి

వచ్చేటికి నేను చెప్పకుండా ఉండటం ఆయన్ని మోసం చేసి నట్లవుతుందా ?

టక్ టక్ మనే జోళ్ళశబ్దం వినిపించి అదిరిపడ్డాను. వెనక్కి తిరిగిచూశాను. బయటికి వెళ్ళేటప్పుడు ఆయన బయట తలుపు తాళంవేసి వెళ్తారు. నేను లోపల ఏదో పనిలోవుండి చూడకపోవచ్చని తాళంవేస్తారు. నా దగ్గర ఒక తాళంచెవి, ఆయన దగ్గర ఒక తాళంచెవి వున్నాయి. ఇవాళ మర్చిపోయారా ? లేదు ఆయనే వస్తున్నారా ? ఆయన నడిచినపుడు జోళ్ళు చప్పుడుకూడా అవవే ? నేను లేవకుండా యిల్లా ఆలోచిస్తూండగానే మోహనరావు నా కళ్ళముందు ప్రత్యక్షమయ్యాడు !

పేంట్ జేబుల్లో చేతులు పెట్టుకొని చిరునవ్వుతో లోపల అడుగుపెట్టిన మోహనరావు—'తలుపు తీసివుంది - నువ్వేమో పరధ్యాహ్నంగా యీ గదిలో కూర్చున్నావు. ఎవళ్ళైనావచ్చి దోచుకొన్నాకూడా తెలిసేటట్లు లేదే ! చంద్రం లేడా ?' అన్నాడు.

నేను తెల్లబోయాను.

'ఆయన ఓ గంటముందు ఆఫీసుకు వెళ్ళాలంటూ వెళ్ళారు. సాధారణంగా తాళంవేసి వెళ్తారే ! యివాళ మర్చి పోయారు కాబోలు ! మీరు వస్తారని తెలిస్తే యింట్లోనే వుండి వుండే వారు' అని జవాబిస్తూనే లేచి నిలబడ్డాను.

కుర్చీలో కూర్చున్న అతను - 'నేను వస్తానని తెలిస్తేనే యింట్లోవుంటాడు కాబోలు! ఇవాళ ఆదివారం కదా. ఇంకా కొంచెం సేపయిందంటే యిద్దరూ కలసి ఎక్కడికేనా విహారా

నికి వెళ్తారేమో అనుకొంటూ పెందరాళే వచ్చాను. అయితే, ఎప్పుడొస్తాడు ?' అంటూ నవ్వాడు.

నాగుండె దడదడ కొట్టుకొంది. మాటలధోరణి మారింది. ఒంటరిగా వచ్చాడు. ఇటువంటి ప్రశ్నలోనుంచి యింకా ఏమేమి అడుగుతాడో ? ఎందుకో మోహనరావును చూస్తే నాలో అర్థంలేని భయం కలుగుతోంది.

'ఒకోసారి ఆయనకు ఆదివారంనాడుకూడా పనివుంటూ వుంటుంది. బహుశా రాత్రి తొమ్మిది గంటలకి వస్తారేమో!' అన్నాను. ఇల్లా చెబితే అతను వెంటనే వెళ్లిపోతాడను కొన్నాను. కాని అతను వెళ్ల లేదు !

'ఉమ్...ఇంకా యిదివరకు లాగనే వున్నాడన్న మాట లేచిపోయూవేం విమలా ? నేను వచ్చాననా ? రాబోయే కార్యక్రమంలోని గీతాలను సాధకం చేస్తున్నావా ?' అన్నాడు.

'లేదు. వీణాతంతులు తెగిపోయాయి ?'

'ఫర్వాలేదు. అందుకు నేను వచ్చినందుకు సరి పోయింది, ఆ గీతాల్ని మరొకసారి పాడు విమలా !'

'అవి సరిగ్గానే వచ్చాయి. ఇక్కడకు వచ్చిన మీకు అనవసరంగా ఎందుకు శ్రమ ?' అని తప్పించుకోవాలని చూశాను.

'శ్రమా ? నీ గొంతుక వింటేనే శ్రమ పారిపోతుందే!' అంటూ నవ్వాడు.

అయ్యయ్యో! ఇల్లాపరాయి పురుషుడు పొగడటానికా నాకు సర్వేశ్వరుడు శ్రావ్యమైన కంఠస్వరాన్ని యిచ్చాడు ?

'మీరు మితిమీరి పొగుడుతున్నారు. మిమ్మల్ని చూస్తూంటే నాకు చాలాకోపం కలుగుతోంది' అన్నాను కొంచెం కటువుగా.

'నిజమైన కళాకారులకి పొగడ్త నచ్చదు. కాని నేను ఏంచెయ్యను విమలా! వాళ్ళను చూసేకదా ఆ మాటలు వస్తున్నాయి? నా స్నేహితులొకరు నీ పాటలను కొన్ని రికార్డు చేయించాలని ఆశపడుతున్నారు. నువ్వు ఒప్పు కొంటావో లేదోనని సందేహంతో సమాధానమిచ్చాను. ఏమీ లేని వాళ్ళంతా 'గాన సరస్వతి', 'సంగీత విశారద', 'గాన కోకిల' అంటూ ఏవేవో బిరుదులు తగిలించుకొంటూ ప్రకాశిస్తున్న యీ రోజుల్లో, ఉత్తమకళా పొక్కిపాన్ని కలిగి, వీణా పుస్తకపాణి అయిన ఆ వాణితో సమానమైన నువ్వు యింకా చీకటి గుహలోనే కూర్చుంటాననుటున్నావే విమలా! ఇదే నీలో నాకు నచ్చలేదు' అన్నాడు నవ్వుతూ మోహన రావు.

వశీకరణమంత్రం, వ్యామోహమందు అంటూ ఏమేమో చెప్పే మాటలలో నాకు నమ్మకంలేదు. కాని యీ పొగడ్త మాటలు ఒకవేళ వశీకరణ మంత్రంలా పనిచేస్తాయేమో అని నాకు సందేహం కలిగింది. ఎంత గట్టిగా మనస్సును కట్టివేసు కొన్నప్పటికి వాటి శక్తికి కట్లు జారిపోతున్నాయి! కఠినంగా యేమీ మాట్లాడలేక నేను అల్లాగే నిలబడిపోయాను.

'విమలా! అవాళ నువ్వు ఆకాశవాణి నిలయంలో, మాధవుణ్ణి తీసుకురావలసినదిగా కోరుతూ చెలితో విరహ వేదన భరించలేనట్లు రాగాలాపన చేశావే, అందులో నేను

నిజంగా నన్ను నే మైమరచాను. కవియొక్క గొప్పతనాన్ని దాన్ని రాగాలాపన చెయ్యటంలోనే వుందనే దాన్ని నిదర్శనంగా చూపించేశావు' అని అతను అన్నప్పుడు నా మనస్సు గుడ్డిదై పోయింది.

పొగడ్త అగ్నిజ్వాల లాంటిది. దాని దగ్గరకు వెళ్లకుండా వున్నంతవరకే దాని కాంతి చాలా అందంగా వుంటుంది. కాని శలభం అదేదో పురుగనుకొని దాన్ని ముట్టుకోవటానికి వెళ్తుంది కదా ?

ఏం మాట్లాడుతున్నానో కూడా తెలియకుండా —
'నన్ను అంటున్నారే! అవాళ మీరుకూడా గీతంలో లయించిపోయి పాడారు. నన్ను మాత్రమే వర్ణించి పొగడకండి. ఇంకా యిల్లా మాట్లాడారంటే అదంతా మీ పైపే తిప్పేస్తాను' అని మెల్లిగా నవ్వాను.

'నిజంగానా విమలా ? నీ నోటంట వచ్చిన యీ మాటలు నాకు ఎంత సంతోషంగా వున్నాయో తెలుసునా ? నిజం చెప్పాలంటే యిప్పుడు నాకు తన్మయత్వం కలుగుతోంది. నా కళ్ళముందు నువ్వు రాధగా నాకు తెలియకుండానే నాలో 'భావం' కలుగుతోంది!' అని నా కళ్ళల్లోకి నిశ్చలంగా చూశాడు మోహనరావు.

జ్వాల అంటుకుపోయింది! చుర్రుమంటూ నిప్పు వాత వేసింది. అదిరిపోయి గజగజ వణికిపోయాను. బయట ఏదో అడుగుల చప్పుడయింది. నా భ్రమేమో ? లేక ఆయన వచ్చారా ? వస్తే ఏం ? కొయ్యబొమ్మలా నిలబడిపోయిన నాకు ఏం చెయ్యాలో తోచలేదు!

'ఏం యిల్లా వణికిపోతున్నావ్ విమలా? నా మనస్సంతా నువ్వు ఆకర్షించివేశావు! నా గృహలక్ష్మికి ఏ ఏ అంశాలు వుండాలని నేను కలలు కన్నానో అవి అన్నీ కూడా నీలో వున్నాయి. ముసుగు వేసుకొన్న వాళ్ళదగ్గిరే కళ పెరుగుతుంది. దాని సౌందర్యాన్ని — ఏం? నీ సౌందర్యాన్ని గ్రహించలేనివాడి చేతిలో నువ్వు వాడిపోవటం తల్చుకొంటే నాకు అపరిమితమైన వేదన కలుగుతోంది విమలా? భార్యాభర్తలకి వారి యిష్టా అయిష్టాలలోను, గుణాలలోనూ ఒకే అభిప్రాయం వుండకపోతే వాళ్ళలో ఆత్మీయత అన్యోన్యత ఎల్లా వుంటాయి? చంద్రానికి నువ్వు తగిన భార్యవు కావు! కళాకల్పవల్లియైన తన భార్య కళాసౌందర్యాన్ని కూడా గ్రహించలేని జడుడు చంద్రం! తను యింత హీనంగా వుండగలుగుతాడని నేను ఎప్పుడూ అనుకోలేదు!' అన్నాడు మోహనరావు.

నా మనస్సుకి తోచినట్లుగానే ఇతనికికూడా తోచిందే! నేను ఆయనకి తగిన భార్యను కాదా? నాకు నోటమ్మట మాట రావటం లేదు!

'అనవసరంగా చుట్టుదారి ఎందుకు విమలా? నువ్వు నా మనస్సులో నా యిష్టదైవంలా రూపొందిపోయావు! నిర్మల నన్ను చేసుకోవటానికి నిరాకరించింది. నాకుకూడా ఆమెను చేసుకోవటం యిష్టంలేదు. అందుకు యిందాకనే చెప్పానే—భార్యాభర్తలు వారి వారి యిష్టాఅయిష్టాలలో ఒకే మనోభిప్రాయం కలిగివుండాలని' అన్నాడు మోహనరావు.

నేను యింక యీ మాటలు సహించలేకపోయాను. ఈసారి ఎక్కణ్ణుంచో వచ్చి మొండిధైర్యం నన్నావహించింది.

'మోహన్ ! మీరు ఏమిటేమిటో మాట్లాడేస్తున్నారు. కళాభిమానంకొద్దీ కలిగిన పరిచయాన్నుంచి తప్పుదారికి వెళ్లిపోయారు. నేను యింకొకరి భార్యననే సంగతి మర్చిపోయి, యీ విధంగా నాతో మాట్లాడటానికి, అందుకు సందర్భాలను ఉపయోగించుకొంటున్నారని నేను యిన్నాళ్లనుంచి తెలుసుకోలేకపోయాను. మీ కళా, గిళా అంతా వేషమేనా ?' అని కోపంగా కేకలేశాను.

అతను వికటంగా మెల్లిగా నవ్వాడు.

'కోప్పడకు విమలా ! నేను నిన్ను హీనంగా ఎంచి నీతో మాట్లాడటంలేదు. వెలకట్టలేని రత్నాన్ని ఒకదానిని నేను పొందాలని కలకన్నాను. దాని సౌందర్యాన్ని గ్రహించకుండా సాధారణ రాయిగా చూసే ఒకని దగ్గర అది ప్రకాశించకుండా వున్నప్పుడు నేను దానిని పొందాలని ఆశపడటం సహజమే కదా ? నువ్వే నిజం చెప్పు విమలా ! చంద్రం నిన్ను ప్రేమగా చూస్తున్నాడా ? స్త్రీత్వాన్ని గ్రహించి గౌరవించే ఉత్తమగుణం తనకి వున్నట్లయితే, నీచేత జ్ఞానశేఖరానికి, చంచలకి బానిసలా చాకిరీ చేయిస్తాడా ? అవాళ తను నీతో మాట్లాడిన మాటలు నేను వినలేదా ? నువ్వు నా దగ్గర ఏదీ దాచి ప్రయోజనంలేదు విమలా !' అన్నాడు మోహనరావు.

'మీరు చెప్పింది నిజమే ! ఆయనకు నామీద ప్రేమ లేదు. శాంతి అనేదే లేని దుఃఖసాగరంలో దొర్లిపోతున్నాను' అనే మాటలు నాకు తెలియకుండా బయటకు వచ్చివుండేవి.

ఒక్క క్షణంలో పెద్ద తప్పుని, మన్నించరాని మహాపరాధాన్ని చేసేసుండేదానిని. కాని, మనోగుణ్ణం వేసే అంకెలను - దాని కళ్లాన్ని గట్టిగా లాగిపట్టుకొని ఆపేశాను. ఈ మాటలని నేను యింక భరించలేకపోయాను. చిన్నపిల్లలా చేతులతో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడ్చాను. నా స్థితి అతనికి యింకా సాధకమయింది.

'ఏమిటి విమలాయిది? పాపం! నీ పరిస్థితి ఎల్లావుందో యిప్పుడుకదా నాకు అర్థమవుతోంది. ఏడవకు విమలా! ఇదో చూడు! నిన్ను నేను మనః పూర్వకంగా ప్రేమిస్తున్నాను! ఎప్పుడూకూడా నీకు మంచిచేయటానికి తయారుగా నే వుంటాను. మనస్సు అనుభవం పొందటానికి ముందే, మూఢ నమ్మకాలతో కూడిన శాస్త్రిలు, ఆలోచించలేని ఆప్తులు, అందుకు తగినట్లు పరిణామం చెందని పల్లెటూరి పరిస్థితులు నిన్ను పెళ్లిపీటలమీద కూర్చోబెడితే అందుకు నువ్వు బాధ్యురాలివా! నువ్వే ఆలోచించి చూడు విమలా! నువ్వు చంద్రాన్ని పెళ్లి చేసుకోబోయే సమయంలో యిది మంచి, యిది చెడు అని నిర్ణయించగలిగే శక్తి నీకువుందా? సహజంగా యిద్దరూ ప్రేమించుకొని వున్నవాళ్లయితే నీ జీవితం యిల్లా వుంటుందా?' అన్నాడు మోహనరావు.

అవును. అప్పుడు నాకు ఏమీ తెలియదు. ఇతను నీ భర్త. ఇతనితోనే నీ జీవితాన్ని గడపాలి—అని పెద్దవాళ్లు నన్ను ఆయనతో కట్టివేశారు. వంశపారంపర్యంగా వచ్చిన ఆచార సాంప్రదాయం, పునీత ఒప్పందం నాలో 'ఆయనే నా ప్రత్యక్ష దైవం - ఆయన్నే నేను పూజించాలి' అనే

భావన కలగజేసింది. కాని ప్రేమ, అనురాగం సహజంగా నాకు ఆయన మీద కలిగాయా? ఆయన నిగూఢ మనస్సుని ఆలోచించి ఆలోచించి అలిసి పోయిన నాకు, యిప్పుడు నా మనస్సెటువంటిదో ఆలోచించ మన్నట్లు చేశాడు మోహనరావు!

'ఆలోచిస్తున్నావా విమలా?' అని అతను యింకా అక్కడే వున్నానని జ్ఞాపకం చేశాడు మోహనరావు.

'ఆలొచన ఏమిటి? మీరు యిల్లామాట్లాడటం చాలా తప్పు. ఆయన యిప్పుడు వచ్చినట్లయితే ఏమనుకోరు? ఈ విధంగా మీరు మాట్లాడదల్చుకొంటే యింక యిక్కడికి రానవసరం లేదు. వెళ్ళిపొండి బయటికి మర్యాదగా' అని కేక లేశాను కోపంగా.

'అనవసరంగా భయపడుతున్నావ్ విమలా! తనకి ఒకనీతి, నీకు ఒకనీతివుందా? నిన్ను అక్కడ సిమ్లాలో వదలి పెట్టి, యిక్కడ నిర్మల వంటరిగా వుండనేకదా తను యిక్కడికి పరిగెత్తుకొచ్చాడు! అది మంచిపనేనా? నిన్ను నాభార్యగా చేసికోవటానికి ఏ పరిస్థితిలో నైనాసరే సిద్ధంగానే వుంటాను! నీ యిష్టాన్నిబట్టి వుంది' అన్నాడు మోహనరావు.

భూమి బ్రద్దలై నన్ను మింగివేయకూడదా? లేకపోతే యింటికప్పు కూలి నామీద పడకూడదా?

'మీరు యిక్కణ్ణుంచి వెళ్ళరా?' గట్టిగా అరిచాను.

'వెళ్ళిపోతాను విమలా! వెళ్తాను. నేను చెప్పిందాంట్లో తప్పేమైనా వుందా అని ఆలోచించు చూడు' అని బతిమాలుతున్నట్లు చూశాడు మోహనరావు.

'పోతారా లేదా ?' – ఒక అడుగు ముందుకు వేస్తూ యీ సారి యింకా గట్టిగా అరిచాను. ఆ మరుక్షణమే టక్ టక్ మనే బూట్ల శబ్దమూ, వీధిగుమ్మం తలుపు తెరచిన చప్పుడు వినిపించి మోహనరావు వెళ్ళిపోయాడని తెలియ జేశాయి.

నెమ్మదిగా నిలా గదిని కలయజూశాను. బల్లమీద వున్న నిర్మల ఉత్తరం నన్ను తల్లి లేని పిల్లలా పరితాపంగా చూసింది. బల్లమీదపడి వెక్కి వెక్కి ఏడ్చాను. బల్లంతా కన్నీళ్ళతో తడిసిపోయింది. అయిదారు నిముషాలయి వుంటుంది. మెల్లిగా వచ్చే అడుగుల చప్పుడు వినిపించింది. ఆయన వచ్చారేమో నని తలయెత్తి చూశాను.

రాధాకృష్ణ !

రాధాకృష్ణ ఎప్పుడు వచ్చాడో తెలియదు. పరి తాపంగా నన్నుచూస్తూ నిలబడిపోయాడు !

# 24

'విమలా' అని మెల్లిగా పిలిచాడు రాధాకృష్ణ.

కళ్ళనుండి కారే కన్నీటిని బలవంతంగా ఆపుచేసు కొంటూ అతనిని చూశాను. 'ఎప్పుడు వచ్చారు ?' అని అడగాలనుకొన్నాను కాని ఆ మాటలు లోపలే వుండి పోయాయి.

అదే జాలి గొంతుకతో 'నేను వచ్చి చాలా సేపయింది విమలా ! మోహనరావు యిక్కడ వుండగానే

వచ్చిన నేను, అదిరిపోయి బయటే నిల్చున్నాను. నువ్వు గట్టిగా అరిచినప్పుడు నేను లోపలికి వచ్చివుండేవాడిని. కాని ఆ మరుక్షణమే అతను బయటికి వచ్చాడు. ప్రక్కనే వున్న నన్ను చూడకుండానే తలవంచుకొని వెళ్లిపోయాడు...ఊ... చంద్రశేఖరం ఎక్కడికి వెళ్ళారు?' అని అడిగాడు రాధాకృష్ణ.

ఈ మాటలు విని నేను అదిరిపడ్డాను. అప్పుడే ఏదో అడుగుల చప్పుడు వినిపించింది. ఆవేశంలో ఏదో మాట్లాడేస్తున్న మోహానరావు గమనించకపోయినప్పటికి నేనుకూడా భ్రమ అని వూరుకొన్నానే! అతని ప్రశ్నకి నేను బదులు చెప్పలేకపోయాను. వెఱ్ఱిదానిలా వెఱ్ఱిచూపు చూశాను. కళ్ళ నుండి కారిన కన్నీరు ఆరి చర్మం బిగుసుకుపోయింది. మాటలు, ఆలోచనాశక్తి అన్నీ నాలో స్తంభించిపోయాయి. 'విమలా!' అన్నాడు మళ్లీ. మెల్లిగా అతను అన్నమాట నా చెవుల్లో పడింది. నేను మళ్ళీ తలఎత్తి అతనిని చూశాను. అతని ముఖ విలాసం నన్ను గజగజలాడించలేదు. మోహానరావు లాంటి వాడు కాదు అతను. నా హృదయంలోనుంచి ఆవేశం పొంగి పోయి జలజలమని కన్నీళ్ళు రాలగా మొట్టమొదటసారిగా అతనిని 'అన్నయ్యా' అంటూ వెక్కి వెక్కి ఏడ్చాను.

అతను నన్నుచూసి బెదిరిపోయాడు. 'ఏమిటమ్మా విమలా! నాకు ఏమీ అర్థం కావటంలేదే! మోహానరావు నడతను గురించి బాధపడుతున్నావా? ఆదివారంనాడు కూడానా చంద్రశేఖరం ఆఫీసుకు వెళ్తున్నారు? ఆయన నీమీద ప్రేమగా వుండటంలేదా విమలా? ఇదివరలోనే నేను అనుమానించి అడిగితే కప్పిపుచ్చావేం? ఇప్పుడు ఎంతో

సంతోషంగా వుండివుంటావని వచ్చిన నాకు, తారుమారుగా, ఒక్కసారిగా నేను భ్రమించిపోయేటట్లుందే పరిస్థితి? నాతో చెప్పవా విమలా?' అని ప్రశ్నమీద ప్రశ్న వేశాడు నా ప్రక్కనే వచ్చి కూర్చుని.

ఆధరవు లేని అనాధశిశువు అభిమానంగా చేరదీసిన వారిని అంటుకుపోయినట్లు, వెక్కివెక్కి ఏడుస్తూ 'నాకు తండ్రి లేరు. తల్లి, మిగిలినవాళ్ళు అందరూ దూరమయారు. అవాళే మీరు అన్నారు. నాకు సోదరులు మీరే. ఈ సమయంలో నన్ను కరుణించి నాకు దారి చూపించగలవారు కూడా మీరే' అంటూ కళ్లు తుడుచుకొన్నాను.

'విమలా! నేను నిన్ను నా చెల్లి సరోజిలా చూసుకొంటున్నానని అవాళే చెప్పానుకదా! ఏం జరిగిందో చెప్పమ్మా విమలా! చంద్రశేఖరం నిన్ను ప్రేమగా చూడటం లేదని వినటానికే నాకు దడ ఎత్తుతోంది.'

మనస్సులో నురగలు కక్కుతూ సాగర కెరటాలలా మోదుకొంటున్న నా దుఃఖానికి నేను కట్టిన ఆనకట్టను, యింక భరించలేక పడగొట్టేశాను.

'గడచిన మా మూడు సంవత్సరాల దాంపత్య జీవితం బయటికి బాగానే వుంది. నన్ను పెళ్లి చేసుకొన్న కారణంగా ఆయన నన్ను భార్యగా చూస్తున్నారేకాని, కోపంలేదు – తాపంలేదు; ఉల్లాసంలేదు – సల్లాపంలేదు; సంతోషంలేదు – సుఖంలేదు. ఈ త్రిశంకుస్వర్గ జీవితంలో విసిగెత్తి కొన్ని సమయాల్లో యీ జీవితాన్ని అంతంచేయాలని కూడా అనుకొనేదానిని. ఆయన ఏమనుకొంటున్నారో

నాకు అర్థంకాలేదు. నా కన్నీళ్ళ ముందు ఒకనాడు, 'నేను నిన్ను పెళ్ళి చేసుకోవటంలో నా జీవితంలో మన్నించరాని మహా పాపాన్ని చేశాను' అనే మాటలు ఆయన నోటమ్మటే వచ్చాయి. ఆ మాటలకి అర్థం ఆ పరిస్థితుల్లో ఒక విధంగా అర్థమయింది. ఇప్పుడు మరొక విధంగా అర్థమయింది. ఏమయినప్పటికి ఆయనకి నామీద ప్రేమ లేదు...' అన్నాను.

రాధాకృష్ణ నిశ్చేష్టుడై పోయాడు!

'నన్ను మీరు అపార్థం చేసుకోరని నమ్ముతున్నాను. మోహనరావు మాట్లాడిన మాటలు నడచిన నడత అంతా తప్పే. కాని అతను అన్న మాటలలో కొన్ని విషయాలు ముమ్మాటికీ నిజం! ఆయన నా ఆవేశాలను యిష్టా అయిష్టాలను కొంచమేనా అర్థంచేసుకొని వున్నట్లయితే నా జీవితం బాగానే వుండి వుండేది. ఆయన్ని నేను ఆ రోజుల్లో నా మనస్సులో పెట్టి పూజించి, నా భాగ్యంకొద్దీ దొరికిన భర్త అని పరవశం చెందాను. ఆయనకు నా మీద మితిలేని అనురాగము, అభిమానము వుందని నమ్మి ఆయనకోసం ఎటువంటి త్యాగం చెయ్యటానికేనా సిద్ధపడ్డాను. నా నమ్మకాన్ని ఒకే ఒక్క నరుకుతో నరికివేసిన ఆయన నా మనస్సును విరిచివేశారు. చిత్రవధకన్నా కఠినమైన యీ ఆవేదనను నేను భరించలేకనే నా మనస్సును సంగీతంవైపు బలవంతంగా మరల్చుకొన్నాను. అందులో మోహనరావు వచ్చి యిల్లా కలగచేసుకొంటాడని నేను అనుకోలేదు. అతను మాట్లాడినదంతా మీరు వినే వుంటారు' అని ఆగాను.

'ఇంతకుముందు మోహనరావు యెప్పుడైనా యిల్లా మాట్లాడాడా విమలా ?' అని చటుక్కున అడిగేశాడు రాధాకృష్ణ.

అతని ప్రశ్న ఎందుకో నన్ను బెదరగొట్టింది. నా మనస్సు - నేను చంద్రశేఖరం భార్యననే హద్దునుంచి జారి పోయి వుంటుందని అతను అనుకొన్నాడా ? ఎంత కట్టుదిట్ట మైన కోట అయినప్పటికి కావలివాళ్ళు పరధ్యాన్నంగా వుంటే శత్రువు తేలిగ్గా లోపలికి ప్రవేశించటం లేదా ? నేను చంద్రశేఖరం భార్యనే. వంశపారంపర్యంగా భర్తను పూజించే పద్మినీ స్త్రీల దారిలోనుంచే వచ్చాను. అయినప్పటికి యీ కట్టుదిట్టమైన కోట ఏ పక్క బలమూ లేక విరిగిపోయిన నా మనస్సు మోహనరావు ఎదిరింపుముందు సమర్థించుకోలేని దానిలా సడలిపోతోందే! తల్చుకోవటానికే నిప్పు ముట్టు కొన్నట్లు చుట్టుకుంది. ఏమైనప్పటికి లోపలనుంచి ఒక గొంతుక 'మోహనరావు చెప్పినదానిలో నిజం వుంది - నిజం వుంది' అని ఎందుకు తాళంవెయ్యాలి ?

'ఏం విమలా ! నే నడిగినదానికి జవా బివ్వలేదేం ?' అన్నాడు రాధాకృష్ణ.

'ఉ...ఉమ్. లేదు. ఆకాశవాణి నిలయంలో జరిగే సంగీతగోష్టి గానం ఒకదానిలో నేను అతనితో కలసి పాడ టానికి ఒప్పుకొన్నాను. అతను మాధవునిగాను, నేను రాధ గాను పాడటానికి నేను అంగీకరించాను. అతను నా మాదిరిగా కళాభిమానం కలవాడని, వినీతభావంతో నేను అతనిని

గౌరవించి, సరళంగా సంచరించాను. ఆ స్థితినుంచి యిప్పుడు అతను...' అని పూర్తిచేయకుండా ఆగిపోయాను.

కొన్ని క్షణాలు రాధాకృష్ణ మౌనంగానే వుండి పోయాడు. తర్వాత గబగబా మాట్లాడాడు...

'చంద్రశేఖరం ఏమీ చూడటంలేదు. మోహనరావు నీతో చనువుగావుండటం సహజధోరణిలో సరళంగా అనుమతించారు. అంతేకదూ? నువ్వు నీ మనస్సును జారవిడిచావని నాకు తోస్తోంది విమలా! అది చాలా తప్పు. ఆయనికి నిజంగా నీ మీద ప్రేమలేదని తోచినట్లయితే అందుకు దారివెతికి కనుక్కోవాలే కాని, పుణ్యమైన మాంగల్య బంధంనుంచి జారిపోవచ్చునా? ఆ రోజుల్లో ఆయన్ని నీ హృదయ పీఠంలో పెట్టి పూజించానంటున్నావే! అంత ప్రేమ, అనురాగం నిజంగా కలిగిన నువ్వు, త్యాగబుద్ధి కలిగిన దానివైతే దారిలో గుచ్చుకొన్న ముల్లుని వెతికి కనుక్కొని తీసి అవతలపారవేయటానికి కదా ప్రయత్నించాలి? నువ్వు మన భారతదేశ పద్మినీ స్త్రీల కులధర్మమార్గాన్నుంచే తప్పిపోతావని నేను ఎప్పుడూ అనుకోలేదు. నాకు చాలా బాధగా వుంది యీ విషయం...

విమలా! నువ్వు నీ మనస్సునే అర్థంచేసుకోలేదు! అందు చేతనే చిన్న పిల్లలా మోహనరావు పలికిన అలంకార మాటల్లో నిజంవుందంటున్నావు. ఏమిటా నిజం? భార్యాభర్తల యిష్టా అయిష్టాలలో వారికి ఒకే అభిప్రాయం వుండాలన్నాడు. దానికన్నా పెద్దతప్పు మరొకటి లేదు. అతనికి రసికగుణం వుంది. నీకు కళాభిమానం వుంది. ఇందుచేత మనస్సు కలిసిందని

నిర్ధారణ చేసాడు. అంతేనా ? ఇంకా ఎంతోమంది దగ్గర యీ కలయికను అతను చూసివుండవచ్చును. అందుకోనుంచి ప్రేమ పుట్టుకొచ్చింది అని చెప్పటం శుద్ధ తెలివి తక్కువ తనం! నీ కళ్లుమూయటానికి అతను చేసే 'తంత్రం' యిది! బయటికి కనిపించే చేష్టలలోను, నడతలోను హస్తిమశకాంతరంలా వ్యత్యాసం కలిగిన వాళ్లంతా అన్యోన్యంగా జీవించలేదనటం ముమ్మాటికి తప్పుడు అభిప్రాయం. నిజం చెప్పాలంటే వాళ్ల జీవితాలే శోభిస్తాయి. భర్తకి తెలియని విషయంలో భార్యకి జ్ఞానంవున్నట్లయితే భర్తకి ఆశ్చర్యం కలుగుతుంది. అందు మూలంగా భార్యమీద భర్తకి అభిమానం ఎక్కువౌతుంది. అందులో నుంచి అనురాగం శాశ్వత స్థానం ఏర్పరచుకొంటుంది. భార్య విషయంకూడా అంతే. పరస్పరంగా వుండే యీ వ్యత్యాసం వాళ్లలో ప్రేమానురాగాలను వృద్ధిచేస్తుందే కాని కృంగిపోయేటట్లు చెయ్యదు. అతను చెప్పినట్లు మనస్సులు కలిసినట్లయితేనే ప్రమాదము. వివాదాలకి మనస్పర్థలకి హేతువౌతుంది. నాకు తెలిసిన ఒక డాక్టరు దంపతులున్నారు. ఆమెకి, అసాధ్యురాలు – అదృష్టశాలి అనే కీర్తి పెరగగా, పెరగగా ఆయనకి ఆమె మీద యీర్ష్య పెరిగింది. తత్ఫలితంగా వాళ్లిద్దరూ దాంపత్య జీవితంలో నుంచే విడిపోయి, జన్మ జన్మాంతర గర్భశత్రువులై పోయారు. ఈ కలయికకు నువ్వు ఏమంటావు విమలా ? జీవితంలోని జీవనజ్యోతి ప్రకాశించటానికి దోహదమిచ్చేది, యిష్టా అయిష్టాలు కాదు. సామర్థ్యము సౌందర్యము కాదు— అనురాగమే ఆధారము—' అని పరిశోధనా వసంతరం యిచ్చే

అభిప్రాయంలా తన అభిప్రాయాన్ని బయటపెట్టాడు రాధాకృష్ణ.

మోహనరావు మాటల్లో నిజం వుందని ఆమోదించిన నా మనస్సు యిప్పుడు రాధాకృష్ణ అభిప్రాయాన్ని కూడా 'తళుక్' మని పట్టుకొంది !

'మోహనరావు సంగతి వదలివేయండి. కాని మీరు యిప్పుడు అన్నారే — అనురాగమే ఆధారమని — అది లేదే ఆయనకి ! 'ఇంట్లోనే వున్నావా ? సరే వుండు — బయటికి వెళ్తున్నావా ? సరే వెళ్ళు' — ఏమిటీ దాంపత్యం ? నా మనస్సు జారిపోయిందని మీరు నామీద నెపం వేస్తున్నారే! ఆయనవల్లేకదా నా మనస్సు విరిగిపోయింది ? ఆయనకి -మరెవరిమీదేదా మనస్సు వున్నట్లయితే - ఆ సంగతి నాతో చెప్పి నానుంచి ఆయన విడుదలై పోవచ్చు ! నా కళ్ల ముందే తిరుగుతూ నన్ను యిల్లా చిత్రవధ చేసేకన్నా అది నాకు ఒకటే దుఃఖమవుతుంది. ఆయన యీ వ్యత్యాస నడతేకదా మోహనరావుని అంత ధైర్యంగా మాట్లాడించింది ! నేనేం చెయ్యను ? ఏది మంచి, ఏది చెడు అని నాకు తెలియటం లేదు. సంవత్సరాల తరబడి నా మనస్సు, నా తెలివి ఒకదానితో ఒకటి పోరాడి అలిసి అలిసి, విసిగి పోయాయి. ఇప్పుడు ఆలోచించి చూచినట్లయితే ఒకరిని మరొకరు కలుసుకొని, అర్థంచేసుకొని ప్రేమ వివాహాలు చేసుకొంటున్నారే అదే చాలా మంచిపని అని తోస్తోంది. నా వివాహ సమయంలో నాకు యింత తెలివి లేదు. ఆయన అల్లా వుంటారని, యిల్లా వుంటారని చిన్నపిల్లలా కోటలుకట్టి,

కలలు కన్నాను. ఆడదాని కలలన్నీ కల్లలే అనేది నిజం! అంతా భ్రమగా పూర్తయింది. నాకు ఆయనమీద కలిగిన ప్రేమానురాగాలు కూడా నా భ్రమలోనే కలిగాయో లేక సహజంగా కలిగాయో అని ఆలోచించే స్థితికి వచ్చానిప్పుడు. ధర్మసూత్రం — అది నాలాంటి జీవిముందు ప్రేమ అనేదే లేని పరిస్థితులలో తలయెత్తి నిలబడదు! భర్తనుంచి విడిపోవాలని మనస్సులో అనుకోవటం, పద్మినీ స్త్రీల ధర్మసూత్రాలనుంచి తప్పిపోయిందని అనుకొనే స్త్రీ దగ్గరే నేను పెరిగాను. కాని యీ నిశ్చలమైన నిశ్చలత్వం నిలబడాలంటే అందుకు ప్రేమానురాగాలుండాలి. జీవితంలో ఒకరి నొకరు పెనవేసుకుపోవటానికి, ముందు యీ పునాది వుండటం చాలా అవసరం. మాలో యిది పూజ్యం అవటంవల్లనే నేను యిల్లాగయిపోయాను.

ఆయన్నీ తప్పు పట్టుకోవటానికి లేదు. నన్నూ తప్పు పట్టుకోవటానికి లేదు. నాకూ ఆయనకీ యీ భార్యాభర్తల మేకపూతల నాటకం తీరని వేదన కలగచేస్తోంది నిర్మలతో ఆయన్ని కలిపి మోహనరావు మాత్రమే కాదు, సుశీలకూడా సూచనగా హెచ్చరించింది. నేను నిర్మలనే అడిగివుండేదానిని. కాని ఆమె యిక్కడ వున్నప్పుడు నాకు యీ సందేహం కలగలేదు. ఆయన నన్ను చూసే పద్ధతికి ఏవేవో అర్థంలేని కారణాలను కల్పించుకొనేదానిని. ఇప్పుడు అది నిజమేమోనని కూడా నాకు అనుమానంగా వుంది' అని నా మనస్సుకు తోచినదంతా ఆలోచించకుండా బయటపెట్టేశాను ఆవేశంగా.

అంతా చెప్పేశాకే యీ విషయం ఎందుకు బయట పెట్టానా అని సిగ్గుపడ్డాను. ఒక్క క్షణంలోనే మనస్సులోని దంతా బయట పెట్టేశానే! అతనేమన్నా జీవితంలో మహా అనుభవశాలా? నాకు తెలిసిన నిర్మలని మోసంచేసి, సిరి సంపదలతో తులతూగే శ్యామలని చేసుకోబోతున్నాడు! 'స్త్రీ బుద్ధే విపరీతబుద్ధి' అనేది నిజం చేసేటట్లు ఒక్కోసమయం లోనూ యిష్టంవచ్చినట్లు మాట్లాడేస్తున్నానే! కాని అతని మీద నిర్మల విషయంలో నాకు ఎంత కోపం వచ్చినప్పటికి, అతి కటువుగా మాట్లాడాలనుకొన్న నేను, సమయానికి మర్చిపోతున్నానే! అనుతాపపూరితమైన అతని ముఖం నాకు తెలియకుండానే నన్ను ఏదో పాశం లాగివేస్తోంది. అతనిని నా సోదరునిగా అంగీకరించటంలో నేను ఎందుకు యింత శాంతి పొందుతున్నానో నాకు తెలియటంలేదు. ఒకవేళ యీ జన్మలో లేని రక్తబంధము పూర్వజన్మలో వుందేమో! నా దుఃఖాన్నంతా ఒక నిశ్చలత్వంతో బయట వెళ్ళగక్కేశాను. స్థిరంగా ఒకపని చేసినప్పుడు తర్వాత తడబడకూడదు. పొయ్యి మండటంలేదని అస్తమాను పుల్లలని మారుస్తానే వుంటే పొయ్యి ఎల్లా మండుతుంది? నాలో నేను అది సరి కాదు – ఇది సరికాదు అని విచారిస్తూ కూర్చుంటే ప్రయోజనం ఏముంది?

ఇందాకటినుంచి నోరు విప్పకుండా దీర్ఘాలోచనలో మునిగిపోయిన రాధాకృష్ణ–'విమలా! నేను ఒక్కసారి కాదు– వందసార్లు చెప్పగలను. నీ మనస్సునే నువ్వు అర్థం చేసుకో లేదు! ఆశాభంగంలోను, నిరాశలోనూ వాడిపోయావు. అందుచే

తనే 'ఆయనను నేను ప్రేమించటం భ్రమ' అంటున్నావు. మొట్టమొదటిసారిగా నిన్ను నేను ఆగ్రానుంచి కొవ్వూరు తీసుకువచ్చినప్పుడు, చంద్రశేఖరం పేరు ఎత్తితేనే నీ ముఖంలో ఎంత సంతోషం పొంగిపోయిందో నాకు యింకా బాగా జ్ఞాపకముంది. అల్లావున్న నువ్వు యిప్పుడు నాతో వాదించగలిగే స్థితికి తయారయావంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. 'నిన్ను చేసుకోనటంలో చాలా పొరపాటు చేశానని' అన్నారంటున్నావు. 'ఎందుచేత అల్లా అంటున్నారని' అడిగావా విమలా?' అన్నాడు.

నాకు యింకా కోపంవచ్చింది.

'ఎందుకు అడగాలి? అడగవలసిన అవసరం ఏముంది. అవాళ మధ్యాహ్నం ఆయన వదినగారు నన్ను నలుగురిలోను కేకలేయటంవల్ల మనస్తాపం కలిగింది. నా కన్నీళ్ళు చూసి వదిన అన్నయ్యలమీద విశ్వాసానికి లోబడిపోయిన ఆయనను విడగొట్టేందుకు నేను ఏడుస్తున్నాననే దృష్టితో అల్లా అన్నారనుకున్నాను. ఇదంతా నేను యింకా పెంచటం ఎందుకు? ఆయనకు నామీద ప్రేమ వున్నట్లయితే నేను ఏదైనా మహాపరాధాన్ని చేసి వున్నప్పటికీ నన్ను మన్నించకుండా వుంటారా? నేను మోసపోయాను! జీవితంలో పెద్ద పరాజయమే నాభాగ్యం! ఆయన రోజులోని చాలాభాగం ఎక్కడ ఎక్కడో తిరిగి గడిపేస్తున్నారు. ఎక్కడికి వెళ్తున్నారు? ఏం చేస్తున్నారు? ఏం ఉద్యోగం? ఎంత జీతం? నాకుమల్లే ఆయన కూడా బాధ పడుతున్నారా? అనే ఎన్నో విషయాలు నాకు తెలియవు. కాని అదేవిధంగా నేనుకూడా

వుండటానికి వీలుండదని – ఇదో యీ మోహనరావు కలగ చేసుకోవటంలోనే తెలుస్తోంది. నేను ఆయన్నుంచి విడిపోయి జీవించటం ఎవరూకూడా ఒప్పుకోరు. ఏం? నన్ను కన్నతల్లే ఒప్పుకోకుండా తిడుతుంది. ఆడదానిగా పుట్టినది భర్త యొక్క ఎటువంటి హింసాకాండకేనా తలవంచుకోవాల్సిందే అనే మనస్తత్వంలో ఊరిపోయిన అమ్మ, నేనుకూడా అల్లాగే సహించుకోవాలనే కేక లేస్తుంది. ఆవిధంగా నేను శరణాగతి అనటానికి నావల్ల సాధ్యంకావటం లేదే! పాతాళంలో వున్న నీళ్ళుకూడా, కొండల్ని కూడా బద్దలుచేసేసే బాంబుల వల్ల, బయటికి రావటం లేదా? అల్లాగే, అజ్ఞానమూ, నన్ను నేనే ఆదరించుకోవలసిన భార మనస్తత్వమూ, నాకున్న కొద్ది స్వీయగౌరవాన్ని మూసివేశాయి. కాని అణు ఆయుధాలలా, నా జీవితంలో నాకు ఏర్పడిన అవ మానాలు, ఆశాభంగాలు ఒకదానివెనకాల ఒకటిగా ఎదు రయి, నాకు కూడా స్వీయగౌరవం వుందని అనురాగానికి తలవంచవచ్చునే కాని అహంకారానికి బెదర రాదనే విష యాన్ని బయటబెట్టాయి. అది బలమైపోయి ఆయన్ని శరణు కోరటానికి నాకు శక్తి లేనప్పుడు నేనేంచెయ్యను?'

'తెలియని విషయాన్ని ఆయననే అడిగి తెలుసుకోవ టానికి 'శరణాగతి' అని అర్థమా విమలా? నువ్వు అక్కడే పొరబడ్డావు విమలా! నీ మనస్సు జారిపోయినందుకు నేను విచారిస్తున్నానే గాని నేను నిన్ను తప్పు పట్టుకోవటం లేదు. సరే...నువ్వు అడగవద్దు – నేనే చంద్రశేఖరాన్ని అడిగే స్తాను. నిర్మల విషయంలో వచ్చిన పుకార్లలో నాకు ఏ

మాత్రమూ నమ్మకంలేదు. నేను నమ్మలేను. ఆ మాటలు రావటానికి సమయూ సందర్భాలు కలసి వచ్చాయి.' అని ముగించాడు రాధాకృష్ణ.

నాకు నిర్మల ఉత్తరం జ్ఞాపకం వచ్చింది.

'నాకు కూడా నిర్మలను గురించి ఆ విధంగా అనుకోవటానికే చాలా సిగ్గుగావుంది. మీరు చెయ్యి వదిలేశారని మనస్సు విరిగి బాధపడుతోంది. నన్ను ఓదార్చటం అలా వుంచండి. ముందు మీరు చేసిన పనియొక్క ఫలితం ఆలోచించండి. శ్రీమంతుడైన మామగారి ఆధరవులో విదేశాలకి వెళ్ళి వచ్చారు! ఐశ్వర్యంలో యీదులాడే శ్యామలను చేసుకొనే రోజుకోసం ఎదురుచూస్తున్నారు! ఇది మహా న్యాయం కాబోలు! మీ మీదున్న ప్రేమకొద్దీ ఆమె మోహనరావుని, అతని ఐశ్వర్యాన్నీ కాలదన్ని ఆమె బంధువులందరిని కూడా విడిచి వెళ్లిపోయింది. చూడండి యీ ఉత్తరం' అని నాలో కోపాన్నంతా వెళ్ళగక్కి ఆ ఉత్తరాన్ని అతనిమీదకు విసిరేశాను.

అది చదివిన రాధాకృష్ణ వికటంగా మెల్లిగా నవ్వాడు.

'విమలా! అసలు ఆడదానికి ఓర్పనేదే లేదు! నా నోటితో నేను ఎప్పుడైనా శ్యామలను చేసికొంటానని చెప్పానా? అంతలోనే నేతిలోపడ్డ అప్పంలా గంతులేస్తే నేనేం చెయ్యను? ఏదీకూడా నోరువిప్పి అడగకుండా చటుక్కున కోపగించుకుంటే నా కెల్లా తెలుస్తుంది? నాకేమైనా దివ్యదృష్టి వుందా? ఇండియానుంచి వెళ్ళేముందు నేను నిర్మలను కలుసుకొని నా ఆలోచనలన్నీ చెప్పాలని ఎంతో

ప్రయత్నించాను. కాని ఆమె నాకు ఏ మాత్రమూ దారి యివ్వలేదు. నాకు అప్పట్లో యింకో సందేహంకూడా కలిగింది. ఆమెని, నిమిషానికి నూరుసార్లు 'మిసెస్. మోహన రావు' అంటూ చంద్రశేఖరం ఒకటే తమాషా చేస్తూండే వారు. వాళ్ళ యిష్టానికి అంగీకరించవలసిన నిర్బంధమయి వుంటుందని, అందుచేతనే ఆమె నన్ను కలుసుకోవటానికి యిష్ట పడటం లేదని అనుకొన్నాను. కాని ఆనాటి ఆమె స్థితికి యిప్పుడు అర్థమయింది సరైన కారణం. నేను ఇండియా నుంచి వెళ్ళేముందు ఎంత బాధపడుతూ వెళ్ళానో అర్థంచేసుకో గల్గిందా ఆమె ? మామయ్యా, అత్తయ్యలతో వాళ్ళ దగ్గర, కాబోయే మీ అల్లుణ్ణనే ప్రమాణంతో నేను ఆర్థిక సహాయం పొందలేదు విమలా ! ఆ నమ్మకంతో వాళ్ళు బయటికి డమారంకొడితే అందుకు నేను బాధ్యుణ్ణవుతానా ? ఇంచు మించు పెళ్ళిమాటలు నేను లండన్ నుంచి తిరిగి వచ్చాకే నా వరకూ వచ్చాయి. నేను యిదివరకు అనుకొన్నట్లుగానే మా యింటిని అమ్మేసి వాళ్ళ దగ్గరనుంచి పుచ్చుకొన్నదంతా వడ్డీతో సహితంగా యిచ్చేస్తూ 'మీ అమ్మాయికి నేను తగిన వాడిని కాను' అని ఖచ్చితంగా చెప్పేశాను. మా అమ్మా, నాన్నలకు కూడా నేను శ్యామలను నిరాకరించినందుకు నా మీద ఏమీ కోపం లేదు. ఎందుచేతనంటే ఆమె మితిమీరిన నాగరీకం వాళ్ళకి కూడా నచ్చలేదు. విదేశాలకి వెళ్ళి విద్యాభ్యాసం చెయ్యాలనే ఆశలో సమయానికి సాటివాళ్ళ దగ్గర సహాయం కోరటం తప్పవుతుందా విమలా ? ఈ మధ్యనే - అంతా ఒకవారం రోజుల కిందట చిత్తరంజన్ లోకోమోటివ్

వర్క్‌షాప్‌లో అసిస్టెంట్ ఎలక్ట్రికల్ ఇంజనీరుగా నాకు ఉద్యోగం వచ్చింది. వచ్చే వారంలో జాయను అవుతాను.

నిర్మల చాలా బుద్ధిశాలి విమలా! ఎంతో తీవ్రమైన ఆలోచన చేసిన తరువాతగాని ఏ అభిప్రాయానికిరాదని నాకు బాగా తెలుసు. కాని అంత నిశ్చలత్వం కలిగిన ఆమె కూడా యిల్లా ఎందుకు తొందర పడిందో నాకర్థం కావటం లేదు.

నిజానికి స్త్రీకి తొందరనేది చాలా ఎక్కువ. మనస్సులో వున్నది బయటికి చెప్పకుండా వెంటనే అనుమానానికి ఆహుతి అవుతుంది. నేను చంద్రశేఖరాన్ని నీ గురించి అడిగినా కూడా యిల్లాగే ఏమైనా అంటారేమో అని నాకు అనుమానంగా వుంది' అన్నాడు రాధాకృష్ణ నవ్వుతూ.

'అవును. మిమ్మల్ని మేము అర్థం చేసుకొనేటట్లు మీరు నడవరు! మమ్మల్ని మీరు అర్థంచేసుకోరు! చివరకి ఆడదాన్ని అర్థం చేసుకోవటం అసాధ్యం, అసాధ్యం అంటూ మమ్మల్ని తెగ వర్ణించి దెప్పుతారు......' అంటూ కోపంగా యింకా మాట్లాడబోయాను. కాని గది తలుపు చప్పుడవటంతో బయటికి వచ్చే మాటలు లోపలే ఆగిపోయాయి.

అదిరిపడి గదంతా కలియచూశాను. నేను బయట గొళ్ళెంపెట్టిన మా పడకగది తలుపే లోపల నుంచి లాగుతున్నట్లు మళ్ళీ చప్పుడయింది!

భ్రమించి నోట మాటరాక నిశ్చేష్టురాలై పోయిన నన్ను చూసి 'ఇదేమిటి విమలా? చంద్రశేఖరం ఆఫీసుకు వెళ్ళారన్నావే? ఆయన్ని లోపల పెట్టా బయట గొళ్ళెం

వేశావు?' అంటూ ఆశ్చర్యంగా నవ్వుతూ వెళ్లి గొళ్లెం తీశాడు రాధాకృష్ణ.

తీక్షణంగా కళ్ళు పెద్దవి చేసుకొని నన్ను పరిహాసంగా చూస్తూ గుమ్మంలో నిలబడ్డారు నా భర్త. ఆ చూపు! ఆహా! నా రోజులు మారి పోయాయా? నాకు పెళ్లిలో పెన్ను ప్రైజు యిచ్చినప్పుడు నన్ను చూసిన అదే చూపు! ఏమిటీ ఆశ్చర్యం?

నాలో ఏదో ప్రళయం చెలరేగినట్లయింది. ఆయన యీ మాటలన్నీ వినే వుంటారు! వింటే ఏం? ఒక రోజున కాకపోయినా మరొక రోజునేనా నా దుఃఖాన్నంతా కక్కి-వేయటానికి తయారయిపోయాను కదా? దానంతట అదే యివాళ సందర్భం కలిసివచ్చేసింది! నేను ఎంత ప్రయత్నించి నప్పటికి ఆయనమీద కోపాన్ని పెంచుకోవటానికి ఆయన అక్రమాలు ఎంత దోహదం చేసినప్పటికి ఆయన్ని నా ఎదురుగా చూసేటప్పటికి తప్పుచేసిన దానిలా నా తల వంగి పోతోంది ఎందుకో! ధైర్యంగా ఎదురెదురుగా ఉదాసీనం చెయ్యటానికి నా కెందుకీ భయం? పరిచయదోషమా? లేక భర్త అని వేరూరి పోయిన అభిప్రాయంలో కలిగే అర్థంలేని గౌరవమా? లేక నాకు ఆయనమీద కలిగిన ప్రేమ, భ్రమ అని అనుకోవటం కూడా భ్రమేనా?

'నిద్ర పోయారా ఏమిటి? మీరు ఆఫీసుకు వెళ్లిపోయారనుకొని విమల గది తలుపుగొళ్ళెం పెట్టేసింది' అంటూ రాధాకృష్ణ కలకలా నవ్వాడు.

నాలో, నేను ఎన్నడూ ఎరగని ఓ కొత్త బెరుకు లేచి నన్ను నిజమైన దోషిలా చేసింది. ఆయన యింట్లో లేకపోవటం నేను కోరినట్లు, నేను మోహనరావుని ఎదురుచూస్తున్నట్లు — ఒకవేళ నాచేష్ట ఆయనకి అల్లా తోచివుంటుందా? ఛీ! ఎంత అశ్రద్ధ నాకు? తలుపు తీసి చూసి గొళ్ళెం పెట్టకూడదా?

ఏం? ఆయన మాత్రం? మోహనరావు అంతసేపు అసందర్భంగా మాట్లాడాడే! రాధాకృష్ణ వచ్చి ఎంతసేపయింది! రెండో గొంతుక వినిపించటంతోనే తలుపు చప్పుడు చెయ్యకూడదా? నన్ను శోధించాలనే నిశ్చయించుకొన్నట్లు జ్ఞాపకూడా వినిపించకుండా లోపలే ముక్కుమూసుక్కూర్చున్నారు!

'అంతా మన మంచికే అనే ఉత్తమ నీతి నాకు యిప్పుడు జ్ఞాపకం వస్తోంది రాధాకృష్ణా! నేను ఆఫీసుకు వెళ్ళిపోయానని విమల అనుకోవటంకూడా చాలా మంచిదయింది. వెళ్ళాలనే అనుకొన్నాను. కొంచెం బద్ధకమేసింది. లోపలనుంచి బట్టలు ఉతుకుతున్న చప్పుడు, అదీ చెవుల్లో పడి నిద్ర చెడిపోతుందని తలుపుదగ్గరగా వేశాను. అల్లాగే నిద్రపోయాను. విమల తలుపు గొళ్లెం వెయ్యటం నాకు తెలియదు. మోహనరావు గట్టిగా మాట్లాడటంలో మేల్కొన్న నేను, కిటికీలోనుంచి, నువ్వు గేటు తీసుకొని లోపలకి రావటం చూశాను.' అని ఆగి, నా దగ్గరగా వచ్చి తల వంచుకొని నిలబడ్డ నా తలని ఎత్తి నా కళ్ళలోకి నిశ్చలంగా చూస్తూ చిలిపిగా నవ్వారు నా భర్త!

పొంగి వచ్చే అవమానంలో లేచిన ఆవేశాన్ని అణచుకోలేక 'అందుకనే, కావాలనే బయట ఏం మాట్లాడు కొంటారో అని వినటానికే యీ కపట నాటకం ఆడారు కాబోలు! నా మనస్సును చిదిపివేసి, నన్ను యింత వేదనకు గురి చేసింది చాలదన్నట్లు యీ స్థితిలో కూడా 'ఇది ఏం చేస్తుందో చూద్దాం' అనే కదా కర్కశంగా కూర్చుండి పోయారు...' ఇంక మాట్లాడ లేక పోయాను. గుభీలుమని ఏడుపు ముంచుకొచ్చేసింది. నేను ఏమాత్రము అనుకోని విధంగా, నా చేతులని విడదీసి నా కళ్ళు తుడిచారు ఆయన!

'నేను చేసిన ఎన్నో తప్పులతోపాటు యీ ఒక్క-తప్పుని కూడా మన్నించు విమలా! నేను అప్పుడే బయటికి వచ్చినట్లుంటే యింత సూక్ష్మంగా ఏది వజ్రమో, ఏది గాజు రాయో నాకు ఎల్లా తెలుస్తుంది? మోహనరావు గొంతుక మాత్రమే వినిపించటంతోటే, నాకుమల్లేనే రాధాకృష్ణ కూడా బయటే నిలబడిపోయాడని మొదట్లో మాట్లాడక ఊరుకున్నాను. తడబడే నా మనస్సును, బలవంతంగా కట్టుబాటుచేసుకొని నేను యిన్నాళ్లనుంచి దాగివున్నందుకు, మీ మంచి హృదయాలు నేను అర్థంచేసుకునేందుకు హేతువైన మీ సంభాషణ పూర్తిగా వినాలనదే అందుకు కారణం విమలా! నన్ను చూసినప్పుడల్లా 'నువ్వొక శుద్ధ ఇడియట్' అనే ఉపమానం లేకుండా మోహనరావు మాట్లాడడు. నేను నిజంగా 'ఇడియట్' నే!—సందర్భ గందరగోళంలో ఎదురయిన సందర్భాలని సరిగా అర్థంచేసుకోకుండా ఆధార మే లేని ఒక భ్రమలో చిక్కుకుపోయి, నన్ను నేనే తిట్టుకొని

నిన్ను కూడా తీరని మనోవ్యథకు గురిచేశాను' అన్నారు ఆయన!

నా ఒళ్ళు పులకరించింది! నేను కలకంటున్నానా? ఆయన రాధాకృష్ణవైపు తిరిగారు.

'నా భ్రమ తెరని నువ్వు తీసేసినవాడివి మాత్రం కాదు రాధాకృష్ణా. దాంతోపాటు నాకో గుణపాఠంకూడా నేర్పి సరైన బుద్ధి చెప్పావు! అంతరంగంలో అనురాగం పరిణమించినపుడు, చెప్పేడు మాటలలో సమ్మకాన్ని కలిగించని ఉత్తమమైన మనస్తత్వం కలిగిన నీ ముందు నిజాన్ని చెప్పటానికే నాకు చాలా సిగ్గుగావుంది.' అన్నారు ఆయన.

'ఏమిటి విమలా యిదంతా? ఆయనమీద ఎన్నో నెపాలు వేశావే? ఆయనమో మరేమేమో మాట్లాడు తున్నారు! ఆయన నిన్ను అర్థంచేసుకోలేదన్నావు? కాని నువ్వుకూడా ఆయన్ని అర్థంచేసుకోలేదే! చాలా బావుంది యీ నాటకం—ఊఁ...నన్నేదో ముఖస్తుతి చేస్తున్నారు. కళ్ళకు గంతలుకట్టి కారడివిలో విడిచినట్లు నాకు ఏమీ కూడా అర్థంకావటంలేదు' అన్నాడు రాధాకృష్ణ నవ్వుతూ.

'అవును! తల్చుకొంటే నాకే నవ్వొస్తోంది. మిమ్మల్ని అర్థంచేసుకోకుండా వుండటమే కాకుండా, మహా త్యాగమేదో చేస్తున్నాననుకొని, ఒక్కొక్క క్షణమూ మనఃక్షోభలో పోరాడి నిష్కారణంగా బాధపడ్డాను.' అని ఆయన లోపలగదిలోకి వెళ్ళారు.

బీర్వా తెరిచి అందులోనుంచి మూడు 'డైరీ' పుస్త కాలను తెచ్చి నాకిచ్చారు.

'ఇందులో 'రెడ్ యింక్ తో అండర్ లైన్' చేసిన తారీఖులను చదివి చూడు విమలా'! అన్నారు. 'మీరు ముగ్గురూ కలసి నిజంగా నన్ను 'ఇడియట్'ని చేసేశారు. నిర్మల యింత గుట్టుమనిషిగా వుందని నేను ఎప్పుడూ అనుకో లేదు. నిన్న రాత్రి నేను, శ్యామలను చేసుకోవటానికి, రాధా కృష్ణకి యిష్టం వున్నట్లు కనపడలేదన్నప్పుడు కూడా యీ సంగతి నువ్వు కప్పిపుచ్చావు కదూ విమలా? నువ్వూ నిర్మలా అస్తమానూ ఆంతరంగికంగా మాట్లాడేందుకు మీకు మాట లేమున్నాయా అనుకొంటూ ఆశ్చర్యపడేవాడిని. అదంతా నాకు తెలియకుండా దాచటమే యిన్ని విపరీతాలకి కారణం' అంటూ నన్ను చూసి నవ్వారు.

'అది చెప్పటానికే మోహనరావుని చేసుకొనేందుకు నిర్మలకి యిష్టం లేకపోవచ్చని సూచనగా చెప్పాను. మీరు శ్రద్ధ చూపించకపోవటంతోటే నేను మరొకవిధంగా అర్థం చేసుకొన్నాను' అన్నాను నేను, కొంచెం కోపంగా.

మేము మాట్లాడుకొనే కోపతాపాల అందం చూసి రాధాకృష్ణ విరగబడి నవ్వాడు.

'నువ్వు నవ్వుతావు మిస్టర్ ! నవ్వుతావు ! ఇప్పుడు నీకు నవ్వులాటగానే వుంటుంది' అన్న నా భర్త నా వైపు తిరిగి 'విమలా ! నేను వచ్చే లోపుగా యివి చదువు. నేనూ రాధాకృష్ణా అల్లా పోస్టాఫీసు దాకా వెళ్లి వస్తాం' అని బయలు దేరారు.

రాధాకృష్ణకి ఏం అర్థమయిందో ఏమిటో మారు మాట్లాడకుండా ఆయనతో కూడా వెళ్ళాడు.

# 25

దడదడమని గుండె అదిరిపోతూంటే, జలజలమని ఒళ్లంతా జలదరించి పోతూంటే, గజగజవణికే చేతులతో మొదటి డైరీ తెరిచాను.

**1954, జూలై 30:** ఆహా! నే నెంత భాగ్యశాలిని! నీలాకాశంలో మిలమిలా మెరిసే నక్షత్రాల లాశ్యంతో వికసించే కమలంలా, వింతవింత శోభలీనుతూ, స్నిగ్ధముగ్ధ యైన నా విమల మా పెళ్లి ఊరేగింపులో - ఎంత సుందరంగా వుంది!

కపటం, కల్మషం, యీర్ష్య, జుగుప్స, మదమాత్సర్య చ్ఛాయలే లేని చదువుకొన్న యీ పల్లెటూరి పిల్లా — నా విమల — నా అర్థాంగి కావటానికి నేను ఎంత పుణ్యంచేసి కొన్నానో కదా!

ఈ యిరవయ్యో శతాబ్దంలో యింకా నాగరీకం అంటే ఏమిటో తెలియకుండా, సిగ్గూ, భక్తి విశ్వాసాలు, గౌరవాభిమానాలు, అణకువ, ప్రస్ఫుటంచేసే యీ పల్లె పడుచు — నా విమలను — తల్చుకొంటే నే నింతగా పులకరించిపోతున్నా నెందుచేతనో కదా!

ఆ చిరు పెదవుల మీద చిందే చిఱునవ్వూ, ఆ అర్థ నిమీలిత నేత్రాల గిలిగింతలూ, నన్ను మైమరపించే సరళమైన ఆ సంగీత మాధుర్యాన్ని విడిచి, యీ ఎడబాటును నేను యింక భరించలేను!

వెంటనే తీసుకొొచ్చి విమలను యిక్కడ దిగబెట్ట వల సినదిగా, అమ్మ అనుమతితో, మా మావగారికి యివాళ ఉత్తరం వ్రాశాను.

**1954, ఆగస్టు 20 :** ఇవాళ — ఏ సౌందర్యమూర్తిని నా హృదయ ఫలకం మీద చెరగని చిత్రంగా చిత్రించు కొని ఆరాధిస్తున్నానో, ఏ పొలతిని గురించి తలచి తలచి, తపించి పోతున్నానో, ఏ కలికి కలయిక కోసం కలలు కంటున్నానో - ఆ కోమలి - నా విమల - ప్రభాతభానుని అరుణ కిరణాల స్వాగతంతో, తుషార కాంతిలోని ఉషా రాణిలా అత్తవారింటిలో అడుగు పెట్టింది.

విడివడిపోయిన జంటపావురాలు రెండూ దరిచేరాయి. కాని అకస్మాత్తుగా తుపాకి ప్రేలటంతో అదిరి, బెదిరి, చెదిరి పోయాయి !

ప్రియురాలి కౌగిలింతకన్నా నా విద్యుక్త ధర్మం ముఖ్యం కదా ? న్యూమోనియా జ్వరంతో బాధ పడుతున్న అన్నయ్య కూతురు మాలతి, నర్సింగ్ హోమ్‌లో నాకోసం బెంగ పెట్టుకొని ఏడుస్తోందిట! నేను వెళ్ళాలి! ఏం చెయ్యను ? తప్పదు మరి...! విమలను చూడలేక అన్నయ్యతో కలసి ముందడుగు వేశాను.

పాపం! విమల ఎంత బాధ పడిందో రాత్రి !

**1954, సెప్టెంబరు 10 :** మాలతిని యివాళ యింటికి తీసుకొచ్చాం. మా గదినే వదిన ప్రసవానికి ఏర్పాటు చేశానంది అమ్మ. నే నీ మాట విని నిశ్చేష్టుడనై

పోయాను! కాని ఏంచెయ్యాను? అమ్మ మాటకి ఎదురు చెప్పలేను! పాపం! విమల! ఏ ముహూర్తాన్ని అత్త వారింటికి బయల్దేరిందోకదా!

**1954, సెప్టెంబరు 11**: నా చెవులని నేను నమ్మలేక పోయాను! నా విమలేనా నన్ను యింత కఠినంగా నిరాకరించింది! నా హృదయ అంతరంగంలో చెరగని చిత్రంగా చిత్రించుకుపోయిన నా విమలేనా నన్ను ఛీవరించుకొంటూ తోసివేసింది! ప్రపంచమంతా నా కళ్ళముందు భస్మమయిపోయిం దనిపించింది. 'పోతారా లేదా?' అంటూ తతాలున తలుపు వేసేయటం, నన్ను లోపలికి రానివ్వకుండా తన మనోద్వారాన్ని మూసివేసి, నిరాకరించినట్లుకదా వుంది యీ పరిస్థితి? ఆశాభంగము నేను భరించలేకపోయాను...

'ఛీ! నన్ను ముట్టుకోకండి!' అనే యీ రెండు మాటలూ ఒక్కొక్క క్షణమూ నా మనస్సును యీటెల్లా పొడిచివేస్తున్నాయి. ఆమె ఎందుకు అల్లా మాట్లాడింది? ఆమె అల్లా సంచరించటానికి కారణమేమిటి? సందర్భాలు అడ్డుపడి సావకాశం కలగకుండా పోవటంవల్ల, ఎక్కువైన తీవ్ర తాపంతో మొట్ట మొదటి రాత్రి దరిచేరిన భర్తని - ప్రియమైన భర్తని - ఒక పడుచు యిటువంటి అదిరింపుతో స్వాగతం యివ్వాలంటే......?అర్థంకా లేదు. మనస్సు కుమిలి పోతోంది. అయినప్పటికి నేను ఎల్లాగో భరించాలి! తప్పదు.

**1954, అక్టోబరు 2**: ఆ రాత్రి ఆమె నడతకు కారణం యివాళ నాకు అర్థమయింది. అవును ఆమె నా విమల

కాదు ! నా జీవితంలో నేను మహాపరాధాన్ని – మన్నించ రాని మహాపాపాన్ని – చేసేసానని గ్రహించాను.

నా బల్ల మీద వున్న ఆ పుస్తకం —— కావాలనే—— విమల నా బల్ల మీద పెట్టివుంటుంది. తీరని ఆవేదనతో పొంగిపోయే నా మనస్సును సమాధాన పరచుకొనేదృష్టితో నే దానిని చదివానేగాని, నా కళ్లు తెరచి ఒక నిజాన్ని బయట పెడుతుందని నేను ఏమాత్రమూ అనుకోలేదు. నేను దానిని చదవటం చూచిన విమల, సాయంత్రం ఆ పుస్తకం ఏమయిందని అడిగింది. నేను వెంటనే ఆ పుస్తకాన్ని ఆమెకు యిచ్చేశాను.

కాని అందులోని విషయాలు......!

పాఠాలు చెప్పటానికి వచ్చిన అధ్యాపకుణ్ణి శిష్యురాలు ప్రేమిస్తుంది. ఇద్దరూ ఒకరు నొకరు ప్రేమించుకొన్న సంగతి తెలిసో, తెలియకో, పిల్లతండ్రి, మరొకనితో ఆమెకు వివాహం చేస్తాడు. పెళ్ళిరోజున, మనస్సు విరిగిపోయిన పెళ్ళి కూతురు మనోవ్యథతో మూర్ఛపోయింది. [ఈ విమలకూడా అనాళ పెళ్ళిలో మూర్ఛపోయిందికదా !] ప్రియుడు, మనస్సు విరిగిపోయి, మనఃక్షోభతో వున్న ప్రియురాలను ఏకాంతంగా కలుసుకొని, మనస్సు విప్పి అతని బాధనంతా బయట పెడ్తాడు. కాని ఆమె, మంచి మాటలతో, ఆమె ఇప్పుడు మరొకరిభార్యనని, ఆమెను మర్చిపొమ్మని కోరుతుంది. ఆమె ఉపదేశమణులలో కాంతిని చూడగలిగిన ప్రియుడు వెనక్కి తిరుగుతాడు. వీరిద్దరి ఏకాంతాన్ని చూసి, వారి మాటలువిన్న ఆమె భర్త వాళ్ళ నిర్మలప్రేమకు చకితుడై

మహత్తరమైన త్యాగంచేస్తాడు. అతను పెళ్ళిచేసుకొన్న కన్యని తన సోదరిగా చూసుకోడానికి నిశ్చయించుకొంటాడు !

ప్రేమికులకన్నా ఆమె భర్తచేసిన త్యాగమే నా మనస్సును ఎక్కువగా ఆకర్షించింది. ఈ విమల నాదికాదు ! అందుకోసమే సూచనగా తెలియజేసినట్లు యీ పుస్తకాన్ని నా కళ్ళ పడేసింది ! ఈ పుస్తకంలోని భర్తలా నేనుకూడా సంచరించాలనే అనుకొని వుంటుంది ! అవాళ చీరలు తెచ్చి యిచ్చిన రాధాకృష్ణని గురించి వదిన ఒక విధంగా మాట్లాడింది. "గుమ్మందాకా వెళ్ళి సాగనంపి వచ్చింది విమల. లోపలదాకా వచ్చి మాట్లాడి పోవటానికి అతను ఆమెకు అన్నా ? తమ్ముడా ?" అని వదిన అన్నప్పుడు నాకు నిజంగా కోపమే వచ్చింది. కాని అతను, ఊరునించి అంతకుముందు రోజే వచ్చాడు. అతని చెల్లెలు పోయినందుకు విమల అతనికి సానుభూతి తెల్పి, వెళ్ళేటప్పుడు గుమ్మందాకా వచ్చి 'వెళుతున్నారా ?' అన్నప్పుడు ఆ చూపుల్లో దుఃఖమూ, శోకమూ కనిపించిం దెందుచేత ? వదిన చెప్పినట్లు అతను ఆమెకు దగ్గరబంధువేమీకాదు. అయినప్పటికీ 'విమలా !' విమలా !' అంటూ అంత ప్రేమగా మాట్లాడుతాడెందు చేత ?

ఆహా ! ఆ మొదటిరాత్రినాడు ఆమె కన్నీళ్ళ అర్థం? రాధాకృష్ణ చీరలతో మొట్టమొదటిసారిగా వచ్చిన రోజున నేను అతన్ని గురించి అడిగినప్పుడు, పరధ్యాన్నంగా ఆమె జవాబివ్వటానికి కారణం ? అవాళ ఒక రోజున యింటి జ్ఞాపకం వచ్చిందంటూ వెక్కి వెక్కి ఏడ్చిన దానికి ఏమిటి అర్థం ? ముంజేతి కంకణానికి అద్దంకూడా కావాలా ? అన్నీ

కరతలామలకంలా నాకు అర్థమయ్యాయి. ఆలోచించకుండా వాళ్ళకి నేను చాలా బాధ కలిగించాను. కథలోవచ్చిన భర్త లాగనే నేనూ త్యాగం చెయ్యాలి! చేసితీరాలి! తప్పదు...

కాని ఎంత గట్టిగా కట్టుబాటు చేసి కొన్నప్పటికి అణగకుండా నా మనస్సు నన్ను ఆమెవైపు లాక్కుపోతేందే! తల్చుకొంటేనే నా గుండె పగిలిపోతుందేమో ననిపిస్తోందే! రెండవ డైరీ తెరిచాను ....

**1955 ఏప్రియల్ 20 :** నేను సమాధానపడలేక తపించి పోయే నా మనః క్షోభని తగ్గించుకోవటానికి, విమలతో నేను మాట్లాడటం కూడా తగ్గించుకొంటూ వస్తున్నాను. ఆమెను అసలు చూడకుండా వుంటే ఒకవేళ నాకు 'పీస్ ఆఫ్ మైండ్' వుంటుందేమో అని అనుకోవటం పూర్తిగా పొరపాటనిపించింది. ఆమె పుట్టింటికి వెళ్ళి సుమారు ఒక నెలరోజు లున్నందుకు నేను పడ్డబాధ! కాని ఆమె నా కళ్ళముందు తిరగటం నాకు యింకా వేదనగా వుంటోంది యిప్పుడు.

**1955, ఏప్రియల్ 25 :** ఐశ్వర్యవంతురాలైన విమల మేనత్త విమలకు యిదివరలో రాధాకృష్ణద్వారా రెండు చీరలు పంపించింది. అతిసాధారణమైన ఆ నూలు చీరలు విమల పుట్టింటి కుటుంబ స్థితిని ఎత్తి పొడుస్తున్నట్లు ధన మదాంధ అహంకారంతో ఆమె పంపిందని నాకు తోచింది. అప్పట్లోనే ఆ చీరలను వెంటనే తిప్పి పంపి వేయాలను కొన్నాను. కాని మరొక రూపంలో ఆమె చర్యకు తగిన పాఠం నేర్పటం మంచిదని తోచి ఆ ఉద్దేశం మార్చు

కొన్నాను. ఆ ధన మదాంధకురాలి మనస్తత్వాన్ని మరి కొంచెం విపులంగా తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో మా సిమ్లా ప్రయాణాన్ని ఆగ్రా మీదుగా మళ్ళించాను.

**1955, ఏప్రియల్ 29 :** అందరూ తాజ్‌మహాల్ చూడటానికి వెళ్తూంటే విమల రాకుండా వుండాలనే నా మనస్సులో అనుకొన్నాను. అవును! లేకపోతే నా మనస్సు నిశ్చయంగా జారిపోయివుండేది. మేము ఎవరమూ యింట్లో లేని సమయంలో రాధాకృష్ణ వచ్చాడని తెలిసింది. వాళ్ళిద్దరూ ప్రేమించుకొన్నవారని నాకు నిశ్చయమయేటట్లు, రాత్రి ఏదో పనిమీద కిందకు వెళ్ళినప్పుడు వంటింట్లో వాళ్ల బామ్మ రాధాకృష్ణతో ఏకాంతంగా మాట్లాడినందుకు విమలని కేకలేసింది. నా మనఃక్షోభని యింక నేను యివాళ రాయలేను...

**1955, ఏప్రియల్ 30 :** పొద్దున్నే రాధాకృష్ణవచ్చాడు. కలకలమని ఆతను మాట్లాడటం, మా మనస్పర్థలు తీర్చివేసే పద్ధతిలో నన్ను ఊళ్లో వింతలన్నీ చూపించటానికి విమలని తీసుకెళ్ళమంటూ బలవంతంచేయటం - అన్నీ నాకు వాళ్ళమీద కలిగిన అభిప్రాయాన్ని యింకా బలపరిచాయి. 'మీరుకూడా వస్తారుకదూ?' అని విమల అతన్ని యెందుకు అడిగింది? శ్యామలని, అతనిని కలిపి నేను పరిహాసం చేసినప్పుడు అతను నిశ్చేష్టుడైపోయాడెందుచేత? • అతని నడత మనస్సు విరిగిపోయిన విమలని ఓదార్చటానికి ప్రయత్నించే ఉత్తమ ప్రేమికునిగానే కనిపించింది. నన్నూ, విమలనీ నిలబెట్టి యమునాతీరంలో

ఘోటోతీశాడు రాధాకృష్ణ. నన్ను అంటుకుపోయినట్లు తల వంచుకొని నిల్చున్న విమలను, ఆవేశం పట్టలేక ఒకే ఒక్కసారి చూశాను. అబ్బబ్బ! మనఃక్షోభ అంతా ప్రతిఫలించే ఆ ముఖం నన్ను దొల్చివేసేటట్లుంది. నేను ఏకాంతంగా వెళ్ళిపోయి నా మనస్సును శాంతపరచుకోక పోయినట్లయితే, నా మనస్సుకు అర్థంకాని ఆవేశాలకి నేను నిశ్చయంగా లొంగిపోయి వుండేవాడిని! ఆమె అతని మీద మనోవేదనతో దగ్ధరిల్లిపోతోందని నాకు నిశ్చయంగా తెలిసిపోయింది! నేను వాళ్లను అక్కడే వదలి వెళ్లిపోయి ఒక అరగంట తర్వాత తిరిగివచ్చాను. నేను తిరిగివచ్చే టప్పుడు, అతను వచ్చేటప్పుడు చూపించిన ఉత్సాహము, సంతోషము, కృంగిపోయి వాడిపోయిన ముఖంతో కని పించా డెందుచేత? మోహనరావు కలకలా మాట్లాడు తూంటే అతని ముఖభావాలను నేను చూడకుండా వుండ లేకపోయానే! విమలకి యింకా నేను ఏవిధంగా అను తాపం చూపించగలను? నా మనస్సును యింకా ఎల్లా కట్టుబాటు చేసుకోను?

**1955, మే 12:** నేను నా స్థిరత్వాన్ని నిలబెట్టుకోవ టానికి ఆమెతో ఎక్కువగా మాట్లాడకూడ దనుకొని, మాటలని కత్తిరించే నా ప్రయత్నాన్ని మోహనరావు చెడగొడ్తూనే వున్నాడు. నాబాధ అతని కేం తెలుసు? రాను రాను వదిన విమలమీద మితిమీరిన అధికారం చలాయించటం చూసి నేను సహించలేకపోతున్నాను. కాని విమల, యెంత సహనము, ఓర్పు కలిగివుంది! మన

స్సులో ఒకరి నుంచుకొని, యింకొకరికోసం, మరొక రింట్లో, యితర మనుష్యులమీద గౌరవంతో, పల్లెత్తు మాటకూడా మాట్లాడకుండా బొంగరంలా గిరగిరా తిరుగుతూ వెట్టిచాకిరీచేసే ఆమె సహనం నన్ను ఇంకా పిచ్చివాణ్ణి చేసేస్తోంది. వదిన యివాళ విమలను కోప్పడినందుకు ఆమెను ఎన్నోవిధాల ఓదార్చాలని తహ తహలాడాను. కాని ఓదార్చాలనుకొన్న వెంటనే "నన్ను ముట్టుకోకండి" అన్న ఆమె ఒట్టుమీరిపోయి నేను ఆమెకు యింకా ఏమైనా పాపంచేసినట్లయితే...? రాత్రి ఆమె కన్నీళ్ళముందు నేను కరిగిపోయాను. "విమలా! నా జీవితంలో నేనొక మన్నించరాని మహాపాపాన్ని చేశాను. నేను నిన్ను పెళ్లిచేసుకొన్న రోజున నా కన్నా భాగ్యశాలి మరొక సుందరనుకొన్నాను. గర్వించాను. యౌవ్వన మైకంలో, అజ్ఞానంలో నేను నీకు మన్నించరాని మహా పాపాన్ని చేస్తున్నానని తెలుసుకోలేకపోయాను విమలా! పూర్తిగా తెలుసుకోకుండా, ఆలోచించకుండా నీకూ, నాకూ మధ్య లోతైన లోయను తవ్వివేశాను. నన్ను క్షమించు. నిన్ను సుఖపెట్టగలిగేందుకు యింతకన్నా మంచిమార్గంలో నడవలేను విమలా!" అని మనస్సువిప్పి ఆమెను క్షమాభిక్ష కోరినతరువాత—ఆమె కొంచెం శాంతించినట్లుగా నాకు తోచింది.

**1955, జూన్ 8:** విమలను చూస్తూవుంటే మనస్సును సమాధాన పరచుకోవటం చాలా శ్రమ అవుతోందని అప్పుడు తోచింది. కాని ఆమె నా కళ్ళముందు కనిపించ

నప్పుడు, ఆమెను చూస్తేనేనా కొంత శాంతించ వచ్చేమో అని మనస్సు తల్లడిల్లిపోతోంది. అల్లా అనుకొనే పిచ్చి వాడిలా ఆఫీస్ పనిమీద అంబాలా వరకూ వచ్చినవాడిని సిమ్లాకూడా వచ్చాను. నేను వచ్చీరావటంతోటే విమల సంకోచ మనస్తత్వాన్ని నేను పోగొట్టలేదంటూ మోహన రావు అభియోగం చాటాడు. ప్రతీ చిన్న సంఘటనా కూడా ఆమె, రాధాకృష్ణా ప్రేమించుకొన్న వాళ్ళని' నేను తప్పుచేశానని నాకు జ్ఞాపకం చేసేటట్లా అమరాలి? రాధాకృష్ణతో సంకోచం లేకుండా సంచరించే ఆమె' ప్రకృతి సహజంగా నిర్మల మాదిరిగా ఆమె ఆ స్వభావాన్ని కలిగివున్నట్లయితే, మోహనరావు యీ అభియోగం ఎందుకు చాటుతాడు? రాధాకృష్ణ విదేశాలకి వెళ్తున్నాడని నేను చెప్పినప్పుడు విమల ముఖంలో ఆమె సంతోషం ఎంత ప్రకాశించింది!

మూడవ డైరీ తెరిచాను........

**1957**, జనవరి **4**: పాపం! విమల! మనశ్శాంతికోసం, ఆమె నేర్చుకొన్న సంగీతాన్ని వృద్ధిచేసుకోవటంలో శ్రద్ధతీసుకొంది. తెల్లవారకట్టే ఆమె నా మంచం పక్కనే కూర్చుని ఆమె మధురమైన గొంతుకతో గానంచేస్తూంటే, నేను ఒకొక్కరోజు నా పరవశత్వాన్ని అణగతీసుకోలేక, లేచి ఎక్కడికేనా వెళ్ళిపోదామా అని అనుకునే వాడిని... ఇదివరకే నలిగిపోయిన ఆమె మనస్సును వదిన దెప్పి పొడుస్తూ వుండు పడేటట్లు చేసింది. వర్ణించ నలవి కాని సహనంతో యింట్లో వాళ్ళందరికి చాకిరీ చేసే ఆమె

మీాద వదినకి అంత కోపం ఎందుకో ? నేనుకూడా వాళ్ళ చేష్టలకి తలవంచి నా ఓర్పుని కోల్పోయాను. ఇంక లాభంలేదు... వేరేకాపరం పెట్టాల్సిందే... !

**1957, మే 10 :** అన్నయ్యనుంచి విడిపోయిన తర్వాత తన కంపెనీనుంచి కూడా తప్పుకొన్నట్లు నేను విమలకి చెప్పటంమకు నిర్మల నన్ను కోప్పడింది. విమలతో చనువుగా మాట్లాడేందుకే సిగ్గుపడుతున్న నేను, యీ విషయంలో ఎందుకు అశ్రద్ధగా వున్నానో నిర్మలతో ఎల్లా చెప్పగలను ?

**1957, మే 12 :** వేరింటి కాపరంలో రోజులు గడచి పోతున్నాయి. కాని నామనస్సు శాంతి పొందకుండా యింకా ఎక్కువౌతూనే పోతోంది నా మనోవ్యథ. రాధాకృష్ణ విదేశాలనుంచి తిరిగి వస్తున్నాడనే సంగతి వినటంలో విమలకి ఎంత సంతోషం ! ఆమె సంతోషపడటానికి ఆమె సంగీతాన్ని బయట ప్రపంచానికి పరిచయం చేసి కాలం గడుపుతోంది. పత్రికల విమర్శనలలో ఆమెకు లభిస్తూన్న కీర్తి, పేరు ప్రతిష్టలు నేను చూస్తూనే వున్నాను. ఇన్నింటిలోనుకూడా స్వభావసిద్ధంగా సంతోషపడని విమల రాధాకృష్ణ విదేశాలనుంచి తిరిగి వస్తున్నాడని యింటిని అలంకరించటంలోను, ఆమెను సింగారించుకోవటంలోను శ్రద్ధతీసుకోవటం ఆరంభించింది !

**1957, మే 15 :** ఇవాళ విమల మేనత్త, మేనమామ, వాళ్ళమ్మాయి శ్యామల మా యింటికి వచ్చారు. అన్నయ్య కంపెనీ రెండు నెల్లనుంచి ఒడుదుడుకుల్లోపడింది.

నన్ను ఎకౌంట్సు చూసిపెట్టమని కోరాడు అన్నయ్య. తన కుటుంబంనుంచి, కంపెనీనుంచి నేను విడిపోయి నప్పటికి, సహోదరపాశం నన్ను లాగివేయటంవల్ల నేను కాదనలేకపోయాను. ఇవాళ నిర్మల గదిలో కూర్చుని నేను అన్నయ్య కంపెనీ ఎకౌంట్సు చూడటం విమల ఆమె కళ్ళతోనే చూసింది. నేను అక్కడ ఎందుకు వున్నానని ధ్వనించేటట్లు, రాత్రి యింటికి వచ్చింతరువాత విమల నన్నడిగింది. నేను నిజమైన కారణాన్ని చెప్పాను. కాని ఆమె నమ్మలేదనే తోచిందినాకు. నిర్మలకీ, నాకూ ఏదో ఆంతరంగిక సంబంధం వున్నట్లు ఆమె అనుమాని స్తున్నట్లుగా నాకు ఆమె ముఖంలో లీలగా కనిపించింది. నేనేం చెయ్యను? నిజం చెప్పినా నమ్మలేదు విమల? ఆమెతో ఎక్కువగా మాట్లాడటానికే భయపడుతున్న నేను యింకా ఎల్లా చెప్పను?

**1957, మే 17 :** ఇవాళ రాధాకృష్ణ విదేశాలనుంచి తిరిగి వచ్చాడు. వచ్చీ రావడంతోనే 'విమల చాలా పెద్ద గానసరస్వతి అయిందిటకదూ?' అంటూ ముందు విమలని గురించే నన్నడిగాడు. మాటల సందర్భంలో అతను శ్యామలను చేసుకొనేటట్లు లేడని గ్రహించాను. ఆనాడు నేను చదివిన పుస్తకంలో ఆ ప్రేమికుల కొరకు ఆ భర్త ఏవిధంగా త్యాగంచేశాడో—అదే విధంగా—తల్చుకొంటేనే నా గుండె బద్దలయిపోతుంది — కాని ఓర్చుకోవాలి — తప్పదు — ఇంక విమలని బాధపెట్ట దల్చుకోలేదు. అతని విమలను అతనికి అప్పగించివేయ టానికి నిశ్చయించుకొన్నాను!

**1957, జూలై 10:** ఆఫీసు పనిమీద ఢిల్లీ వెళ్ళివచ్చిన నేను యివాళ విమల వ్రాసిన ఉత్తరం చూశాను. ఆ ఉత్తరం మా యింట్లో నెలా యిరవై రోజులనుంచి నిద్రపోతోందని విమల వ్రాసిన తారీఖునుబట్టి తెలుసుకొన్నాను. విమల తండ్రి 'ట్యూబర్ క్లోసిస్' వ్యాధికి గురిఅయారు. నన్ను సహాయం కోరుతూ ఏదైనా శాని టోరియంలో చేర్పించమని ఎంతో బతిమాలుతూ వ్రాసింది. వెంటనే కొవ్వూరు బయలుదేరాను.

**1957, జూలై 18 :** కొవ్వూరునుంచి యివాళ తిరిగి కలకత్తా వచ్చాను. విధి యెంత విచిత్రమైనది! ఆమె తండ్రి వైద్యచికిత్సకోసం నా సహాయంకోరుతూ విమల వ్రాసిన ఉత్తరం ఆమె తండ్రి చనిపోయింతర్వాత నా చేతికి చేరింది! విమల కోసం తన జీవిత సర్వస్వాన్నీ త్యాగం చేసిన త్యాగమూర్తి విమలతండ్రి. ఆ జీవి శాశ్వతంగా వెళ్ళిపోయింది. ఆమె ఉత్తరం విషయంలో నిజంచెప్పినా కూడా విమల నన్ను నమ్మలేదు! ఏం చేస్తాను? నా జీవితంలో నాకు అన్నీ ఎదురుదెబ్బలే......!

**1957, సెప్టెంబరు 23 :** కొవ్వూరు నుంచి యివాళ విమల కలకత్తావచ్చి చేరింది. ఆమె చాలా మారి పోయింది! నేను యింక ఉపేక్ష ఎంతమాత్రమూ చేయకూడదు! రాధాకృష్ణను నన్ను వచ్చి కలుసుకొనవలసినదిగా యివాళ ఉత్తరం వ్రాశాను. అతను వచ్చిన వెంటనే నా ఉద్దేశ్యం బయట పెట్టేస్తాను...!

ఆ తర్వాత డైరీలో యింకేమీ రాసిలేదు. చదవగా

చదవగా నిప్పులో మండిపోయే కొవ్వొత్తిలా నా మనస్సు కన్నీళ్లను కార్చింది.

కఠినమైన పెంకును కలిగిన కొబ్బరికాయలో తియ్యని కొబ్బరి, మధురమైన నీళ్ళు వుంటాయని తెలుసుకోకుండా విసిరివేసిన పిచ్చిదానిలా, వర్ణించ సాధ్యంకాని ఆయన ఉత్తమగుణ హృదయాన్ని, రాతిగుండె అని చీదరించు కొన్నానే...! నా అసహ్యాన్ని ఆయన దగ్గర చూపించాను! కోపగించుకొని విసుచుకుపడ్డాను! వాటంతటవే జరిగినవాటిని ఆయన కావాలనే చేస్తున్నారనుకొని ఆయన మనస్సు వుండు పడేటట్టు అలక్ష్యంగా సంచరించాను! ఛీ! నేను ఎంత మూర్ఖురాలిని!

పుస్తకం! ఎక్కడిది నా కా పుస్తకం? నాకేమీ జ్ఞాపకం రావటంలేదే...! ఎప్పుడైనా నిర్మలే ఏదైనా పుస్తకం తెచ్చి 'ఇది చాలా బాగుంది – చదువు విమలా!' అని యిస్తూండేది. చదవటానికి నాకు తీరుబడి ఎక్కడుంది? రెండు మూడు రోజు లుంచుకొనో, సగందాకా చదివో యిచ్చేస్తూండేదానిని. కాని, డైరీలో ఆయన రాసిన పుస్తకం నేను ఎప్పుడూ చదివిన జ్ఞాపకమే లేదే నాకు!

మోహనరావు అలంకార మాటల్లో మోసపోయిన నేను, ఆయన మచ్చలేని ప్రేమ హృదయంలో ప్రవేశించ టానికి తగినదానినేనా? ఆయన కాళ్ళమీదపడి నా కన్నీ ళ్ళతో ఆయన పాదాలని కడిగినాకూడా, నా మనస్సులో ఆయన్ని నేను తప్పుగా అర్థంచేసుకొని తోసివేసినందుకు నాకు ప్రాయశ్చిత్తం కలుగుతుందా?

వాళ్లు వస్తున్నారు కాబోలు, అడుగుల శబ్దం వినిపించింది.

నేను ఆయన్ని ఏ ముఖంపెట్టుకొని చూడను ? డైరీలను చేతిలో పెట్టుకొని శిలావిగ్రహంలా తలవంచుకొని కూర్చుని కృంగిపోయాను.

'విమలా !' అన్న ప్రేమపూరితమైన పిలుపు — యిదివరకు ప్రేమ పిలుపు — నా చెవుల్లో పడింది. ఆయన చేతులు నా ముఖాన్ని పైకెత్తాయి.

'నన్ను క్ష...మిం...చ...గ...ల...రా...?'

మాటలు తడబడ్డాను. వశం తప్పిపోయి ఆయన గుండెల్లో ముఖాన్ని దాచుకొంటూ వెక్కి వెక్కి ఏడ్చాను. ఆయన లాలనగా నా తల నిమురుతూ —

'విమలా ! తప్పంతా నాది. జరిగినదంతా కల అనుకొని మర్చిపోదాం. ఏడవకు విమలా ! స్త్రీ హృదయాన్ని అర్థంచేసు కోవాలని నేను ఏ వేవో పిచ్చి పిచ్చి ఊహాలతో, పరిస్థితులను ఆధారంగా తీసుకొని పరిశోధించిన దాని ఫలితం యిదంతా ! పట్టుపురుగు గూడు నువ్వు ఎప్పుడైనా చూశావా విమలా ! పట్టు నూలు అందులో అతి సూక్ష్మంగా చుట్టుకొని వుంటుంది. కొసనిమాత్రం జాగ్రత్తగా చూసి, తీస్తే సులభంగా నూలంతా వస్తుంది. కాని విప్పటం చాలా కష్టం అని చూసిన వెంటనే అనుకొని మితిమీరిన శక్తిని ఉపయోగించినట్లయితే నూలు చిక్కుపడటమే కాకుండా తెగిపోతుందికూడా. ఈ మితిమీరిన పద్ధతిలోనే నేను సంచరించి నిన్ను నేను ఎంత బాధపెట్టానో నాకు యిప్పుడు అర్థమవుతోంది. మోహనరావు తప్పుదారి

తోక్కటానికి నేనే కారణం. ఇకనుంచీ చూడు నీ సంగీతాభి వృద్ధికి నేను ఎంతగా తోడ్పడుతానో ?' అని ఆగారు ఆయన.

నేను తల ఎత్తి ఆశ్చర్యంగా ఆయన్ని చూశాను.

'అవును విమలా! నాకు సంగీతం రాదనుకొన్నావు కదూ ? నీకు వచ్చినంత ఉత్తమ సంగీతం నాకు రాకపోయినా మోహనరావుకన్నా నేను బాగా పాడగలను! వీణకూడా వాయించగలను! ఇంక కొద్దిరోజుల్లో విమలా, చంద్రశేఖరంలు యిద్దరూ ఆకాశవాణి నిలయంలో పాడాబోతారు' అని నన్ను చూసి చిలిపిగా కళ్ళు చిట్లించారు.

'ఇంత అద్భుత రహస్యం యిన్నాళ్ళనుంచి బయటపడ కుండా యీయనలో ఎల్లా దాక్కుని వుందో కదా! రాధా కృష్ణ ఆయనతో కూడా రాలేదని అప్పుడే గమనించాను.

'రాధాకృష్ణ అల్లాగే వెళ్ళిపోయారా ఏమిటి ?' అన్నాను.

'దారిలో ఎవరో స్నేహితుడు కనిపిస్తే మాట్లాడు తున్నాడు. నేను వచ్చేశాను. నువ్వు అల్లా వెనక్కి తగ్గ కూడదు విమలా! కళాభివృద్ధి, స్త్రీ పురుషుడు యిద్దరూ ఒకే అభిప్రాయం కలిగి వుండాలనే ఆ దోర — మోహనరావు— యింకా అల్లాగే సంచరిస్తే నేను చూస్తూ ఊరుకొంటానా ? నువ్వే అతనికి చెప్పుదెబ్బ కొట్టినట్లు చక్కని పాఠంనేర్పావు!' అన్నారు ఆయన.

ఆహా! వెలకట్టలేని ముత్యానికి చోట్టవుందని అన మానపడిచో విసిరివేశానే! నేను ఎన్నివిధాల విచారించినా శాంతి పొందగలనా ?

'నిర్మలకి పెళ్ళిగ్రాం యిద్దామని రాధాకృష్ణనుకూడా తీసుకొని వెళ్ళాను. మాట్లాడుకొంటూనే వెళ్ళటంలో ఎడ్రసు తీసుకు వెళ్ళకుండా వెళ్ళానని, అక్కడదాకా వెళ్ళాకగాని జ్ఞాపకం రా లేదు. నిర్మల దగ్గరనుంచి నీకు ఉత్తరం వచ్చిందికదూ? ఏదీ అది...? రాధాకృష్ణ వెయ్యిమందిలో ఒకడు విమలా! ఆకాశంలోని చుక్కల్లో చంద్రుడు. మోహనరావుని నేను ఎంతో మంచివాడనుకొనే వాడిని. దగ్గరకు వెళ్ళిచూసిన తరు వాతగాని వజ్రం యొక్క జాజ్వల్యమూ, గాజురాయితత్వమూ తెలియదు.' రాధాకృష్ణ నాకు చేసిన ఉపకారానికి అతనికి నేను ఏవిధంగా కృతజ్ఞత చెప్పుకోవాలోకూడా తెలియటం లేదు. ముందు నిర్మలని రప్పించి, రాధాకృష్ణతో వివాహానికి ఏర్పాటుచేయాలి. అంతవరకు నా మనస్సు........'

ఆయన యింకా ఏదో చెప్పబోయి, రాధాకృష్ణ లోపలికి రావటంవల్ల ఆగిపోయారు.

'నన్ను బయటే నిలబెట్టి అప్పుడే వచ్చారేమిటి? ఇన్నాళ్ళనుంచివున్న ఎడబాటు యిప్పుడు అయస్కాంతంలా పని చేస్తోందనుకొంటాను' అని పరిహాసంగా నవ్వాడు రాధాకృష్ణ.

'నువ్వు మాట్లాడుతూ వుండగానే నిర్మల ఎడ్రసు తీసు కొద్దామని వచ్చాను. విమలా! ఏదీ ఆ ఉత్తరం?' అన్నారు ఆయన నవ్వుతూ, రాధాకృష్ణ చేసిన పరిహాసానికి ఒక పక్క సిగ్గుపడుతూ.

'విమలా! స్త్రీత్వాన్ని ఆయన అర్థం చేసుకో లేదని, ప్రేమకి ఆయన గౌరవం యివ్వలేదని ఆయన మీద చాలా పెద్ద నేరం వేశావు. కాని ఆయన ఎటువంటి

వారో తెలుసా? నీకన్నా రెండాకులు ఎక్కువే చది
వాడు! పోస్టాఫీసుకు యిప్పుడు ఎందుకా అని అనుకోంటూ
బయలుదేరిన నన్ను రోడ్డమ్మట తిప్పుతూ, ఆయన నిన్నూ,
నన్నూ అర్థంచేసుకొన్న లక్షణాన్ని చెబుతూంటే నవ్వీ, నవ్వీ
నవ్వలేక నాకు కడుపులో పోట్లుకూడా వచ్చాయి. నిర్మల
ఎడ్రసు యిదిగో నాదగ్గరే వుంది. నన్నడక్కుండా దీనికోసం
విమల దగ్గిరకు పరిగెత్తుకొచ్చారు కాబోలు!' అని అతని
జేబులోనుంచి ఉత్తరాన్ని బయటికితీసి చూపించిన రాధా
కృష్ణ—'ఆదివారంపూట యీ టెలిగ్రాంకి రెట్టింపు డబ్బు
కూడా దండగ ఎందుకు? కోపగించుకొని కాశీయాత్రకి వెళ్లిన
పిల్లని, కాశీ వెళ్ళి, కొత్త పెళ్ళికొడుకులా, లక్షణంగా, నేనే
తీసుకొస్తాను వచ్చేవారంలో' అంటూ కలకలా నవ్వాడు.

మేము యిద్దరం మనస్ఫూర్తిగా నవ్విన నవ్వు కంచు
మారుమ్రోగినట్లు ఆ గదంతా ప్రతిధ్వనించింది.

'సార్! చంద్రశేఖరంగారికి ఒక టెలిగ్రాం' అని
కేకవేశాడు గుమ్మంలో నిల్చొని టెలిగ్రాఫ్ బంట్రోతు.

టెలిగ్రాం ఆయనకే వచ్చినప్పటికి దానిని రాధా
కృష్ణ తీసుకొని తనొకసారి చదివిచూసి యిలా అన్నాడు:

'వినండి! ఈ శుభసమయంలో మరొక శుభవార్త!
విమలా! మానయ్య ఆగ్రానుంచి యీ టెలిగ్రాం యిచ్చారు.'

"డిసైడెడ్ టు గివ్ శ్యామల టు మోహనరావు -
కమింగ్ డే ఆఫ్టర్ టుమారో."

"సర్వేజనా స్సుఖినో భవన్తు" అన్నారు నా భర్త
నవ్వుతూ

★